
రాయలసీమలో
రంగస్థలం
1వ భాగం
డా॥ పాటుగుంట వెంకట సీతారామయ్య

# రాయలసీమలో రంగస్థలం

*This Book is*
*Published with the Financial Assistance of*
**TIRUMALA TIRUPATI DEVASTANAMS**
*Under their Aid to Authors Scheme*
TIRUPATI



కర్త

డా॥ పోతుగుంట వెంకట సీతారామయ్య

ఎం.ఏ., బి.ఇడి., పి.హెచ్.డి.

తెలుగు పండితులు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ పాఠశాల

తిరుపతి.

1993



# అంకితం

మా కుల దైవతములు ........
ఇలవేల్పులు ...
దివ్యదంపతులు ........
ఆర్త్రత్రాణపరాయణులా ...
పద్మావతి అలమేలు మంగమ్మ ...
కలియుగ వైకుంఠవాసుడు ...
ఏడుకొండల పెన్నిధి ....
శ్రీ వేంకటేశ్వర స్వామివారి
పాదారవిందములకు .........
ఈ పూజా పుష్పం.

పి.వి. సీతారామయ్య



ప్రతి పురుషుని ప్రగతికి, విజయానికి ఒక స్త్రీమూర్తి అజ్ఞాత ప్రేరణే కారణం. ఈ గ్రంథరచనకు అన్నివిధాలా నాకు సహకరించిన నా ఊపిరిలో ఊపిరి, నా చూపులో వెలుగు నా అర్ధాంగి శ్రీమతి శ్యామల. నా ఆరోగ్యమే ఆమెకు మహాభాగ్యం. ఆమెకివే నా మనసున గుబాళించే మంచిమల్లెల సుమాంజలి.

డా॥ పి.వి. సీతారామయ్య



"ఓ నేస్తం .........!

మైత్రికి మరోపేరైన

నీకు నేనేమివ్వగలను ...... ?

అడుగడుగునా నా రచనలను, నా నటనను మనస్ఫూర్తిగా

మెచ్చుకుంటూ, నన్ను హృదయ పూర్వకంగా ప్రోత్సహిస్తూ, నాకు

అర్థబలం, ఆత్మబలమై కొండంత అండగా నిలిచిన సహృదయుడు,

మనసున్న మంచిమనిషి, నాకు ఆత్మీయుడు, బాల్య స్నేహితుడు

డా॥ వి.ఎస్. షరీపుద్దీన్ గారికి .............

నా హృదయనందనంలో వికసించిన ........ కళాకుసుమాంజలి".

డా॥ పి.వి. సీతారామయ్య

డి. నాగసిద్ధారెడ్డి
రిటైర్డ్ ప్రిన్సిపాల్
ఎడిటర్, టి.టి.డి. పబ్లికేషన్స్

ఫోన్ : 22452
18-1-83, కె.టి. రోడ్డు
తిరుపతి - 517 507.

# పరిచయం

డా॥ పోతుగుంట వేంకట సీతారామయ్య, ఎమ్.ఎ., బి.ఇడి., పి.హెచ్.డి., గారి అసామాన్య కృషి ఫలితంగా వెలువడిన పరిశోధన గ్రంథం "రాయలసీమలో రంగస్థలం". ఈ గ్రంథాన్ని దిఙ్మాత్రంగా పరిచయం చేసేముందు రాయలసీమను గూర్చి కొంత చెప్పటం అప్రస్తుతం కాదు. కడప, కర్నూలు, చిత్తూరు, అనంతపురం జిల్లాలు, ప్రకాశం జిల్లాలోని మార్కాపురం, గిద్దలూరు, కంభం తాలూకాలు కలిసి ఈనాడు 'రాయలసీమ' అనే పేరుతో వ్యవహరింపబడుతూ వున్నాయి. (కర్ణాటకలోని బళ్లారి, తమిళనాడులోని తిరుత్తణి మున్నగు ప్రాంతాలుకూడ ఒకప్పుడు రాయలసీమలోనివే) చారిత్రకుల నిర్ణయానుసారం ఈ సీమను మౌర్యులు, శాతవాహనులు, పల్లవులు, చాళుక్యులు, తెలుగుచోడులు, రేనాటి చోళులు, కాకతీయులు మున్నగు రాజవంశాలెన్నో పరిపాలించాయి. క్రీ.శ. 1336 నుండి 1678 వరకు సాగిన విజయనగర రాజులకాలంలో రాయలసీమకొక ప్రత్యేకత సిద్ధించింది. ఈ రాజుల పరిపాలనలో ఈ సీమ రతనాల సీమగా, రత్నగర్భగా వాసికెక్కిందనటం అతిశయోక్తి కాదు. సీమకు వారి పరిపాలనమొక స్వర్ణయుగం. కాలక్రమంలో నైజాం ప్రభువుల ఏలుబడి, ఆపై ఆంగ్లేయుల పెత్తనం, స్వాతంత్ర్య పోరాటంలో ఈ సీమ నిర్వహించిన ప్రముఖపాత్ర వగైరా విషయాలెన్నో చారిత్రక సత్యాలు. 16,17 శతాబ్దాల్లోనే ఈ ప్రాంతానికి 'రాయలసీమ' అనే వ్యవహారనామం ఏర్పడిందనీ, కాలగర్భంలో ఈ పేరు మరుగున పడిపోగా డా॥ చిలుకూరి నారాయణరావుగారు పునరుద్ధరించారనే సుప్రసిద్ధ విమర్శకులు శ్రీ భూమన్‌గారిమాట. (చరిత్రలో రాయలసీమ 34 వ పేజీ)

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఒక ప్రాంతమైన రాయలసీమలో "పుట్టిన చిగురు కొమ్మైనచేవ" అనే అల్లసాని పెద్దన్న సూక్తిని సార్థకం చేస్తూ కవులు, గాయకులు, అవధానులు, విమర్శకులు, పండితులు, రాజకీయ చతురులు, త్యాగులు, భోగులు, యోగులు, నటులు ఎందరో జన్మించి సాంఘిక, రాజకీయ, సారస్వత కళారంగాల్లో చిర యశస్సునార్జించారు. ఈ సీమవాసులకు పొగడ్తలన్నా, పేరు ప్రతిష్ఠలకోసం ప్రాకులాడటమన్నా గిట్టదు. "నరత్నమన్విష్యతి మృగ్యతేహి తత్"- అనే కాళిదాసకవి వాక్యం వీరికి అన్వయిస్తుంది. ఉన్నది వున్నట్లు కుండపగలగొట్టినట్లు చెప్పడం, ముక్కుకు సూటిగా పోయే ప్రవర్తన, నమ్మిన వారికి ప్రాణాలుసైతం ఇచ్చే మనస్తత్వం ఈ ప్రాంతవాసులకు నైజగుణాలు. వీటికితోడు నిరంతరక్షామపీడనం కారణంగా ఆర్థిక దుస్థితి- ఈ కారణాలవల్ల నాటక కళామతల్లి సేవకు అంకితమయ్యీ వెలుగుచూడని నటరత్నాలెన్నో మరుగునపడిపోయాయి. (లేని గొప్పలు చెప్పుకొంటూ సొంతడబ్బా వాయించుకొనే వారికేగదా కాలం!) ఈ సందర్భంలో ఆంధ్రదేశంలో నాటకాల చరిత్రను స్థాలీపులాక న్యాయంగా పరామర్శించడం అనుచితం కాదనుకొంటా.

సద్యఃపరనిర్వృతికీ, లోకవృత్త ప్రదర్శనకూ, కర్తవ్యోపదేశానికీ నాటకాన్ని మించిన సాహిత్య ప్రక్రియ మరొకటిలేదు. నాటకానికి ప్రాణంగా పేర్కొనబడే సంగీత సాహిత్యాల సమ్మేళనం, అభినయకౌశలం, రసోన్మీలనం సామాజికుల్ని ఇట్టే ఆకట్టుకొంటాయి. "కావ్యేషు నాటకం రమ్యమ్, నాటకాంతం హి సాహిత్యమ్"- అని ఆలంకారికులు వాఙ్మయ ప్రపంచంలో నాటకానికి పెద్దపీటవేయటానికి దీని వైశిష్ట్యమే కారణం. ఈ ప్రక్రియ నన్నయకాలంనుండి (11 వ శతాబ్దం) కూడ తెలుగు వారికి పరిచయమేనని చెప్పటానికి భారతంలోని "ఉదాత్తరసాన్వితకావ్యనాటక క్రమములు"- (ఆది 1-10) అనే వాక్యం సాక్ష్యం. అయితే ఆనాటి నాటకాలు సంస్కృతమూ తెలుగా అని తేల్చి చెప్పటం కష్టం. ఐనా ఉత్తరరామచరిత్ర (భవభూతి), అనర్ఘరాఘవము (మురారి), రత్నపాంచాలిక (సర్వజ్ఞసింగడు), పార్వతీ పరిణయం (వామన భట్టబాణుడు), జాంబవతీ పరిణయం (కృష్ణదేవరాయలు) మున్నగు సంస్కృత నాటకాల్ని రచించిన కవులు తెలుగువారు కావటంచేత నాటక ప్రక్రియతో తెలుగువారికి పరిచయం వుందనే చెప్పవచ్చు. కానీ పిల్లలమర్రి పినవీరనాది కవులు సంస్కృత నాటకాల్ని సైతం శ్రవ్యకావ్యాలుగా అనువదించటంలోని రహస్యం అంతుపట్టదు. ఏమైనా ఆంగ్ల నాటక కంపెనీల ప్రభావం మనమీద పడేదాకా (1860) ఆంధ్రదేశంలో

తెలుగు నాటకాలు రచింపబడలేదనీ, నాటక సమాజాలు ఏర్పడలేదనే తెలుస్తూ వుంది. పార్సీధార్వాడ నాటక సమాజాల ప్రాదుర్భావంతో ఆంధ్రదేశం నాలుగు చెరగులా ఔత్సాహిక నాటక సంస్థలు తామరతంపరగా పుట్టుకొచ్చాయి. అలాంటివాటిలో బళ్లారి ధర్మవరం రామకృష్ణమాచార్యులవారి సరసవినోదినీ సభ, బళ్లారి కోలాచలం శ్రీనివాసరావుగారి సుమనోరమ సభ, కడప సురభి కంపెనీ మున్నగునవి ప్రసిద్ధి వహించాయి. ఈ నాటక సంస్థలు పౌరాణిక చారిత్రక సాంఘిక నాటకాల్ని ప్రదర్శిస్తూ ఔత్సాహిక నటులకెందరికో ప్రోత్సాహం కల్గించాయి. ఈ క్రమంలో రాయలసీమలోకూడ నాటక సంస్థలు ఉద్భవించడం, నటుల్ని ప్రోత్సహించడం జరిగింది. కాలగమనంలో సినిమాల ప్రభావం, నటులలో నిరుత్సాహం, నైతిక విలువలు పతనంచెందడం మొదలగు కారణాలెన్నో ఈ సంస్థలమీద దెబ్బతీయడంతో నాటకాలే జీవిత సర్వస్వంగా భావించిన నటులెందరో కనుమరుగయ్యారు. రాయలసీమలో అలాంటి వారిని అన్వేషించి పరిచయం చేయడం, సీమలో వెలసిన నాటక సమాజాల్నిగూర్చి తెలియజెప్పడం అనే శ్రమతోకూడిన విశిష్ట కృషి ఫలితంగా రూపుదిద్దుకొన్న గ్రంథం 'రాయలసీమలో రంగస్థలం'.

విషయనివేదనలో ఈ గ్రంథం 400 పేజీలకుపైగా పెరిగింది. విజయనగర రాజుల పరిపాలన రాయలసీమలో కళలకు సిద్ధింపజేసిన ప్రాభవం, కొరవంజి మున్నగు దేశినాటకాల చరిత్ర, నాటక వాఙ్మయం పుట్టుపూర్వోత్తరాలు, తెలుగులో నాటక ప్రయోగం- సరిక్రొత్తపోకడలు అనే అంశాల్నిగూర్చి ప్రారంభంలో వ్రాయబడిన వ్యాసం ఈ గ్రంథానికి తిలకాయమానంగా వుంది. రచయిత గురువైన శ్రీ పూని నాగేశంగారి రసపోషణా విధానాన్ని గురించి, ధర్మవరం రామకృష్ణమాచార్య, కోలాచలం శ్రీనివాసరావుగార్లు నాటక రచనలో చూపిన నూతన పోకడల్ని గురించి, బళ్లారి రాఘవగారి అద్భుత నటనా కౌశలాన్ని గురించి డా॥ సీతారామయ్యగారు తెల్పిన విశేషాంశాలు, ప్రశంసార్హాలు, ప్రయోజనాత్మకాలు. గ్రంథంలోని విషయ విభాగపద్ధతి విశిష్టంగా వుంది. జిల్లావారిగా వెలసిన నాటక సమాజాల చరిత్రనీ, జిల్లాలోని నటుల వృత్తాంతాన్నీ వారి ఫోటోలతో సహా (360) సేకరించి గ్రంథస్థం చేయడం మిక్కిలి ఓర్పుతో, నేర్పుతో కూడిన క్లిష్టకార్యం. విషయ సేకరణలో రచయితపడిన యిబ్బందులకు "నాయీ అన్వేషణలో వ్యయ ప్రయాసలెన్నో"- అనే గ్రంథారంభంలోని గేయం అద్దంపడుతూ వుంది. కులమతాలకు అతీతంగా వెలసిన కలియుగ ప్రత్యక్ష దైవం శ్రీ వేంకటేశ్వర స్వామికి నిలయమనే భావంతో కావచ్చు, డా॥ సీతారామయ్యగారికిగల జన్మస్థలాభిమానం కావచ్చు. ఏదయినా నటులకు, నాటక సంస్థలకు కేంద్రమైన తిరుపతిని గూర్చి మనకు తెలియని విశేషాంశాలనెన్నిటినో తెలియజేయటం ముదావహం. సుప్రసిద్ధ మేధావులు వందమంది నాటకకళపై తమ అభిప్రాయాల్ని తెల్పడం, వాటిని అభిప్రాయవేదికలో సంతరించడం రచయితకు కళమీదగల మక్కువకు నిదర్శనం. ఒక్కమాటలో చెప్పాలంటే రాయలసీమలో రంగస్థలాన్ని గురించిన వివరాలు తెలిసికొనటానికి ఈ గ్రంథం ఒక 'ఎక్సైక్లోపేడియా' గా ఉపకరిస్తుంది.

అత్యంత సరళమూ, లలిత మనోజ్ఞమూ ఐన డా॥ సీతారామయ్యగారి వచన రచనా విన్యాసం పాఠకుణ్ణిలోగొని చివరిదాకా చదివిస్తుంది. ఈ విధమైన చక్కనిశైలిని ప్రదర్శించడం రచయిత కబ్బిన ప్రజ్ఞావిశేషం, జిజ్ఞాసువుల అదృష్టం. డా॥ పి. సీతారామయ్యగారు నాకు శిష్యమిత్రులు. నాపై ఆయనకుగల అభిమానం అచంచలం. అందుకు నిదర్శనం నాచేత తన ఈ అమూల్య గ్రంథానికి పరిచయం వ్రాసే అవకాశాన్ని కల్పించడం. ఇలాంటి విజ్ఞానదాయక గ్రంథాలెన్నింటినో రచయిత వెలయించాలని ఆకాంక్షిస్తూ, అలాంటి స్ఫూర్తిని శ్రీనివాసుడు కలిగించగలడని ఆశిస్తూ-

తిరుపతి

15-8-93.

డి. నాగసిద్ధా రెడ్డి

# తెరతొలగిన రాయలసీమ రంగస్థలం

డా॥ మన్నవ భాస్కర నాయుడు,
తెలుగు రీడర్,
శ్రీ వేంకటేశ్వర కళాశాల, తిరుపతి.

తెలుగు రంగస్థలం రంగరంగవైభోగానికి నోచుకోనూలేదు, రంగురంగుల రంగవల్లికలతో విజృంభించనూలేదు. ప్రాచీనకాలంలో విస్మృతికి గురికాగా, వర్తమానంలో నిస్పృహకు బలి అవుతూవుంది. గతశతాబ్ది చివరిదశలోనూ, ఈ శతాబ్ది మొదటిదశలోనూ తెలుగు రంగస్థల అభినయశోభలు ప్రభలు తొడిగాయి. రంగస్థల ప్రయోజనం ఎంత సాంద్రమైనదో గుర్తించినవారికి, ఆధునికాంధ్రరంగస్థలం నాలుగోగోడను చాలావరకు విస్మరించిందనే వేదన మిగిలిపోతూనే ఉంది. అయితే, ఆంధ్రదేశ రంగస్థల విజయాలకు రాయలసీమ రంగస్థలంకూడా ఎంతో కొంత దోహదం చేసిందన్న విషయం కాదనలేని సత్యం.

రాయలసీమ పొదిగించుకొన్న ఘనచరిత్రమాత్రమేగాని రాయలసీమ ఎప్పుడూ రాళ్లసీమే. పంటపొలాలకు నీళ్లకరువైన కటికదరిద్రపు కన్నీళ్లసీమే!. రాళ్లసీమలో విలువైన రాళ్లగనులున్నట్లే, రత్నాలవంటి కళాకారులూ ఉన్నారు. ప్రాంతీయ దారిద్ర్యయవనికాచ్ఛాదితమైన ఆ రత్నాలను సానపట్టే కమ్మరులూ, విలువకట్టే షరాబులూ కరువైనారు. ఎన్నో ఆటంకాల తెరలు ఛేదించుకొని రంగస్థలాల తెరలుతీసి, నటనా కళాకాంతిపుంజాలు ప్రసరించిన రాయలసీమ నటరత్నాల జీవిత రంగస్థలాల తెరలు తొలగించే పరిశోధకులూ కరువైనారు. నేటికి ఆ కరువుతీరింది. రాయలసీమ రంగస్థలాన్ని కప్పివేసిన తెర తొలగింది. ఆ తెరతొలగించే బలమైన పనికి పూనుకొన్న మిత్రుడు సీతారామయ్య బహుధా అభినందనీయులు.

నాటకం ఒక విశిష్టమైన కళ. సంగీతం, సాహిత్యం, నాట్యం, చిత్రలేఖనం, శిల్పం వంటి లలితకళల సమాహార సమ్మేళన కళ. కళ మానవ సృజనాత్మక శీలానికి ప్రతీక.

కళకూడా మానవ శ్రమనుంచి ఆకృతి ధరించిందే. అంటే కళకంటే ముందే శ్రమ ఉంది. శ్రమ మానవ జీవితావసర సామగ్రి ఉత్పాదకతకు అనివార్యం. అవసరం తీరిన తర్వాతనే ఆనందం, వినోదం. కళ వినోదహేతువు కావచ్చు. ఆనందసేతువు కావచ్చు. అయినా కళకు ప్రయోజనంకూడా ఉంటుంది. ఆనందంకూడా ఒక ప్రయోజనమేకదా!

నిజానికి ఏ కళ అయినా వినోదంతో కలిసి మానసిక వికాసంకూడా అందిస్తుంది. Art educater while entertaining. అందుకే కళ మానవ పరిణామంతోబాటు పరిణమిస్తూ పురోగమిస్తూనే ఉంది. ఏ దశలోగానీ కళ మానవ ప్రయోజనాన్ని విస్మరించలేదు. "Art concerns itself with everything which is of interest to man as a humanbeing." అంటాడు యూరిబొరేవ్. (Aesthetics-P.29) ప్రకృతికి, ప్రపంచానికి సంబంధించిన ఎన్నో విషయాలను కళద్వారా మానవుడు వ్యక్తిగత అనుభూతులుగా అనుభవంలోకి తెచ్చుకుంటాడు. కళద్వారా గతాన్ని గుర్తుకు తెచ్చుకొంటాడు. వర్తమానంతో పోల్చుకొంటాడు, భవిష్యత్తును దర్శిస్తాడు. ఆ విధంగా కళ మానవునికి కాలాతీత ప్రయోజనకారి అవుతుంది. అంతేకాదు, లోకోత్తరమైన ఆత్మిక అనుభూతులు, కళాత్మక పరమానందపులోతులు అందుకోటానికి మానవునికి కళ ఒక ఉత్కృష్ట సాధనంగా ఉపకరిస్తుంది.

నాటకకళ ప్రయోజనంకూడా అదే.

తెలుగువారి నాటకకళ స్వరూప స్వభావాలు అతి ప్రాచీనకాలంలో ఎట్లా ఉండేవో తెలియజేయగల చారిత్రకాధారాలు లేవు. ఉన్నంతలో కొరవంజి, యక్షగానం, వీధినాటకం వంటివే ప్రాచీనమైనవి. కళకు సంబంధించి వాస్తవికతాధోరణి ఇటీవల వచ్చిందే. ప్రాచీనకళలు చాలావరకు మానవుని అనుభవాలకు, ఆశయాలకు ప్రతీకాత్మకంగా రూపుదిద్దుకున్నవే. మన నృసింహమూర్తిగానీ, ఈజిప్టుల 'స్ఫింక్స్' కానీ ఒకనాటి మానవ విశ్వాసాలకు సంకేతాత్మకంగా ఆవిర్భవించిన కళారూపాలే.

వీధినాటకాలవంటి ప్రాచీన రంగస్థల కళారూపాలలోకూడా ఇటువంటి ప్రతీకాత్మకత గుర్తించవచ్చు. ద్రౌపదిని సభకు ఈడ్చుకొని వచ్చే దుశ్శాసనపాత్రచేసే క్రూరమైన అట్టహాసపు చిందులుగానీ, ఎండకన్నెరుగని దమయంతి వంటి రాణివాసపు స్త్రీ పాత్ర అడవులలో కటికరాళ్లదారులలో నడువలేక వేదనతో అభినయించే దరువులోగానీ–మనకు సాక్షాత్కరించేది మానవుని భావావేశ సాంద్రత మాత్రమే. ఆ కళల పరిధిలోని ప్రేక్షకవర్గం అటువంటి సన్నివేశాలలో రసానందతుందిలం అవుతూనే ఉంటుంది. వ్యావహారికార్థంలో రసాభాసకు అక్కడ అవకాశమేలేదు. లాక్షణికపరంగా రసాభాసం కూడా అనుభవైకవేద్యమే!

రాయలసీమ రంగస్థలానికి పునాదిరాళ్లుగా నిలిచిన కంగుందికుప్పం వీధినాటకాల గురించిన చాలా విషయాలు ఈ గ్రంథంలో చోటుచేసుకొన్నాయి. పనిలోపనిగా రచయిత నాటకోత్పత్తికి సంబంధించిన లక్షణశాస్త్రసారం కొంతవరకు పొందుపరిచారు.

రచయిత కృషి భావి నాటకకళా పరిశోధకులకు ఉపకరించగలిగితే– అంతకంటె కావలసిందేమి ఉంటుంది!

"మధుప్రభాస" భవదీయుడు

'సాహితీ సహృదయ ధురీ'
డా॥ ఎస్. జవాద్‌హుసేన్
ఆంధ్రోపన్యాసకులు - రీడర్
శ్రీవేంకటేశ్వర కళాశాల, తిరుపతి - 517 501.

# మనసమంహాళి

పరిహద్దుల్ని చెరిపేసి మనుషులతో మైత్రీబంధాన్ని ముడివేసే మహత్తర సాధనం కళ. మానవుల్ని ఆనందపరవశుల్ని చేసి మంత్రనగరాల్లో విహరింపచేసేది కళ. మస్తిష్కాల్లో ఆలోచనల తుఫానుల్ని రేపేది కళ. కళాప్రపంచం కలలప్రపంచం కాదు. అది కల్లోల తరంగాల కడలి. కడదాకా ఈదాలంటే అచంచల ఆత్మవిశ్వాసం, నిరంతర పరిశ్రమ అనివార్యం. కళాకారుని సృజన అజరామరం. అతని కళాఖండం నిత్యనూతనం. కళాఖండంపై చివరిమాట ఉండదు. కళనుగూర్చిన అన్వేషణ ఆగదు; పరిసమాప్తం కాదు. ఇందుకు నిదర్శనం డా॥ పోతుగుంట వెంకట సీతారామయ్యగారి 'రాయలసీమలో రంగస్థలం'. శ్రీ సీతారామయ్యగారు ప్రశంసింపదగిన నటులు. జ్వలనశీలి; ఆలోచనాపరులు, అధ్యయనశీలురు. వీరు రాసిన ఈ పుస్తకం పరిశోధన స్థాయిగల ఒక ప్రయోజనాత్మక గ్రంథం. భావితరాల యువ పరిశోధకులకు ఆదర్శం. ఈనాడు తామరతంపరగా వెలువడుతున్న గ్రంథాలను, సిద్ధాంత వ్యాసాల్ని చూస్తే గుండె బాధతో మెలికలు తిరుగుతుంది. తలాతోకాలేని ప్రతిపాదనలు, అసంబద్ధమైన ప్రణాళికలు, వర్గీకరణలు, లోతుల్లేని పరిశోధనలు - ఇదీ ఈనాటి పరిశోధనారంగం. సమగ్రమైన విషయసేకరణ, తార్కికమైన విశ్లేషణ, హేతుబద్ధమైన ప్రతిపాదనలు, వివేచనలో కూడిన శాస్త్రీయదృష్టి శ్రీ సీతారామయ్యగారు రచించిన ఈ గ్రంథానికి ఊపిరులూదాయి. ఇతివృత్త వివరణలోనూ సీతారామయ్యగారు క్రొత్తదారి తొక్కారు.

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారి ఆంధ్రనాటకరంగ చరిత్ర, నటరత్నాలకు శ్రీ సీతారామయ్యగారి 'రాయలసీమలో రంగస్థలం' గ్రంథానికి సాదృశ్యాలెక్కువగా ఉన్నాయి. శ్రీ సీతారామయ్యగారి ఈ కావ్యవనంలో ఎన్నోరంగులు నిండిన పుష్పాలు, పరిమళాల్ని వెదజల్లిన ప్రసూనాలు కనబడతాయి. "కార్మికవీరుల షర్మజలానికి, ధర్మజలానికి ఖరీదుకట్టే షరాబులేడోయ్" అన్నాడు మహాకవి శ్రీ శ్రీ. కళాకారుని జీవితం, త్యాగం, అంకితభావం, జ్వలనశీలం కూడా విలువకట్టలేనివి. రాయలసీమలో కన్నుతెరచి, కళారంగంలో అడుగుపెట్టి, కళాకారులుగా ఎదిగి, అత్యంత రూపురేఖావయోవిలాసచాకచక్య చతురతాది కళాలక్షణాలతో విరాజిల్లే కళామతల్లి సేవకై జీవితాన్ని అంకితంచేసి తరించిన, నేటికీ రంగస్థలాన్ని అర్చిస్తున్న రత్నాల వ్యక్తిగత జీవిత విశేషాల్ని, కళాసాంస్కృతిక రంగాల్లో వారి సేవల్ని సీతారామయ్యగారు స్వయంప్రయాసలకోర్చి వెలికితీసి కావ్యగౌరవాన్ని కల్పించినారు. నిఘంటువు అక్షరక్రమాన్ని, మాటలకర్థాన్ని మనకు అందిస్తుంది. శ్రీ సీతారామయ్యగారి ఈ కావ్యకుసుమం రాయలసీమరత్నాల ఆకారరేఖల్ని, వారి ప్రతిభాపాటవాల విశేషాల్ని ప్రత్యక్షీకరింపచేస్తుంది.

పౌరాణిక నాటకాలను ప్రదర్శించే సమాజాల వివరాలు ఈ గ్రంథంలో ఉన్నాయి. ధర్మరాజుల తిరునాళ్ల వీధినాటకాల ప్రాచీనతను తెలియచేసే అంశాలు ఆసక్తికరంగా వివరింపబడినాయి. 'కొరవంజి', 'యక్షగానాల' వంటి ప్రాచీనకళారూపాలను గూర్చిన శాస్త్రీయ వివరణ పాఠకుల కుతూహలాన్ని పెంచుతుంది. "రాయలసీమను" వీరు వ్యాఖ్యానించిన తీరు మనోజ్ఞంగాను, క్రొత్తగానూ వుంది. కూచిపూడి నాట్యకళను గూర్చిన విషయం సమగ్రంగా, సంగ్రహంగా వివరింపబడింది. కంగుంది వీధి భాగవతుల వివరాలు, వారి కళాసేవను గూర్చి శ్రీ సీతారామయ్యగారు సేకరించిన విశేషాలు అమూల్యమైనవి. కాలపు పొరల క్రిందపడి నలిగి అనాదృతమౌతున్న ఎన్నో ప్రాచీన కళాగానాల వివరాలను శ్రీ సీతారామయ్యగారు ఎంతో శ్రమపడి సేకరించారు. గ్రంథస్థం చేశారు. రాయలసీమ రంగస్థలానికి కొత్తరంగులద్ది, జవాన్ని జీవాన్ని సమకూర్చిన రత్నాల ప్రాశస్త్యాన్ని మనకనులముందు నిలిపారు. వారి ఈ కృషి అభినందనీయం. రమణీయ శైలీ విశేషాల సంచయం ఈ పుస్తకం.

విద్యార్థులు, నాటకప్రియులు, పరిశోధకులు తప్పక ఆదరిస్తారనీ, వారికి ఈ గ్రంథం అన్నివిధాల తృప్తినిస్తుందని ఆశిస్తూ, వారి కలంనుంచి మరికొన్ని మంచి రచనలు వెలువడాలని ఆకాంక్షిస్తూ

డా॥ ఎస్. జవాద్‌హుసేన్

# అభినందనీయం

విద్వాన్ యస్. మునిసుందరం, ఎం.ఏ.

ఎక్కడో చదివినట్టు జ్ఞాపకం. అప్పుడప్పుడూ కొందరు పుడతారు, కొన్ని ఘనవిజయాలు సాధిస్తారు అని ఎందరో నటులున్నారు, నాటకకర్తలున్నారు, దర్శకులు, విమర్శకులు, ప్రయోక్తలున్నారు. కాని రాయలసీమ రంగస్థలంగురించి ఒక సమగ్ర గ్రంథాన్ని యింతవరకు ఎవరూ అందించలేదు. ఇదిగో; యీ పనిని యిన్నాళ్లకు డా॥ పోతుగుంట వెంకట సీతారామయ్య, పి.హెచ్.డి., గారు విజయవంతముగా చేసిపెట్టారు. ఇందుకాయన ఎంతయినా అభినందనీయులు. రాయలసీమ కళాకారులు ఆయనకు అభినందనలు చెప్పితీరాలి.

ఆయన నాలుగు మాటలు నన్ను రాయమన్నప్పుడు నాకాశ్చర్యం వేసింది. నేను నాటికలు, నాటకాలురాసినా, నటించినా దర్శకత్వం వహించినా ప్రచారంలేని, ప్రచారం చేసుకోలేని మనిషిని. మా పరిచయంకూడా తక్కువ. అయినా ఆయన సహృదయులు కాబట్టే అజ్ఞాతంగావున్న నాచేత యీ మాటలు రాయించదలిచారు. నా హార్ద్ర ధన్యవాదములు.

"రాయలసీమలో రంగస్థలం" ఏ పట్టాకోసమోరాసిన గ్రంథంకాకపోయినా రచనమాత్రం అట్లాగే సాగిందని చెప్పడానికి సాహసిస్తున్నాను. గ్రంథాన్ని పక్షివీక్షణమే చేయగలిగాను. కారణం వ్యవధి. అయితే వీరుచేసిన యీపని అనితరసాధ్యం అనిపిస్తుంది. శ్రమకోర్చి చిత్తూరునుండి బళ్లారివరకూ సొంత ఖర్చులతో ఓపిగ్గా తిరిగి విషయసేకరణ చేయడం, అదీ ఏ ఫలాపేక్షా లేకుండా మళ్ళీ దాన్ని యిప్పుడు అచ్చువేయడం నిజంగా డా॥ సీతారామయ్యగారు యజ్ఞమే చేస్తున్నారు. ఎవరికోసం? ఎందుకోసం? రాయలసీమలో రంగస్థలం వుంటేనేం? వూడితే ఏం? ఏ కళాకారుడు ఏ వీధిలో అడుక్కుంటే ఎవరిక్కావాలి? ఇప్పుడు పైసలు కావాలి. పదవులు కావాలి. పైకెగబ్రాకడం కావాలి. సీతారామయ్యగారూ! మీ శ్రమకు ఫలితం? శ్రమే. లేకుంటే యీ సాహిత్య కృషీవలుడు రెండవగ్రేడు తెలుగు పండితుడుగా జీవిక సాగించడమేమిటి? ఆంధ్రదేశ చరిత్రలో అపశ్రుతులు అతిసాధారణమని తృప్తిపడాలా? సమాజపరిణామంలో యిదో విషమదశ.

డా॥ వెంకట సీతారామయ్యగారు నాటక కళపట్ల తనకున్న అభిరుచి, ఆసక్తి, అభినివేశం ప్రోత్సహిస్తే యీ కార్యక్రమం మొదలెట్టారు. శ్రమించి, విషయసేకరణ చేశారు. వివరంగా, విస్తృతంగా రాయలసీమలోని రంగస్థలం, నటులు, దర్శకులు, రచయితల గురించి సవిమర్శకంగా రాశారు.

రాయలసీమ విషయంలో అన్నిరంగాలపట్లా అందరికీ ఔదాసీన్యమే. ఇక రంగస్థలం, నాటకం, కళాకారులంటే చిన్నచూపే. రాయలసీమలో నీటికటకటలాగే కళాకారులు, నాటక రచయితల కటకటా వుందన్నది అపోహమాత్రమే. రాయలసీమ నాటకరంగం గురించి, నటులగురించి, నాటక రచయితలగురించి చెప్పినవాళ్ళు, చెప్పేవాళ్లు తక్కువ. వారికి ప్రచారంలేదు. ఆ కొరత యీ గ్రంథం తీరుస్తుందనడంలో సందేహంలేదు. రంగస్థలికి, రచనకు, అభినయానికి, సంగీతానికి ఓనమాలు దిద్దిన ధర్మవరం రామకృష్ణమాచార్యులు, బళ్ళారి రాఘవ, చిత్తూరు నాగయ్య రాయలసీమ వారేనన్న విషయం ప్రజలు గుర్తుంచుకోకపోవడం బాధాకరమైన విషయం. ఈ రచయితకూడా సాంఘిక నాటక, నాటికల పరిణామ దశను వివరించేటప్పుడు రాయలసీమ నాటక రచయితల రచనలు వుదహరించకపోవడం అన్యాయమే అనిపిస్తుంది. నాటకరంగానికెంతో సేవచేసిన శ్రీ కె. సభాగారిని రచయిత మర్చిపోయినట్టుంది. రాయలసీమలో నాటకరంగం పరిఢవిల్లక పోవడానికి కారణాలేమిటో వ్యాసకర్త ఒక అధ్యాయంలో చర్చించి వుంటే బాగుండేది. బహుశా గ్రంథ విస్తరణ వారిని వెనక్కిలాగి వుండొచ్చు.

ఏమయితేనేం? రాయలసీమ నాటకరంగం గురించి విస్తృతంగా వెలువడిన మొదటిగ్రంథం ఇది. భవిష్యత్తులో ఎందరికో ఈ గ్రంథం దారి చూపుతుంది. డా॥ పి.వి. సీతారామయ్యగారి కృషి అనన్య సామాన్యం. వారు అభినందనీయులు. వారి కృషి ఎలాంటి సత్ఫలితాలను సాధిస్తుందో కాలమే నిర్ణయించాలి. వారి శ్రమ గుర్తించబడుతుందని విశ్వసిస్తున్నాను.

ఈ నాలుగుమాటలు రాసే అవకాశం నాకిచ్చిన వారికి నా ధన్యవాదాలు, వారింకా యీ రంగంలో కృషిచేయాలని, వారికి ఏడుకొండల వెంకన్న ఆశీస్సులు లభిస్తాయన్న విశ్వాసంతో

17.8.93

యస్. మునిసుందరం

పుత్తూరు.

ప్రొఫెసర్ కె. సర్వోత్తమరావు
తెలుగు అధ్యయన శాఖ
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

తిరుపతి
19.8.93

# "సమాలోచన"

నేను తిరుపతిలో పాతికేళ్ళనుండి వున్నప్పటికీ శ్రీ సీతారామయ్యగారితో పరిచయం నాకు పదేళ్ళనుండి మాత్రమే. శ్రీ సీతారామయ్యగారు చదువుకొన్నవారని, బాగా పాఠం చెప్పగలిగినవారని, ఏ విషయాన్నైనా తీసుకొని అనర్గళంగా ఉపన్యాసం చేయగలవారని నా మిత్రులు, శిష్యులు, సహచరులు చెప్పగా విన్నాను. ఒకవ్యక్తి స్వప్రయత్నంతో బాగా ఎదగగలడనే సత్యానికి శ్రీ సీతారామయ్య సాక్ష్యం కూడా. ఎం.ఏ., పూర్తి చేయడం, బి.ఇడి., శిక్షణ పొందడం, పర్యవేక్షకుడు లేకనే పి.హెచ్.డి., సంపాదించడం వగైరాలు ఉదాహరణాలుగా జోడించుకుపోవచ్చు. అయినా వారిలో ఉన్న కళాతృష్ణ, నాటకకళలపట్ల వారికున్న అభిరుచి నాకు ఆలస్యంగానే తెలిసింది. బహుశః అది నాలోపమే కావచ్చు.

పరిశోధన రెండు రకాలు. పిత్రార్జితాన్ని సంతానం వాడుకున్నట్టు లోగడ సిద్ధమయిన వస్తుసామగ్రిని ఉంచుకొని విశ్లేషిస్తూ పోవడం. రెండవది ఊరూపేరూ తెలియనిచోట, ఒంటరిగా కొత్త సంసారం దిద్దుకోవడం లాంటిది. దీనికెంతో ఓపిక కావాలి. ఆత్మవిశ్వాసం కావాలి. ఎదురుదెబ్బలు తగులుతుంటే నిబాయించుకునే 'ధైర్యం' కావాలి. 'అవాకులు చవాకులు' పలుకుతూ ఈసడించుకొనేవారిపట్ల సహనం కావాలి. పరిహాసం చేసే వారిపట్ల నిర్లిప్తత కావాలి. ఇవన్నీ "సీతారామయ్యకు" బలంగా వున్నాయని నా అభిప్రాయం.

శ్రీ సీతారామయ్య రచయిత అని నాకు చాలాకాలందాకా తెలియదు. "రాయలసీమలో రంగస్థలం" అనే శీర్షికన 'మూడు సంపుటాలు' చూసినప్పుడు నిజంగానే నేను ఆశ్చర్యపడ్డాను. శీర్షిక ఆకర్షణీయంగా ఉంది. కాని సేకరణ 'చాలా కష్టం'. 'గతించినవారి భోగట్టా' సేకరించడం, 'నీటిమీది వ్రాతలాంటిది, ఉన్నవారి వివరాలు సేకరించడం 'గాలి మూట' లాంటిది. నటులు కొన్నివేళల్లో 'అల్ప సంతోషులు'. మరికొన్ని సమయాల్లో 'భీష్మ ప్రతిజ్ఞలు'. వారి దగ్గరనుండి 'సమాచారం' రాబట్టడం కొన్ని సందర్భాలలో వ్యర్థప్రయత్నంకూడా. అయినా శ్రీ సీతారామయ్య ఎండనక, వాననక ఎందరినో కలుసుకొన్నారు. 'పెద్దనక, చిన్ననక' సమదృష్టితో నటుల్ని పలుకరించారు. విసుగుపడినా, విరామం లేదన్నా, వీటివల్ల నాకు ప్రయోజనమేమిటని చెప్పినా 'అట్టే' పట్టించుకోలేదు. వీరి ప్రయత్నాన్ని 'మనసారా' అభినందిస్తున్నా.

'రాయలసీమలో రంగస్థలం' – ఈ పుస్తకంలో మూడు భాగాలున్నాయి. ఈ భాగంలో రాయలసీమ కంగుంది కళ వీధినాటకాలు, తెలుగులో నాటక ప్రయోగం, బళ్ళారి నాటక సమాజాలు, అనంతపురం కర్నూలు జిల్లాలలోని సమాజాలకు సంబంధించిన వివరణలున్నాయి. రెండవభాగంలో కడప, చిత్తూరు జిల్లాలలోని నాటక సమాజాలు, ఆయా జిల్లాలలోని ప్రసిద్ధనటులు, వారి ప్రత్యేకతల విశ్లేషణ వుంది. మూడవ భాగంలో తిరుపతి నాటక సమాజాలు, తిరుపతిలోని ప్రసిద్ధ నటుల 'భోగట్టా'లున్నాయి. రచయిత తిరుపతి వాస్తవ్యులు కావడంవల్ల అభినివేశంతో 'మూడవ భాగం' పెంచినట్లు చెప్పుకోవచ్చు. లోగడ 'నాటక సమాజాలకు' సంబంధించి ఒకటి రెండు పుస్తకాలు వెలువడ్డాయి. కొంతవరకు 'ఆంధ్రనాటక రంగ చరిత్ర, నటరత్నాలు'. ఈ రంగంలో 'నాలుగు కాలాలపాటు' నిలిచే రచన శ్రీ సీతారామయ్యగారి 'రాయలసీమలో రంగస్థలం'. మరో విశిష్టమయిన ప్రయత్నం. ఇలాంటివి మరికొన్ని రావాలి కూడా.

దాక్షిణాత్యులలో 'ఆంధ్రులు' నష్టజాతకులని ఒకానొక విమర్శకుడన్నాడు. సంపాదించి నిలబెట్టుకోలేకపోవడం, ఉన్నదానిని పోగొట్టుకోవడం, ఒకవేళ ప్రయత్నించినా చిత్తశుద్ధి లేక వదలుకోవడం లాంటివి ఆంధ్రుల లక్షణాలుగా కొందరు భావించారు. ఈ విమర్శలో 'నూరుపాళ్ళ' నిజముందని చెప్పలేనుగాని కొంత సత్యం వుందని మాత్రం చెప్పగలను. బళ్ళారిని పోగొట్టుకొన్నాం, మదరాసును వదలుకొన్నాం. అలాగే సినిమాలు వచ్చేసరికి నాటకకళకు ఇంచుమించు 'విడాకులు' ఇచ్చేశాం. తమిళనాడులో ఇప్పటికీ టికెట్లుకొని నాటకాలు చూసేవారున్నారు. కర్ణాటకలో కూడా రంగస్థలానికి తగిన ప్రాధాన్యముంది. ఆంధ్రులలో ఆత్మావలోకనం రావాలి. తమ శక్తిని రక్తిని తెలుసుకోలేని 'స్థితి' మారాలి. 'గతవైభవకీర్తన' మంచిదేకాని పాతకొత్తల మేలుకలయిక స్థిరపడడం సమాజానికి మంచిది.

శ్రీ సీతారామయ్య కృషిని మెచ్చుకున్నవారు తిరుమల తిరుపతి దేవస్థానంవారు, కేంద్రప్రభుత్వం మానవ వనరుల మంత్రిత్వ శాఖవారున్ను. ఈ పుస్తకం 'ఉచిత పుస్తకం' గా మారకూడదని నా ఆకాంక్ష.

ఎందరో మహానుభావులు

# "రాయలసీమలో రంగస్థలం"

## 1.వ భాగం

I

### (1) రాయలసీమ ప్రాచీన వైభవం

1. విజయనగర రాజులు - జానపదకళలు
   (ఎ) వసంతోత్సవాలు, (బి) దసరా మహోత్సవాలు

### (2) కళావిర్భావం

1. కొరవంజి, (కురవంజి)
2. యక్షగానాలు - సుప్రసిద్ధ యక్షగానమేళాలు
3. కూచిపూడి
4. వీధినాటకం

### (3) కంగుంది దుర్గం - జమీందారులు (చిత్తూరు జిల్లా)

1. కంగుంది జమీందారులు - కళాసేవ
2. కంగుందికుప్పం వీధిభాగవతులు - వీధినాటకాలు
3. కంగుంది కళలో కాలం తెచ్చినమార్పు
4. ప్రస్తుతమున్న కంగుందికుప్పం వీధి భాగవతులలో కొందరు ప్రముఖులు - కళాసేవ
5. ఈనాటి కుప్పం

### (4) ధర్మరాజుల తిరుణాళ్ళు లేదా ద్రౌపదమ్మ తిరుణాళ్ళు అనబడే అగ్గి తిరుణాళ్ళు

(ఎ) ధర్మరాజుల తిరుణాళ్ళు - వీధి భాగవతులు వీధి నాటకాలుగా ప్రదర్శించే మహాభారత భాగాలు

1. వేదవ్యాస జననం, 2. భీష్మప్రతిజ్ఞ, 3. భీష్మవిజయం (అంబ, అంబిక, అంబాలిక స్వయంవరం), 4. పాండవజననం, విద్యాభ్యాసం, 5. లాక్షాగృహదహనం - హిడింబాసురవధ, 6. బకాసురవధ (బండికుంభం), 7. ద్రౌపదీ స్వయంవరం 8. సుభద్రాకళ్యాణం, 9. రాజసూయయాగం, 10. జూదం, 11. ద్రౌపది వస్త్రాపహరణం, 12. పాండవవనవాసం 13. సైంధవ పరాభవం, 14. పాండవుల అజ్ఞాతవాసం - కీచకవధ, 15. అర్జునుని తపోవృక్షారోహణం, 16. గోగ్రహణం, (I) దక్షిణ గోగ్రహణం, (II) ఉత్తర గోగ్రహణం, 17. శ్రీకృష్ణరాయబారం, 18. యుద్ధం, (I) పద్మవ్యూహం-అభిమన్యుని మరణం, (2) సైంధవవధ, 19. దుర్యోధనవధ, 20. అగ్నిగుండ ప్రవేశం.

(బి) భారతోత్సవాలలో స్థానిక ప్రజల ప్రమేయంగల ముఖ్య ఘట్టాలు

1. బండికుంభం - బకాసురవధ    2. ద్రౌపదీకళ్యాణం
3. తపోవృక్షారోహణం    4. ఉత్తర గోగ్రహణం
5. దుర్యోధనవధ    6. అగ్నిగుండ ప్రవేశం

(సి) చిత్తూరు జిల్లా:- ధర్మరాజుల తిరుణాళ్ళు జరుపుతున్న ముఖ్య కేంద్రాలు

1. కార్వేటి నగరం,    2. పుత్తూరు,
3. దుర్గ సముద్రం,    4. రామాపురం,
5. పాపానాయుడు పేట,    6. పాకాల

II

(1) నాటకం

(ఎ) నాటకోత్పత్తి-నాటకావిర్భావ సిద్ధాంతాలు

1. అనుకరణ ప్రవృత్తి సిద్ధాంతం

2. శ్రమ సిద్ధాంతం, 3. దేవపూజ సిద్ధాంతం,

4. గ్రీకు నాటకోత్పత్తి

(బి) భారతీయ సిద్ధాంతాలు

1. వేదసంవాద సిద్ధాంతం, 2. భరతముని సిద్ధాంతం, 3. శారదా తనయుని సిద్ధాంతం 4. పురాణకాలక్షేప సిద్ధాంతం,

5. జాగీర్దార్ సిద్ధాంతం, 6. మౌల్టన్ సిద్ధాంతం.

(సి) రూపక నిర్వచనము

(డి) నాటక ప్రయోజనం

(2) రంగస్థల చరిత్ర – క్రమ వికాసం

1. భరతఖండంలో దేశినాటకాల స్వరూపం
2. తెలుగులో నాటక ప్రయోగాలు – సరిక్రొత్త పోకడలు
3. నవరసాలు – కళాభారతి శ్రీ పూని నాగేశంగారి రసపోషణ

III

(1) రాయలసీమలో అంతర్భాగంగా బళ్ళారి నాటక కళాసేవ

1. ధర్మవరం రామకృష్ణమాచార్యులు – సరస వినోదినిసభ (నాటక సమాజం)
2. కోలాచలం శ్రీనివాసరావు – సుమనోరమ నాటక సమాజం
3. తాడిపత్రి (బళ్ళారి) రాఘవాచార్యులు
4. శ్రీ సి. భీమప్పశ్రేష్ఠి – బళ్ళారి

(2) నేటి రాయలసీమ జిల్లాలు – నాటక కళాసేవ

1. అనంతపురం జిల్లా

ఎ) నాటక సమాజాలు

బి) నటరత్నాలు

2. కర్నూలు జిల్లా

ఎ) నాటక సమాజాలు

బి) నటరత్నాలు

# రాయలసీమలో రంగస్థలం

## విషయసూచిక

### ప్రథమ భాగము

నటరత్నాలు

# "కళాంజలి"

"కళ" కళకళ లాడితేనే అందం. అందమైన కళ ఆనందాన్నిస్తుంది. అందానికి రకరకాల నిర్వచనాలు వెలువడ్డాయి. చర్మచక్షువులకు కనిపించే అందమే ఆనందప్రదాయని కానక్కర్లేదు. శ్రవణమాత్రం చేతకూడా ఆనందం కలుగుతూ వుంది. అంధుడు విని ఆనందిస్తున్నాడు. బధిరుడు చూచి ఆనందిస్తున్నాడు. కళ యొక్క సౌందర్యాన్ని చూడ లేకపోయినా, కళవైపు స్పందించే కళాహృదయం ఉన్నట్లైతే, ప్రతికళ అందంగానే గోచరిస్తుంది. ఆనందాన్ని కలిగిస్తుంది. కళాస్వాదనకు పండిత, పామర తారతమ్యం కనిపించదు. అందులోను 'నాటక కళ' అంటే ఇక చెప్పనక్కరలేదు. అందరినీ ఆకట్టుకొనే అందమైన ఐదు కళల సమైక్యరూపం. ఇటువంటి నాటక కళచేత చిన్ననాడే ఆకర్షింపబడిన నేను, ఈ కళకోసం శాశ్వతమైన, సుస్థిరమైన పనేదైనా చేయాలని అహోరాత్రులు పరితపించాను. ఇలా సుమారు ముప్పై (30) వసంతాలు దొర్లిపోయాయి. కాని నాలోని తపన మాత్రం రోజు రోజుకి యెక్కువైందేగాని సన్నగిల్లలేదు. ఈ మధ్యకాలంలో అరుదైనవిషయంపైన పరిశోధన చేసి, పట్టా పుచ్చుకోవడంకూడా జరిగింది. కాని తృప్తి మాత్రం కలుగ లేదు. మనసు పరి పరి విధాల పరుగులుతీసింది. ఆలోచనలు సాగర తరంగాలుగా ఉవ్వెత్తున లేచాయి.

ఏపని చేస్తున్నా, ఈ ఆలోచనలు మాత్రం నన్ను వదలలేదు. రోజులు, మాసాలు, ఒకటి రెండు వసంతాలుకూడా దొర్లాయి. ఒకరోజు ----నా ఆలోచనా తరగల నురుగులోనుండి ---- కారు మేఘాల ఘర్షణలో నుండి ------వెలుగురేఖ ఒకటి తళుక్కు మంది. మెరుపల్లె మెరిసింది. నా రచనకు ప్రేరణ అయ్యింది. పేరుగా గోచరించింది. అదే 'రాయలసీమలో రంగస్థలం'---ఒక కావ్య కుసుమం.

నా ఈ కృషికి స్ఫూర్తినిచ్చినవారు గౌరవనీయులు, కళారాధకులు శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు. (వారి ఆంధ్ర నాటకరంగ చరిత్ర, నటరత్నాలు) వారికి నా హృదయపూర్వక కళాంజలి.

నా పరిశ్రమలో పాలుపంచుకొని ఈ రచననంతా సామూలాగ్రం చదివి, దొరలిన దోషాలనుసరిదిద్ది, నన్ను ప్రోత్సహిస్తూ నా కన్నివిధాలా సహకరించిన నా మిత్రుడు, ఆత్మీయుడు అయిన శ్రీ లింగారెడ్డి ఢిల్లీరెడ్డిగారికి నా గుండె గూటిలో వికసించి, పరిమళభరితమై పరవశించే హృదయ కుసుమాంజలి.

నేను రాసినంత వరకు అప్పుడప్పుడు చదువుతూ ప్రశంసిస్తూ, ప్రోత్సహించిన నా బాల్యస్నేహితులు, సహనటులు శ్రీ టి. దివాకర్ సింగ్, శ్రీ పి. బాలసుబ్రహ్మణ్యం, శ్రీ యం. ధర్మయ్యగార్లకు నా హృదయపూర్వక కళాకుసుమాంజలి.

రాయలసీమ జిల్లాలలో పర్యటిస్తూ విషయ సేకరణకై ఆశ్రయించినపుడు పాపానాయుడు పేట వాస్తవ్యులు, శ్రీ శ్రీనివాసమూర్తి గారు పౌరాణిక నాటక సమాజాలను గురించిన విషయం తెలియజేసి నాకు సహకరించినందులకు వారికి నా హృదయపూర్వక కళాంజలి. పాపానాయుడుపేటలో ప్రతి సంవత్సరం జరిగే ధర్మరాజుల తిరునాళ్ళు, వీధినాటకాల ప్రాచీనతను గూర్చి తెలియజేసిన ట్రస్టుబోర్డు చైర్మన్ శ్రీ తంబాగోపాల మొదలి గారికి నా నమస్సుమాంజలి.

పుత్తూరులో వెలసియున్న ధర్మరాజుల గుడి, భారతోత్సవాలను గురించి తెలియజేసిన శ్రీ ఏ.వి పాండ్యన్, శ్రీ మేఘవర్ణం గార్లకు నా హృదయపూర్వక నమస్సుమాంజలి.

విషయ సేకరణలో సహకరించిన శ్రీకాళహస్తి వాస్తవ్యులు శ్రీ ముక్కంటి గురప్ప బి.ఏ.,బి.ఇడి., గారికి, చిత్తూరులో మేనకా గోల్డు కవరింగు షోరూం ప్రొప్రైటర్ శ్రీ వై. వెంకటేశ్వరరావుగారికి, చిత్తూరు రామవిలాస సభ అధ్యక్షులు శ్రీ రామస్వామి అయ్యంగారికి, శ్రీ చిత్తూరు జయరాంగారికి, పలమనేరు వాస్తవ్యులు డ్రాయింగ్ మాస్టర్ శ్రీ ఎం.ఎస్.మణి (సుబ్రహ్మణ్యం)గారికి, పాకాల వాస్తవ్యులు శ్రీ ఆలూరు యోగానందం గారికి నా హృదయపూర్వక కుసుమాంజలి. పాకాల వాస్తవ్యులు, పాకాల మండల ప్రెసిడెంటు అయిన శ్రీ నారాయణ స్వామిగారు పాకాల ధర్మరాజుల తిరుణాళను గూర్చి తెలియజేసి నందులకు వారికి నా హృదయ పూర్వక కుసుమాంజలి. కంగుంది కుప్పం వీధి నాటక కళాకారుల పూర్వాపరాలను గూర్చి వారి సంతతి వారైన శ్రీ సీదా సుబ్బయ్య నాయుడు (ఎ.ఎస్. నాయుడు, బి.ఎ., టీచరు) గారు తెలియజేసినందులకు వారికి నా హృదయపూర్వక కళాంజలి.

కంగుంది కుప్పం జమీందార్లనుగూర్చి తెలియజేసిన వారి సంతతి వారు శ్రీ యం.టి, వెంకటపతి, బి.ఏ.,బి.యల్ (అసిస్టెంట్ గవర్నమెంట్ ప్లీడర్, కుప్పం)గారికి నా హృదయపూర్వక కుసుమాంజలి. మదనపల్లిలో విషయసేకరణలో నాకు సహకరించిన 'పెద్ద మనుష్యులు పత్రికా వ్యవస్థాపకులు, ధర్మనిరత శ్రీ సుదర్శనంగారు, శ్రీ జెట్టి రవీంద్రవర్మగార్లకు నా హృదయపూర్వక కళాంజలి.

ధర్మవరంలో ఎ.ఆర్.ఎస్. హరినాథ్ బి.ఎ., బి.ఎల్., గారు, అనంతపురంలో 'లలిత కళా సమితి' కార్యదర్శి అయిన శ్రీ ఎ. నరశింహమూర్తి (రిటైర్డు సాయిబాబా జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్, అనంతపురం) గారు, గుంతకల్లులో శ్రీ వై.విశ్వనాధయ్య (హెచ్.సి. గుంతకల్)గారు, శ్రీ హెచ్. రామాంజనేయులు గార్లకు నా హృదయపూర్వక కళాంజలి. నంద్యాలలో శ్రీ వెంకటసుబ్బయ్య (ప్రధానోపాధ్యాయులు, యస్.ఆర్.కె.వి. ప్రైమరీ పాఠశాల, సంజీవ్ నగర్, నంద్యాల)గారు విషయసేకరణలో వారి సహాయ సహకారాలు అందించినందుకు వారికి నా హృదయపూర్వక కళాంజలి.

కర్నూలులో లలిత కళా సమితి ప్రెసిడెంటు, కోశాధికారులైన శ్రీ జంపాల శివయ్యగారు, శ్రీ మాదినేని పాపారావుగారు నా కృషిని సర్వవేళలా కొనియాడుతూ, సర్వవిధాలా నాకు తమ హార్థిక సహకారాన్నందించినందుకు వారికి నా హృదయపూర్వక నమస్సుమాంజలి.

కడపలో "కడప జిల్లా కల్చరల్ కాంట్రిబ్యూటర్" శ్రీ కేశవకుమార్ గారు, ప్రొద్దుటూరులో శ్రీ ఆకుమళ్ళ శివరామ శాస్త్రిగారు, కోడూరులో కోసంగి సిద్దేశ్వర ప్రసాదరావుగారు నాకు తోడ్పడినందులకు వారికి నా హృదయపూర్వక కళాంజలి.

ఈ గ్రంథాన్ని ఆర్థిక సహాయార్థం మానవ వనరుల మంత్రిత్వశాఖ ఢిల్లీ వారికి పంపడానికి సహకరించిన సహృదయులు, రాష్ట్ర ఉన్నత పాఠశాల విద్యాశాఖ "డైరక్టరు జనరల్" గారైన శ్రీ కూరపాటి పెంచలయ్య గారికి.........

సరస్వతీ పుత్రులు, కవితావతంసులు, కళాహృదయులు, మాన్యులు, మంచి మనసున్నవారు రాష్ట్ర ఉన్నత విద్యాశాఖ కార్యదర్శి శ్రీ డి. రామకృష్ణయ్య, ఐ.ఎ.ఎస్., గారికి నా హృదయపూర్వక కళా కుసుమాంజలి.

నాకు అన్నివిధాలా సహకరించి, అడుగడుగున ధైర్యంచెప్తూ ఈ గ్రంథ ప్రచురణకు ప్రోత్సహించిన నటులు, ప్రయోక్తలు, చిత్రకారులు, మనసున్న మంచి మిత్రులు, కేంద్రీయ ప్రధానోపాధ్యాయులైన శ్రీ హేమాద్రిగారికి నా హృదయపూర్వక కళా కుసుమాంజలి.

శ్రీ హేమాద్రిగారి ద్వారా పరిచయమై, అచిరకాలంలోనే నాకు దగ్గరై, నా గ్రంథ ప్రచురణకు ఢిల్లీ వారినుండి ఆర్థిక సహాయం అందించడంలో యెన్నో వ్యయ ప్రయాసలకోర్చి, నాకు ఆశ్రయమిచ్చి, నన్నాదరించిన మిత్రులు మంచి మనిషి శ్రీ కె. రామమూర్తి గారికి నా హృదయపూర్వక కళా కుసుమాంజలి.

నేను కోరినవెంటనే శ్రమగా తలంచక నా మనోభావాని కనుగుణంగా కళాత్మక హృదయంతో ఒక రూపాన్ని సృష్టించి, కవరు పేజీని చిత్రించి యిచ్చిన మిత్రులు, కళాహృదయులు, చిత్రకారులు, మహోన్నత వ్యక్తిత్వంగల మంచి మనిషి శ్రీ సత్యనారాయణ (ఎస్.వి.ఎ.జి. కాలేజి) గారికి నా హృదయపూర్వక కళా కుసుమాంజలి.

గ్రంథ ప్రచురణకు అవసరమైన పేపరు సమకూర్చిన మిత్రుడు, ఆత్మీయుడు, అనుంగు బావమరది అయిన శ్రీ సి.హెచ్. భూపయ్యకు, సహృదయులు, స్నేహశీలి అయిన శ్రీ కోదండ రామిరెడ్డిగారికి నా హృదయపూర్వక కళా కుసుమాంజలి.

అచ్చుతప్పులు దిద్ది నా గ్రంథ ప్రచురణకు సహకరించిన మిత్రులు శ్రీ గిరిధర్ గారికి నా హృదయపూర్వక కళా కుసుమాంజలి.

ఈ గ్రంథం సర్వాంగ సుందరంగా అవతరించడానికి తగిన సహాయ, సహకార సలహాలనందించిన స్నేహశీలి, మంచి మనిషి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ముద్రణాలయాధికారి శ్రీ సోమశేఖర్ గారికి నా హృదయ పూర్వక కళా కుసుమాంజలి.

ఈ విధంగా నా కృషికి ప్రోత్సాహమిచ్చి, నన్ను ఉత్సాహ పరచిన ఎందరో కళాకారులకు, రసహృదయులకు, కళాప్రియులకు నా హృదయపూర్వక కళాంజలి.

రచయిత

డా॥ పోతుగుంట వెంకట సీతారామయ్య

# ఒక్క క్షణం

"నాటక కళ' అది ఒక సమ్మోహన శక్తి. మధురానుభూతికి మరోపేరు. స్పందించే కళాహృదయంగల ప్రతి మనిషినీ, నాటకకళ తన వైపునకు ఆకర్షించుకుంటుంది. పండిత, పామర జనాకర్షణీయమైన ఏకైకకళ 'నాటకం'. ఆబాల గోపాలాన్ని ఆనంద పరవశుల్ని చేసేది, పల్లెలు, పట్టణాలు అని తేడా లేకుండా మహానగరాలకైనా, మారుమూల పల్లెలకైనా చొచ్చుకొని పోయిన (రంగస్థల, వీధి నాటక రూపాలు) "నాటక కళ" అపూర్వమైనది, అద్భుతమైనది, ఆనందకరమైనది.

ఇటువంటి కళ దేశవ్యాప్తంగా అన్ని భాషలలో, యెన్నోరూపాలుగా గోచరించినా, రాయలసీమలో మాత్రం ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది. బయలాటలు, కంగుంది వీధి నాటకాలు, సురభి, రంగస్థల సంగీత నాటకాలే రాయలసీమ ప్రత్యేకత.

ఇప్పుడు రాళ్ళసీమే అయినా ఒకప్పటి రతనాల సీమ ఈ రాయలసీమ "సురభి"కి పుట్టినిల్లు. ధార్వాడ నాటకాలకు మెట్టినిల్లు. మరాఠీ, కర్ణాటక నాటక కళలు కలిసిమెలసి తిరుగాడిన చోటు. అటువంటి రాయలసీమలో ఒకనాడు "బళ్ళారి" అంతర్భాగం. రాయలసీమ నుండి ముగ్గురు ఆంధ్రనాటక పితామహులు అవతరిస్తే, అందులో "చారిత్రకాంధ్ర నాటక పితామహులు" శ్రీ కోలాచలం శ్రీ నివాసరావుగారు బళ్ళారి గడ్డపై పుట్టిన బంగారు పట్టి. తక్కిన ఇద్దరు శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు, శ్రీ వనారస గోవిందరావు. విశ్వవిఖ్యాత రంగస్థలనటులు శ్రీ బళ్ళారి రాఘవ, ఆంధ్రనాటక పితామహ బిరుదాంకితులు శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు, చారిత్రకాంధ్ర నాటక పితామహ బిరుదాంకితులు శ్రీ కోలాచలం శ్రీ నివాసరావు బళ్ళారిని రంగస్థలంగా జేసికొని, నాటక కళామతల్లికి అసామాన్య సేవలందించారు. ప్రప్రథమంగా ఆంధ్రదేశంలోనే నాటక ప్రదర్శన శాలలను నిర్మించుకున్న ఘనత బళ్ళారికే దక్కుతుంది.

ఇంతటి ఘనకీర్తి గల బళ్ళారిని 'రాయలసీమ రంగస్థలం"లో చేర్చి, పంచమహానటుల చరిత్రలను, బళ్ళారిలో వెలసిన రెండు, మూడు నాటక సమాజాల చరిత్రలను వ్రాయడం జరిగింది. ఇది 'బళ్ళారి' రాయలసీమలో అంతర్భాగంగా ఉన్నప్పటి మాట. బళ్ళారి ఘనతను తెలియ జేసే మచ్చు తునకలు మాత్రమే యివి. సమగ్రమైన బళ్ళారి నాటక రంగ చరిత్ర మాత్రం కాదు.

ఈనాటి రాయలసీమ 'బళ్ళారి' పరాధీనమైన రాయలసీమ. 'అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు' జిల్లాల కలయిక ఈనాటి రాయలసీమ. ఆ నాడైనా, ఈ నాడైనా కళలకు కాణాచి ఈ సీమ. ప్రత్యేకించి నాటక కళామతల్లి చిరునవ్వులతో చిందులేస్తూ నర్తించిన చోటు. ఇటువంటి రాయలసీమకేగాక ఆంధ్రదేశానికే అగ్రస్థానాన్ని అలంకరించిన అనంతపురం జిల్లాలో నాటక కళ మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వర్ధిల్లిందొకనాడు. గతవైభవానికి తీపి గుర్తులుగా నాటక కళామతల్లి సేవ చేస్తున్నాయి కొన్ని సమాజాలీనాడు. వాసన పోకుండా గత వైభవాన్ని మరువకుండా, కళామతల్లి సేవలో కన్ను మూయాలనుకునే నిస్వార్థ కళారాధకులు కొందరు, కీర్తికండూతితో కళాసేవ చేస్తున్నామని భ్రమపడే స్వార్థపరులు మరికొందరు.

అనంతపురంజిల్లా అంతటా లెక్కకు మిక్కిలి నాటక సమాజాలు ఆవిర్భవించాయి. ఒక్క అనంతపురం పట్టణంలోనే 25నాటక సమాజాలు ఉన్నాయంటే, ఇక జిల్లా మొత్తంమీద వంద నాటక సమాజాలైనా వుండవచ్చని ఊహించవచ్చును. ఎంత ప్రయత్నించినా చరిత్ర పుటలకు చేరువ కానివి కొన్ని, ఉన్నాయన్న ఉనికే తెలియక చరిత్రలో స్థానం కోల్పోయినవి కొన్ని, పరిశీలనలో సమగ్రత లోపించడం వలన చరిత్రకందనివి మరికొన్ని, పుబ్బలో పుట్టి మఖలో మాయమయ్యే చరిత్రార్హత లేనివి కొన్ని నాటక సమాజాలు ఈ "రాయలసీమలో రంగస్థలం" అను రాయలసీమ నాటక రంగ చరిత్రలో చోటు చేసుకోక పోవడం గ్రంథకర్తనైన 'నా' కృషిలోపం మాత్రం కాదని పాఠకులకు మనవి.

అన్ని జిల్లాలలోను సమగ్రమైన వివరాలతో చరిత్ర పుటలలో చేరిన నాటక సమాజాలు కొన్నైతే, నామమాత్రంగా చరిత్రను సృష్టించుకున్నవి కొన్ని. ఈ పరిస్థితి రాయలసీమ అన్ని జిల్లాలలోను యెదురైంది. ఇటువంటి పరిస్థితి నటరత్నాల విషయంలో కూడ తప్పలేదు. నా ఈ అన్వేషణలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో అజరామరకీర్తి నార్జించుకొన్న కొందరు మహానటులు, మరి కొందరు నటులు, ఇంకొందరు నటులనిపించుకోవాలనుకునే ఔత్సాహికులు తారసిల్లారు.....ఎందరో మహానటులు నా అన్వేషణకు అందలేదు...... నేను చేస్తున్న కృషి తెలియక కొందరు ఈ గ్రంథంలో చోటు చేసుకోలేక పోయారు. ఈ గ్రంథం సమగ్రమని, నా కృషి సంపూర్ణమని నేను భావించడం లేదు. కళకోసం ఏదో చేయాలన్న నాలోని తపన ఈ గ్రంథంగా రూపుదిద్దుకుంది.

నాకు తిరుపతి రంగస్థలమైనందున తిరుపతి కొక ప్రత్యేకత కల్పించడం జరిగింది.

నా కృషిని అభినందించి, నన్ను ప్రోత్సహించి, నాకు తమ సహకార హస్తాన్ని అందించిన మిత్రులు, గురువులు, సహచరులు, రసహృదయులు, పూజ్యులైన కళా తపస్వులు, కళారాధకులు, కళాకారులకు, నాశ్రేయోభి లాషులకు

నా హృదయపూర్వక కళాంజలులు.

సవినయంగా రచయిత.........

“ఎందరో మహానటులు.....
అందరికీ వందనాలు .....
నా ఈ అన్వేషణ లో .....
వ్యయ ప్రయాసలెన్నో.......
ఇచ్చకాలు.....ముఖస్తుతులు.....
నిజమైన ఆత్మీయతలు.......
ఆప్యాయతలు....ఆదరణలు...
మఱువ లేని అనుబంధాలు.......
మరపురాని మధుర క్షణాలు.....
అపరిచిత స్నేహాలు......
హృదయాన్ని కదిలించే.........
అనురాగమైత్రీ బంధాలు.....
మనసుకు పన్నీటి జల్లులు....
వీటిని వెన్నంటే వుంటాయి అపస్వృతులు.....
బుసలు కొట్టే ఈర్ష్యా ద్వేషాలు........
అసూయలు, అపహాస్యాలు.......
నోట మంచి మాటలు.....
నొసటి విరుపులతో వెక్కిరింతలు.......
ఎదురైనవి చేదు నిజాలు కొన్ని.........
కాల భ్రమణంలో........
కళాకారుల కన్నీటి గాథలు.......
నిరాశా నిస్పృహల.......
గాఢాంధకారంలో......
వెలుగు రేఖల కోసం.......
వెంపర్లాడే బడుగు జీవితాలు.....
వీధినబడి మాదాకబళంతో........
మనుగడ సాగిస్తున్నాయి.
కళ.......
కళామతల్లికి నీరాజనం.......
ప్రేక్షకునికి ఆహ్లాదకరం......
కళాకారుడికిదో శాపం......
ఓహ్.........
నా ఈ అన్వేషణలో....
ఎన్నో అనుభవాలు.....
మరెన్నో మలుపులు......
హృదయవిదారక దృశ్యాలు......
మంచి చెడుల మథనం......
క్షీరసాగర మథనం.......
ఆ మథనంలో వెలువడిందో విషకుంభం.......
అదే వ్యయ ప్రయాసల శేషం........
ఆ తరువాత కనబడింది......
అరుదైన అమృత భాండం.....
ఉంచాను ప్రేక్షకుల పళ్లెరాలలో.....
ప్రేక్షక మహాశయులే......
కళాపోషకులై........
కళోద్ధరణకు నడుంకట్టే.......
దాతలు...ధార్మిక సంస్థలు.....
ప్రజా ప్రభుత్వాలు ....
కళకొక ఉనికిని కల్పిస్తాయి ....
అప్పుడు కళాకారుడు ....
కళకోసం .... ఈ సమాజం కోసం...
అవుతాడు క్రొవ్వొత్తిగా తాను ....
అలా కాకపోతే ....
ఓ ప్రేక్షక మహాశయా...!
నీ అశక్తతను వ్యక్త పరుస్తూ ...
కన్నీటి బొట్టొకటి రాల్చు...
మానవత్వానికి మారుపేరుగా ...
కళాకారుని ...
దీన హీన స్థితిని చూచి ...
అదే ధన్యత నీ జన్మకు...
సార్థకత నా రచనకు .... !!!

“రచయి

## "రాయలసీమ"

"రాయల"సీమ ...

నాటి రతనాల సీమ .....

దక్షిణ భారతంలో హైందవ సంస్కృతికి అద్దం పట్టిన సీమ. ....విద్యారణ్య స్వాములవారి తపస్సు ఫలించిన తపోభూమి రాయల సీమ ......... ఎందరో మహానుభావులు, యెందరో మహారాజులు, మరెందరో మహా మంత్రులు కలలు పండించుకున్న కర్మభూమి రాయలసీమ.........

"నభూతో నభవిష్యతి"

అని విశ్వవిఖ్యాతి గాంచిన విజయనగర సామ్రాజ్యపు సౌభాగ్యసీమ....

మూరు రాయరగండ, సకల కళా సమరాంగణ సార్వభౌముడు, ఆంధ్ర కర్ణాటక చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలు పాలించిన సీమ... అరివీర భయంకరుడై, శత్రురాజులకు సింహస్వప్నమై, వీర తేజాన్ని దశదిశలా వ్యాపింపజేసిన సార్వభౌముని పాదఘట్టనలతో పదిలమైన సీమ............

నవరత్నాలను రాసులుగా పురవీధులలో పడులతో (కొలమానిక) కొలిచి విక్రయించిన సీమ......

పవిత్ర తుంగభద్రా సజల స్రవంతి గలగలా రావాలతో పావనమై, సిరులు పొంగిన సీమ...... తుంగభద్రామతల్లి అభంగ తరంగ మృదంగ రావాలతో, అంబర చుంబిత మహోన్నత పర్వత శ్రేణుల పలకరింపుతో, పిల్లతెమ్మెరల పులకరింతలతో, పచ్చని ప్రకృతి కాంత పరవశింపుతో భారతమాత కటి ప్రదేశాన్ని అలంకరించి నవరత్న ఖచిత కనకభూషణమైన విజయనగర సామ్రాజ్య విభవమును విశ్వంభర వీధిలో విభ్రాజమానంగా విరాజిల్లజేసిన సీమ....... "రాయలసీమ".

తెలుగువారి తేజమై, రాజనీతి దురంధరుడై, మహామంత్రిగా చంద్రగిరినుండి హంపి విజయనగరం వరకు ప్రవర్ధమానుడైన అమర త్యాగి"అప్పాజి" కనుసన్నలలో కదలాడిన ఆంధ్రకర్ణాటక రాజ్య రమ....రాయలసీమ.

విఠలుడు, విరూపాక్షుడు, హజారరాముడు, అలవైకుంఠవాసుడు (శ్రీ వెంకటేశ్వరుడు) చల్లగా బ్రోచిన రతనాల సీమ. అత్తాకోడండ్ర (లక్ష్మి, సరస్వతి) అన్యోన్యతకు నెలవైన రంగారు బంగారు సీమ

సుభిక్ష సుందర సీమ....కళలకు కాణాచి రాయలసీమ.

ఏకశిలా రథాలపై సప్తస్వరాలు సరిచూచుకున్న సంగీతం......

భువనవిజయ ప్రాంగణంలో పుంభావ సరస్వతుల ప్రబంధ పరిమళాలు వెదజల్లిన కవిత్వం......

సంగీత కవిత్వ సమ్మేళనంతో రంభాది అప్సరసలను మురిపించు భామల కింకిణుల మంజుల నిస్వనముతో లయతప్పక నర్తించిన నాట్యం.....

అప్సరసల నాట్య విన్యాసాలతో దేవతా మూర్తుల ప్రతిమలతో సభామంటపాలు, రాతి రథాలు, ఆలయ గోపురాలపై తర తరాల హైందవ సంస్కృతికి చిహ్నంగా నిలిచిన శిల్పం.....

భావుకుని హృదయ స్పందనమే రంగుల స్వప్నంగా చిత్రకారుని కుంచెతో జీవం పోసుకొన్న చిత్రలేఖనం... హంపిని, అమరావతిగా చేశాయి. భువన విజయం మహేంద్రసభను మరపించింది. భువిలో వెలసిన దివ్య సామ్రాజ్యం. ఆనాటి రాయల సీమ వైభవం అది. అటు వంటి రాయల సీమలో యెన్నో జానపద కళలు స్థానికంగా బహుళ ప్రచారం పొందాయి. రాజుల పోషణలో, ప్రజల ఆదరణలో బహుముఖంగా అభివృద్ధి చెందాయి.

రాజు ధర్మప్రభువైతే రాజ్యం సుభిక్షమవుతుంది. ప్రజలు సుఖశాంతులతో సహజీవనం చేస్తారు. విరామకాలాన్ని వినోదార్థం వినియోగించుకుంటారు. ఆనంద పారవశ్యంతో యెన్నో గంతులు, చిందులు వేస్తారు. భజనలు చేస్తారు. హృదయ స్పందనతో పదాలు పాడుతారు. వీటినుండే జానపద కళలు ఆవిర్భవిస్తాయి. అలా ఆవిర్భవించినవే కోలాటాలు, చెక్కభజనలు, బుర్రకథలు, కొరవంజి,

విజయనగర రాజుల కాలంలో రాయలసీమలో యెన్నో జానపద కళలు బహుళ ప్రచారంలో వుండేవి. రాజ్యంలో ప్రజాజీవనం సుఖశాంతులతో విరాజిల్లింది. ప్రజలు విరామ కాలంలో వినోదార్థం "కోలాటాలు, చెక్కభజనలు, బుర్రకథలు, యక్షగానాలు, పగటివేషాలు, నాటకాలు" నేర్చి, ప్రదర్శించేవారు. వీటికి పల్లెపట్టులందు మంచి పట్టు వుండేది. ప్రజాదరణ లభించేది. రాజాశ్రయం పొందేది.

అటువంటి ప్రదర్శనయోగ్యమైన జానపద కళలలో వీధినాటకం అతిప్రాచీనమైంది. వీధినాటకానికి 'వీధి భాగవతమని, వీధి భాగోతమని, తెర నాటకమని, బయలాట" అని నామాంతరాలు గోచరిస్తాయి.

## 1. వసంతోత్సవాలు:

విజయనగర రాజుల కాలంలో "వసంతోత్సవాలు" గొప్పగా జరిగేవి. ఈ ఉత్సవాలు మహర్నవమి రోజున తుంగభద్రా తీరంలో జరిగేవి. విజయనగర రాజవీధిలో మేళతాళాలతో ఊరేగింపుగా "కోలాట నృత్యం" సాగిపోయేది. ఒక వినోద కార్యక్రమం తరువాత మరొక వినోద కార్యక్రమం సాగిపోయేది.

## 2. దసరా మహోత్సవాలు:

విజయనగర రాజభవనంలో దసరా మహోత్సవాలు అత్యంత వైభవంగా జరిగేవి. ఆ సమయంలో అద్భుతమైన నాట్యప్రదర్శనలు జరుగుతుండేవి. గాయకులు గానం చేసేవారు. కథకులు కథలు చెప్పేవారు. లలిత విన్యాసాలతో నృత్యం చేయడం, 'నటులు' గాన మాధుర్యంతో నటనాకౌశలాన్ని ప్రదర్శించేవారు. ఇక్కడ తెలియజేసిన నాటకాలు వీధి నాటకాలనడంలో యెట్టి సందేహం లేదు. నేటి రంగస్థల నాటకాలు ఆ నాటికి ఇప్పటివలె అభివృద్ధి చెందలేదు.

మొదటి దేవరాయలు (క్రీ.శ. 1406-1422) నాటి నాటక కళను గూర్చి ఒక కథ సోదాహరణంగా తెలియ జేయబడింది. ఈయన కాలంలో 'ఫెరిస్తా' అనే మహమ్మదీయ చరిత్రకారుడు విజయనగర రాజుల నాటక కళాప్రాముఖ్యాన్ని, రాజకీయ పరమైన ఒక అపూర్వ సంఘటనను గూర్చి ఇలా వ్రాశాడు.

"ముదగల్లు, రాయచూర్ల"పై ఆధిపత్యాన్ని గురించి అనాది నుండీ విజయనగర రాజులకు, మహమ్మదీయులకు తీవ్రయుద్ధాలు జరుగుతూవుండేవి. విజయనగర రాజులకు, కళలపట్ల గల కాంక్షను ఆసరాగా తీసికొని మహమ్మదీయులు ఒక నాడు చక్కని ఉపాయం ఆలోచించారు.

విజయనగరం వారి నాటకాలలో నటించే వేశ్యల్ని లోబరుచుకొని, ఆ వేషాలు తామే ధరించుకొని, మహమ్మదీయులు కోటలో ప్రవేశించారు. నాటక ప్రదర్శనలో ఒక సన్నివేశంలో కత్తియుద్ధం కూడా వుందట. తరుణం వచ్చిన వెంటనే వేషధారులు బూటకపు నటనకు స్వస్తిచెప్పి, ప్రత్యక్ష హత్యాకాండకు వుపక్రమించి, ప్రేక్షకులుగా కూర్చున్న రాజకుటుంబాన్ని వధించి, కోటను వశపరచు కున్నారట.[1]

ఎందరో విదేశీ యాత్రికులు, రాయబారులు, వ్యాపారులు విజయనగర వైభవాన్ని, కళాపోషణను గూర్చి తెలియజేశారు. వారిలో ముఖ్యులు పారసీ దేశస్థుడైన 'అబ్దుల్ రజాక్', ఫెరిస్తా' అను మహమ్మదీయ చరిత్రకారుడు 'పెట్రోడెల్లా' అను పోర్చుగీసు దేశస్థుడు, 'పేయస్' అను విదేశీయాత్రికుడు, 'నికోలోకాంటి' 'నూయల్', మొదలగువారు.

అప్పటికే పరిణతి చెందిన, జన సామాన్యంలో, రాజాంతఃపురాలలో ప్రాచుర్యం పొందిన కళలు యేనాడో ఆవిర్భవించాయి. మొదట్లో కళలెప్పుడూ నాగరికసమాజంలో ఆవిర్భవించ లేదని తెలుస్తుంది. ఆటవిక జనుల్లో ఆవిర్భవించిన కళలు అంతఃపురాలలో వినోద ప్రదర్శనలుగా తిష్టవేశాయి. రాచమర్యాదలను అందుకున్నాయి. మేధస్సు పెరిగి, నాగరికత అభివృద్ధి చెంది, యెన్నో దశలను దాటుకుంటూ వచ్చి, ఈనాడు 'నవనాగరికత' అని పిలిపించుకుంటూ వున్న నగరవాసుల సంస్కృతి ఒకనాడు 'కళకళకోసం' అని గొంతెత్తి అరిచినా, ఈనాడు "కళ సమాజం కోసం" అని సమ్మతిస్తూవుంది.

## కళావిర్భావం

భగవంతుని సృష్టే ఒక కళాఖండం. మహోన్నత గంభీర పర్వత శిఖరాలు, ప్రళయ ప్రభంజన ఝంఝా మారుతాలు, లయకేళీ వినోదంలో ఘూర్ణిల్లే మహాసాగరాలు, గలగలా ప్రవహించే సెలయేళ్ళు, కిలకిలా రవళించే పక్షుల నినాదాలు, పిల్ల తెమ్మెరలు, తివాచీల్లాంటి పచ్చిక బయళ్ళు, శుకపికాల నృత్యగానాలు.....ఓహ్! పరవశించే ప్రకృతిలో ప్రతిదీ ఒక కళారూపమే...! దానిని దర్శించ గలిగేదే కళాహృదయం.

---

.1.ఆంధ్రనాటకరంగ చరిత్ర-పేజి-మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి.

సకల చరాచర ప్రపంచంలో మానవుడొక జీవి. ఆలోచనా శక్తిగల జీవి, అనుకరించేస్వభావం గల జీవి, భగవంతునిసృష్టిని అనుకరించి, ప్రతిసృష్టి చేశాడు "విశ్వామిత్రుడు." మనిషిలోని ప్రతి సృష్టి చేయాలనే తపన కళా సృష్టికి పొందింది. సృష్టిని అనుకరించడమే కళాసృష్టి.

'సృష్టి' ఆవిర్భావంతోనే 'కళ' కూడ ఆవిర్భవించింది. కాని ఆనాడు అది 'కళ'గా పేర్కొనబడలేదు. మానవుడు పుట్టిన తరువాత ఆకలి తీర్చుకోవడానికి ఆహారాన్ని వెతుక్కున్నాడు. శీతాతపాల నుండి రక్షించుకోవడానికి వసతిని ఏర్పాటు చేసికొన్నాడు. చిత్ర విచిత్ర వేషాలతో, కేరింతలతో, చిందులతో వినోదిస్తూ ఆనందపడ్డాడు. ఆనాటి"విచిత్ర వేషధారణ, కేరింత, చిందు" ఈనాటి జానపద కళగా పేరుగాంచిన "వీధి నాటకానికి" నాంది. ఇది తిరుగులేని సత్యం. దీనిని బట్టి 'కళ' ఆనాడే ఆవిర్భవించిందని చెప్పవచ్చు. కళముఖ్యోద్దేశం వినోదం. ఈ వినోదంతో మానవుడు తను ఆనందపడి, ఇతరులను ఆనందపరిచేవాడు. ఆనాడు దీనిని 'కళ' అనేవారు లేరు. 'రస' విభజన అంతకన్నా తెలియని దశ.

ఈ విధంగా ఆవిర్భవించిన జానపద కళ యెన్నో దశలను దాటుకుంటూ వచ్చి, నేడు వీధి నాటకంగా పరిణమించింది.

మానవునిలో ఆలోచనా సరళి పెరగడం ఆరంభించింది. మొరటుగా వున్న 'కళ'లో కొంత సున్నితత్వం చోటుచేసి కొన్నది. మార్పు గోచరించింది. ఒక్కొక్క మెట్టే యెదగసాగింది. అలా యెదిగేటప్పుడు తన జనికిని విస్మరించకుండా, వివిధ జానపద కళలతో సాన్నిహిత్యం యేర్పరచుకొని, కొత్తకొత్త రూపాలతో కొత్త కొత్త పంథాలను అనుసరించింది.

ఆదిలో "కురవంజి" లేక "కొరవంజి" కళా రూపం దాల్చింది. ఒక దశలో యక్షగానాలతో చేతులు కలిపి, రాజాస్థానాలనే అధిరోహించింది. ఒక స్థితిలో 'కూచిపూడి' నృత్యాలతో కలిసిపోయినట్లే కనిపించింది. వీథినాటకంగా నడివీధిలో ఆడింది. పగటివేషాలు, బుర్రకథలు, హరికథలే గాక అనేక నృత్త, నృత్య విశేషాలుగా రూపుదాల్చి, ప్రపంచంలోనే "భారతీయ జానపద కళ" గా ఒక విశిష్ట స్థానాన్ని ఆక్రమించుకొన్నది.

## కొరవంజి :

"కొరవంజి" తెలుగువారి మొదటి జానపద కళారూపం. "కొరవంజి కళకు పూర్వం మరొక జానపద కళ వుందనడానికి చరిత్రాధారాలు లేవు"1

అడవులలో నివసించే 'కురవలు' అను అడవి జాతివారు వేసే అడుగు కాబట్టి దీనికి "కురవంజి" లేక "కొరవంజి" అనిపేరు వచ్చింది. కొరవంజి అడవులలో పుట్టింది, పుణ్యక్షేత్రాలను ఆశ్రయించింది.

కొరవంజి ఒక నృత్యవిశేషంతో కూడిన అడుగు. "గంతులు, చిందులు, గొండ్లి, అంజె, అంట, అడుగు" అనేవి నృత్యవిశేషాలు.

ఆటవికులైన 'కురవలు' యాత్రికుల వినోదార్థం అడవి జంతువుల చర్మాలు, నెమలి ఈకలు, పులిగోళ్ళు, ఎలుగుబంటి బొచ్చు, పంది ముండ్లు, కోరలు రకరకాల పక్షుల ఈకలు" మొదలగువాటితో విచిత్ర వేషధారణ చేసికొని, కాలికి వచ్చిన చిందులు తొక్కుతూ, నోటికి వచ్చిన పదాలు పాడి, ఆడి, ప్రేక్షకులను వినోద పరచేవారు. ఆయాటే క్రమక్రమంగా "కొరవంజి" జానపద కళగా రూపుదాల్చింది.

ఏపుణ్యక్షేత్రంలో వారు ప్రదర్శనలిస్తారో ఆ క్షేత్రమాహాత్మ్యాన్ని పాటగామార్చి, తగిన విధంగా అడుగు వేస్తూ, యాత్రికులను ముగ్ధుల్ని చేసేవారు. "శ్రీశైలం, భద్రాచలం, సింహాచలం, తిరుపతి" మొదలగు క్షేత్రాలలో కురవంజులు తమ ప్రదర్శన లిచ్చేవారని ప్రతీతి. ఇలా ప్రారంభమైన కొరవంజి కళారూపం క్రమంగా ఆంధ్రదేశం నలుమూలలా వ్యాపించింది. చివరికది ఎరుకలవారికి జీవనోపాధిగా మారింది.

'కొరవంజి' అంటే "ఎరుకలసాని" అని అర్థం. ఎరుకలసాని వినోద కాలక్షేపానికై, సామాన్యంగా ఆట పాటలు జోడించి, ఆరంభించిన నృత్యం. ఈనాడది ఒక జానపద కళా ఖండం. జానపద దృశ్యకావ్యం. ఇది ఒక్క తెలుగునాటనే గాక ద్రావిడ, కేరళ, కర్ణాటక ప్రాంతాలలోకూడ ప్రాముఖ్యం వహించింది.

అడవులలో ఆవిర్భవించి, పుణ్యక్షేత్రాలలో పాదమూని, ప్రజాసామాన్యంలో ప్రచారంపొంది, క్రమంగా దేవతా ఉత్సవాలలో ప్రవేశించి, గ్రామజాతర్లలో ఘనత వహించి, రాజుల ఆశ్రయాన్ని సంపాదించి, అంతఃపురకాంతల ప్రాపకంపొంది, అందరిచేత ఆదరింప బడిన ఈ కొరవంజి జానపదకళారూపం నేడు ఆంధ్రప్రదేశ్ లో అంతర్ధానం అయ్యింది. ఈ కళాఖండానికి స్మృతి చిహ్నంగా నేడు మనకు గోచరించేది ఎరుకల సాని పాత్ర-గద్ది(సోది) చెప్పే ఎరుకత మాత్రమే. ఈ గద్ది చెప్పే ఎరుకత "వేంకటేశ్వర మాహాత్మ్యము" లో కూడా కనిపిస్తుంది. కొరవంజి జానపద కళలోని ముఖ్యపాత్రలు – సింగి, సింగడు, కొంటెకోణంగి, కొరవంజి. తమిళంలో "కొరవంజి కుఱత్తి పాట్టు"(కురవత పాట) అనీ, మళయాళంలో "కొఱత్తియాట్టమ్" అనీ, కన్నడంలో "కొరవంజి" అని, తెలుగులో "కొరవంజి ఎరుకలసాని"

అని ప్రచారం పొందింది.

ఒకప్పుడు ఆంధ్రదేశంలో "జీవకొరవంజి, జ్ఞాన కొరవంజి, సత్యభామ కొరవంజి, ఎరుకల కొరవంజి, జానకీ సుఖోల్లాస కొరవంజి, రామమోహన కొరవంజి," అను నాటకాలు బహుళ ప్రచారంలో వుండేవి. ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఈ కొరవంజి నాటకాలు ప్రదర్శింప బడటంలేదు. కాని తమిళనాడులో మాత్రం "కుత్రాల కురవంజి" అను పేరుతో నేటికీ ప్రదర్శింప బడుతూ వుంది.

ఇలా అభివృద్ధి చెందిన 'కొరవంజి' జానపద కళారూపం "యక్షగాన" నాటకాలకు ఒరవడి అయ్యింది, జక్కులవారు (యక్షులు) అనే కళావంతులు కొరవంజిని ఆధారంగా యక్షగాన నాటక ప్రదర్శనలు ప్రారంభించారు.

## యక్షగానాలు :

"యక్ష" శబ్ద తద్భవ రూపం "జక్క"
యక్షులు - జక్కులు.

నేడు 'జక్కులు' అను శబ్దం ఒక జాతిపర్యంగా వినిపిస్తూ వుంది.

మన ప్రాచీన జానపద కళారూపాల్లో అతి ప్రాచీనమైంది యక్షగానం. యక్షగానాలు తమిళ, కేరళ, కర్ణాటకాంధ్ర దేశాలలో దేశి సాహిత్యపరంగాను, సంగీతాభినయ జానపద కళాపరంగాను బహుళప్రచారంపొంది, సుసంపన్నమైనవి.

ఆచార్య శ్రీఖండవల్లి లక్ష్మీరంజనం గారు "రూప కావిర్భావంలో మొదటి దశ కురవంజులు వెడలుట....కురవంజులు ఆటవికుల మూలమున పట్టణములకు ప్రాకిరి. నగరకవులు కురవంజులవంటి రచనలు చేయసాగిరి. వీటిని ప్రదర్శించువారు జక్కులు గనుక నివియక్ష గానములను పేరుదాల్చెను."[1]ఇది వేటూరివారి వాదమని తెలయజేశారు.

క్రీడాభి రామంలో (135వ. పద్యం 7 "జక్కుల పురంధ్రి"గాన కళాకౌశలాన్నిగూర్చి ప్రశంసింపబడి వున్నది.

బొమ్మలాటల పరిణామమే యక్షగానమని శ్రీనేలటూరి వెంకట రమణయ్యగారి అభిప్రాయం. "కాలక్రమమున బొమ్మలకు బదులు మనుషులు కథలలోని పాత్రలు ధరించి, ప్రదర్శించిరి. మొట్ట మొదట బొమ్మలాట సంప్రదాయాన్ననుసరించి, మూక నాట్యంగ ప్రారంభమైంది. ఈ మూక నాట్యమే క్రమంగా యక్షగానంగా పరిణామ మందినది."[2]

యక్షగానమనగా యక్షుల యొక్క పాట అని అర్థం. బౌద్ధ సాహిత్యంలో "యక్షులు" (యక్షులు) "నీతి ప్రవక్తలు, రక్షకశక్తులు"గ పేర్కొనబడివున్నది. హైందవ పురాణాలలో యక్ష "శబ్దం" యక్ష, గరుడ, గంధర్వ, కిన్నెర, కింపురుషాది దేవగణాలుగా పేర్కొన బడియున్నది.

మహాభారతంలో రాజసగుణ ప్రధానులగు మానవులు యక్షరాక్షసులను పూజింతురని పేర్కొనబడి యున్నది. భారతంలో "యక్షప్రశ్న"లను పరిశీలించిన యక్షులు ధర్మపరాయణులు లేక ధర్మజిజ్ఞాసువులని తెలుస్తుంది.

కొండవీటి రెడ్డి రాజుల కాలంలోను, విజయనగర రాజుల కాలంలోను, మధుర తంజావూరు ఆంధ్రనాయక రాజుల కాలంలోను యక్షగాన వాఙ్మయము, యక్షగాన నాటకాలు దేదీప్య మానంగా వెలుగొందాయి. ఒకనాడు యక్షగాన వాఙ్మయం దక్షిణ భారతదేశం (ఆంధ్ర, తమిళ, మళయాళ, కన్నడ, మహారాష్ట్ర)లో పుష్కలంగా రచింపబడి, ప్రదర్శింపబడడానికి జక్కులవారే కారకులు. జక్కులవారు విద్యావివేకాల్లో నిష్ణాతులు. సంగీత, సాహిత్యాలలోను, చిత్ర, శిల్పకళాప్రతిభలలోను గొప్ప ప్రజ్ఞగల వారుగా పేరుగాంచినారు. ప్రాచీనజాతుల్లో "జక్కులు, బవని వాండ్లు" మొదలగు వారు మేధావి వర్గంగా పరిగణింప బడ్డారు.

మనకు లభించిన మొట్టమొదటి యక్షగానంగా "సౌభరిచరిత్ర" చెప్పబడుతూవుంది. తరువాతది "చిత్ర భారతం". ఆ తరువాత "సుగ్రీవ విజయం, విప్రనారాయణ, బాలపాపాంబ, అక్కమహాదేవి చరిత్ర, విష్ణుమాయా విలాసము, ప్రభావతీ ప్రద్యుమ్నము, గంగావతరణము, శశాంక విజయము, చంద్ర తారా విలాసము" మొదలగునవి ప్రాచీన యక్షగానాలు.

ఆంధ్రదేశంలో యక్షగాన ప్రదర్శనలు బహుముఖంగా సాగినవి. శ్రీనాథుని "జక్కుల పురంధ్రి', ప్రతాప రుద్రుని పడపు గత్తె 'మాచల్దేవి', భాగోతుల బుచ్చి, పెండెలనాగి, దోరసముద్రపు నటులు, తాయి కొండ నాటక సమాజ ప్రదర్శకులు" ముఖ్యులు.

---

1. ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము - పేజి. 208-210 -ఆచార్య శ్రీఖండవల్లి లక్ష్మీరంజనం-
2. మధుర తంజావూరు నాయక రాజుల నాటక చరిత్ర. - శ్రీనేలటూరి వెంకట రమణయ్య.

రామకృష్ణయ్యగారు, పింగళి లక్ష్మీకాంతం గారు, చింతా దీక్షితులు గారు, యండమూరి వెంకట రమణగారు మొదలైనవారి అభిప్రాయం. యక్షగానం గేయ, నృత్య విశిష్టమైనవి. యక్షగానం వీధులలో ప్రదర్శించడం చేత వీటికి యక్షగాన వీధినాటకాలని పేరువచ్చింది.

"మొదట గానరూప కథాఖ్యానముగ గ్రామసీమల పామర గాత్రమాత్రోప జీవిగానుండి యక్షగానమాడు నాటికి వాడవాడల నాడబడుచుండిన వీధి నాటకపు వాట మెరిగి, రాచనగరమొగసాలల కెగబ్రాకి, రంగభోగమునవధరించుటలో మార్గరూపక ప్రభావము ననుసరించి 'నాటక ' నామకరణము చేయించుకొన్నది. కోట లోని రాజుగారికిని, పేటలోని ప్రజలకును నాదరపాత్రమైనది". 1

ఆధునిక కాలంలో యక్షగానం వీధినాటకంతో ఐక్యం చెందింది. అందుకు కూచిపూడి భాగవతులే కారకులని ఒక వాదం. కూచిపూడి భాగవతులు మొదట వీధినాటకాలాడుతుండే వారనియు, తరువాత వచ్చిన యక్షగానాలు వారి దృష్టినాకర్షించిన వనియు, వీధినాటక, యక్షగాన సమ్మిళితమైన ఒక నూతన ప్రయోగాన్ని ప్రవేశపెట్టిన ఘనత కూచిపూడి భాగవతులకే దక్కుతుందనియు తెలుస్తుంది. అదే 'యక్షగాన రూపక' ప్రక్రియ. ఉదాహరణగా కూచిపూడి నృత్యాలకు మూలపురుషుడైన "సిద్ధేంద్ర యోగి" సృష్టించిన "భామా కలాపము" అని చెప్పవచ్చును. ఈ క్రొత్త ప్రక్రియ ప్రయోగంలో సిద్ధేంద్ర యోగి సిద్ధహస్తుడు. భరతముని నాట్యశాస్త్రాన్ని అనుసరించి, నందికేశ్వరుని అభినయ దర్పణానికి అనుగుణంగా యక్షగానాలను సృష్టించి, ప్రదర్శించిన వారు సిద్ధేంద్రయోగి.

19వ శతాబ్దంలో యక్షగానానికి 'నాటక' శబ్దం పర్యాయపదంగా వ్యవహరించడం జరిగింది. యక్షగానం నాటక గేయ ప్రబంధమనియు, 'నాటకం' అనియు పిలువబడింది. యక్షగానానికి నాటక శబ్దం వీధినాటక సాహచర్యంతో సంక్రమించి వుండవచ్చునని ఊహించ వచ్చును. నేటి రంగస్థల నాటకాలకు, నాటి యక్షగాన నాటకాలే మాతృకలని కొందరు విమర్శకులు తెలియజేశారు. కాదని కొందరివాదం.

దక్షిణాంధ్ర యుగంలో యక్షగానం అక్షయమై, అతి త్వరిత గతిలో అభివృద్ధి చెంది, సర్వోపయోగ్యమైన "నాట్య,సంగీత, సాహిత్య, సమాహారకళాస్వరూపం"గా ప్రకాశించింది.

"పూర్వము తెలుగు నాటకములన్నియు యక్షగాన రూపములుగానే యున్నవి. ఈ దేశంలో పూర్వం ప్రదర్శింప బడుచుండిన" పారిజాతాపహరణ నాటకము, ప్రహ్లాదనాటకము" మొదలైన వీధి నాటకములిట్టివే"1

పై వాక్యాలను బట్టి వీధి నాటకాలు, యక్షగానాలు ఒకదాని కొకటి వేరైనవనియు, వీధి నాటకాలు యక్షగానాలకు పూర్వం ఉన్నట్లు తెలుస్తుంది. యక్షగానాలు, వీధినాటకాలు రెండూ కూడా వీధి ప్రదర్శనలే. రెండూ నృత్యసంగీత సాహిత్య ప్రాచుర్యం కలిగిన కళలే. ఒక దశలో రెండూకూడా ఒకదానితో ఒకటి ఐక్యంచెందినట్లు గోచరిస్తాయి.

యక్షగానానికి పూర్వమే వీధి నాటకాలు ప్రచారంలో వుండి నప్పటికీ, యక్షగానం ఆవిర్భవించి, వీధినాటకాలతో ఐక్యం చెంది, ఒక నూతన నాటక ప్రక్రియగా రూపొంది, నాటక శబ్దాన్ని వాచ్యంచేసి, మధ్యలో మార్గనాటక ప్రభావానికి లోనైనప్పటికీ తన వ్యక్తిత్వాన్ని పోగొట్టుకొనక, తనదైన బాణిలో దేశినాట్యకళా ప్రపంచానికి ప్రతినిధిగా నేటికీ నిలిచివుంది.

'కొరవంజి, యక్షగానం, కూచిపూడి" నృత్యాలకు ఆధారం వీధి. వీధిలో ప్రదర్శించే నృత్యనాటక విశేషాలు కాబట్టి వీటికి వీధి నాటకంతో అవినాభావ సంబంధం యేర్పడింది. వీధినాటకంతో వీటికున్న సంబంధం విడదీయరానిది. ఈ నృత్యగాన విశేషాలనుండి వీధినాటకాన్ని వేరుచేస్తే, మనకు కేవలం సాహిత్యపరమైన వాఙ్మయమే మిగులుతుంది, "దరువు, అడుగు, తాళం, మేళం," ప్రధానమైంది వీధి నాటకం. కేవలం వాఙ్మయ రూపమైన 'కొరవంజి, యక్షగానం, కూచిపూడి' నృత్యాలకు వెన్నెముక వీధి నాటకం. ఒక చైతన్యం. వీధి నాటకానికి 'కొరవంజి, యక్షగానం, కూచిపూడి' ఆకృతి (రూపం). నాటకం (నటన) ప్రాణం. వీధి (రంగస్థలం) ఆధారం. ఇవి ఒక దానినుండి ఒకటి ఆవిర్భవిస్తూ పరిణతి చెందుతూ, ఒక్కొక్కదశ ఒక్కొక్క జానపద కళాఖండంగా ఆంధ్రసాహిత్య చరిత్రలో తమ స్థానాలను పదిల పరచుకున్నవి.

'కొరవంజి' నోటి కొచ్చిన పాటలతో, కాలి కొచ్చిన అడుగుతో, ఆటవికవేషాలతో, వీధిలో ప్రదర్శింపబడేవి. కథావస్తువు స్థల మహాత్యం. ఇది మొదటి దశ.

'యక్షగానం' కొరవంజిని ఆధారంగాజేసికొని ఆవిర్భవించింది. సంగీతంలోను, సాహిత్యంలోను ఆటవిక స్థాయినుండి, నాగరికస్థాయికి యెదిగింది. పురాణాలలోని కథలు యక్షగానాలకు ఇతివృత్తాలైనవి. సంస్కరింపబడినదరువు, క్రమబద్ధమైన అడుగు, మేళం, తాళం,

సంగీతం, సాహిత్యం' ఇత్యాదులు యక్షగానం యొక్క ప్రత్యేకత. దీనికి కూడా ఆధారం వీధి. వీధులలో ప్రదర్శింపబడేయక్షగానాలు రాజుల ఆశ్రయంపొంది, అంతఃపురాలలో తిష్టవేశాయి. రాజాశ్రయంతో రంగ రంగ వైభోగంగా రాణించి, ఆంధ్రవాఙ్మయ చరిత్రలో తమదంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సృష్టించుకొన్నవి. దక్షిణాంధ్ర యుగాన్ని "యక్షగాన యుగం" అంటే అతిశయోక్తి కాదు.

"యక్షగానం "ఆంధ్ర సాహిత్య సరస్వతీ కంఠాలంకృత రత్నాలహారంలో దేశి సాహిత్య ప్రక్రియ మాణిక్యం. అదే ఒక ప్రత్యేక నృత్యవిశేషమై, సంగీతాభినయ నాటక కళకు ఆధార భూతమైన దేశసంస్కృతికోశమై విరాజిల్లింది.

యక్షగానాల్లో అనేకరకాలైన దేశిరచనలు యిమిడి వున్నవి. ఉదాహరణకు "ఏల పాటలు, జోలపాటలు, ఆరతులు, దవళాలు, చందమామపాటలు, వెన్నెల పాటలు" మొదలగునవి.

యక్షగాన ప్రదర్శనలో ఒకవిశేషం గోచరిస్తుంది. ప్రదర్శనలో వచ్చే ప్రతిపాత్ర తనను తాను పరిచయం చేసికొంటూ కథను నడుపుతుంది. వీధినాటకంలో సూత్రధారుని ప్రవేశంలోను, ప్రధాన పాత్రల ప్రవేశసమయాల్లోను, యక్షగానం పోలికలు గోచరిస్తాయి. ఉదాహరణకు "మన్నెకొండ విలాసం" యక్షగానంలో చిత్రాంగద పాత్ర తన ప్రవేశాన్ని గూర్చితానే తెలియజేసి కొంటుంది.

దేవినే చిత్రాంగద దేవినే
దేవినే పాండ్య దేశాధిపునకు
కేవల సుతనై కీర్తివహించిన
దేవినే చిత్రాంగద దేవినే!

యక్షగానాల్లో హాస్యరసం అధికంగా కనిపిస్తుంది. యక్షగాన నాటకంలో కథకు సంబంధించిన పాత్రలతో బాటు "ఎరుకసాని, కటికమువాడు, సింగి, సింగడు, సుంకర కొండ" మొదలైన సంప్రదాయక పాత్రలు ప్రవేశపెట్టబడినవి.

ఈ విధంగా సుప్రసిద్ధమైన యక్షగానాలు ముఖ్యంగా అఖిలాంధ్ర దేశంలోనేగాక యావద్దక్షిణాపథ వ్యాప్తమైన జానపదకళా స్వరూపంగా పేరు ప్రతిష్టలు సంపాదించుకున్నవి.

## సుప్రసిద్ధ యక్షగాన ప్రదర్శన మేళాలు :

ఆంధ్రదేశంలో యక్షగాన నాటకాలు బహుళప్రచారం పొందిన రోజులలో, యక్షగాన నాటక ప్రదర్శనలే జీవన వృత్తిగా గ్రహించి, కొన్ని మేళాలు ఆవిర్భవించాయి, వాటిలో సిద్ధేంద్రయోగి మేళం, భాగవతుల దశరధ రామయ్యగారి మేళం, భాగోతుల బుచ్చిగాని మేళం, రాయల సీమలో లేపాక్షి వేములపల్లి, తాడిపత్రి మేళాలు, నెల్లూరు మండలంలో పడకండ్ల రామస్వామి రాయకవి, త్వరకవి రామకృష్ణయ్యగార్ల మేళాలు, విశాఖ పట్టణంలో నరసింగపల్లి, కల్లేపల్లి మిక్కిలి ప్రసిద్ధి గాంచిన మేళాలు. పూర్వపుయక్షగానాలను ప్రదర్శించే వారు ఈనాడాంధ్ర దేశంలో కనిపించదు.

పోషించే ప్రభువులు పోయారు. ఆదరించే ప్రజలు చిన్నచూపు చూశారు. ఆదరణలేక అణగారిపోతున్న, జానపద కళలను చూస్తూ వూరుకోలేక, వాటికి పూర్వపుటౌన్నత్యాన్ని, వైభవాన్ని, కల్పించే శక్తి సామర్థ్యాలు లేని నేటి ప్రజా ప్రభుత్వాలు ఈ యక్షగాన ప్రక్రియను ఒక జానపద కళగా ప్రదర్శించే కళాకారులను పారితోషికాలతో, సన్మానాలతో సత్కరిస్తున్నవేగాని పోషించలేక పోతున్నవి.

## కూచిపూడి నాట్యకళ :

కృష్ణజిల్లాలో శ్రీకాకుళం పట్టణానికి సమీపంలో 'కూచిపూడి' గ్రామం వుంది. 'కూచిపూడి' బ్రాహ్మణ అగ్రహారం. ఒక కళాక్షేత్రం. నేడు విశ్వవిఖ్యాతి గాంచిన కూచిపూడి నృత్యానికి పుట్టినిల్లు. సుమారు ఐదు వందల సంవత్సరాలకు పూర్వమే కూచిపూడిలో నాట్యకళకు అంకురార్పణ జరిగిందని చరిత్రకారుల అభిప్రాయం.

కూచిపూడి భాగవతుల ప్రదర్శనాలకు మూలపురుషుడు "సిద్ధేంద్రయోగి" అని చెబుతారు. సిద్ధేంద్రయోగి స్థానికుడని కొందరు అభిప్రాయపడ్డారు. సిద్ధేంద్రయోగి కూచిపూడిలోని బాలురను సమకూర్చుకొని, వారికి సంగీతాన్ని, నాట్యాభినయాన్ని నేర్పాడు. ఆనాటినుండి కూచిపూడి కళాకేంద్రంగా భాసిల్లింది. సిద్ధేంద్రయోగి అటు భరతముని నాట్యశాస్త్రాన్ని, ఇటు నందికేశ్వరుని అభినయ దర్పణాన్ని, ఔపోసన పట్టిన వ్యక్తి. సిద్ధేంద్రయోగి అహోరాత్రులు పరిశ్రమించి, కూచిపూడి నృత్యాన్ని సృష్టించాడు. యువకులైన కూచిపూడి వాస్తవ్యులను ఒక్కటిగా చేర్చి, నాట్యగీతాభినయాలను వారిచేత సాధన చేయించి, ఆ కళను వారికే అంకితం చేశాడు.

పారిజాతాపహరణము." ఈ నాటకాలను ప్రదర్శించి, కూచిపూడి . భాగవతులు ప్రశంసల పరంపరను అందుకున్నారు.

కూచిపూడి వారి ప్రదర్శనలు సంప్రదాయ బద్ధంగా వుంటాయి. (వీరు భరతముని నాట్య శాస్త్రాన్ని, నందికేశ్వరుని అభినయ దర్పణాన్ని వీరిప్రదర్శనలో ప్రవేశపెట్టారు). కూచిపూడి భాగవతులు ఆటను ప్రారంభిస్తే, నందికేశ్వరుని అభినయాన్ని, భరతముని నాట్యాన్ని, శాస్త్రయుక్తంగా తెల్లవార్లు ప్రదర్శిస్తూ వుండేవారు.

కూచిపూడి భాగవతులు 'భారత, భాగవత, రామాయణా'ది పురాణాల నుండి ఇతి వృత్తాన్ని గ్రహించి, యక్షగాన నాటక రూపంలో భరతముని నాట్యశాస్త్ర సంప్రదాయాలను అనుసరించి రచన గావించుకొని, ప్రదర్శనలిస్తూ వుండేవారు. వీరు ప్రదర్శించిన యక్షగానాల్లో 'గిరిజా కళ్యాణము, కీచక వధ, హరిశ్చంద్ర, కిరాతార్జునీయము, కాళీయమర్దనము, రుక్మాంగద, లవకుశ, ఉషాపరిణయము" మొదలుగునవి ముఖ్యములు. క్రమక్రమంగా ప్రేక్షకుల కనుగుణంగా ఈ యక్షగాన రూపాలను కొంతవరకు మార్పుచేసి, వీధి నాటకాలుగా ప్రదర్శించారు.

కూచిపూడి కళాకారుల నాట్యాభ్యాసం వ్యాయామం తో ఆరంభమవు తుంది. ఆ తరువాత అభినయం నేర్పుతారు. నాట్యంలో పాదగతులు, ఆళి, ప్రత్యాళి నేర్పుతారు. హస్తముద్రలను, అంగవిన్యాసాలను, మూడుకాలాల్లో అడుగులు నేర్చుకుంటారు. నాల్గవదశలో నవరసాలను అనుభవించడం, ముక్తాయింపులు, పాటలందలిభావాన్ని అనుసరించి భావవిన్యాసాన్ని అభ్యసిస్తారు. ఈ విధంగా నాలుగు దశలుగా విభజించుకొని నాట్యంలోను, హావభావ ప్రకటనలోను సాధనద్వారా పరిపూర్ణతను సంపాదిస్తారు.

భావ, రాగ, తాళయుక్తంగా అభినయించే నాట్యాన్ని భరతనాట్యం అంటారు. నాట్యం నృత్యమని, నృత్తమని రెండు విధాలు. భావాలను స్పష్టపరిచేది నృత్యం. భాషతో భావాలను వ్యక్తంచేసేది నృత్తం. కూచిపూడి భాగవతులు (నాట్యాచార్యులు) వీటన్నిటిని మేళవించి నాట్యం చేస్తారు. పాటలో వున్న పదం యొక్క భావాన్ని అభినయం ద్వారా చూపిస్తారు. ఈ విధంగా సంగీతం, సంగీతం ద్వారా పదం, పదం ద్వారా అభినయం, అభినయం ద్వారా భావవిశిష్టతను వెల్లడిస్తూ చేసే నృత్యమూ, నృత్తమూ కూచిపూడి సంప్రదాయంలో అత్యధిక ప్రాముఖ్యం వహించాయి.

"మువ్వగ్రామం" కూచిపూడికి అతి సమీపంలో వుంది. పద కవితలో తనదంటూ ఒక బాణిని సృష్టించుకొని, "మువ్వగోపాల" మకుటంతో మువ్వగోపాల పదాలను రచించి, దక్షిణ దేశాన్నంతా ఉర్రూతలూగించిన 'క్షేత్రయ్య' జన్మస్థలం. క్షేత్రయ్య మువ్వగోపాల పదాలను కూచిపూడి భాగవతులు వారివీధి నాటక భాగవతాల్లో పాడడం, భరతనాట్య సంప్రదాయం ప్రకారం అభినయించడం ద్వారా, యెక్కువ ప్రచారంలోనికి తీసుకొని వచ్చారు. కూచిపూడి వీధినాటకాలు ఆనాటి నుండి ఈనాటి వరకు వీధుల్లోనే ప్రదర్శింపబడుతూ వున్నవి. నాలుగు వీధుల కూడలిలోగాని, ఊరి మధ్య పెద్ద బజారులోగాని, ఊరివెలుపల బయలు ప్రదేశంలోగాని కూచిపూడి ప్రదర్శనలు జరుగుతుండేవి. వీరు గ్రామస్థుల సహాయంతో రంగస్థలాన్ని స్వయంగా నిర్మించుకొనేవారు. రాత్రి సుమారు పదిగంటలకు (10) ప్రదర్శన ప్రారంభమై, తెల్లవారి ఆరు (6) గంటలవరకు, నిర్విరామంగా ప్రదర్శించేవారు. ప్రేక్షకులు కూడ తెల్లవార్లు చూచి ఆనందించేవారు.

కూచిపూడి కళాకారులు నాట్య, సంగీతాలలో నేగాక అలంకార శాస్త్రంలోను, మంత్రశాస్త్రంలోను, భాషా శాస్త్రంలోను, వాద్యశాస్త్రంలోను యెనలేని నైపుణ్యాన్ని సంపాదించారు.

కూచిపూడి వారిలో "వేదాంతం వారు, వెంపటివారు, ఇంగువవారు, బుక్కావారు, చింతావారు, సమర్తివారు, భాగవతులవారు" అను ప్రసిద్ధికెక్కిన కుటుంబాలవారున్నారు.

ప్రస్తుతం "వెంకటరామానాట్య మండలి" అనుపేర కూచిపూడి నాటక సమాజం స్థాపింపబడివుంది. చింతా వెంకటరామయ్యగారు 1975 "వెంకట రామానాట్యమండలి"ని స్థాపించినారు, వీరేదీనికి వ్యవస్థాపక అధ్యక్షులు, మేనేజరు. ఢిల్లీ, బొంబాయి, హైదరాబాదు మొదలైన ముఖ్యనగరాలలో కూచిపూడి వీధినాటక ప్రదర్శనలిచ్చి గొప్ప గొప్ప సన్మానాలను అందుకున్నారు. వీరు గొప్ప నటులు. ఇప్పటి యువనటులలో పేర్కొనదగిన వారు వేదాంతం సత్యనారాయణ శర్మ. వీరు స్త్రీ పాత్రలు ధరించి, ఘనకీర్తిని సంపాదించారు. వీరి ప్రతిభకు మెచ్చి కేంద్రప్రభుత్వం వీరిని సన్మానించి, అవార్డును బహూకరించింది.

కూచిపూడి వారు స్త్రీ పాత్రలను కూడ పురుషులే ధరించేవారు. వీరికి కావలసిన రంగస్థల పరికరాలు, వేషభూషణాదులు వీరే తయారు చేసుకొనేవారు.

కూచిపూడి భాగవతులు ఆంధ్రదేశమంతటా వీధినాటక ప్రదర్శనలిచ్చారు. ఆ రోజుల్లో రాజాస్థానాలలోను, దేవుళ్ల కళ్యాణ ఉత్సవ సమయాల్లోను, తిరునాళ్ల సమయాల్లోను కూచిపూడి నాట్య, నాటక ప్రదర్శనలు తప్పనిసరిగా వుండేవి.

ఈ విధంగా అడవిలో ఆటవికుల వినోదార్థం ఆవిర్భవించిన జానపద కళ మొదటి దశలో కురవంజిగాను, రెండవదశలో యక్షగానంగాను, మూడవ దశలో కూచిపూడి నాట్యంగాను, నాల్గవ దశలో వీధి నాటకంగాను, ఐదవ దశలో నేటి అధునాతనమైన రంగస్థలనాటకంగాను పరిణతి చెంది వుండవచ్చును. ఈ పరిణామ దశలే నేటి మార్గ రంగస్థల నాటకాలకు ఆధారమని, యక్షగాన, కూచిపూడి, వీధినాటకాలే మాతృకలని కొందరు విమర్శకులు అభిప్రాయపడుతున్నారు. వీరి అభిప్రాయానికి ఆధారం వున్నా లేకపోయినా ఈనాటి పరిణతిదశలో వున్న నాటక కళకు, సినిమా కళకు ఆదిలో యేదో ఒక ఆటవిక కళ ఆధారమనడం సమంజసం, సహేతుకం. దాని క్రమ పరిణామమే ఈ నాటి అధునాతన 'రంగస్థల నాటకం' అనడంలో యెట్టి సందేహము లేదు.

## వీధి నాటకం

అడవులలో అడవి జాతుల ఆనందం కొఱకు ఆవిర్భవించిన "ఆట" యెన్నో దశలను దాటుకుంటూ, మార్పులు చెందుతూ, దేశి కళలలో ఒకటిగా, జానపద కళల సరసన చేరి, నేడు "వీధినాటకం" అని పిలువబడుతూ వుంది.

జానపదసాహిత్యంలోను, జానపద కళలలోను వీధినాటకానికి ఒక ప్రత్యేకస్థానం వుంది. ఇది సమాహారకళ. ప్రేక్షకుల స్థాయి ఎలావున్నా, కంటికింపైన వేషం, చెవికి సొంపైన పాట, మనసును ఉల్లాసపరిచే ఆట, ఆవేశపూరితమైన దరువు, మృదంగం, తబలా, హార్మోనియం, తాళమేళం, వంతపాట" వీధినాటకంలో ముఖ్యమైనవి. ప్రేక్షకలోకాన్ని ఆకర్షించి, ఆకట్టుకుంటుంది వీధినాటకం. అలరించి, ఆనందింప జేస్తుంది. "కళ వినోదంకొరకే పుడుతుంది" అనుటకు నిదర్శనం వీధినాటకం. దీనికి "వీధి భాగవతమని, వీధి బాగోతమని" పేర్లు.

"వీధి" దశరూపకాలలో ఒక భేదం. దీనికీ, వీధినాటకానికీ సంబంధం లేదు. కానీ రెండూకూడ నాటక విశేషాలే, ఐతే వేరు వేరు రూపాలు.

వీధి నాటకానికి ఆధారం వీధి. అనగా వీధినాటకానికి రంగస్థలం నడివీధి. వీధి నాటకం యెన్నోదశలనుదాటుకుంటూ ఈనాటి స్థితికి చేరింది. వసతులు లేక, సమకూర్చుకునే ఆలోచనరాక ఆరుబయట ప్రదర్శించిన రోజులలో ఈ వీధినాటకం "బయలాట" అని పిలువ బడింది.

తెరముందు ప్రదర్శింప బడేటప్పుడు "తెరనాటకము" అయ్యింది. పట్టపగలు వేషాలు ధరించి పాడుకుంటూ, ఆడుకుంటూ వెళ్ళడాన్ని "పగటివేషాలు" అన్నారు. నట్టనడివీధిలో, నాలుగు వీధుల కూడలిలో ప్రదర్శింపబడేటప్పుడు "వీధినాటకం" అని పేర్కొనబడింది.

మనప్రాచీన జానపద కళారూపాల్లో అతి ప్రాచీనమైనది యక్షగానమన్నారు. ఈనాడు మనం చూస్తున్న వీధి భాగవతాలకు మాతృకలు యక్షగానాలే అని తెలియజేశారు. యక్షగానాల తరువాత ప్రచారంలోనికి వచ్చింది వీధినాటకాలని పేర్కొన్నారు. కానీ యక్షగానాలు ఒక దశలో వీధి నాటకాలతో ఐక్యం చెందాయని చెప్పారు. ఒక దశలో కూచిపూడి నృత్యం వీధి నాటకాలతో చేరి, కొంతమార్పు చెందింది. వీధి నాటకం లేకుండా యక్షగానం కానీ, కూచిపూడి నృత్యంగాని రాణించ లేదని తేట తెల్లమవుతుంది. "కొరవంజి, యక్షగానం, కూచిపూడి నృత్యం" యెంత ప్రాచీనమో వీధి నాటకంకూడా అంత ప్రాచీనమైనవని తెలుస్తుంది.

'వీధినాటకం' పైనకనబరచిన ప్రాచీన జానపద కళలతో సన్నిహితత్వం కలిగి వున్నా, తన ఉనికిని మాత్రం పోగొట్టుకొనలేదు. తన ప్రత్యేకతను నిలుపుకుంటూనేవచ్చింది. వీధి నాటకంగానే నిలిచింది. యక్షగానాలు, కూచిపూడి నృత్యాలు యెన్నుకొను కథావస్తువునే యెన్నుకుంటుంది. తనదైన బాణీలో ప్రదర్శనలిస్తుంది.

కూచిపూడి నాట్యప్రదర్శనలు ఆంధ్రదేశమంతటా విజయ యాత్ర సాగిస్తున్న రోజుల్లో అంత ఉత్తమంగా వీధి నాటకాలు ప్రదర్శించి, ప్రజామన్ననలందుకున్న వ్యక్తి, మేటినటుడు "శ్రీ తమ్మారపు వెంకట స్వామి". వీరిజట్టులో స్త్రీ పాత్రలను స్త్రీలే ధరించేవారు. వీరు "ఉత్తర గోగ్రహణము, హరిశ్చంద్ర, శశిరేఖా పరిణయం, నలచరిత్ర, భామాకలాపం, గొల్లకలాపం" మొదలగు నాటకాలు ప్రదర్శించారు.

వీధి నాటకాల ప్రదర్శనలు వీరి కాలంలో యెంతో రసవత్తరంగా రక్తిగొట్టేవి. ఒక్కొక్క వూరిలో రోజుల తరబడి వీధినాటకాలు ప్రదర్శించేవారు. వీరంతా కళావంతుల కులజులు. నాటక ప్రదర్శన పూర్తయిన వెంటనే, వీరు వేషాలతో గ్రామంలో ప్రతియింటికి వెళ్ళి పాతచీరలు, దోవతులు దండుకునేవారు. ఆనాటి రంగస్థలానికి వెడల్పైన గుడ్డను (దుప్పటి) తెరగా వుపయోగించేవారు. అందువలన ఆనాటి వీధి నాటకం 'తెరనాటకం'గా పిలువబడింది.

"కుప్పం" చిత్తూరు జిల్లా, పలమనేరు తాలూకాలో పశ్చిమదిశగా వున్న ఒక చిరుపట్టణం. ప్రజలలో యెక్కువ ప్రచారంలో వున్న పేరు "కంగుంది కుప్పం". ఇది తమిళ, కర్ణాటక రాష్ట్రాలకు సమీపంలో వుండడంచేత కుప్పం పరిసర ప్రాంతాలలో "తెలుగు, తమిళ, కన్నడ" భాషలు ప్రజల వ్యవహారంలో నున్నవి. ఇక్కడ ఈమూడు రాష్ట్రాల సంస్కృతి, ఆచారవ్యవహారాలు సమ్మిశ్రితంగా కనిపిస్తాయి.

కుప్పం పట్టణానికి సుమారు యెనిమిది (8) కిలోమీటర్ల దూరంలో 'కంగుంది' అనుచిన్న గ్రామం వుంది. ఈ గ్రామానికి సమీపంలో ఒక కొండ కనిపిస్తుంది. ఆ కొండపైన ఒక పురాతనమైన కోట గోచరిస్తుంది. స్వాతంత్ర్యానంతరం భారత ప్రభుత్వం జమీందారీ వ్యవస్థను రద్దుచేసేవరకు, ఈ ప్రాంత మంతా కంగుంది జమీందారుల అధీనంలో వుండేది. "ఆంధ్ర, కర్ణాటక, తమిళనాడు" రాష్ట్రాలలోని 360 గ్రామాలు "కంగుంది" కేంద్రంగా జమీందారీ వ్యవస్థలో వుండేవి. ఈ ప్రాంతం పై తెలుగు, తమిళ, కర్ణాటక భాషల ప్రభావం అధికంగా గోచరిస్తుంది.

కంగుంది జమీందారుల పూర్వులు కృష్ణాజిల్లా లోని "వాల్మీకి" కులానికి చెందిన వారని చరిత్ర చెబుతుంది. వీరు ఛత్రపతి శివాజి సామ్రాజ్యం పతనము తరువాత కృష్ణాజిల్లా నుండి తమిళనాడులోని ఉత్తర ఆర్కాడు జిల్లాయందలి "జవ్వాజి కొండ"కు వలసవచ్చి, స్థిర మేర్పరచుకొన్నారు. ఆ తరువాత కంగుందికి సమీపంలో గల "బేట్రాయి స్వామికొండ"కు వచ్చి స్థిరపడినారు. వీరు బేట్రాయి స్వామి కొండలో నివాసముండే టప్పుడు, కంగుంది కొండప్రాంతానికి వేటకువచ్చారు.

అక్కడ అడవిలో నివసించు "కంగి, కంగడు" అను ఇర్లవాళ్ల (యానాదులు) సహాయంతో కొండపైకి పోవుమార్గం తెలుసుకున్నారు. కొండ పై భాగాన్ని, పరిసరాలను పరిశీలించి, కంగుంది కొండ దుర్గ నిర్మాణానికి అనువైన ప్రాంతంగా యెంచుకొని, అక్కడ దుర్గాన్ని నిర్మించారు. అప్పటినుండి అది "కంగుంది దుర్గం"గా పేరుగాంచింది. "కంగి, కంగడి" జ్ఞాపకార్థం ఈ దుర్గానికి 'కంగుంది దుర్గ' మనిపేరు పెట్టివుండవచ్చును.

కంగుంది జమీందారులకు మూలపురుషుడు "జవ్వాజి కంబినాయని వారు." వీరు జవ్వాజి కొండనుండి వచ్చినందువలన "జవ్వాజి"వారు అయినారు. "జవ్వాజి" అనునది వీరికి ఇంటిపేరు (సర్ నేమ్)గా నిలిచి పోయింది.

ఛత్రపతి శివాజి సామ్రాజ్యం పతనమైన తరువాత వీరిక్కడ స్థిరపడినట్లు చరిత్రాధారం కలదు. అప్పటినుండి కంగుంది జమీందారీని రాజాకంబినాయని జవ్వాజి వారి సంతతివారు పాలిస్తూవుండేవారు. ఈ సంతతిలోని జమీందారులకు "కంబినాయని వెంకటపతి నాయని వారు", "శ్రీ కంచినాయని జవ్వాజి నాగభూషణ నాయని "వారు అనుపేర్లే పునరుక్తమయ్యేవి. వీరిలో చివరి జమీందారు "శ్రీ రాజాకంబినాయని జవ్వాజి వెంకటపతి నాయనివారు". ఈవంశానికి మూలపురుషుడు కంబినాయని వారే. తరువాత వచ్చినవారు ఆయన పేరును తమ పేరుకు ముందు చేర్చుకోవడం ఆనవాయితీగ పెట్టుకున్నారు.

శ్రీ రాజా కంబినాయని జవ్వాజి వెంకటపతి నాయని వారు క్రీ.శ.1897వ. సంవత్సరంలో జన్మించారు. మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలో విద్యనభ్యసించారు. 10.12.1918వ. తేదీన జమిందారుగా సంస్థానాధిపత్యాన్ని స్వీకరించారు. ఈయన చాల తెలివైన వారని ప్రతీతి. కంగుంది జమీందారీలోగల 360 గ్రామాలలోని ప్రజల పేర్లు ఈయనకు గుర్తుండేవని చెబుతారు. అంతేకాదు శ్రీ రాజా కంబినాయని జవ్వాజి వెంకటపతి నాయనివారు తను బతికుండగనే తన జమీందారీలోని ప్రజలవద్ద నుండి సుమారు 60 వేల రూపాయలు చందాలుగా వసూలు చేసి, కుప్పంలో తన శిలావిగ్రహాన్ని (కాంశ్య విగ్రహం కావచ్చు) ప్రతిష్టింప జేసుకొని, దానికి 25 సంవత్సరాల తరువాత సిల్వర్ జూబ్లీ జరిపించుకొని, సంతృప్తి చెందిన ఘనుడు.

ఈయన కాలంలోనే భారత ప్రభుత్వం అప్పటి ఉపప్రధాని సర్దార్ వల్లభాయి పటేలు నాయకత్వంలో భారతదేశంలోని 526 జమీందారీలను స్వతంత్ర భారత దేశంలో విలీనం చేసుకొన్నది. అప్పుడే వీరి జమీందారీ కూడ స్వతంత్ర భారతంలో భాగమయ్యింది.

కంగుంది జమీందారులు దుర్గంతో బాటు కుప్పంలో కోటలు నిర్మించారు. ఆ కోటలలో వీరు నివాస మేర్పరచుకున్నారు. జమిందారీ వ్యవస్థ నశించి, ప్రభుత్వపరమైన తరువాత ఈ జమీందారుల సంతతివారు కంగుంది దుర్గాన్ని పూర్తిగా వదలిపెట్టి, కుప్పంలోని కోటలలో నివసిస్తున్నారు. ప్రస్తుతం కుప్పంలోని ఒక కోటలో శ్రీ రాజా కంబినాయని జవ్వాజి వెంకటపతి నాయని వారి కుమారుడైన "శ్రీ కంబినాయని జవ్వాజి నాగ భూషణనాయని వారు", వారి సంతతి వారు నివసిస్తున్నారు. రెండవ భవంతి సామాన్యమైనది. అందులో శ్రీ రాజా కంబినాయని జవ్వాజి వెంకటపతి నాయని వారి దౌహిత్రుడు శ్రీ యం. టి. వెంకటపతి (బి.ఎ., బి.యస్., అసిస్టెంట్ ప్రభుత్వ

ప్లీడర్)గారు నివాసముంటున్నారు. పై విషయాలన్నీ (ఆర్.టీ.సి.) ఉద్యోగి శ్రీ బి. మల్లిఖార్జున సహకారంతో శ్రీ వెంకట పతి, బి.ఏ.,బి.యల్., అసిస్టెంట్ గవర్నమెంటు ప్లీడరు గారి వలన తెలిసికొన్నవి.

కంగుంది జమీందారులు ఇటీవల కొన్ని తరాలుగా రాజమండ్రి ప్రాంతంలోని అమలాపురం వాస్తవ్యులైన బలిజనాయుళ్లతో వివాహ సంబంధబాంధవ్యాలను నెరపుకొంటున్నట్లు తెలుస్తుంది. ఈ జమీందారీకి సుమారు 400 సంవత్సరాల చరిత్రవున్నట్లు చెబుతారు.

## కంగుంది జమీందారులు – కళాసేవ :

జమీందారీ వ్యవస్థలో ఏవో కొన్ని సంస్థానాలు తప్ప తక్కినవన్నీ ప్రజల బాగోగులను పట్టించుకోలేదు. ప్రజలగోడు వారికి వినిపించదు. ప్రజల లేమివారికి కనిపించదు. వారికి కావలసింది అష్టైశ్వర్యాలు, దేవేంద్రభోగం. ప్రజలనుండి వసూలుచేసిన పన్నులు తమస్వర్గ సుఖాలకోసం, తమ ప్రాభవవైభవాలకోసం విచ్చలవిడిగా వెచ్చించే వారన్నది జగమెరిగిన నగ్నసత్యం. ఆనాడు ప్రజలకోసం పాలకులు కాదు. పాలకుల కోసం ప్రజలు. ఆనాటి వ్యవస్థ అట్టిది. కళలనుపోషించాలన్న దృక్పథంతోకాదు కాని, దేశ చరిత్రలో తమకంటూ ఒక స్థానం సృష్టించు కోవాలన్న కోరికతో, స్థానికమైన కొన్నికళలను పోషించేవారు. కవులను ఆదరించి, కావ్యాలను అంకితం తీసికొనేవారు, కళాకారులను సత్కరించేవారు. ఆకారణంగా వారు శాశ్వతకీర్తిని సంపాదించుకున్నారు. సంస్థానాలు నశించినా, రాళ్ళలో నిలిచి, శిలా విగ్రహాలుగా ప్రతిష్ఠింప జేసికొని, గతవైభవానికి, జమీందారీ వ్యవస్థకు స్మృతి చిహ్నాలుగా చరిత్ర పుటలమధ్య తమ స్థానాన్ని పదిలపరచుకున్నారు.

కంగుంది జమీందారులు కూడ ఈ కోవకు చెందిన వారే. వీరి వినోదం కోసం కావచ్చు, కళాపోషణ కొరకు కావచ్చు. కానీ వీరికాలంలోనే ఘనకీర్తి గడించిన వీధినాటకాలను పోషించినట్లు తెలుస్తుంది. కంగుంది కుప్పం వీధినాటకాలకు ప్రసిద్ధి.

పూర్వం కంగుంది జమీందారులు వీధినాటక సమాజాలను ఆదరించి, పోషించినట్లును, నటులను సన్మానాలతో సత్కరించి, పతకాలు బహూకరించినట్లును, ఆకారణంగా వీరికి "కంగుంది వీధి భాగవతుల"నియు, వీరు ప్రదర్శించే వీధినాటకాలకు "కంగుంది వీధినాటకాల'నియు పేర్లువచ్చినట్లు స్థానికులైన ఈనాటి వీధి భాగవతులు తెలియజేస్తారు. కంగుంది జమీందారుల కాలంలో కంగుంది వీధినాటకాలకు బహుళప్రచారం లభించింది.

## కంగుంది కుప్పం వీధి భాగవతులు – వీధినాటకాలు :

కంగుంది దుర్గం, దానికి సమీపంలో కంగుంది గ్రామం, కంగుంది గ్రామానికి సుమారు యెనిమిది (8) కిలోమీటర్ల దూరంలో కుప్పం పట్టణం, కుప్పంలో కంగుంది జమీందారుల కోటలు, "కుప్పం" కంగుంది జమీందారీలో అంతర్భాగమై ఉండినందువలన కుప్పానికి "కంగుంది కుప్పం" అను పేరువచ్చి వుండవచ్చును.

కంగుంది కుప్పం పేరువింటూనే చిత్తూరు జిల్లాలో యే మాత్రం నాటకాల పరిజ్ఞానం కలవారెవరైనా కంగుంది వీధి నాటకాలను గుర్తుతెచ్చుకుంటారు.

కంగుంది వీధి భాగవతుల పూర్వులు కీ.శ. 16వ శతాబ్ది ప్రాంతంలో కోస్తా జిల్లాలనుండి వలస వచ్చినట్లు అనూచానంగా వినవచ్చే విషయం. ఇప్పటి స్థానికులు విజయనగర చక్రవర్తి శ్రీకృష్ణ దేవరాయల కాలంలో వారి పూర్వులు వచ్చినట్లు చెబుతారు కానీ ఖచ్చితమైన చరిత్రాధారాలు లేవు.

'భాగవత కళ' రాయలసీమలో కొన్ని తరాలుగా వున్నట్లు 'ఎల్లోరా'వ్రాసిన "కళలు–పుట్టు పూర్వోత్తరాలు" అను గ్రంథానికి ఉపోద్ఘాతం వ్రాస్తూ శ్రీ నిడదవోలు వెంకట్రావు సూచించారు. ఈ సూచనలవలన రాయలసీమలో వీధి నాటకాలు విరివిగా వున్నట్లు తెలుస్తుంది. కూచిపూడి వారు ఆంధ్రదేశమంతటా వీధినాటక ప్రదర్శనలతో విజయ యాత్రసాగిస్తున్న రోజులలో అంతగొప్పగా వీధినాటకాలు ప్రదర్శించి, ప్రశంసల నందిన వ్యక్తి శ్రీ తమ్మాపురపు వెంకటస్వామి అని, ఆయన నాటి ఒంగోలు తాలూకాలోని తమ్మవరం గ్రామానికి చెందిన దేవదాసి కులానికి చెందినవారని శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి తన 'ఆంధ్రనాటక రంగచరిత్ర' అను గ్రంథంలో తెలియజేశారు. ఈ విషయాన్నిబట్టి వీధినాటకాలు సర్కారు జిల్లాలనుండి రాయలసీమకు తరలివచ్చినవని ఈనాటి కంగుంది వీధి భాగవతులు చెప్పేమాట నిజమేమోననిపిస్తుంది. అంతేకాదు ఈనాడు సర్కారు జిల్లాలలో "సముద్రాల, మాదాల, తోట, చల్లా" అని ఇంటిపేర్లు గల వారు కళాకారులుగా పేరు ప్రఖ్యాతులు గడించిన వారుగా కనిపిస్తున్నారు. "సముద్రాల, మాదాల, చల్లా, తోట" అను ఇంటిపేర్లు గలవారు కంగుంది కుప్పంవీధి భాగవతులలో వుండడం చేత కంగుంది వారి పూర్వులు కోస్తా జిల్లాలనుండి వలస వచ్చి, కంగుంది కుప్పంలో స్థిరపడ్డారన్న వాదనకు బలం కలుగుతూవుంది. ఏది యేమైనా కంగుందికుప్పం వీధినాటకాలు ఆడేవారున్న పట్టణమని

ప్రసిద్ధిగాంచింది. కానీ వీరిప్పుడు కంగుందికుప్పంలో మాత్రం నివసించడం లేదు. వీరిప్పుడు కొత్తఇండ్లు, అనిమిగాని పల్లి, గుండ్లపల్లి" అను గ్రామాలలో నివసిస్తున్నారు. ఇవి కంగుంది కుప్పానికి సుమారు పది (10) కి.మీ. దూరంలోపుగా వున్న గ్రామాలు.

కంగుంది వీధిభాగవతులు బలిజ కులానికి చెందినవారు. వీరిని "బలిజ నాయుళ్ళు" అంటారు. వీరు తమ పేరు చివర "నాయుడు" అనుపదాన్ని చేర్చుకుంటున్నారు.

రాయలసీమ ప్రాంతంలో దేవదాసికులాన్ని, "భోగం బలిజ" కులంగా - అనగా బలిజకులంలో ఉపజాతిగా వ్యవహరించడం జరుగుతూ వుంది. ఈ కారణంగా కంగుంది కళాకారులు బలిజనాయుళ్ళుగా ప్రచారంలోకి వచ్చి వుండవచ్చును. దేవదాసి కులానికి సభ్యసమాజంలో గౌరవ మర్యాదలు లేవు. ఇది నా ఊహ మాత్రమే.

కంగుంది వీధి భాగవతులకు మూలపురుషుడు "గాదిమునెప్ప". ఈయనే కంగుంది వీధినాటకాలకు శ్రీకారంచుట్టినట్లు ఆ సంతతికిచెందినశ్రీసీదాసుబ్బయ్య, బి.ఏ., (ప్రస్తుతం సెకండ్ గ్రేడ్ టీచరుగా పనిచేస్తున్నారు) గారు తెలియజేశారు.

మొదటి తరానికి చెందిన "గాదిమునెప్ప, సీనప్ప" వీధినాటకాలు నేర్చి, నేర్పించి, ప్రదర్శించేవారట.

"తోట చినగంగప్ప, అందేచిన వెంకటప్ప" మొదలగువారు రెండవ తరానికి చెందినవారు. క్రమంగా వీరు వీధి నాటకాలను కులవృత్తిగా స్వీకరించినట్లు తెలుస్తుంది.

తరువాతి తరానికి చెందిన వారిలో చిత్తేరి మునస్వామి, బుడ్డ రంగయ్య, సీదావెంకటేశు, చిత్తేరి చిన్నబ్బ, ముత్యాలమునిరత్నం మొదలుగువారు ముఖ్యులు.

చిత్తేరి మునస్వామికి 'అద్దాలమునస్వామి' అని మరొక పేరుకూడా వుంది. ఈయన కంటి అద్దాలు వేసేవారు. ఈ అద్దాలతోనే నాటకంలో వేషం ధరించి ఆడేవారు. అందువలన ఆయనకాపేరు వచ్చింది. అద్దాల మునస్వామి, బుడ్డరంగయ్య, సీదా అప్పాజీ అనువారు వీధినాటక ప్రదర్శనలో గొప్పపేరున్న నటులు. 1950-55 ప్రాంతంలో చిత్తూరు జిల్లా, పుత్తూరు తాలూకాలోని "పచ్చికాపల్లం"వద్ద జరిగే ధర్మరాజుల తిరునాళ్ళలో వీరు సంపూర్ణ భారతాన్ని 18 రోజులపాటు కాంట్రాక్టు పద్ధతిలో వీధినాటకాలుగా ప్రదర్శించేవారు. అప్పటికే అద్దాల మునస్వామి వయస్సు 70 సంవత్సరాలకు పైబడి వుంటుంది.

నడవలేని స్థితిలోఆయన కుమారులు పట్టుకొని వచ్చి, వేషంవేసి, రంగస్థలం మీద వదిలేవారు. అద్దాల మునస్వామి ద్రౌపది వస్త్రాపహరణ ఘట్టంలో దుశ్శాసన పాత్రను నటించేవాడు. ద్రౌపది వస్త్రాపహరణ ఘట్టాన్ని, అత్యద్భుతంగాను, ఆవేశ పూరితంగాను ప్రదర్శించేవాడు. ఈయన దరువు, స్వర, తాళజ్ఞానం తెలిసిన వ్యక్తి. అద్దాల మునస్వామి దుశ్శాసనుని పాత్రలో రంగప్రవేశం చేశాడంటే, ప్రేక్షకులలో చైతన్యం కలిగేది. నిద్రపోతున్న వారుకూడా లేచి కూర్చొనేవారు. తాళం, తబలా, హార్మోనియం వాయించేవారు భయంతో ఉక్కిరి బిక్కిరి అయ్యేవారు. అద్దాల మునస్వామి ఆడేటప్పుడు దరువు మారినా, తాళం తప్పినా, అపస్వరం పలికినా వెంటనే వెళ్ళి అందుకు కారకులైన వారిని రంగస్థలం మీదనే కాలితో తన్నేవాడట. 70 ఏండ్ల ముసలివాడు 30 ఏండ్ల పరువంతో ఆడేవాడు. అడుగువేస్తూ, ప్రేక్షకులను అలరించేవాడు. తబలా, తాళం, హార్మోనియం అతని అడుగుకు తగిన విధంగా నినదించేవి. ఈ విషయంలో ఆయన మహాకోపి అనడంకంటే ఉగ్రరూపుడంటే సమంజసమనిపిస్తుంది.

దుర్యోధనుని ఆజ్ఞప్రకారం దుశ్శాసనుడు వచ్చి, ద్రౌపదిని సభకు రమ్మని పిలుస్తాడు. ద్రౌపది వెళ్ళనిరాకరిస్తుంది. అప్పుడు దుశ్శాసనుడు

"అభిమాన ధనుడు మా  
అన్న సుయోధనుడు నిన్ను,  
సభకు ఈడ్చుకరమ్మని పంపెనే.......  
పాంచాలీ పంచభర్తృకా ....  
రావే.......రావే.........రావే.........  
రా.........రా............రా........"అంటూ అడుగు వేస్తూ ద్రౌపదిని బలత్కారంగా వెంట్రుకలుపట్టి రంగస్థలం మీద ఈడ్చుకుపోతూ వుంటే, ఆనాడు ద్రౌపది అట్టి కష్టాలు అనుభవించిందేమో ననిపిస్తుంది.

అహంకారంతో, రోషావేశాలతో, ద్రౌపదిని పరాభవింప బోయి, వీలుకాక, తానే పరాభవింపబడి, అశక్తుడై, ద్రౌపదినుండి వెలువడిన అక్షయ వస్త్రాలపై బోర్లబడి, చెమటలు పట్టిన శరీరంతో మోకాళ్లపైకి లేచి, దీనాతి దీనంగా అన్నవైపు తిరిగి దుఃఖిస్తూ

'చీరలన్నీ విప్పి విప్పి ఓరెన్నా నా..

చేతులూ తెగ నొప్పులాయే ఓరెన్నా........"

అని విలపిస్తూ వుంటే, ప్రేక్షకులు అంతకుముందు పడిన పాటుకు, జరిగిన శాస్తికి తృప్తిగా గుండెలనిండా ఊపిరి పీల్చుకునేవారు.

ఇటువంటివే భారతంలోని అనేక ఘట్టాలలో తనదైన శైలిలో నటించి, ఆడి, పాడి, పల్లెప్రజల హృదయాలలో చెరగని ముద్ర ఆ ప్రాంతపు ప్రజలు ఈనాడుకూడా అతనిని గురించి చర్చించుకుంటూ వుంటారు.

ఈ కోవకు చెందినవాడే "బుడ్డ రంగయ్య". ఇతడు అద్దాల మునస్వామికి సమవయస్కుడు. సత్యహరిశ్చంద్ర నా హరిశ్చంద్రుని పాత్ర ధరించేవాడు. రాజ్యం కోల్పోయిన హరిశ్చంద్రుడు, భార్యా బిడ్డలతో నక్షత్రకుడు వెంటరాగా, అడవి మార్గంగుం వెళ్తున్న ఘట్టం. నక్షత్రకుని వేషధారి స్థూలకాయుడు, దృఢమైన వాడు,-నడవలేనని మారాంచేస్తాడు. అప్పుడు హరిశ్చంద్రుడు నక్ష తన వీపుమీద కొంతదూరం మోయవలసి వస్తుంది. ముసలివాడైన బుడ్డరంగయ్య హరిశ్చంద్రుని వేషంలో నక్షత్రకుని మోయలేక పాడుకుంటూ వెళ్తుంటే ప్రేక్షకులలో హరిశ్చంద్రునిపై యెనలేని సానుభూతి కలిగేది. నక్షత్రకుని శాపనార్థాలతో తిట్టిపోసేవారు.

కంగుంది కుప్పం వారి జట్టులో యెక్కడ అద్దాలమునస్వామి, బుడ్డ రంగయ్య, సీదా అప్పాజి వేషాలు వేస్తారంటే అక్కడికి ఆ ప్రక్కల ప్రాంతాలనుండి జనం తండోప తండాలుగా వచ్చేవారు.

"పచ్చికాపల్లం, నిలువురాళ్ళకమ్మ పల్లి, నెత్తకుప్పం, చెంచుగుడి" గ్రామాలలో ప్రతియేడూ ధర్మరాజుల తిరునాళ్ళు తప్పకుండా జరిగేవి. ఈ గ్రామాలలో కంగుంది కుప్పం కళాకారులు కుటుంబ సమేతంగా వచ్చి, తిరునాళ్ళు జరిగినన్ని ( మహాభారతం వేదవ్యాస జననం నుండి దుర్యోధనవధవరకు వీధి నాటకాలుగా ప్రదర్శించేవారు.

ఆ తరువాత వచ్చిన వారు నాల్గవ తరానికి చెందినవారు. "తోట చిన్నవెంకటేసు, సీదామునస్వామి, తోట చిన్నవెంకటేసు మప్పాజి, తోట తిమ్మయ్య, కోమటి రామచంద్రయ్య, నారాయణప్ప, పార్లదొరస్వామి, అగ్గి పెట్టెల మునివెంకటప్ప, మీసాల వెంకటప్ప, చల్లా మునివెంకటప్ప" మొదలగు వారు ముఖ్యులు. చల్లాముని వెంకటప్పను డ్యాన్సుముని వెంకటప్ప అని కూడా పిలి ఈయన చక్కగా డాన్సుచేసేవాడనడం చేత, ఇతని కా పేరు వచ్చింది. వీరికాలంలో వీధినాటకాలు మూడుపువ్వులు, ఆరుకాం అభివృద్ధి చెందాయి.

కంగుంది కుప్పం వీధి నాటకాల సమాజంలో వున్నవారు ప్రతి ఒక్కరూ వారు ప్రదర్శించే నాటకాలలోని అన్ని పా నేర్చుకునేవారు. ఎవరిని యేవేషం వేయమన్నా వేసేవారు.

కంగుంది భాగవతులు తమ పిల్లలకు చిన్న తనంనుండే చదువుతో బాటు సంగీతాన్ని నేర్పించేవారు. రాగ, తాళ జ్ఞానం తరువాత, పెద్దవారి వద్ద శిష్యరికం చేసి, వీధి నాటకాలను క్రమశిక్షణతో, క్రమపద్ధతిలో అభ్యసించేవారు.

శిష్యులైన పిల్లలు తెల్లవారు జాముననే నిద్రలేచి, గురువు గారింటికి వెళ్లి, మేలుకొలుపు పాటలతో గురువుగారిని నిద్రలేపే గురువుగారు వారికి రాగాలు నేర్పివీధినాటకాలలోని అన్ని పాత్రలనూ కంఠస్థం చేయించేవారు. ఇది ప్రారంభ దశ. ఒక్కొక్కరికి ఒకొ పాత్ర అనిగాక, అందరూ అన్ని పాత్రలనూ అభ్యసించేవారు.

పాఠం వచ్చినదని గురువుగారు నిర్ధారణ చేసికొన్న తరువాత, శిష్యులకు దరువులు, దరువులకు తగిన విధంగా అడు నేర్పించేవారు. ఇది రెండవ దశ. ఈ దశలో గురువుగారు అతి జాగ్రత్త వహించేవారు. రాగంలో అపస్వరం దొర్లకుండా, దరువు తప్పక తప్పటడుగులు వెయ్యకుండా, శ్రద్ధతో "పద్దికలు" చేయించేవారు. అందరూ నేర్చుకున్నారని గురువుకు నమ్మకం కలిగిన తరువా శుభముహూర్తాన "గజ్జపూజ"చేయించేవారు. వీధినాటకాలలో గజ్జపూజ అతి ముఖ్యమైన ఘట్టం. (ఇటువంటి గజ్జపూజ న నేర్చుకునేవారికి చాల ముఖ్యమైంది) ఆటగాళ్లందరు కాలికి గజ్జకట్టి, నటరాజుకు పూజచేసి, రంగస్థలాన్ని మ్రొక్కి, గురువుగారికి అర్పించుకునేవారు. ఇది మూడవ దశ. ఈ దశలో కొన్నిరోజులు పద్దికలు జరిగేవి. ఇక నాలుగవదశ వీధినాటక ప్రదర్శన. ఏదైనా ఒక ప రోజుగాని, దేవతల కొలుపు రోజుల్లోగాని, తిరునాళ్ళలోగాని, దసరా ఉత్సవాలలో గాని నాటకాలను ప్రదర్శించేవారు. శిష్యులైనవార నాటకం ఆడేరోజు, గురువు గారికి పాదాభి వందనం చేసి, కానుకలు సమర్పించుకొని, యెంతో ఉత్సాహంతో వేషం ధరించి, వీధి నా ఆడేవారు. ఈవిధంగా కంగుంది కళాకారులు బాల్యంనుండే వీధి నాటకాలను అభ్యసించేవారు.

ఈవిధమైన అభ్యాసము "సురభినాటక సమాజం"లోను, కూచిపూడి భాగవతులలోను గోచరిస్తుంది. సురభివారు నిద్రలే

రాగాలతో ప్రారంభించి, పద్యాలు పాడడం అభ్యసించేవారు. కూచిపూడి కళాకారులు వ్యాయామంతో నాట్యాన్ని ప్రారంభించేవారని ప్రతీతి.

కంగుంది వీధి భాగవతులు ముఖ్యంగా సంపూర్ణ మహాభారతాన్ని "సత్యవతీ పరాశరుల సమాగమునుండి (వేదవ్యాస జననం) భారత కథ" ను గ్రహించి కురుక్షేత్రయుద్ధం – దుర్యోధన వధవరకు 30 రాత్రులు ప్రదర్శించడానికి వీలుగా వీధి నాటకాలను రచించి లేదా ఇతరులచేత రచింపజేసికొని, సిద్ధం చేసుకొనేవారు.

రాత్రులందు ప్రదర్శించడానికి వీలుగాని ఘట్టాలను 'పగటి కథగా' పురాణం చెప్పేవారు.

కంగుంది కళాకారులు మహాభారతమే గాక, "రామాయణం, భాగవతం, బాలనాగమ్మ, సత్యహరిశ్చంద్ర, కనకతార, నలచరిత్ర, చంద్రహాసుడు, సతీసావిత్రి, జయంత–జయపాలం, కాంతామతి, రామాంజనేయ యుద్ధం, యమాంజనేయ యుద్ధం, దేశింగు రాజు కథ, మాణిక్యాల దేవికథ" వంటి వీధి నాటకాలను క్షుణ్ణంగా నేర్చుకొని, తర్ఫీదు పొందివుండేవారు.

పూర్వం వీరు ప్రదర్శించే వీధినాటకాలలో భావావేశం తోకూడిన ఆట, పాట తప్ప మరేమీ వుండేవికాదు. పాత్రౌచిత్యంగాని, రస పోషణగాని వుండవు. వీరినాటక ప్రదర్శనలో సర్వత్రా రసా భాసమే గోచరిస్తుంది. పాటపైన,దరువుపైన, తాళంపైన, మాత్రమే వీరు దృష్టిని కేంద్రీకరించేవారు. పాడేపాట, వాయించే దరువు, వేసే అడుగు సన్నివేశసందర్భ సహితంగా వుండవు. కరుణ రస ప్రధానమైన సన్నివేశాల్లో పాత్రల హుందాతనాన్ని విస్మరించి, కరుణాపూరితమైన పాట పాడుతూ తబలా దరువుకు అనుగుణంగా అడుగు వేసేవారు. అది స్త్రీ పాత్రకైనా ఆరోజులలో తప్పేదికాదు. అది ఒక విధంగా వారి తప్పు కూడాకాదు. ఆనాడు నటులుగాని, ప్రేక్షకులుగాని సందర్భాన్ని అర్థంచేసికొనే స్థితికి యెదగ లేదు. రసమంటే యేమిటో తెలియని స్థితి. వీధి నాటకానికి"ఆట" అని పేరుంది. ఆ యాటను వీరు ఆడితేగాని వీరికి తృప్తి వుండదు. ప్రేక్షకులుకూడ హర్షించరు. రంగస్థలం మీదికి ప్రవేశించిన నటుడు కాలిగజ్జలు ఘల్లుమనగా, చెమటలు క్రక్కేటట్లు ఆడేవాడు. నటుడు ఎంత యెక్కువ ఆడితే ప్రేక్షక లోకంలో అంత యెక్కువ మెప్పును పొందేవాడు.

ఒకసారి 'నలదమయంతి' వీధి నాటకాన్ని ప్రదర్శిస్తున్నారు. నలుడు జూదంలో రాజ్యాన్ని కోల్పోయి, భార్యాసమేతుడై, కట్టుబట్టలతో అడువుల పాలయ్యాడు.

దమయంతి ఎండ కన్నెరుగని, అతి సుకుమారమైన రాణివాసపు స్త్రీ. భార్యాభర్తలు అడవిమార్గం గుండా వెళ్తున్నారు. మార్గం దుర్గమమైంది. గులకరాళ్ల కనుమ. మిట్ట మధ్యాహ్నం. సూర్యుడు తన ప్రతాపాన్ని చూపిస్తున్నాడు. మండుటెండలో పాదరక్షలు లేని దమయంతి పాదాలు కాలి బొబ్బలవుతున్నాయి. రాళ్లయెదురు దెబ్బలు తగిలి దమయంతి కాలివేళ్లు చిట్లి, రక్తం కారుతూవుంది. కలిప్రభావంతో మార్గానికి ఇరువైపులా మంటలు ప్రబలుతున్నాయి. ఇది కరుణ రసప్రపూరితమైన సన్నివేశం. దమయంతి నలుని భుజాలు పట్టుకొని వ్రేలాడుతూ, నడవలేక నడుస్తూవుంది. ఈ దృశ్యాన్ని చూచిన యెంతటి వారికైనా కండ్లు స్రవించక మానవు. శోకమూర్తియైన దమయంతి కరుణాపూరితమైన పాటనందుకుంది.

"అయ్యో! ప్రాణానాథా.............
గులక రాళ్లకనమూ లోనా ..............
నేనూ నడువలేను నడువాలేనూ"

రాగ యుక్తంగా దమయంతి పాడుతూవుంది. హృదయాన్ని కరిగించే దృశ్యం. తెరవెనుక మేళంవంత పాడుతూవుంది. తబలా, తాళాలు, దరువు వేస్తున్నాయి. క్రమక్రమంగా పాట వేగం, దరువు వేగం హెచ్చింది. దరువు కనుగుణంగా దుఃఖించే దమయంతి అడుగు వేయడం ప్రారంభించింది. ఆమెను తీసుకు వెళ్తున్న నలుడు కూడ అడుగువేయనారంభించాడు. పాట 'రిథం' మారింది.

నడువ లేను .............
నే నడువ లేను ..............
అయ్యో నే నడువ లేను.
అహ! నాథా .............
నే నడువ లేను ............

అంత వరకు కరుణాపూరితమైన సన్నివేశాన్ని తిలకించిన ప్రేక్షకులలో ఆ పాత్రపై జాలి, సానుభూతి కలిగాయి.

అడుగు ప్రారంభమైన వెంటనే కరుణరసం వారి పాద ఘట్టనలకు నలిగి పోయి, దుమ్ములో కలిసిపోయింది. రసాభాసమైంది. పాత్ర ఔచిత్యందెబ్బ తిన్నది. ప్రేక్షకులకు అర్థంకాని స్థితి. అది ఆట. అందుకే వారుఆడేవారు.ఆనాటి సమాజం ఆయాటను చూచేది.

చప్పట్లతో, పొగడ్తలతో నటులను ముంచెత్తేది. యెదగని ఆనాటి సమాజపు స్థితి అది.

దైనందిన కార్యక్రమంతో శారీరకంగా, మానసికంగా అలసి, విసిగి వేసారిన ఆనాటి ప్రేక్షకులకు విరామ సమయాల్లో వినోదం అవసరమయ్యేది. ఆవిధంగా వినోదం కోసం ఆవిర్భవించిన ఒక జానపద ప్రక్రియ, జానపద కళే ఈ వీధినాటకం.

మొట్టమొదట వీరికి నాటక సమాజాలు లేవు. వాటికి పేర్లు అంతకన్నా లేవు. కంగుంది కుప్పం భాగవతులందరుకలిసి, వీధి నాటకాలను ఆడేవారు. ఇది ఒక నాటి పరిస్థితి.

## 'కంగుంది కళ'లో కాలం తెచ్చిన మార్పు.

కాలం మారింది, అభిరుచులు మారాయి. ఆధునాతనంగా అన్ని రంగాల్లోను యెంతో మార్పు వచ్చింది. ఆ మార్పు జానపద కళలలో కూడా గోచరిస్తుంది. ప్రజలలో అవిద్య తొలిగి, రసజ్ఞానం కలిగింది. విమర్శనా దృష్టి యేర్పడింది. ధార్వాడ, సురభి నాటక సమాజాల రాకతో నాటక కళ కొత్త పుంతలు తొక్కింది. మొరటుగావున్న జానపద కళలో కొంత సున్నితత్వం చోటు చేసుకుంది. రంగస్థల నాటకాల రాకతో వీధి నాటకాల స్వరూప, స్వభావాలు సరికొత్త రూపందాల్చాయి. కంగుంది వీధి భాగవతులు ఈనాడు వీధి నాటకాలను ఆధునికంచేశారు. అసందర్భమైన అడుగులు తగ్గించారు. సినిమా పాటలు, పద్యాలు వీధి నాటకాలలో చేర్చి, ప్రదర్శించడం నేర్చుకున్నారు. వీధి నాటకాలతోబాటు, రంగ స్థల నాటకాలను నేర్చి ప్రదర్శిస్తున్నారు. పౌరాణిక, జానపద, సాంఘిక నాటకాలను ప్రదర్శించడానికి అలవాటు పడ్డారు.

ఈనాటి కంగుంది కళాకారులలో "సముద్రాలవెంకటేశ్వరులు, చల్లా శేషప్ప, కొండా రాఘవులు, చిత్తేరి రంగ స్వామి, చిత్తేరి నాగరత్నం. చల్లా నారాయణప్ప, కోమటి శ్రీ రాములు, చింతల విశ్వనాథం, సీదాముని వెంకటప్పయ్య, జియం మాస్టరు భాగవతులు, మాదాల లీలా వెంకటేశ్వరులు, అనిమిగాని పల్లిమునిరత్నం, బి. సీతారామయ్య" మొదలగు వారు ముఖ్యులు. వీరు మారిన పరిస్థితుల కనుగుణంగా, ఒక నాటక సమాజాన్ని స్థాపించుకున్నారు. ఈ సమాజం పేరు 'శ్రీకృష్ణ దేవరాయ నాటక సమాజం". "కొత్తఇండ్లు" కేంద్రంగావున్న ఈ సమాజంలో అనిమిగాని పల్లి, గుండ్లపల్లి వాస్తవ్యులుకూడ సభ్యులుగా వున్నారు. వీరందరూ ఒకప్పుడు ఒకే కూటమిగా నున్నవారే.

శ్రీకృష్ణదేవరాయ నాటక సమాజానికి ప్రస్తుతమున్న అధ్యక్షులు శ్రీ ముత్యాలమునిరత్నం, ఉపాధ్యక్షులు శ్రీతోట జగన్నాధం నాయుడు.కార్యదర్శి శ్రీసీదాఅప్పాజిగారి సుబ్బయ్యనాయుడు. ఈయన సీదా అప్పాజి కుమారుడు. ఇతనిని 'ఏ.యస్. నాయుడు' అని పిలుస్తారు. ప్రస్తుతం ఈయన వృత్తిరీత్యా సెకండ్ గ్రేడ్ టీచర్‌గా, కొత్త ఇండ్లకు సమీపంలోగల 'చిన్న బంగారు నత్తం' గ్రామంలో పనిచేస్తున్నారు. ఈయన నటుడుకాదు. వీధినాటక రచయిత. ఈయన ఆధ్వర్యంలో శ్రీకృష్ణ దేవరాయనాటక సమాజం వారు భారతదేశ మంతటా వీధినాటకాలను ప్రదర్శిస్తూ పర్యటిస్తున్నారు. "ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, తమిళనాడు, ఢిల్లీ, ఉత్తర ప్రదేశ్, పంజాబు" రాష్ట్రాలలో, ఆ ప్రభుత్వాల ఆహ్వానాలమేరకు వెళ్లి వీధినాటకాలు ప్రదర్శించి వచ్చారు. ఇప్పుడుకూడ వీరికి పలురాష్ట్రాలనుండి వీధినాటక ప్రదర్శన కొరకు ఆహ్వానాలు వస్తున్నవి.

ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీవారి ఆహ్వానంమీద కంగుంది కుప్పం శ్రీకృష్ణదేవరాయనాటక సమాజం వారు, హైదరాబాదులో "కీచక వధ" అను వీధి నాటకాన్ని ప్రదర్శించి, మన్ననలందుకున్నారు.

శ్రీకృష్ణ దేవరాయ నాటక సమాజానికి కార్యదర్శిగావున్న శ్రీఅప్పాజిగారి సుబ్బయ్యనాయుడు (ఏ.యస్. నాయుడుగారి కళాసేవను గుర్తించి, వీరిని చిత్తూరు 'శ్రీరామ విలాస సభ' అను నాటక సమాజానికి ప్రస్తుతం అధ్యక్షులుగావున్న "శ్రీకపేస్థళం రామస్వామి అయ్యంగారు" చిత్తూరుకు పిలిపించి, శ్రీరామవిలాస సభ నాటక మందిరంలో, చిత్తూరు పురప్రముఖులమధ్య, ఘనంగా సన్మానించినట్లు తెలుస్తుంది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారును, ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ వారును శ్రీ ఏ.యస్. నాయుడు గారిని సన్మానించి, గౌరవించినట్లు ఆయనే స్వయంగా చెప్పుకున్నారు.

కంగుంది కుప్పం కళాకారులు సంపూర్ణ మహాభారతాన్ని వీధినాటకాలుగా నేర్చి, చిత్తూరు, కడప జిల్లాలలో జరుపబడు "ధర్మరాజుల తిరునాళ్ల"లో కాంట్రాక్టు పద్ధతి ప్రకారం ఈనాటికీ విరివిగా ప్రదర్శిస్తున్నారు. వీరు భారతమేగాక రామాయణం; శ్రీమద్భాగవతంలోని కొన్ని ఘట్టాలను నేర్చి, వీధినాటకాలుగా ప్రదర్శిస్తూవుంటారు. వీరు వీధినాటకాలందే గాక నేటి ఆధునిక రంగస్థల నాటకాలలోకూడ ప్రావీణ్యం సంపాదించారు. వీరు "సత్యహరిశ్చంద్ర, సతీసావిత్రి, సతీసక్కుబాయి, రామాంజనేయ యుద్ధం, జయంత-జయపాలం" అను పౌరాణిక నాటకాలను, "కాంతామణి, కనకతార"వంటి సాంఘిక నాటకాలను నేర్చి, కర్ణాటక రాష్ట్రంలోని 'కోలారు' తమిళనాడులోని 'ధర్మపురి'

ప్రాంతాలలో రంగస్థల నాటకాలు (డ్రామా లైఫ్)గా ఆధునిక పద్ధతులలో కిరాయి నాటకాలు ప్రదర్శిస్తున్నారు.

కంగుంది కళాకారులలో వీధినాటక రచయితలుగా పేరుగాంచిన వారు "శ్రీ అందేచిన వెంకటప్ప, శ్రీ బుడ్డ రంగయ్య, శ్రీ తోట తిమ్మయ్య, శ్రీ అప్పాజిగారి సుబ్బయ్యనాయుడు" మొదలగువారు ముఖ్యులు.

వీధినాటకాలలో "హార్మోనియం, మృదంగం, తబలా, తాళాలు," వాద్యవిశేషాలుగా ఉపయోగిస్తారు.

కంగుంది కుప్పం కళాకారులకు వీధినాటకాలే కులవృత్తి. ఆ రోజులలో "చిత్తూరు, కడప" జిల్లాల్లో జరుగుచుండిన ధర్మరాజుల తిరునాళ్ళ శ్రావణమాసం (ఆగష్టు) లో జరిగేవి. తక్కిన రోజులలో వీధి నాటకం నేర్చుకోవాలనే ఉత్సాహం గల వివిధ గ్రామస్థులకు, కంగుంది భాగవతులు గురువులుగా భారతంలోని కొన్నిఘట్టాలను విడివిడిగా నేర్పించి, ప్రదర్శింపజేసేవారు. ఈ విధంగా ప్రదర్శింపజేసే ముఖ్యమైన భాగాలు 'పాండవ జననం, గయోపాఖ్యానం, ద్రౌపది కళ్యాణం, ద్రౌపది వస్త్రాపహరణం, పాండవ వనవాసము, శ్రీకృష్ణ రాయబారము, శ్రీకృష్ణలీలలు, శ్రీకృష్ణ తులాభారం, కురుక్షేత్రం" మొదలగునవి.

వీరు నాటకాలు నేర్పేటప్పుడు నెలజీతం యేర్పాటు చేసుకొనేవారు. ఆటనేర్చుకొను శిష్యులు గురుభక్తిని, చక్కటి క్రమశిక్షణను పాటించేవారు. ఆట నేర్చుకొనుట పూజతో ప్రారంభమవుతుంది. పాట బాగావచ్చిందని గురువుగారికి నమ్మకం కలిగిన తరువాత అడుగునేర్పిస్తాడు. ప్రతిరోజు సక్రమంగా 'పద్దికలు'చేసి, 'పాట, ఆట' నేర్చుకుంటారు. ఆ తరువాత గజ్జపూజ జరుగుతుంది. ఆటగాళ్ళందరూ (నటులు) యెంతో వుత్సాహంతో కాళ్లకు గజ్జలు కట్టుకుంటారు. గజ్జలతో పద్దికలు సుమారు ఒక మాసం రోజులు జరుగుతాయి.

ఒక పర్వదినంనాడు నడివీధిలో గాని, భజన మందిరం వద్దగాని నాటక ప్రదర్శన జరుగుతుంది. నాటక ప్రదర్శన రోజున గురువుగారికి కొత్తబట్టలు కొనిపెడతారు. శిష్యులందరూ గురువుగారిని యెంతో గౌరవంగాను, భక్తితోను చూచుకొనేవారు. ఒక నాటకం నేర్పడానికి సుమారు నాలుగైదు మాసాలు పట్టుతుంది. ఇంతకాలం శిష్యులందరూ గురువుగారిని వంతుల ప్రకారం పోషిస్తారు. గురువుకూడ గ్రామస్థులందరిలో తనూ ఒకడుగా కలిసిపోయేవాడు. నాటక ప్రదర్శన పూర్తి అయిన తరువాత, గురువుగారిని అతని స్వగ్రామానికి పంపే రోజున, ఆయనకు యేర్పాటు చేసిన జీతంతోబాటు, వారి వారి శక్త్యానుసారం ధాన్యం ప్రోగుచేసి, ఒక మనిషిని తోడిచ్చి, గురువుగారిని సంతృప్తిగా పంపేవారు. ఇప్పుడుకూడ అక్కడక్కడ గ్రామ ప్రాంతాలలోను, తిరుపతి ప్రాంతంలోను కంగుంది కుప్పం కళాకారులు, వారి శిష్య, ప్రశిష్యులు వీధినాటకాలు నేర్పుతున్నారు.

పూర్వం పిల్లలు మొదలు పెద్దలవరకు ఉదయం నిద్రలేచినప్పటినుండి, తిరిగి రాత్రి నిద్రపోయేవరకు వీధినాటకాలు నేర్చుకుంటూ, నేర్పుతూ వుండేవారు. ఆనాడు వారికది కులవృత్తి, జీవనాధారం. కాని ఇప్పుడంత శ్రద్ధ వీధి నాటకాలపైన చూపడం లేదు. పూర్వంవలె కళాకారులను ఆదరించి వారికి జీవనోపాధికి మడులు, మాన్యాలిచ్చే రాజులుగాని, జమీందారులుగాని ఈనాడు లేరు. ఆనాడు కళలన్నీ వంశ పారంపర్యంగా, కులప్రాతిపదికపై పోషింపబడేవి. ఇప్పుడు జానపద కళలను ప్రజలు, ప్రజాప్రభుత్వాలు పోషించాలి. ఈనాటి ప్రభుత్వాలకు కళాకారులను పోషించే ఆర్థిక స్తోమత లేదు. కాని కళలను ప్రోత్సహించాలన్న సదుద్దేశంతో కళాకారులకు కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు కొన్ని రాయితీలు మాత్రం ప్రకటిస్తున్నవి. కానీ ప్రజలు మాత్రం ఏ కళనైనా చూచి గొప్పగా మెచ్చుకుంటారే తప్ప ఆ కళాకారులపైన ఆదరణ చూపడం లేదు.

పొగడ్తలు, చప్పట్లు కళాకారుల కడుపులు నింపవు. ప్రజలలో వృత్తికళాకారులపైన చిన్నచూపు కలుగుతూ వుంది. సభ్య సమాజములో వారికి గౌరవప్రదమైన స్థానం లభించడం లేదు. ముఖ్యంగా వీధి నాటకాలపైన ప్రజలలో ఆదరణ సన్నగిల్లింది. ఒకవేళ ఎవరికైనా పల్లెపట్టులలో వీధి నాటకం ఆడాలని కోరిక కలిగితే వారు కంగుంది కుప్పం కళాకారులపైన ఆధారపడడం లేదు. స్థానికులైన కంగుంది వారి శిష్య, ప్రశిష్యులద్వారా నేర్చుకొని, ప్రదర్శనలిస్తున్నారు. కంగుంది వారి కళపై ప్రజలకు ఆదరణ నశించడానికి "సినిమాలు" కూడ ఒక కారణం. అందువలన కంగుంది కళాకారులలో కూడ మారిన పరిస్థితులకు అనుగుణంగా మార్పు వస్తూవుంది. తమ పిల్లల్ని చదివించుకొని, వృత్తిరీత్యా మార్పు చెందాలని కోరు కుంటున్నారు. సభ్యసమాజంలో వారికి కూడ గౌరవ ప్రదమైన స్థానం కావాలని ఆశిస్తున్నారు. కళను విడిచిపెట్టకుండానే 'వ్యవసాయం, పశుపోషణ' జీవనాధార వృత్తులుగా ప్రస్తుతం వారు స్వీకరిస్తున్నారు. చాలీచాలని భూములు, అందునా అవి దేవమాతృకలు (వాన నీటిపై ఆధారపడేభూములు) మెట్ట పంటలతో యెదుగుబొదుగు లేని జీవితం సాగిస్తున్నారు. వారి జీవితాల్లో వెలుగుకిరణాలెప్పుడు వికసిస్తాయో కాలమే నిర్ణయించాలి.

కళాత్మకంగా మన పూర్వపు సంస్కృతిని ప్రతిబింబించే వీధినాటకాలను కోరి ఆహ్వానించే రాష్ట్రాలకు వెళ్ళి, ప్రదర్శించి, ప్రశంసలు, సన్మానాలను అందుకుంటున్నారు. మహాభారత ఉత్సవాలలో పాల్గొంటున్నారు.

ప్రాచీన కళలను పోషించాలన్న దుగ్ధ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఉందిగాని, వృత్తికళాకారులకు జీవనోపాధి కల్పించి, పోషించే ఆర్థిక శక్తిస్తోమతలుమాత్రం లేవు. ప్రాచీన కళలు నశించకూడదు, పోషించే శక్తీ లేదు.

ఇది కంగుంది కుప్పం కళాకారులు, వారి వీధి నాటకాల ఈనాటి పరిస్థితి.

## ఈనాటి కుప్పం :

స్వతంత్ర భారతదేశంలో "ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం" అవతరించి ఇప్పటికి మూడుదశాబ్దాలు నిండి, నాలుగవ దశాబ్దం చివరిపాదం చేరుకుంటూవుంది. చిత్తూరుజిల్లా, పలమనేరు తాలూకాలో "కుప్పం" ఈనాడొక మండలకేంద్రం. చాల వెనుకబడిన ప్రాంతం. అక్కడక్కడ కొన్ని జలాశయాలు (చెఱువులు), కాలువలు, ఒకటి రెండు చెక్ డ్యాంలు నీటి ఆధారాలుగా కనిపించినా, ఈ ప్రాంతపు ప్రజలు యెక్కువగా మెట్టపంటలపైననే ఆధారపడుతున్నారు. వరిపంట గణనీయంగా లేదు. "చెఱకు, వేరుశనగ, జొన్న, కంది, అనప, అలచందలు" మొదలైన పంటలు యెక్కువగా పండిస్తున్నారు. "మల్లె, కనకాంబరం, కాగడాలు," వంటి పూలతోటలు పెంచి, ఆ పూలను చిత్తూరు, తిరుపతి మొదలగు ప్రాంతాలకు యెగుమతి చేస్తున్నారు. అక్కడక్కడ ఒకటి రెండు సల్లద్రాక్ష తోటలు కనిపిస్తాయి.

విద్యాపరంగా ఇంకాయెంతో అభివృద్ధి చెందవలసివున్నది. పట్టణంలో కొంత నాగరికత గోచరించినా, పల్లెపట్టులందు అవిద్య, అనాగరకత, అమాయకత స్పష్టంగా కనిపిస్తాయి. సరియైన రహదారులు లేవు. ఇందుకు కారణం పేదరికమేనని చెప్పక తప్పదు. పారిశ్రామికంగా చాల వెనుకబడిన ప్రాంతం. కార్మాగారాలేవి లేవుకాని ప్రపంచ విఖ్యాతమైన "పునాదిరాళ్ళ పరిశ్రమ" మాత్రం కుప్పం ప్రాంతంలో విరివిగా సాగుతూవుంది. మంత్రులు, రాజకీయనాయకులు సంస్థలకు, పరిశ్రమలకు విద్యాకేంద్రాలకు వేసే పునాదులకు కావలసిన విలువైన, పలచటిరాళ్ళు ఇక్కడలభిస్తాయి. వీటిని దేశవ్యాప్తంగా ఉపయోగించడమేగాక, "ఫ్రాన్సు, ఇటలీ, ఇంగ్లాండు, జర్మనీలవంటి" విదేశాలకు కూడా యెగుమతి చేస్తున్నారు. విదేశీయులు ఈ రాతిపలకలపై జ్ఞాపకాలు చెక్కించి, సమాధులకుకూడా అమర్చు కుంటున్నారు. మన ప్రాంతంలోకూడా మరణించినవారి జ్ఞాపకార్థం వారుపుట్టినతేది, లగ్నం, సంవత్సరం, మరణించిన తేది, లగ్నం, సంవత్సరం చెక్కించి, సమాధులకు అమర్చుకుంటున్నారు.

ఈ ప్రాంతంలో ఇంకొక విశేషమేమంటే, ఇక్కడ శ్రీగంధపు చెట్లపెంపకం ఉండడంచేత, శ్రీగంధపు పరిశ్రమ విరివిగా సాగుతూవుంది. అగరువత్తులు, శ్రీగంధపుపొడి, పౌడరు, శ్రీగంధపునూనె, సబ్బులు, మొదలగువానిని తయారుచేసి, దూరప్రాంతాలకు యెగుమతి చేయబడుతున్నవి. కుప్పం ప్రాంతంలో బంగారు గనులు ఉన్నాయని, బంగారం తీయడానికి అయ్యేఖర్చుకంటే లభించే బంగారం అల్పమని ప్రభుత్వం వెనుకాడుతున్నట్లు చెబుతారు.

జమీందారీవ్యవస్థనుండి విముక్తిపొంది, ఇప్పుడిప్పుడే కోలుకొంటున్నట్లు కనిపిస్తుంది. రాజధానికి దూరంగా విసిరివేయబడినట్లు వుండడంచేత, రాజకీయ చైతన్యంగూడ అంతంత మాత్రంగానే గోచరిస్తుంది.

## కంగుందికుప్పం వీధి భాగవతులు

ఈనాటి కంగుందికుప్పం వీధి భాగవత కళాకారులలో ముఖ్యులైనవారు కంగుందికుప్పం పరిసర గ్రామాలైన "కొత్తయిండ్లు, అనిమిగానిపల్లి, గుండ్లపల్లి" గ్రామాలలో స్థిరపడ్డారు. వీరందరు కలిసి "శ్రీ కృష్ణదేవరాయ నాటక సమాజం" అనుపేర ఒక నాటకసమాజాన్ని స్థాపించుకొని, దాని పతాకం క్రింద దేశవ్యాప్తంగా, తెలుగువారి జానపదకళయైన వీధి నాటకాన్ని ప్రదర్శిస్తున్నారు. వీరు హైందవ పురాణాలైన భారతం, రామాయణం, భాగవతాలను వీధి నాటకాలుగా ప్రదర్శిస్తున్నారు. వీరిలో చాలవరకు "నటన, గానం, నాట్యం", లలో శిక్షణపొంది వుంటారు. వీరు "ఢిల్లీ, పంజాబు, బెంగాలు, ఒరిస్సా, బీహారు, రాజస్థాన్, ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, తమిళనాడు" మొదలగు రాష్ట్రాలలో, వారి ఆహ్వానంమేరకు వెళ్ళి, నాటక ప్రదర్శన లిచ్చి వస్తుంటారు. అఖిల భారత ఆకాశవాణి, దూరదర్శన్ "ఢిల్లీ, కడప, హైదరాబాదు, విశాఖపట్నం, విజయవాడ" కేంద్రాలనుండి ప్రసారం చేస్తుంటారు. వీరు వృత్తి కళాకారులు.

"శ్రీ డి.రామకృష్ణయ్య (68 సం.రాలు) దళవాయి కొత్తపల్లి, శ్రీ పి.వెంకటేశ్వర్లు (65సం.రాలు) అనిమిగానిపల్లె, శ్రీ పి.నేతప్ప (80సం.రాలు) అనిమిగానిపల్లె, శ్రీ టి.జగన్నాథం నాయుడు (47 సం.రాలు) కొత్తయిండ్లు, శ్రీ టి.వి.హెడ్ మునస్వామి, కొత్తయిండ్లు, శ్రీ యస్.రంగయ్య (55 సం.) కొత్తయిండ్లు, శ్రీ ఎస్.నారాయణ (48 సం.)కొత్తయిండ్లు, శ్రీ ఎ.ఎస్.నాయుడు (44సం.) కొత్తయిండ్లు,

శ్రీ చింతలరామయ్య (60సం.) కొత్తయిండ్లు, శ్రీ పి.వి.వేణుగోపాల్ (42సం.) కొత్తయిండ్లు, శ్రీ కోగూరు రంగయ్య (70 సం.) కొత్తయిండ్లు, శ్రీ ముని వెంకటప్ప (65 సం.) గుండ్లపల్లి," ప్రస్తుతమున్న వీధి నాటక కళాకారులలో ముఖ్యులు.

"శ్రీ కృష్ణదేవరాయ నాటకసమాజం"లో వున్నవారందరూ వృత్తి కళాకారులు. ఐదేండ్ల బాలురనుండి, 80 ఏండ్ల వృద్ధులవరకు నాటకాలాడుతారు. ప్రస్తుతం ఈ సమాజంలో సర్వశ్రీ ఆర్.శ్రీనివాస్, టి.జి.కృష్ణమూర్తి, సి.చంద్రశేఖర్, జి.మునిరత్నం భాగవతులు, పి.సి.కృష్ణప్ప, కె.శ్రీనివాస్, సి.మునిరత్నం, పి.ఆర్.మునిరత్నం, పి.వి.నారాయణస్వామి, పి.వెంకటేశు, యం.గోవిందస్వామి, కె.ఆర్.నీరజాక్షులు, పి.బి.తిప్పన్న, ఎ.సంపంగి రామయ్య, బి. వెంకటస్వామి, పి.నేతప్ప, ఎస్.నారాయణస్వామి, కె.రామచంద్రప్ప, కె.నరసప్ప," మొదలగువారు నటులుగా వున్నారు. వీరు "అనిమిగానిపల్లి" నివాసులు. కొత్తయిండ్లు నివాసులైన సర్వశ్రీ "సి.నాగరత్నం, సి.ఎస్.రంగస్వామి, టి.జగన్నాథం నాయుడు, ఎస్.రంగయ్య, టి.వి.హెడ్ మునస్వామి, ఆర్.ప్రకాష్, పి.ఆర్.శ్రీనివాసులు, వి.రాఘవులు, ఎస్.ఆర్.వెంకటాచలం, పి.వి.వేణుగోపాల్, ఎస్.యం.శేషప్ప, సి.పెద్దబ్బయ్య, చింతలరామయ్య, టి.ఎన్.లోకనాథం, ఎ.ఎస్.నాయుడు, ఎస్.నారాయణప్ప, వి.మునివెంకటప్ప, డి.కృష్ణప్ప, వి. జయరామప్ప, ఎన్.రంగస్వామి, టి.యం. జయరాం, సి.యం. నారాయణప్ప, ఎస్.ఎం.శేషప్ప, ఎ.కృష్ణప్ప, కోవూరు రంగయ్య, రామయ్య" మొదలగు వారు ముఖ్యనటులు. గుండ్లపల్లి వా[illegible] సర్వశ్రీ మునివెంకటప్ప, బి.దొరప్ప, వెంకటమునెప్ప," మొదలగువారు శ్రీ కృష్ణదేవరాయ నాటక సమాజంలో సభ్యులు, నట[illegible]గా శ్రీ డి.రామకృష్ణయ్య, దళవాయి కొత్తపల్లి, శ్రీ వి.రామకృష్ణప్ప, వసనాడు గ్రామం, ఎస్.సూర్యనారాయణ నల్లిరాళ్లపల్లి గ్రామం, శ్రీ వి. మాణిక్యం, వసనాడుగ్రామం, వి.విశ్వనాథ్, దండికుప్పం, శ్రీ ఎస్.చిన్నరంగయ్య, జాసగుట్ట" మొదలగు కుప్పం పరిసర గ్రామాలవారు శ్రీ కృష్ణదేవరాయనాటక సమాజంలో నటులుగా వుంటున్నారు.

కంగుంది కుప్పం సంతతివారు, వారి శిష్యులు కొందరు పలమనేరు, పరిసర గ్రామాలవారు కలిసి "శ్రీ వేంకటేశ్వర నాట్యకళామండలి" అను మరియొక నాటక సమాజాన్ని స్థాపించుకొని, వీధి నాటకాలను ప్రదర్శిస్తున్నారు. వీరుకూడ వృత్తి కళాకారులే. సర్వశ్రీ "పెద్దనారాయణ, యం.రామమూర్తి, ఎన్.రామచంద్రయ్య, వీరు రాయలపేట మండలానికి చెందినవారు. దండు వెంకటస్వామి, సి.సాంబయ్య, యం. మార్కండయ్య, డి.వెంకటస్వామి, శి.కణ్ణయ్య, పలమనేరు మండలానికి సంబంధించినవారు. యం.నారాయణప్ప (గుండ్లపల్లి), వి.వెంకటప్ప (చెలగానిపల్లి), ఎస్.ఖాదర్ సాహెబ్, ఎన్.వెంకట్రామయ్య (కొలమాసనపల్లి)," వీరందరూ "శ్రీ వేంకటేశ్వర నాట్యకళామండలి" సమాజంలో శాశ్వత సభ్యులు, వీధినాటక కళాకారులు.

ఈనాటి కంగుంది కుప్పం కళాకారులలో ప్రముఖులు కొందరు.



## 1. డి.రామకృష్ణయ్య :

శ్రీ డి.రామకృష్ణయ్యగారు చిత్తూరుజిల్లా, కుప్పం మండలం, దళవాయి కొత్తపల్లె గ్రామవాస్తవ్యులు. వీరి వయసు 68 సంవత్సరాలు. వీరు "శ్రీ కృష్ణదేవరాయ నాటకసమాజం"లో సభ్యులై, వీధి నాటకాలు ఆడుతున్నారు. వీరు భారత, రామాయణ, భాగవతగాథలను వీధి నాటకాలుగా ప్రదర్శిస్తారు. ఈ పురాణాలలోని అన్ని పాత్రలలో శిక్షణ పొందారు. సుమారు 50 సంవత్సరాలుగా నాటకానుభవంగల వృత్తి కళాకారులు. వీరు "నటన, గానం, నాట్యం"లలో అభినివేశంగల జానపద కళామూర్తులు.



## 2. పి.వెంకటేశు :

శ్రీ పి.వెంకటేశుగారు చిత్తూరుజిల్లా, కుప్పం మండలం, అనిమిగానిపల్లి నివాసి. 65సంవత్సరాల వయసుగల వీరు వీధినాటకాలలో 45 సంవత్సరాల అనుభవంగల వృత్తి కళాకారులు. వీరు "శ్రీ కృష్ణదేవరాయ నాటకసమాజం"లో సభ్యులుగావుంటూ, అనేకచోట్ల వీధి నాటకాలను ప్రదర్శించారు. చిత్తూరుజిల్లాయందలి ధర్మరాజుల తిరుణాళ్లకు సంపూర్ణ భారతాన్ని వీధినాటకాలుగా ప్రదర్శించారు. వీరికి ప్రత్యేకించి ఒక పాత్రమీద అభిమానమంటూ లేదు. అన్ని పాత్రలను నటించేవారు. "అభినయము, నాట్యము, గానము"లలో వీరికి చక్కటి అభినివేశము కలదు.

3. పి.నేతప్ప :



శ్రీ పి.నేతప్పగారు చిత్తూరుజిల్లా, కుప్పం మండలం, అనిమిగానిపల్లి వాస్తవ్యులు. 80 ఏండ్ల వయసులో సుమారు 65 సంవత్సరాల నిండు అనుభవంతో భారత, భాగవత, రామాయణాలను కొన్నివందల సార్లయినా ప్రదర్శించి వుంటారు. వీరు వృత్తి కళాకారులు. చిత్తూరుజిల్లాలోని పెక్కు ద్రౌపదమ్మ ఉత్సవాలలో సంపూర్ణ భారతాన్ని వీధి నాటకాలుగా ప్రదర్శిస్తారు. నాటక ప్రదర్శనకు సమిష్టికృషి, క్రమశిక్షణ, అవసరమని వీరు నమ్ముతారు. వీరుకూడా భారతంలోని అన్నిపాత్రలను నటించగల సమర్థులు. వీరు "గానం, నటన, నాట్యం" తెలిసిన దిట్ట.

4. టి.జగన్నాథం నాయుడు : కొత్తయిండ్లు



శ్రీ టి.జగన్నాథంనాయుడుగారు చిత్తూరుజిల్లా, కుప్పంమండలం, కొత్తయిండ్లు గ్రామంలో జన్మించారు. వీరివయసు 47 సంవత్సరాలు. 30 సంవత్సరాల అనుభవంతో దేశరాజధాని, రాష్ట్ర రాజధానులలో, దేశవ్యాప్తంగా మరికొన్ని ముఖ్యపట్టణాలలోను జానపద కళయైన వీధి నాటకాలను ప్రదర్శించి, పలువురి ప్రశంసలను అందుకున్నారు. ప్రభుత్వ ఆహ్వానం మేరకు అఖిల భారత ఆకాశవాణి కేంద్రాలలో మహాభారత వీధి నాటకాలను ప్రసారంచేశారు. దూరదర్శన్ కేంద్రాలనుండి వీధి నాటకాలను ప్రదర్శించారు. వీరు మంచిగాయకులు, నటులు, దర్శకులు. వీరు పౌరాణిక నాటకాలకు దుస్తులు, ఆభరణాలు తయారుచేయగలరు. వీరుకూడ "శ్రీ కృష్ణదేవరాయ నాటకసమాజం" సభ్యులు, వృత్తి కళాకారులు.

5. టి.వి.హెడ్ మునస్వామి :



శ్రీ టి.వి.హెడ్ మునస్వామిగారు చిత్తూరుజిల్లా, కుప్పం మండలం, కొత్తయిండ్లు గ్రామంలో జన్మించారు. వయసు 26 సంవత్సరాలు. తమ పదమూడవయేటనుండి వీధినాటకాలలో నటిస్తున్నారు. వీరు "శ్రీ కృష్ణదేవరాయనాటక సమాజం"లో సభ్యులు. అఖిల భారత ఆకాశవాణి కేంద్రాలనుండి వీధి నాటకాలను ప్రసారం చేశారు. దూరదర్శన్ కేంద్రాలనుండి ప్రదర్శన లిచ్చారు. ఢిల్లీ, హైదరాబాదు, విశాఖపట్టణం వంటి ముఖ్యనగరాలలో భారతంలోని కొన్ని భాగాలను వీధి నాటకాలుగా ప్రదర్శించారు. జానపద , పౌరాణిక నాటకాలను ప్రదర్శిస్తారు. వీరు మంచినటులు. వీరికి రంగాలంకరణలో ప్రవేశముంది. ఈనాటి యువకళాకారులలో ఉత్సాహమున్న నటులు. సమాజాన్ని కూడగట్టుకొని రాష్ట్రంలోను, రాష్ట్రేతర ప్రాంతాలలోను వీధి నాటకాలను ప్రదర్శిస్తూ, వీధినాటక కళను ప్రచారం చేస్తున్నారు.

6. ఎస్.రంగయ్య : కొత్తయిండ్లు



శ్రీ ఎస్.రంగయ్యగారు చిత్తూరుజిల్లా, కుప్పంమండలం, కొత్తయిండ్లు గ్రామంలో నివాసముంటున్నారు. వీరు వృత్తి కళాకారులు . ఆట, పాట తెలిసినవ్యక్తి. మహాభారత, రామాయణ, భాగవతపురాణాలను, జానపదగాథలను, వీధినాటకాలను ప్రదర్శించారు. 55యేండ్లవయసులో, 40 సంవత్సరాల నాటకానుభవంతో, దేశం పలుప్రాంతాలలో దిగ్విజయంగా నాటక ప్రదర్శనలిచ్చారు. ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలలో నాటక ప్రదర్శనలిచ్చారు. కడప, హైదరాబాదు, విశాఖపట్టణం, మొదలగు పట్టణాలలో వీధి నాటకాలను ప్రదర్శించారు. నాటకంలోని అన్ని పాత్రలను నటించగలరు.

7. ఎస్.నారాయణప్ప : కొత్తయిండ్లు



శ్రీ ఎస్.నారాయణప్పగారు చిత్తూరుజిల్లా, కుప్పం మండలం, కొత్తయిండ్లు గ్రామంలో నివసిస్తున్నారు. వీరు కంగుందికుప్పం వీధినాటక కళాకారులకు చెందినవారు. వృత్తి కళాకారులు. వయసు 48 సంవత్సరాలు. 30 సంవత్సరాలుగా వీధినాటక కళకు సేవ చేస్తున్నారు. వీరు ఆట, పాట తెలిసిన ఉత్తమనటులు. వీరు అఖిలభారత ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలనుండి తమ నాటకాలను ప్రసారం చేశారు. భారత, భాగవత, రామాయణ పురాణాలను వీధి నాటకా ప్రదర్శిస్తారు. వీరుకూడ "శ్రీకృష్ణదేవరాయనాటక సమాజం"లో సభ్యులు.

8. ఎ.ఎస్.నాయుడు : కొత్తయిండ్లు



శ్రీ ఎ.ఎస్.నాయుడుగారి పూర్తిపేరు సీదా అప్పాజి సుబ్బయ్యనాయుడు. సీదా అప్పాజి సుబ్బయ్యనాయుడుగారి తండ్రి సీదా అప్పాజి, ముందుతరానికి చెందిన ప్రముఖ వీధినాటక కళాకారులు. శ్రీసుబ్బయ్యగారువృత్తిరీత్యా సెకండ్‌గ్రేడ్ ఉపాధ్యాయులు.అయినప్పటికీ వంశపారం పర్యవృత్తియైన వీధినాటకాలను వదలలేదు. శ్రీకృష్ణదేవరాయ నాటకసమాజానికి కార్యదర్శిగా నియమితులై, దేశవ్యాప్తంగా వీధినాటక కళకు ప్రచారమిస్తున్నారు.

శ్రీ సుబ్బయ్యనాయుడుగారు చిత్తూరుజిల్లా, కుప్పంమండలం, కొత్తయిండ్లు గ్రామంలో జన్మించారు. వీరివయసు 44 సంవత్సరాలు. 20 సంవత్సరాలుగా తెరవెనుక మనిషిగా వీధినాటక కళకు యెనలేని సేవ చేస్తున్నారు. వీరు నటులు కాదుకాని, నటనలో మెలకువలు తెలిసిన ఉత్తమదర్శకులు. వీరు వీధి నాటకరచయిత. పూర్వపు వీధినాటకాల ననుసరించి భారత, రామాయణ, భాగవత పురాణాలను, కొన్ని జానపద గాథలను వీధినాటకాలుగా వ్రాసి, తమ సమాజంచేత ప్రదర్శింప జేస్తుంటారు. వీరి నాయకత్వంక్రింద శ్రీకృష్ణదేవరాయ నాటకసమాజంవారు దేశవ్యాప్తంగా ఢిల్లీ, పంజాబు, పశ్చిమ బెంగాలు, ఉత్తరప్రదేశ్, తమిళనాడు, కర్ణాటక మొదలగు ఉత్తర, దక్షిణ రాష్ట్రాలలోను, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణం, విజయనగరం, రాజమండ్రి" మొదలుగాగల ముఖ్యపట్టణాలలోను కంగుందికుప్పం వీధినాటకాలను ప్రదర్శించారు. ఆకాశవాణి, దూరదర్శన్ కార్యక్రమాలలో పాల్గొన్నారు. ఇటీవల హైదరాబాదులో "కీచకవధ" నాటకాన్ని ప్రదర్శించి, ప్రముఖుల మన్ననలకు పాత్రులైనారు. చిత్తూరు రామవిలాస సభ కార్యదర్శియైన శ్రీరామస్వామి అయ్యంగారు వీరి ప్రతిభను గుర్తించి, చిత్తూరు శ్రీకోదండ రామమందిరంలో, చిత్తూరు పురప్రముఖుల సమక్షంలో, వీరిని ఘనంగా సన్మానించారు.

వీరు ఆంధ్రుల సంస్కృతికి అద్దంపట్టే జానపదకళ వీధినాటకాన్ని సినిమా ప్రభావంలోపడి కొట్టుకు పోకుండా కాపాడుకుంటూ వస్తున్నారు.

9. చింతలరామయ్య : కొత్తయిండ్లు



శ్రీ చింతలరామయ్యగారు చిత్తూరుజిల్లా, కుప్పంమండలం, కొత్తయిండ్లు గ్రామంలో నివసిస్తున్నారు.వీరు 60సంవత్సరాలకు పైబడిన వయస్సులో 30 సంవత్సరాల అనుభవంతో వీధినాటకాలను ప్రదర్శిస్తున్నారు.వీరు "శ్రీకృష్ణదేవరాయ నాటక సమాజం"లో సభ్యులు. ఈ సమాజం వీధినాటక వృత్తి కళాకారుల సమాజం.వీరు వృత్తి కళాకారులు. భారతం, రామాయణం, భాగవత పురాణాలను వీధి నాటకాలుగా ప్రదర్శించే కంగుందికుప్పం కళాకారులకు వారసులు.వీధినాటకంలో అన్నివేషాలు వేస్తారు. హైదరాబాదు, కడప, విశాఖపట్టణం మొదలగు దూరదర్శన్, రేడియో కేంద్రాలలో నాటక ప్రదర్శనలిచ్చారు. బాలనాగమ్మ, కనకతార, చింతామణి వంటి జానపదనాటకాలను కూడ ప్రదర్శించారు. ఆట, పాట లేకుండ వీధి నాటకాన్ని ప్రదర్శించడం కష్టం.వీరు ఆట, పాట తెలిసిన వీధినాటక నటులు.

10. పి.వి.వేణుగోపాల్ : కొత్తయిండ్లు



శ్రీ పి.వి.వేణుగోపాల్‌గారు చిత్తూరుజిల్లా, కుప్పం మండలంలోని కొత్తయిండ్లు గ్రామానికి చెందినవారు. 42సంవత్సరాల మధ్యవయస్కులు. 22సంవత్సరాలుగా వీధి నాటకాలను ప్రదర్శిస్తున్నారు. వీరు వృత్తి కళాకారులు. "శ్రీ కృష్ణదేవరాయ నాటక సమాజం"లో సభ్యులు. ఈ సమాజం పతాకంక్రింద దేశవ్యాప్తంగా ఆయా రాష్ట్ర ప్రభుత్వాల ఆహ్వానంపై "ఢిల్లీ, పంజాబు, కలకత్తా, హైదరాబాదు" మొదలగు ముఖ్యనగరాలలో వీధినాటకాలను ప్రదర్శించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు. వీరు భారత, భాగవత, రామాయణాది పురాణాలలోని వీధి నాటకాలలో అన్ని పాత్రలను నటించగల నేర్పరులు. చక్కగా పాడగలరు. నటన, రంగాలంకరణలలో ఆరితేరినవారు. ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలలో వీధినాటకాలను ప్రదర్శించారు.

11. కోవూరు రంగయ్య : కొత్తయిండ్లు



శ్రీ కోవూరు రంగయ్యగారు చిత్తూరుజిల్లా, కుప్పంమండలం, కొత్తయిండ్లుగ్రామంలో నివసిస్తున్నారు. 70ఏండ్లు పండిన వయసులో, 50 సంవత్సరాల నటనానుభవంతో, కంగుంది కుప్పం వీధినాటక కళాకారుడుగా పేరుప్రఖ్యాతు లార్జించిన వ్యక్తి. వీధినాటకాలలో అన్నిపాత్రలను స్త్రీ, పురుషభేదం లేకుండ నటిస్తారు. వీరు వృత్తి కళాకారులు. వృత్తి కళాకారుల సంఘమైన "శ్రీ కృష్ణదేవరాయ నాటక సమాజం"లో సభ్యులు. వీరు నాట్యంకూడ చేయగలరు. "నటన, గానం, నాట్యం" చక్కగా తెలిసిన వృద్ధ కళాకారులు.

12. సి.ఎస్.రంగస్వామి : కొత్తయిండ్లు



శ్రీ సి.ఎస్.రంగస్వామిగారు కంగుంది కుప్పం వీధినాటక కళాకారుల సంతతికి చెందినవారు. వీరు 36 సంవత్సరాల యువకులు. 20 సంవత్సరాలుగా వంశానుగతమైన వీధినాటక కళలో వృత్తి కళాకారులుగా జీవిస్తున్నారు. పౌరాణిక, జానపద వీధి నాటకాలలో అన్ని పాత్రలను నటించగల సమర్థులు. నటనే వీరి ధ్యేయం. ఆట, పాట తెలిసిన వ్యక్తి. దేశవ్యాప్తంగా పెక్కురాష్ట్రాలలోని ముఖ్యపట్టణాలలో వీధి నాటకాలు ప్రదర్శించారు. ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలనుండి వీధి నాటకాలను ప్రదర్శించి, ప్రసారం చేశారు. వీరు వృత్తి కళాకారులైనప్పటికి, కళాసేవ చేయాలన్న ఉత్సాహంగల యువనటులు. "శ్రీ కృష్ణదేవరాయ నాటకసమాజం"లో సభ్యులు. కొత్తయిండ్లు గ్రామంలో నివసిస్తున్నారు.

13 సి.యం.నారాయణప్ప : కొత్తయిండ్లు



చిత్తూరుజిల్లా, కుప్పం మండలం, కొత్తయిండ్లు గ్రామంలో నివసిస్తున్న శ్రీ సి.యం.నారాయణప్పగారు 33సంవత్సరాల యువకళాకారులు. వీరు కంగుంది కుప్పం వీధినాటక వృత్తి కళాకారుల వంశీయులు. 15 సంవత్సరాలుగా వీధినాటక కళను పోషిస్తూ, వీరు దేశవ్యాప్తంగా ఢిల్లీ, కలకత్తా, హైదరాబాదు, విశాఖపట్టణం మొదలగు ముఖ్యనగరాలలో వీధినాటక ప్రదర్శనలిస్తూ, రంగస్థల నాటకాలలో కూడా ప్రావీణ్యాన్ని సంపాదించారు. ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలనుండి ప్రభుత్వ ఆదేశంమేరకు వీధినాటకాలను ప్రసారం చేస్తున్నారు. వీరుకూడ వృత్తికళాకారుల సంఘమైన "శ్రీ కృష్ణదేవరాయ నాటకసమాజం"లో సభ్యులు. ఆట, పాట తెలిసిన వ్యక్తి. కేవలం భుక్తికోసమేగాక భారతీయ సంస్కృతికి అద్దంపట్టే జానపద వీధి నాటకకళను, కాలంమరుగున పడిపోకుండ కాపాడుకొస్తున్న, కళాతపనగల మంచి నటులు.



శ్రీ సి.నాగరత్నంగారు కంగుంది కుప్పం వీధి నాటక కళాకారుల వంశానికి చెందినవారు. వీరు చిత్తూరుజిల్లా, కుప్పంమండలం, కొత్తయిండ్లు గ్రామంలో నివసిస్తున్నారు. 45 సంవత్సరాల వయసులో 30సంవత్సరాల నాటకానుభవంగల వ్యక్తి. వీరికి జీవనవృత్తి వీధినాటకాలే అవడంచేత "శ్రీకృష్ణదేవరాయ నాటక సమాజం"అను వృత్తి కళాకారుల సంఘం పతాకంక్రింద, దేశవ్యాప్తంగా వీధి నాటకాలను ప్రదర్శిస్తున్నారు. వీధినాటకంలో అన్ని పాత్రలను నటించగలరు. వీరికి నటనలోనేగాక, రంగాలంకరణలో కూడ అభినివేశము కలదు. ఢిల్లీ, హైదరాబాదు, కలకత్తా, విశాఖపట్టణం, పంజాబు మొదలగు ముఖ్యనగరాలలో వీధి నాటకాలను ప్రదర్శించారు. ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలనుండి వీధినాటకాలను ప్రసారంచేశారు. అతి ప్రాచీనమైన జానపదకళగా పేర్కొనుచున్న ఈ వీధినాటకకళను తెరమరుగుకాకుండా కాపాడుకుంటూ వస్తున్నారు.

15.మునివెంకటప్ప : గుండ్లపల్లి



కంగుందికుప్పం జమీందారుల ఆదరణ తప్పిన తరువాత కంగుందికుప్పం వదలిపెట్టి, వీధినాటక కళాకారులు "కొత్తయిండ్లు, గుండ్లపల్లి, అనిమిగానిపల్లె"అను మూడు గ్రామాలలో స్థిరనివాసమేర్పరుచుకున్నారు. ఆ విధంగా గుండ్లపల్లిలో స్థిరనివాసమేర్పరుచుకున్న శ్రీమునివెంకటప్పగారు వీధినాటక వృత్తికళాకారుల సంఘమైన "శ్రీకృష్ణదేవరాయ నాటక సమాజం"సభ్యులై, వారితో అనేక నాటకాలను ప్రదర్శించారు. వీరు 60 సంవత్సరాల వృద్ధాప్యంలో అడుగుపెట్టిన వృద్ధకళాకారులు.వీధి నాటకాలలో 40సంవత్సరాల అనుభవంగలవారు. అందరిలాగే వీరుకూడ నాటకంలో అన్నిపాత్రలు పోషించగలరు. ఆట, పాట, నృత్యం నేర్చిన కళాకారులు.

16. వెంకటమునెప్ప : గుండ్లపల్లి



శ్రీ వెంకటమునెప్పగారు చిత్తూరుజిల్లా, కుప్పంమండలం, గుండ్లపల్లి గ్రామానికి చెందినవారు. వీరు కంగుంది కుప్పం వీధి భాగవతుల సంతతివారు. వృత్తి కళాకారులు. వృత్తి కళాకారులందరు కలిసి, స్థాపించుకున్న "శ్రీకృష్ణదేవరాయనాటక సమాజం"లో వీరు సభ్యులు. పురాణాలను వీధి నాటకాలుగా ప్రదర్శిస్తారు. వీరు 60 ఏండ్ల వయసువారు. 35 సంవత్సరాలుగా వీధి నాటకాలు ఆడుతున్నారు.చిత్తూరుజిల్లా, కడపజిల్లాలలో విరివిగా జరుపుతున్న "ధర్మరాజుల తిరుణాళ్ల"కు సంపూర్ణ భారతాన్ని వీధి నాటకాలుగా ప్రదర్శించేవారు. "ఆట, పాట, నాట్యం"లలో అభినివేశమున్న కళాకారులు.

17.జి.మునిరత్నం భాగవతార్ : అనిమిగానిపల్లి



శ్రీ జి.మునిరత్నం భాగవతార్‌గారు చిత్తూరుజిల్లా, కుప్పం మండలం, అనిమిగానిపల్లె గ్రామవాస్తవ్యులు. వీరు వృత్తి కళాకారులు. వీధి భాగవతుల వంశానికి చెందినవారు. వీరు 60 సంవత్సరాల వయసులో 40 సంవత్సరాల అనుభవంతో వీధి నాటకాలు ప్రదర్శిస్తున్నారు. నాటకంలోని స్త్రీ, పురుష పాత్రలన్నిటిని నటించగలరు. శ్రావ్యమైన కంఠం. హరికథలు చేస్తారు. హార్మోనియం, ఫిడేలు వాయిస్తారు. వీరు దేశవ్యాప్తంగా వీధినాటకాలు ప్రదర్శిస్తున్నారు. "శ్రీకృష్ణదేవరాయ నాటకసమాజం"లో సభ్యులై రాష్ట్ర సంగీత నాటక అకాడమీలలోను, "ఢిల్లీ, కలకత్తా, పంజాబు, హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణం" రాష్ట్ర, రాష్ట్రేతర ముఖ్యనగరాలలో, విరివిగా వీధినాటకాలను ప్రదర్శిస్తున్నారు. ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలలో వీధి నాటకాలను

ప్రసారం చేస్తున్నారు. ధర్మరాజుల తిరునాళ్ల సందర్భంగా సంపూర్ణ భారతాన్ని వీధి నాటకాలుగా ప్రదర్శిస్తూ, హరికథలు చెప్పుకుంటున్నారు. భుక్తికోసమే కళనాశ్రయించినా, గొప్ప వీధిభాగవత నటులుగా, హరికథ భాగవతార్‌గా, హార్మోనియం, ఫిడేలు వాద్యకారులుగా, బహుముఖ ప్రజ్ఞను సాధించిన ఉత్తమ కళాకారులు.

### 18. సి.కణ్ణయ్య : సముద్రపల్లి



కంగుందికుప్పం వీధినాటక కళాకారులు స్థాపించుకున్న "శ్రీకృష్ణదేవరాయ నాటక సమాజం"వంటిది పలమనేరు మండలంలోకూడ పలమనేరు పరిసరప్రాంతాల వృత్తి కళాకారులందరూ కలిసి "శ్రీవేంకటేశ్వరా నాట్య కళామండలి"అనుపేర ఒక వీధినాటకసమాజాన్ని స్థాపించుకున్నారు. ఈ సమాజంలో సభ్యులైన శ్రీసి.కణ్ణయ్యగారు సముద్రపల్లి, చిత్తూరుజిల్లా, పలమనేరు మండలానికి చెందినవారు. 70 ఏండ్ల వృద్ధులైన వీరు తమ పదవయేటనుండి వీధి నాటకాలాడుతున్నారు. పండిన అనుభవంతో పరిసర ప్రాంతాలలో నాటకాలు ప్రదర్శిస్తూ పల్లెవాసులకు నేర్పుతూ జీవనయాత్ర సాగిస్తున్నారు. వీరి శిష్యులు, ప్రశిష్యులు, కలిసి చిత్తూరుజిల్లాలో పలుప్రాంతాలలో నిర్వహింపబడుతున్న ద్రౌపదమ్మ తిరునాళ్లకు సంపూర్ణ భారతాన్ని వీధి నాటకాలుగా ప్రదర్శిస్తూ భారతోత్సవాలను దిగ్విజయంగా జరిపిస్తున్నారు . వీరు ఆట, పాట తెలిసినవారు. నాటకాలకు దర్శకత్వం వహిస్తుంటారు. రెక్కాడితేగాని డొక్కాడని ఇటువంటి జానపద కళాకారులకు భవిష్యత్తు, వృద్ధాప్యం శూన్యంగా గోచరిస్తుంది. ఇటువంటి వృద్ధకళాకారులకు గృహవసతి, ఉపకారవేతనం కల్పించడం ప్రభుత్వంయొక్క కనీస ధర్మంగా గుర్తించాలని వీరి అభిప్రాయం.

### 19. ఎస్.ఖాదర్ సాహెబ్ : కొలమాసనపల్లి



శ్రీ ఎస్.ఖాదర్ సాహెబ్‌గారు చిత్తూరు జిల్లా, పలమనేరు మండలం, కొలమాసనపల్లె నివాసి. వీరు వృత్తి కళాకారులు. "శ్రీవేంకటేశ్వరా నాట్య కళామండలి"లో సభ్యులై, జీవన వృత్తిగా వీధి నాటకాలను యెన్నుకున్నారు. కళకు కులమతములు అడ్డురావన్నవిషయం ఇటువంటి కళాకారుల వలన ధృవపడుతున్న సంగతి అందరికీ తెలిసిన విషయమే. రామాయణ, భారత, భాగవతాది పురాణాలలో వీధినాటకాలను ప్రదర్శిస్తుంటారు. ఆట, పాట తెలిసిన, నాటకాలకు దర్శకత్వం నిర్వహిస్తున్న సమర్థులు. వీరు సహృదయులు. దేవాలయ సంస్థలకు ఉచితంగా నాటక ప్రదర్శనలిచ్చి, సేవచేస్తుంటారు. 64 సంవత్సరాల వయసులో పండిన అనుభవంతో ప్రాచీన జానపద కళయైన వీధినాటక కళకు సేవచేస్తున్న మంచిమనిషి.

### 20. ఎన్ వెంకట్రామయ్య : కీరమంద గ్రామం



శ్రీ ఎన్. వెంకట్రామయ్యగారు చిత్తూరు జిల్లా, బంగారుపాళ్యం మండలం, కీరమంద గ్రామంలో జన్మించారు. వీరు వృత్తికళాకారులు. 'శ్రీ వేంకటేశ్వర నాట్యకళామండలి"లో సభ్యులు. వీరు హాస్యప్రియులు. పెక్కు నాటకాలలో హాస్యపాత్రలను పోషించి, పౌరాణిక వీధినాటకాలలో హాస్యనటుడుగా గుర్తింపు పొందిన శ్రీ ఎన్. వెంకట్రామయ్యగారు ప్రస్తుతం వికలాంగుడై, కాళ్ళుపోయి కుంటివాడై, నిరాశ్రయుడుగా మిగిలిపోయాడు. జానపద కళలకు రాజాశ్రయం కరువైన తరువాత కళాకారులే కళాపోషకులు, తద్వారా స్వయంపోషకులు కావలసి వచ్చింది. సినిమారంగంలోవలె నాటక కళారంగంలో స్థితిమంతుడు కావడం దుర్లభం. తమ జీవితంతో బాటు, ప్రాచీన నాటక కళను ఈడ్చుకొస్తున్న కళాకారులను అవసానదశలో ఆదరించవలసిన కనీసధర్మం ప్రభుత్వానికెంతైనా వుంది.

21. దండు వెంకటస్వామి : పలమనేరు



శ్రీ దండు వెంకటస్వామిగారు చిత్తూరు జిల్లా, పలమనేరు వాస్తవ్యులు. చిన్ననాటినుండి వీరు వీధినాటక కళలో తలపండినవారు. వృత్తికళాకారులుగా "శ్రీ వెంకటేశ్వరా నాట్యకళామండలి"లో సభ్యులై భారత, రామాయణ, భాగవతాది పురాణాలను వీధి నాటకాలుగా ప్రదర్శించారు. జీవితాంతం జీవనాధారమైన నాటకకళ నంటిపెట్టుకొని, గౌరవభావంతో, ఆ కళకు సేవచేసిన వీరు 60సంవత్సరాల వృద్ధాప్యంలో, ప్రస్తుతం నాటకాలు ప్రదర్శించే జవసత్త్వాలులేక నిరీక్షిస్తున్నారు. భృతికొరకు నాటకాలాడినా, ఒక జానపదకళ అడుగంటి పోకుండా పోషించుకొచ్చామన్న, తృప్తి వీరికి మిగిలింది గాని తమపోషణమాత్రం గాలిలో దీపమైంది. ఈనాటి సమాజంలో సినిమా వ్యామోహం యెక్కువై, ప్రాచీనకళలను ఆదరించే నాధుడులేక, ఈ జానపదకళలు నశించిపోతాయేమోననిపిస్తుంది. వీరు ఆట,పాట తాళ యుక్తంగా నేర్చుకున్నవారు. వీధినాటక కళపై ఆదరణ నశించి, అవకాశాలు రాక, అవసానదశలో వీరు ప్రభుత్వ పెన్షన్ కొరకు ఆశతో ఎదురుచూస్తున్నారు.

## 22. ఎస్. చినరంగయ్య : జానగుట్ట



శ్రీ ఎస్. చినరంగయ్యగారు చిత్తూరు జిల్లా, బంగారుపేట మండలం, జానగుట్ట గ్రామంలో నివసిస్తున్నారు. వీరు వీధినాటక వృత్తికళాకారులు. కంగుందికుప్పం వీధిభాగవతుల "శ్రీ కృష్ణదేవరాయల నాటక సమాజం'లో సభ్యులు. భారత, భాగవత, రామాయణాది పురాణాలను వీధినాటకాలుగా ప్రదర్శించినవారు. 65సంవత్సరాల వృద్ధాప్యంలో, 45ఏండ్ల నాటకానుభవం గల కళాకారులు. చిత్తూరు జిల్లాలో పలుప్రాంతాలలో జరుగు ధర్మరాజుల తిరునాళ్ళలో సంపూర్ణ భారతాన్ని వీధినాటకాలుగా ప్రదర్శించి, కంగుందికళను సజీవంగా నిలబెట్టుతున్న నిజమైన కళాకారులు.

"నటన, నాట్యం, గానం"తెలిసిన వీరు చిత్తూరు జిల్లాలో వీధినాటకకళకు ప్రసిద్ధిగాంచిన కంగుందివారి సంతతికి చెందినవారు.

## 23. ఎస్.ఎం. శేషప్ప : కొత్తయిండ్లు



శ్రీ ఎస్. ఎం. శేషప్పగారు చిత్తూరు జిల్లా, కుప్పం మండలం, కొత్తయిండ్లు గ్రామంలో నివసిస్తున్నారు. వీరు కంగుందికుప్పం వీధి భాగవతుల సంతానానికి చెందిన వృత్తికళాకారులు. వీరు సంపూర్ణ భారతాన్ని వీధి నాటకాలుగా, చిత్తూరు జిల్లాలో విరివిగా జరుపబడుతున్న ధర్మరాజుల తిరునాళ్లలో ప్రదర్శిస్తున్నారు. వీధి భాగవతుల సంఘమైన "శ్రీ కృష్ణదేవరాయ నాటక సమాజం"లో వీరు సభ్యులు. వీరు రామాయణ, భారత, భాగవతాలను వీధినాటకాలుగా ప్రదర్శిస్తుంటారు. వీరు ఆకాశవాణి, దూరదర్శన్ కేంద్రాలలో వీధినాటకాలను ప్రదర్శించి యావద్భారతీయ ప్రజలకు ప్రాచీన జానపద కళయైన వీధినాటకాన్ని చూపిస్తున్నారు.

## 24. ఎ.వి.ఈశ్వరరావు : చిన్నపురం గ్రామం



శ్రీ ఎ.వి.ఈశ్వరరావుగారు చిత్తూరుజిల్లా, బైరెడ్డిపల్లి మండలం, చిన్నపురం గ్రామానికి చెందినవారు. రాయలసీమ చాలవరకు వర్షాధార భూములుగల ప్రాంతం. వర్షాలులేక భూములు పండని రోజులలో ప్రజలు ఏదో ఒకవృత్తిని ఆశ్రయించి, జీనవయాత్ర సాగించవలసి వుంటుంది. ఆ విధంగా చాలమంది చాలవృత్తులను ఆశ్రయించారు. అలా యెన్నుకున్నవృత్తులలో తోలుబొమ్మలాటలు, చెక్కబొమ్మలాటలు, వీధినాటకాలు చిత్తూరు జిల్లా పశ్చిమ తాలూకాలలో అనాదిగా ప్రచారంలో వున్నాయి. 58 సంవత్సరాలు వయసుగల శ్రీ ఈశ్వరరావుగారు, తొలుత తోలుబొమ్మలాటలాడిస్తూ వుండేవారు. ఆ తరువాత వీధినాటకాలు నేర్చుకొని 16వ యేటనుండి

పలమనేరులోని వృత్తి కళాకారుల సంఘం "శ్రీ వేంకటేశ్వరా నాట్యకళామండలి"లో సభ్యులుగా వుంటున్నారు. సినిమా ప్రభావంతో నిరాదరింపబడుతున్న తోలుబొమ్మలాటలు, వీధినాటకాలు కొంతకాలానికి అడుగంటి పోతాయేమోనన్న భయాన్ని వీరు వ్యక్తపరుస్తారు. భారత, భాగవత, రామాయణ వీధినాటకాలలో వీరు అన్నిపాత్రలను ధరించగలరు. వీరు ఆట, పాట, వాయిద్యం చక్కగా తెలిసినవారు. నాటకాలకు దర్శకత్వంచేస్తూ, ఉచితంగా యువకులకు శిక్షణ యిస్తూ, కళాసేవ చేస్తున్నారు. మంచినటులు, దర్శకులు.

వీరందరూ ప్రాచీన కంగుందికుప్పం వీధిభాగవతులతో ఏదోవిధంగా సంబంధం గలవారు. ఈనాడు కుప్పం, పలమనేరు మండలాలలో "శ్రీ కృష్ణదేవరాయ నాటక సమాజం, శ్రీ వేంకటేశ్వరా నాట్యకళామండలి" అను వృత్తి కళాకారుల నాటక సమాజాలలోగల వందలాది కళాకారులలో, కొందరు ప్రాచీన కంగుందికుప్పం వీధి భాగవతుల వంశీయులు, కొందరు వారి శిష్యగణం, మరికొందరువారి ప్రశిష్యులు. గ్రంథ విస్తృతిని దృష్టిలో వుంచుకొని వారిలో కొందరు ప్రముఖులను మాత్రమే ఉదహరించడం జరిగింది.

## చిత్తూరు జిల్లాలో వీధి నాటక కళాకారులు



వెంకటస్వామి



అణ్ణామలై



పణతల చిన్నబ్బ



యం. బత్తల్ రెడ్డి



పందిరి మునస్వామి

## ధర్మరాజుల తిరుణాళ్ళు – వీధి నాటకాలు :

ఆంధ్రుల ఆరాధ్యదైవాలలో "ముగ్గురు మూర్తులు (బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు), ముగురమ్మలు, (సరస్వతి, లక్ష్మి, పార్వతి) శ్రీ రాముడు, శ్రీ కృష్ణుడు, ఆదిపరాశక్తి" ఇత్యాది దేవతలేగాక పంచపాండవులు, ద్రౌపదికూడా వున్నారు. మహాభారతం ఆంధ్రీకరించిన తరువాతే దానియొక్క ప్రాధాన్యత, ప్రాచుర్యం పెరిగింది. తెలుగునటులు భారతాన్ని నాటకాలుగా, సినిమాలుగా ప్రదర్శించిన తరువాతే భారతంలోని పాత్రలు వెలుగుచూశాయి. భారతం శ్రవ్యకావ్యమేగాక దృశ్యకావ్యంగా గూడా తయారయ్యింది. వేదాంతపరంగా భగవద్గీత ప్రపంచ సాహిత్యంలోనే ప్రాధాన్యతను సంతరించుకున్నది.అటువంటి భారతం అంటే ఆంధ్రులకు ప్రత్యేకమైన అభిమానం. అందులోను ధర్మంపక్షం నిలిచిన పంచపాండవులు, ద్రౌపది, శ్రీకృష్ణుడు అంటే ఆంధ్రుల అంతరంగం పులకిస్తుంది. ఆ కారణంగానే ఆంధ్రులు, అందునా రాయలసీమవాసులు పాండవులను, ద్రౌపదిని తమ ఆరాధ్యదైవాలుగా యెంచుకున్నారు. "భారత ఉత్సవాలు, ధర్మరాజుల తిరునాళ్ళు, ద్రౌపదమ్మ తిరునాళ్ళు, అగ్ని తిరునాళ్లు" అని పలుపేర్లతో శ్రావణ, భాద్రపదమాసాల (ఆగష్టు, సెప్టెంబరు)లో పంచపాండవులు, ద్రౌపది రూపాల్లో "ధర్మాన్ని" పూజిస్తున్నారు.

చిత్తూరు, కడప, నెల్లూరు జిల్లాలలో ఈనాడుకూడా ధర్మరాజుల తిరునాళ్ళు జరుగుతున్నవి. ఈ తిరునాళ్ళకు పురాతనమైన చరిత్రవున్నట్లు ఇప్పటి వయోవృద్ధులు చెబుతారు. కానీ చరిత్రాధారాలు లేవు. చారిత్రాత్మకమైన ధర్మరాజుల దేవాలయాలు, ద్రౌపదమ్మ గుళ్ళు రాయలసీమలో యెక్కువగా చిత్తూరు, కడప, నెల్లూరు జిల్లాలలో కనిపిస్తాయి. చిత్తూరుజిల్లాలోని చంద్రగిరి, రామాపురం, పాపానాయుడుపేట, నెల్లూరుపట్టణం మూలపేటలోని ధర్మరాజుల దేవాలయాలు శ్రీ కృష్ణదేవరాయలచే నిర్మింపబడినవని ప్రతీతి.

మొదట ఈ దేవాలయాలలో నిత్యపూజలు మాత్రం జరుగుతుండేవని తెలుస్తుంది. ఆ తరువాత భారతోత్సవాల పేరుతో పది నుండి, ముప్పై రోజులవరకు తిరునాళ్ళు జరుపుతున్నారు. ఇటీవలకాలంలో ఈ భారతోత్సవాలు ఇబ్బడి ముబ్బడిగా పలుప్రాంతాలలో జరుపుతున్నారు.

భారతోత్సవాలు లేక ధర్మరాజుల తిరునాళ్ళు ప్రతి సంవత్సరం క్రమం తప్పకుండా జరుగుతాయి. ఈ తిరునాళ్ళు జరిపేవాళ్ళు దానిని ఒక యజ్ఞంగా పరిగణిస్తారు. ఎక్కువగా పల్లెప్రాంతాల్లోనే జరుగుతుంటాయి.

ధర్మరాజుల గుడిని ఊరికి దూరంగా ఒక మైదానంలో నిర్మిస్తారు. అందులో పంచపాండవులు, ద్రౌపది శిలావిగ్రహాలను ప్రతిష్టిస్తారు. గుడికి ఒకవైపున అగ్నిగుండం తయారుచేస్తారు. మరొకవైపు పెద్ద పూరిపాకను నిర్మిస్తారు. అందులో "పంచపాండవులు, ద్రౌపది, పోతరాజు" దారువిగ్రహాలను చేయించి, రంగులువేసి వుంచుతారు. గుడికి యెదురుగా, గుడివైపు చూస్తున్నట్లుగా ఒక పూరిపాకను, దాని ముందువైపున యెత్తైన పందిరిని నిర్మిస్తారు. ఈ ప్రాంతాన్ని "భారతం మిట్ట" అని పిలుస్తారు.

ధర్మరాజుల తిరునాళ్ళు జరుపుటకు ఒక ధర్మకర్త వుంటాడు. ధర్మకర్తపదవి వంశపారంపర్యంగా సంక్రమించినది కావచ్చును. లేదా గ్రామ మునసబునకు లభించినది కావచ్చును. ఈ ధర్మకర్త చుట్టుప్రక్కల గ్రామాలలో కొందరిని కార్యవర్గసభ్యులుగా యెన్నుకుంటాడు. వీరందరూకలిసి ధర్మరాజుల తిరునాళ్ళు (మహాభారత ఉత్సవాలు) జరపాలని నిర్ణయిస్తారు. గ్రామాలలో ప్రతియింటికి పంపకం (చందా) వేస్తారు. ఈ చందాలు వసూలుచేసి, ఆగష్టు, సెప్టెంబరు మాసాలకు సరియగు శ్రావణ, భాద్రపద మాసాలలో, ధ్వజారోహణంతో ధర్మరాజుల తిరునాళ్ళు ప్రారంభిస్తారు.తిరునాళ్ల ప్రారంభించిన రోజునుండి మహాభారతకథను వేదవ్యాస జననంతో ఆరంభించి, ధర్మరాజుల పట్టాభిషేకంవరకు పగలు పగటికథగా చెబుతారు. రాత్రులందు కంగుందికుప్పం వీధి భాగవతులు మహాభారతకథను వేదవ్యాస జననం నుండి దుర్యోధనవధ వరకు వీధి నాటకాలుగా ప్రదర్శించేవారు. వీరు ధర్మరాజులగుడికి యెదురుగావున్న పాకలో వేషాలు ధరించి, ముందువైపునవున్న పందిరిలో నాటకాలు ఆడుతారు. వీధి భాగవతులను కాంట్రాక్టు పద్ధతిలో నియమిస్తారు. తిరునాళ్ళు జరిగినన్నిరోజులు వీధి భాగవతులు కుటుంబసమేతముగా వచ్చి, తిరునాళ్ళు పూర్తయిన తరువాత స్వగ్రామానికి వెళ్ళిపోయేవారు.

వీధినాటక సమాజాలలో చిత్తూరుజిల్లాలోని కంగుందికుప్పంవారి సమాజం అతి ప్రాచీనమైనది. తరువాత చెప్పుకోతగినవారు 'నగరి' ప్రాంతంలో 'నింద్రమండలం' లోని "నూరికాపురం" వాస్తవ్యులు.వీరు వీధి నాటకాలలో ధరించే ఆభరణాలను తేలికపాటి చెక్క (కొయ్య) తో తయారు చేసుకొని, నేటికీ పాత పద్ధతులలో వీధినాటకాలు ఆడుతున్నారు.

ప్రస్తుతం పుత్తూరు వాస్తవ్యులు పి.సి.మేఘవర్ణం ఆధ్వర్యంలో "శ్రీ వేంకటేశ్వర నాట్య కళామండలి" వారు "పుత్తూరు, చంద్రగిరి,రామాపురం, శ్రీకాళహస్తి, పులిచెర్ల, ముండ్లపూడి" మొదలగు గ్రామాలలో జరుపబడు ధర్మరాజుల తిరునాళ్లలో కాంట్రాక్టు పద్ధతిని భారతకథను వీధినాటకాలుగా ప్రదర్శిస్తున్నారు.

చిత్తూరుజిల్లాలో, 20వ శతాబ్దంలో వందకుపైగా ధర్మరాజుల గుళ్ళు వెలిశాయి. అక్కడక్కడ కొన్ని గ్రామాల్లోని యువకులు స్వయంగా వీధి నాటకాలు నేర్చుకొని, వారి గ్రామంలో జరుగు భారత ఉత్సవాలలో నాటకాలాడుతున్నారు.

ఈ విధంగా ధర్మరాజుల తిరునాళ్ళకు, వీధి నాటకాలకు అవినాభావ సంబంధమేర్పడింది.

ధర్మరాజుల తిరునాళ్ళలో వీధినాటకాలుగా ప్రదర్శింపబడే అతిముఖ్యమైన మహాభారతఘట్టాలు (1) వేదవ్యాస జననం, (2) భీష్మప్రతిజ్ఞ, (3) భీష్మవిజయం, (4) పాండవ జననం, విద్యాభ్యాసము (5) హిడింబాసురవధ (6) బకాసురవధ (బండికుంభం), (7) ద్రౌపది స్వయంవరం, (8) సుభద్రాపరిణయం, (9) రాజసూయ యాగం, (10) ద్రౌపదీ వస్త్రాపహరణం, (11) అర్జునుని తపోవృక్షారోహణం, (12) సైంధవపరాభవం, (13) కీచకవధ, (14) ఉత్తరగోగ్రహణం, (15) శ్రీకృష్ణరాయబారము, (16) భీష్మపర్వం, (17) యుద్ధం-పద్మవ్యూహం-దుర్యోధనవధ, (18) అగ్నిగుండప్రవేశం.

17వరాత్రి దుర్యోధనవధ తప్ప తక్కిన భారతయుద్ధం పూర్తవుతుంది. 18వరోజు సూర్యోదయం తరువాత దుర్యోధనవధ జరుగుతుంది. 18వ రోజురాత్రి ద్రౌపదిపూజ, అగ్నిగుండ ప్రవేశం జరుగుతుంది. ఆరాత్రి వీధి భాగవతులు ఇనాము ఆటగా (Free performance) మహాభారతానికి సంబంధంలేని ఆటను ప్రదర్శిస్తారు.

ఈ భారతాన్నే పదిరోజులలో ముగించివేస్తారు. అవసరమనుకొంటే 30రోజులవరకు పెంచి ఆడుతారు.

నాటకాలు ప్రదర్శించేది వీధి భాగవతులే అయినా అతి ముఖ్యమైన ఘట్టాలలో స్థానికమైన ప్రజల ప్రమేయంకూడా గోచరిస్తుంది. ప్రజల ప్రాధాన్యంగల ఘట్టాలు.

1. బండి కుంభం (బకాసురవధ)
2. ద్రౌపదీకళ్యాణం
3. తపోవృక్షారోహణం
4. ఉత్తరగోగ్రహణం
5. యుద్ధం - దుర్యోధనవధ
6. అగ్నిగుండప్రవేశం

బండికుంభం:- బకాసురవధనాడు బండికుంభం తయారుచేస్తారు. వంతుప్రకారం గ్రామపెద్దలు అన్నము, కూరలువండి ఒక బండిలో అమరుస్తారు. ఆ బండికి రెండు యెనుబోతులను కట్టి సిద్ధంచేస్తారు. భీమసేనుడు బండిని తోలుకొని బకాసురుని వద్దకు వెళ్తున్నట్లుగా పాడుకుంటూ రంగస్థలంమీదకు వస్తాడు. బకాసురవధానంతరం బండిలోని అన్నాన్ని (కుంభం) అక్కడ చేరిన ప్రజలకు పంచి పెడతారు.

ద్రౌపది కళ్యాణం:- ద్రౌపది కళ్యాణం రోజున పగలు 'ద్రౌపది కళ్యాణం' పగటికథ చెబుతారు. రాత్రి ద్రౌపది కళ్యాణం వీధినాటకం ప్రదర్శింపబడుతుంది. నాటకంలో ద్రౌపది కళ్యాణం జరిగే సమయానికి సరిగ్గా గుడిలోని ద్రౌపదమ్మ విగ్రహానికి, పంచపాండవుల విగ్రహాలకు కళ్యాణం జరుగుతుంది. ఆ సమయంలో చుట్టుప్రక్కల గ్రామస్తులు పెండ్లిగాని తమ కన్నెపిల్లలను తీసుకొనివచ్చి ద్రౌపదికి మొక్కులు చెల్లించి, ద్రౌపది తలంబ్రాలు బియ్యము, అక్షతలు, పసుపు కుంకుమలు ప్రసాదంగా గ్రహించి వెళ్తారు. ఆ విధంగా చేస్తే ద్రౌపదమ్మ కరుణవలన తమపిల్లలకు త్వరగా పెండ్లి జరుగుతుందని వారినమ్మకం.

తపోవృక్షారోహణం:- తపోవృక్షారోహణకూడ ఇటువంటి ఘట్టమే. ఒక తాటిచెట్టును తలనరికి తెచ్చి, తపోవృక్షంగా తయారుచేస్తారు. చెట్టుకిరువైపులా క్రిందనుండి పైకి ఒక్కొక్క అడుగు తేడాతో ఒక అడుగు పొడవున్నమేకులను మెట్లుగా అమరుస్తారు.తాటిచెట్టు పైభాగంలో (చివర) ఒక గడ్డ పలుగును నాటి, మధ్యరంధ్రంగల కొయ్యపలకను ఇరువురు మనుషులు చెరొకవైపు పలకపై కూర్చొనేవిధంగా గడ్డపలుగుకు అమరుస్తారు.పలకపై అర్ధచంద్రాకారంలో వెదురుదబ్బలను వంచి "కాశికావడి" వలె నిర్మిస్తారు.ఆ వెదురుదబ్బలపైన ఎట్టుటి పీతాంబరాన్ని కప్పుతారు. ఆ తపోవృక్షాన్ని నిటారుగా నిలిచేటట్లు నాటుతారు.తపోవృక్షం మెట్లపై మొక్కుబడివున్నవారు ఒక్కొక్కమెట్టుకు రెండుగాని మూడుగాని కొత్తదోవతులు, అంగవస్త్రాలుతెచ్చి వేస్తారు.తపస్వి అయిన అర్జునుడు పాడుకుంటూ తపోవృక్షాన్ని, ఒక్కొక్కమెట్టే అధిరోహిస్తూ వుంటాడు. పూలు, పండ్లు ఒక జోలినిండానింపుకొని మరొకవ్యక్తి అర్జునుని అనుసరిస్తాడు. అప్పటికే తపోవృక్షంచుట్టూ జనసందోహం గుమిగూడి వుంటుంది. పిల్లలులేని భార్యాభర్తలు ఈ వేడుకకు హాజరవుతారు. అర్జునుడు తపోవృక్షాన్ని అధిరోహిస్తూ, వెనుక వచ్చేవ్యక్తి జోలిలోని పూలు, పండ్లు అందుకొని, అందినవి అందినట్లుగా తపోవృక్షం నలువైపులా జనసమూహంపైకి విసురుతాడు. బిడ్డలులేని

స్త్రీలు, పురుషులు ఆ పూలు, పండ్లకొఱకు తమ పైటకొంగులను, అంగవస్త్రాలను చాచి, గొడుగులను త్రిప్పి, నిలబడతారు. వారికొంగులలో గొడుగులలో పువ్వుపడితే ఆడపిల్ల పుడుతుందని, పండుపడితే మగపిల్లవాడు పుడతాడని వారినమ్మకం. పూలు, పండ్లు పడని స్త్రీలు, పురుషులు ఈ యేటికి తమప్రాప్తమింతేనని ఒక నిట్టూర్పువిడిచి, మరుయేడు ఆరోజు కొఱకు యెదురుతెన్ను చూస్తూవుంటారు. మెట్లపైవేసిన వస్త్రాలు వీధి భాగవతులకు చెందుతాయి. ఈ తపోవృక్షారోహణ కార్యక్రమం భారతంమిట్టకు కొంతదూరంలో విశాలమైన మైదానంలో జరుగుతుంది. ఇదిపగలు జరిగే తంతు (కార్యక్రమం).

ఉత్తరగోగ్రహణం:- పాండవులు అజ్ఞాతవాసకాలంలో విరాటరాజు కొలువునందు తలదాచుకొని వుంటారు. అదితెలిసిన కౌరవులు పాండవుల అజ్ఞాతవాసాన్ని భగ్నంచేయ సంకల్పిస్తారు.విరాటరాజుకు గోసంపద అధికం. కౌరవసేనలు దక్షిణ, ఉత్తర గోగ్రహణాలకు ప్రయత్నిస్తారు. బృహన్నలతప్ప తక్కిన పాండవులు విరాటరాజుతో గ్రహణాన్ని యెదుర్కొని, గోవులను మరలిస్తారు. ఉత్తరగోగ్రహణం జరుగుతుంది. ఆరోజు చుట్టుప్రక్కల గ్రామాలలోని గోవులను భారతంమిట్టకు తోలుకొని వస్తారు. ఈ గోవులను కౌరవులు తరలించుకొని పోతుంటే, అర్జునుడు వెళ్లి మరలిస్తాడు. ఈ విధంగా గోగ్రహణంలో తమగోవులు పాల్గొంటే విరాటరాజుకు గోసంపద వృద్ధిచెందినవిధంగా తమ గోసంపద వృద్ధిచెందుతుందని అందరూ చెప్పుకుంటూ వుంటారు. ఇదికూడా పగటి కార్యక్రమమే.

యుద్ధం - దుర్యోధనవధ:- భారత ఉత్సవాలలో ఇది చివరిఘట్టం కాకపోయినా, భారతకథలో చివరిఘట్టం. 17 వరోజు శనివారం వచ్చేవిధంగా కార్యక్రమం నిర్ణయమవుతుంది. ఒక్క దుర్యోధనవధతప్ప, కురుక్షేత్ర సంగ్రామమంతా పూర్తవుతుంది.ఆదివారం సూర్యోదయం తరువాత దుర్యోధనవధ జరుగుతుంది. ఆదివారం సూర్యోదయమయ్యేసమయానికి భారతంమిట్ట మైదానంలో నేలపై ఇసుకతో దుర్యోధనుని బొమ్మను తయారుచేస్తారు. కుంకుమ లేదా ఎఱ్ఱరంగు కలిపిన నీటిని చిన్న మట్టికుండలో నింపి, మూతపెట్టి, ఇసుక దుర్యోధనుని తొడలో పైభాగాన పూడ్చిపెడ్తారు.ఆ యిసుక బొమ్మమీదనే భీమదుర్యోధన పాత్రధారులిద్దరూ యుద్ధం ప్రారంభిస్తారు. ఒకరిని మించి ఒకరు యుద్ధం చేస్తూ యిద్దరూ బాగా అలసిపోతారు. శ్రీకృష్ణునిసైగతో భీముడు బొమ్మదుర్యోధనునితొడపై గదతో కొడతాడు. తొడలో పూడ్చిపెట్టిన మట్టికుండపగిలి, రక్తంలాంటి ద్రవం చిమ్ముతుంది. దుర్యోధనపాత్రధారి బొమ్మపైనపడి స్పృహతప్పుతాడని వదంతి. భీమసేనుడు దుర్యోధనుని తొడవిరుస్తానని చేసిన శపథం నెరవేరుతుంది. దుర్యోధనునివధతో భారత వీధినాటకప్రదర్శనలు పూర్తవుతాయి.

అగ్నిగుండ ప్రవేశం:- చివరిఘట్టం అగ్నిగుండ ప్రవేశం.ఆదివారం సాయంకాలం కొయ్యదుంగలతో అగ్నిగుండాన్ని వెలిగిస్తారు. నిగనిగలాడే నిప్పులతో అగ్నిగుండం ప్రజ్వరిల్లుతూ వుంటుంది. ద్రౌపదీదేవి ఉత్సవవిగ్రహాన్నితెచ్చి అగ్నిగుండందగ్గర నిలుపుతారు. పసుపుచీరను శృంగారించి, ఒడిబ్రాలు కడ్తారు. అగ్నిగుండంనుండి నిగనిగలాడే నిప్పుకణికలు తెచ్చి ద్రౌపదీదేవి ఒడిబ్రాలులోపోస్తారు. ద్రౌపదికి కట్టినచీర కాలదు. మొక్కుబడివున్న చుట్టుప్రక్కల గ్రామస్తులు చిన్నా, పెద్దా, ఆడా, మగ భేదం లేకుండ తడిబట్టలతో అగ్నిగుండం ప్రవేశించి, అగ్ని తొక్కుకుంటూ వెళ్తారు. ఈ విధంగా మూడుసార్లు అగ్నిప్రవేశం చేస్తారు. అగ్నిప్రవేశం చేసినవారి పాదాలు కాలవు.ఇదంతా ద్రౌపదమ్మ మహిమ అంటారు. గ్రహదోషమున్న స్త్రీలను తడిబట్టలతో ద్రౌపదమ్మ దగ్గర పడుకోబెడతారు.దీనిని "వరపడుట" అంటారు. వరపడినవారిలో కొందరు దెయ్యం పట్టిందని ఊగుతారు.ఆ తరువాత వారిలోవున్న గ్రహదోషాలు తొలగిపోతాయని నమ్మకం. ఇవన్నీ నమ్మకంతోనే ఇప్పటికీ చేస్తున్నారు. ఇలా ఆచరించినవారిలో కొందరికి పెండ్లిండ్లు జరగడం, కొందరికి బిడ్డలు పుట్టడం, కొందరికి గ్రహదోషాలు తొలగటం జరిగాయని చెబుతుంటారు. ఇదంతా వారినమ్మకం. మూఢనమ్మకమే కావచ్చు. "నమ్మినవారికి నమ్మినంత మహాదేవ" అని సామెత.

ద్రౌపది శక్తిస్వరూపిణి. శక్త్యారాధన అనేకరూపాలలో, అనేక పేర్లతో హిందూ సంస్కృతి, సంప్రదాయాలలో ఇమిడివున్నట్లు గోచరిస్తుంది. ఇది అనాదిగా వస్తున్న ఆచారం.

అగ్నిగుండం ప్రవేశం రోజున వీధి భాగవతులు "ఇనాము ఆట" (Free Performance) ను ప్రదర్శిస్తారు. సత్యహరిశ్చంద్రగాని, నలదమయంతిగాని, సారంగధరగాని అనగా భారతకథకు సంబంధంలేని కొత్తనాటకాన్ని ప్రదర్శిస్తారు. సోమవారం పగటికథగా శాంతిపర్వం చెబుతారు. గుడిలో ధర్మరాజు పట్టాభిషేకం జరుగుతుంది. మధ్యాహ్నం 2 గంటలకు అన్నదానం జరుగుతుంది. ఈ రోజుతో ధర్మరాజుల తిరునాళ్ళు (భారత ఉత్సవాలు) సమాప్తమవుతాయి. నిజంగా ఇది ఒక మహాయజ్ఞమే.

"ధర్మరాజుల తిరునాళ్ళు, ద్రౌపదమ్మ తిరునాళ్ళు, అగ్నిపూజలు, భారత ఉత్సవాలు" అనుపేర్లతో చిత్తూరు, కడప, నెల్లూరు జిల్లాలలో సుమారు వందప్రాంతాలకు పైగా నేటికీ ఈ ఉత్సవాలు జరుపుకుంటున్నారు.

దేవళం, 12. తెల్లగుండ్ల పల్లి, 13. దేవళంపేట, 14. చెంచుగుడి, 15. వెదురుకుప్పం, 16. పచ్చికాపల్లం, 17. వేపకుప్పం, 18. నిలువురాళ్లు కమ్మపల్లి, 19. ఎఱ్ఱమరాజుకండ్రిగ, 20. కార్వేటినగరం, 21. పుత్తూరు, 22. వేపంజేరి, 23. జక్కదన, 24. సల్లవెంగసపల్లి, 25. చవటగుంట, 26. అనుప్పల్లి, 27. పెనుమూరు, 28. నూతుగుంటపల్లి, 29. సోమల, 30. ముగిరాల, 31. నెత్తకుప్పం 32. కత్తిరిపల్లి, 33. వడకుప్పం, 34. అత్తిమంజేరి, 35. పాతగుంట, 36. ఉగ్రాణపల్లి, 37. చుట్టుగుంటపల్లి, 38. సాతంబాక, 39. బండ్లపల్లి, 40. కలవకుంట, 41. సంతగేటు, 42. ఐరాల, 43. నాంపల్లి, 44. చిలమాకులపల్లి, 45. నారాయణవరం, 46. నింద్ర, 47. నగరి దగ్గర అత్తూరు, 48. ఆరూరు, 49. ఆరూరుపేట, 50. సత్రవాడ, 51. కొత్తకోట, 52. మురకంభట్టు, 53. మిట్టమీదపల్లి, 54. పరమాల, 55.వాయల్పాడు, 56. పీలేరు, 57. పాతవీరాపురం, 58. ముండ్లపూడి, 59. ఎఱ్ఱంవారిపల్లి, 60. రామాపురం, 61. దుర్గసముద్రం, 62. పాకాల, చంద్రగిరి, 63. రేణిగుంట, 64. పాడిపేట, 65. తిరుపతి లాల్ బహదూర్ నగర్, 66. పాపానాయుడు పేట, 67.సూళ్ళూరుపేట, 68. సదుము, 69. సత్తివేడు మున్నగు ఇంకా యెన్నో ప్రాంతాలలో ధర్మరాజుల తిరునాళ్ళు జరుగుతున్నవి. ఈ విధంగానే కడపజిల్లాలో కొన్ని పల్లెలలోను, నెల్లూరుపట్టణం మూలాపేటలోను ధర్మరాజుల తిరునాళ్ళు జరుగును.

వీధి నాటకాలు బహుళ ప్రచారమందిన తరువాతనే ముఖ్యంగా చిత్తూరు జిల్లాలో భారత ఉత్సవాలు జిల్లావ్యాప్తంగా వ్యాపించాయి. చిత్తూరు జిల్లాలో కొన్ని పురాతనమైన ధర్మరాజుల దేవాలయాలు, అక్కడ జరిగే భారతోత్సవాలు.

## 1. ధర్మరాజుల గుడి : చంద్రగిరి

"చంద్రగిరి", పాతపేటలోని ధర్మరాజుల గుడి చాల పురాతనమైనదని చెప్పబడుతూవుంది. 16వ శతాబ్దంలో రాయలసీమను పరిపాలించిన సకలకళాసమరాంగణ సార్వభౌముడు శ్రీకృష్ణ దేవరాయలు ఈ ధర్మరాజుల గుడిని నిర్మించినట్లు చెబుతున్నార్లు.

చంద్రగిరికి, విజయనగర రాజులకు విడదీయరాని సంబంధం వుంది. మహామేధావిగా విఖ్యాతిగడించిన మహామంత్రి తిమ్మరుసు జన్మించిన స్థలం. విజయనగర రాజుల వైభవ, ప్రాభవాలను చాటి చెప్పే స్మృతి చిహ్నాలుగా చంద్రగిరి దుర్గం, చంద్రగిరి కోటలు, ఈ నాటికీ మనకు గోచరిస్తాయి. చంద్రగిరి చరిత్ర ప్రాధాన్యంగల యాత్రాస్థలం.

16వ శతాబ్దంనుండి ఈ గుడిలో నిత్యపూజలు మాత్రం జరుగుతుండేవి. క్రీ.శ. 1955వ సంవత్సరంనుండి "మహాభారత మహోత్సవాలు" జరుపబడుతున్నవి. శ్రీదుబాసి గుండయ్య కుమారుడు వెంకట్రాయులు శెట్టి ధర్మకర్తగా వుండి, మొట్టమొదటిసారిగా మహాభారత ఉత్సవాలను ప్రారంభించారు. వెంకట్రాయులు శెట్టితోబాటు ఎల్. శ్రీనివాసులురెడ్డి కుమారుడు వెంకటకృష్ణా రెడ్డి, ఒంటి మూర్తి రెడ్డి, టి.జి. ముని రెడ్డి, పిచ్చి కృష్ణమూర్తిరెడ్డి కూడ కార్యనిర్వాహక సభ్యులుగా వుండి, ఉత్సవాలను జయప్రదంగా జరిపించారు. మొదట్లో కంగుందికుప్పం వీధి భాగవతులు శ్రీ చిన్నబిడ్డ, దొరస్వామి, చిత్తేరి మునస్వామి, బుడ్డ రంగయ్య, మొదలగువారు సంపూర్ణ మహాభారతాన్ని వీధినాటకాలుగా ప్రదర్శించేవారు.

చంద్రగిరిలో మహాభారత ఉత్సవాలను "అగ్ని తిరునాళ్ళు" అనుపేరుతో 18రోజులు జరుపుతారు.ఈ పదునెనిమిది రోజులు వీధి నాటకాలతోబాటు పగటికథలుగూడ చెప్పేవారు. ఈ విధంగా ప్రతిసంవత్సరం మహాభారత మహోత్సవాలు జరుగుతూ వచ్చాయి.

ఇటీవలికాలంలో కంగుందికుప్పం వీధి భాగవతులకు బదులుగా పుత్తూరు వాస్తవ్యులు "శ్రీ వేంకటేశ్వర నాట్యకళామండలి"మేనేజరు అయిన శ్రీపి.సి.మేఘవర్ణంగారి ఆధ్వర్యంలో వీధినాటక ప్రదర్శనలు జరుగుతున్నవి. హరికథా భాగవతులతో పగటికథలు చెప్పిస్తున్నారు.

ప్రస్తుతం చంద్రగిరి శ్రీమహాభారత మహోత్సవాలు జరిపే కార్యవర్గసభ్యులు.

1. శ్రీ విరూపాక్ష రామచంద్రారెడ్డి
2. శ్రీ కొత్తపేట రామమూర్తి రెడ్డి
3. శ్రీ కొత్తపేట మునిరామి రెడ్డి

ఇంకా కొందరు ప్రముఖులు కలిసి 8-9-1989వతేది శ్రీమహాభారత మహోత్సవం (అగ్ని తిరునాళ్ళు) జరిపినారు. శ్రీ సుధలగుంట జయరామ చౌదరిగారిచే శ్రీద్రౌపది సమేత ధర్మభీమార్జున నకుల సహదేవ బ్రహ్మోత్సవ అంకురార్పణ, నవగ్రహకలశస్థాపన, ధ్వజారోహణంతో ప్రారంభింపబడింది. ఆరోజు మొదలు ప్రతిదినం పగలు 1-00 గంటకు శ్రీమతి ఎ. రంగనాయకమ్మ భాగవతారిణిగారిచే సంపూర్ణ భారతం హరికథ 18 రోజులు పగటికథగా చెప్పబడింది. మహాభారత మహోత్సవాలు జరిగిన ఈ18 రోజులు " శ్రీ వేంకటేశ్వర

నాట్య కళామండలి" మేనేజరు శ్రీ పి.సి. మేఘవర్ణం ఆధ్వర్యంలో వీధి నాటకప్రదర్శనలు జరిగాయి. వేదవ్యాస జననం, భీష్మప్రతిజ్ఞ, భీష్మవిజయం, పాండవజననం, విద్యాభ్యాసం, కురుపాండవాభ్యుదయం (పాండవపర్యటన), ద్రౌపదీ స్వయంవరం, సుభద్రాపరిణయం, రాజసూయయాగం, ద్రౌపది మాన సంరక్షణ, తపస్సు, సైంధవ పరాభవము, సౌగంధికపుష్పము, యక్షప్రశ్నలు, కీచకవధ – నర్తనశాల, ఉత్తరగోగ్రహణము, శ్రీకృష్ణరాయబారము, కర్ణసందేశము – భీష్మపర్వము, (చక్రధారణ), వీరాభిమన్యు–పద్మవ్యూహము, దుర్యోధనవధ, శాంతిపర్వము, ధర్మరాజుల పట్టాభిషేకము" మొదలగు ఘట్టాలు పగటికథగా చెప్పబడింది. అక్కడక్కడ కొన్ని మార్పులతో సంపూర్ణ భారతం వేదవ్యాస జననంతో మొదలుపెట్టి దుర్యోధనవధతో అంతమయ్యేటట్లునూ, ఒక ఇనాము ఆటనూ పుత్తూరు భాగవతులు ఆడడం జరిగింది. చివరిరోజు అన్నదానంతో అగ్నితిరునాళ్ళు పూర్తి అయినవి.

## 2. రామాపురం : ధర్మరాజుల తిరునాళ్ళు :

రామాపురం పుత్తూరు తాలూకాలో తిరుపతినుండి సుమారు 6కి.మీ.దూరంలో దక్షిణ దిశగా రాయల్ చెఱువు రోడ్డుమీదగల ఒక కుగ్రామము. దీనికి చుట్టుగుంట రామాపురమనిగూడా పేరుకలదు. ఈ గ్రామంలో అతిపురాతనమైన "ధర్మరాజులగుడి" గోచరిస్తుంది. ఈ గుడిని 1756 ప్రాంతంలో నిర్మించినట్లు ఆ గుడి శంకుస్థాపనశిలపై చెక్కబడివుండినట్లును, ఆ శిల గుడిపునర్నిర్మాణమప్పుడు కాశిరాళ్లతో కలిసి గుడి గోడలలో యెక్కడోకనుమరుగైనట్లుందని ఇప్పటి స్థానికులైన వయోవృద్ధులు చెబుతారు. ఈ గ్రామం కార్వేటినగర సంస్థానంలో చాలకాలంగా వుండేది. ఆ సంస్థానం కనుమరుగైన తరువాత వారిపాలనలో వుండిన గ్రామాలన్నీ తిరుమల తిరుపతి దేవస్థానం పాలనక్రింద వుండేవని, దేవస్థానంవారికి పాలంశిస్తు చెల్లిస్తుండేవారని, క్రమక్రమంగా ప్రభుత్వస్వాధీనమైనట్లున్నూ చెబుతారు.

శ్రీ కార్వేటినగరం మణెంగ్రారైన నగరం సుబ్బారెడ్డిగారు, పొన్నా కుళపారెడ్డిగారు, గాండ్ల తిరుమలయ్యతాతగారు, మరికొందరు గ్రామపెద్దలు కలిసి ఈ గుడిని నిర్మించినట్లు స్థానికులు చెబుతారు. ఈ గుడి పూజాది కార్యక్రమాలకు కొంతపొలం దేవునికి మాన్యంగా వుండేదని, అది యిప్పుడు పరుల స్వాధీనంలో వున్నదని ఆ ఊరిపెద్దలు చెబుతారు. కాని ఇప్పుడు గ్రామస్తులందరూ చందాలు వేసుకొని శ్రావణ, భాద్రపదమాసాలలో ప్రతి సంవత్సరం ధర్మరాజుల తిరునాళ్ళు ఒక్క వారంరోజులపాటు జరుపుతున్నారు.

ప్రస్తుతం ఈ గుడికి ధర్మకర్తగా శ్రీ నగరం సుబ్బారెడ్డిగారి వంశీకుడైన శ్రీ నగరం కృష్ణారెడ్డిగారు వ్యవహరిస్తున్నారు. రామాపురం గ్రామంలోని కొందరు ఉత్సాహవంతులు మహాభారతకథను వీధి నాటకంగా నేర్చుకొని ధర్మరాజుల తిరునాళ్ళు జరిగినన్నిరోజులు ప్రదర్శిస్తారు. తక్కిన సన్నివేశాలు, ఘట్టాలు అనాదిగా వస్తున్న ఆచారం ప్రకారమే జరుగుతాయి. వేదవ్యాస జననంతో ప్రారంభించి, ధర్మరాజు పట్టాభిషేకంతో ఈ ఉత్సవాలు పూర్తవుతాయి.

ఈ గ్రామంవారు మహాభారత వీధినాటకాల ప్రదర్శనకు కంగుందికుప్పం వీధి భాగవత కళాకారులను చాల అరుదుగా పిలిపిస్తుంటారు. వీరికి రాత్రి నాటకాల ప్రదర్శనకంటే భారత ఉత్సవాలు ముఖ్యం. తిరునాళ్లను ఘనంగా జరిపిస్తుంటారు. ఈ ఉత్సవాలు ఈనాటికీ ప్రతిసంవత్సరం క్రమం తప్పకుండా జరుగుతుంటాయి.

అనాదిగా చిత్తూరు జిల్లాలో బహుళ ప్రచారంలోవున్న తిరునాళ్లలో ఈ ధర్మరాజుల తిరునాళ్ళు అత్యంత ప్రాధాన్యం వహిస్తాయి.

## 3. ద్రౌపదమ్మగుడి : పుత్తూరు :

పుత్తూరు పట్టణం చిత్తూరుజిల్లాలో ఒక తాలూకా క్షేంద్రం. పుత్తూరు పట్టణానికి సమీపంలో చౌటూరు అను గ్రామం కలదు. ఆ గ్రామంలో మద్దూరు ధర్మారెడ్డిగారి కుటుంబం ఒకటి. వీరు చౌటూరు గ్రామం సమీపంలోగల తమ బావిలో పూడిక (మట్టి) తీస్తుండగా, ద్రౌపదమ్మ విగ్రహం లభించింది. ఆ విగ్రహాన్ని పుత్తూరుకుతెచ్చి 1850 ప్రాంతంలో ధర్మరాజుల గుడినిర్మించి, అప్పటినుండి ప్రతి సంవత్సరం ధర్మరాజుల తిరునాళ్ళు జరుపుతుండేవారు. ఈ ధర్మరాజుల గుడికి శ్రీ ధర్మారెడ్డిగారు ధర్మకర్తగా వుండి, ఉత్సవకార్యక్రమాలు నిర్విఘ్నంగా నిర్వహిస్తూ వుండేవారు. వీరి తరువాత వీరి కుమారుడు శ్రీ గోపాలరెడ్డిగారు ఈ ఉత్సవాలను జరిపించారు. మూడు తరాలుమారిన తరువాత ప్రస్తుతం స్థానికులైన శ్రీ సి.డి.భాస్కర మొదలి ధర్మకర్తగా ధర్మరాజుల తిరునాళ్ళు జరుపుతున్నారు.

పూర్వం పుత్తూరులో జరిగే ధర్మరాజుల తిరునాళ్ళకు కంగుందికుప్పం వీధి భాగవతులు సంపూర్ణ మహాభారతాన్ని వీధి నాటకాలుగా, కాంట్రాక్టు పద్ధతిలో ప్రదర్శించేవారు.

ఈ ధర్మరాజుల తిరునాళ్ళను, ద్రౌపదమ్మ ఉత్సవాలు, అగ్నితిరునాళ్ళు అని పిలుస్తారు. ఈ తిరునాళ్ళు శ్రావణ, భాద్రపదమాసాలలో ప్రతిసంవత్సరం సౌకర్యాన్నిబట్టి 7రోజులనుండి 15 రోజులవరకు జరుపుతారు. ఈ సందర్భంగా ప్రదర్శించే మహాభారతకథను

వేదవ్యాసజననం నుండి దుర్యోధనవధ వరకు ప్రదర్శన యోగ్యమైన ఘట్టాలను వీధినాటకాలుగాను, ప్రదర్శనకు వీలుకాని ఘట్టాలను హరికథా భాగవతారులచేత పగటికథలుగాను చెప్పించేవారు. అన్నిప్రాంతాలలోవలెనే ఇక్కడకూడ కొడియెక్కడంతో ఉత్సవాలు ప్రారంభిస్తారు. ఈ కార్యక్రమాలలో అలుగునిలపడం ముఖ్యఘట్టం.

పుత్తూరులో కంగుంది కుప్పంవారేగాక, సూరికాపురం భాగవతులుకూడ ధర్మరాజుల తిరునాళ్ళలో వీధి నాటకాలు ప్రదర్శిస్తూ వుండేవారు. 1965లో పుత్తూరులో చినరాజకుప్పం మునస్వామి"శ్రీ వేంకటేశ్వర నాట్య మండలి" అను పౌరాణిక నాటక సమాజాన్ని స్థాపించారు. వీరిని పంబలమునస్వామి అనికూడా పిలుస్తారు. ఈయనకు "కలియుగ భీముడు" అను బిరుదు కలదు. పై సమాజంలో శ్రీ బత్తెన్న, శ్రీ భక్తవత్సలం, శ్రీ కుప్పిరెడ్డి, శ్రీ సి.వెంకటస్వామి, శ్రీ నారాయణస్వామి, శ్రీ ఆర్.కుప్పస్వామి, శ్రీ లోకయ్య, శ్రీ గురవయ్య, శ్రీ ఎ.వి.పాండ్యన్, శ్రీ పూడి అర్జునయ్య మొదలగువారు ముఖ్యసభ్యులుగాను, నటులుగాను వుండేవారు.

ప్రస్తుతం "శ్రీ వేంకటేశ్వర నాట్యమండలి" శ్రీ మేఘవర్ణంగారి ఆధ్వర్యంలో నడుపబడుతూవుంది. ఈ సమాజంలో శ్రీ కె.జి.రామచంద్రారెడ్డి-ఎల్లంవారి పల్లె, శ్రీ ఆల్ల దొరస్వామి రెడ్డి, శ్రీ కొండమిందపల్లె నరసింహులు శెట్టి, శ్రీ పలమనేరు సాంబయ్య, శ్రీ పనబాకం రామకృష్ణయ్య శ్రీ వేపనపల్లి కృష్ణయ్య, శ్రీ తిరుపతి గురవయ్య, శ్రీ గూళూరు మణి, శ్రీ కదిరిమంగళం జగ్గయ్య, శ్రీ దుర్గం శ్రీనివాసులు, శ్రీ దుర్గం గోపాలం, శ్రీ బొంతలకండ్రిగ శ్రీనివాసులు, శ్రీ అన్నామలై" మొదలగువారు నటులుగా వున్నారు. వీరు సంపూర్ణ భారతాన్ని 30రోజులు వీధినాటకాలుగా ప్రదర్శించడానికి శిక్షణ పొందియున్నారు. వీరు పుత్తూరు ధర్మరాజుల తిరునాళ్లకేగాక, తిరుపతి పశ్చిమ రైల్వేస్టేషన్ దగ్గర జరుపబడే ధర్మరాజుల తిరునాళ్ళకు, శ్రీ కాళహస్తి, చంద్రగిరి మొదలగు ఇతర ప్రాంతాలలో జరుగు ధర్మరాజుల తిరునాళ్ళలో కూడ వీధి నాటకాలను ప్రదర్శిస్తున్నారు.

పుత్తూరుకు సమీపంలోగల నారాయణవనం అను గ్రామంలో ధర్మరాజుల తిరునాళ్ళు జరుపుతున్నారు. ఇక్కడ శ్రీ భాగవతం రంగయ్యగారి ఆధ్వర్యంలో శ్రీ కుమ్మరి చిన్నబ్బ, శ్రీ వడమాలపేట చిన్నబ్బ, ఇంకా కొందరు స్థానికులైన యువకులతో మహాభారతకథను వీధినాటకాలుగా ప్రదర్శిస్తున్నారు.

## 4. ధర్మరాజుల తిరునాళ్ళు : పాపానాయుడు పేట

1840 ప్రాంతంలో చిత్తూరుజిల్లాలోని పాపానాయుడుపేట గ్రామంలో ధర్మరాజులగుడిని నిర్మించారు. ఈ గుడికి శంగుంద మొదలియార్ల సంఘం అండదండలు మొదటినుండి వుండేవి.

శ్రీ వళత్తూరు కుట్టియప్ప మొదలి, శ్రీ కృష్ణప్ప మొదలి, శ్రీ రంగప్ప మొదలి, శ్రీ రామస్వామి మొదలి, శ్రీ మురగప్ప మొదలి, శ్రీ రంగనాథ మొదలి" మొదలగు గ్రామపెద్దలు ప్రతిసంవత్సరం క్రమం తప్పకుండ ధర్మరాజుల తిరునాళ్ళు జరిపిస్తుండేవారు. ఈ ఉత్సవాలకు సూరికాపురం వీధి భాగవతులు వీధినాటకాలను ప్రదర్శించేవారు. వీరు పాత పద్ధతులలో తేలికైన కొయ్యతో వేషాలకు తగిన ఆభరణాలు తయారుచేసికొని, నాటకాలను ప్రదర్శించేవారు.

పాపానాయుడుపేటలో ధర్మరాజుల తిరునాళ్ళు ఆగష్టు మాసంలో జరుగుతుంది. వరలక్ష్మీవ్రతానికి 7 రోజులుందనగా కొడియెక్కి, ఉత్సవం ప్రారంభిస్తారు. 7 రోజులనుండి 15రోజుల వరకు భారతోత్సవాలు నిర్వహింపబడేవి.

1987 నుండి పాపానాయుడుపేట ధర్మరాజుల గుడి ప్రభుత్వట్రస్టు బోర్డు క్రిందికి వచ్చింది. ప్రస్తుతం తెలుగు కైకలవారు ఈ కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. శ్రీ తంబా గోపాల మొదలి ధర్మరాజుల గుడికి ప్రభుత్వట్రస్టు బోర్డు చేర్మన్‌గా నియమితులైనారు.

శ్రీమతి. సదాశివమ్మ, శ్రీ ఎన్. దామోదరం శెట్టి, శ్రీ వి. ముత్తుకన్నప్ప మొదలగువారు బోర్డు సభ్యులుగావుంటూ, ఉత్సవ కార్యక్రమాలను నిర్విఘ్నంగా నిర్వహిస్తున్నారు. శ్రీ విశ్వనాథంగారు పాపానాయుడుపేట వాస్తవ్యులు. వీరు కొన్నాళ్ళు పురాణం పగటికథగా చెపుతుండేవారు. ప్రస్తుతం వీరికుమారుడు శ్రీ గోవిందుగారు పురాణం చెబుతున్నారు.

ఇక్కడ భారత ఉత్సవాలు చిత్తూరుజిల్లా అన్ని ప్రాంతాలలో జరిగిన విధంగానే జరుగుతాయి.

## 5. ద్రౌపదమ్మ తిరునాళ్ళు : పాకాల

'పాకాల' చిత్తూరుజిల్లాలో గల ఒక పెద్ద రైల్వేకూడలి. ఇక్కడ వంద సంవత్సరాలకు పైబడిన పురాతన ధర్మరాజులగుడి కలదు.

పాకాల అనుగ్రామంలో నిర్మింపబడింది. ఈ గుడిలోని విగ్రహాలు దారువిగ్రహాలు. ఇవికూడా పురాతనమైనవే. వెంకట్రమణ నాయుడుగారు గతించిన తరువాత వారిసోదరులు శ్రీ చిన్నలక్ష్మయ్య నాయుడుగారు ధర్మరాజుల తిరునాళ్ళు నిర్వహించేవారు. ప్రస్తుతం పాకాల మండల ప్రెసిడెంటు శ్రీనారాయణస్వామి చౌదరిగారు ధర్మకర్తలుగా ఈ ఉత్సవాలు నిర్వహిస్తున్నారు. పాకాల దగ్గర శ్రీ చౌదరిగారి పొలాలలో ఒకపుట్ట వుత్పన్నమైంది. ఆ పుట్టలో దేవతానాగసర్పం ఉన్నట్లును, ఆ ప్రాంతపు ప్రజలు పుట్టచుట్టు తిరిగి పూజలు చేస్తారని, నాగదేవత వారుకోరిన కోర్కెలు తీరుస్తుందని వారినమ్మకం. శ్రీనారాయణస్వామి చౌదరిగారు ప్రతి శుక్రవారం పుట్టకు స్వంతంగా పూజలు నిర్వహిస్తున్నారు. 1960నుండి 30సంవత్సరాలుగా శ్రీ చౌదరిగారు ప్రతి సంవత్సరం క్రమంతప్పకుండా వారి స్వంతపొలంలోగల నాగపుట్టదగ్గర భారతోత్సవాలు జరిపిస్తున్నారు. దారు విగ్రహాలకు వెలిసిపోయిన రంగులు వేయించి, రిపేరులు చేయించి, పెద్దపాకాలనుండి పాండవుల విగ్రహాలు, ద్రౌపదమ్మ విగ్రహం తెప్పించి, పాకాలలో 27రోజులు ఉత్సవాలు జరిపిస్తారు. అలుగు నిలుపు పద్ధతి ఇక్కడవుంది. ద్రౌపదమ్మమీద భక్తితో ఆడ, మగ, పిల్లలు చివరిరోజున అగ్గి తొక్కుతారు. ఈ ఉత్సవాలకు కార్యవర్గసభ్యులంటూ ఎవరూలేరు. ఈ ఉత్సవాలను పాకాలమండల ప్రెసిడెంటు శ్రీనారాయణస్వామిగారొక్కరే జరిపిస్తూ వుంటారు. ఈ గుడికి మడిమాన్యాలేవీ లేవు. శ్రీ చౌదరిగారే అన్నిఖర్చులు భరించి, ఉత్సవకార్యాలు నిర్వహిస్తున్నారు.

ఉత్సవాలు జరిగేటప్పుడు పూర్వం 60 సంవత్సరాలు కంగుందికుప్పం వీధి భాగవతులు మహాభారతాన్ని వీధి నాటకాలుగా ప్రదర్శించారు. ఆ తరువాత "పుత్తూరు, పలమనేరు, సూరికాపురం, పల్లిపట్టు, కూర్మయ్యగారి వడ్డేపల్లి"వారు వచ్చి వీధి నాటకాలు ప్రదర్శిస్తున్నారు.

పాకాలలో జరిగే ధర్మరాజుల తిరునాళ్ళు తక్కిన చిత్తూరుజిల్లా ప్రాంతాలలోవలెనే జరుగుతాయి.

## 6. అగ్గి తిరునాళ్ళు : కార్వేటినగరం :

కార్వేటినగరం చరిత్ర ప్రసిద్ధమైన ఒక చిరుపట్టణం. చిత్తూరుజిల్లా, పుత్తూరు తాలూకాలో వున్న "కార్వేటినగరం" సూర్యవంశపురాజుల యేలుబడిలో రాచరికపు ప్రాభవాన్ని చవిచూచింది.

ఒకనాడు ఈ కార్వేటినగరంలో అత్తాకోడండ్రయిన లక్ష్మి, సరస్వతులు యెంతో అన్యోన్యంగా మసలుకున్నారు. సంగీత, సాహిత్య, శిల్ప కళలు కళామతల్లికి నీరాజనం పట్టిన రోజులవి. కఠారి సాళ్వభూపాలుని కఠారులకు సానపెట్టిన పోతుగడ్డ. కవితాలతాంగి ఝుళం ఝుళత్కటక సూచిత వేగపదారవిందమై విహరించిన పుణ్యధామం. సురకాంతల సౌందర్య సౌరభాలను శిలలపై మలిపించుకున్న సుందరసీమ. సారంగపాణి పదముల సంగీతంలో సలలిత రాగ సుధారసాన్ని పానంచేసిన రమ్యభూమి కార్వేటినగరం. సమున్నత పర్వతసానువుల మధ్య, రమణీయ ప్రకృతికాంత ఒడిలో సౌభాగ్య భాగ్యములతో, సిరులు చిందించిన సీమను రంగ రంగ వైభోగంగా ఇనవంశాబ్ధి ఉద్భవ సోములు జనరంజకంగా పరిపాలించారు.

ఇటువంటి వైభవ, ప్రాభవాలకు ప్రసిద్ధికెక్కిన కార్వేటినగరంలో అనాదిగా "అగ్గి తిరునాళ్ళు" పేర భారతమహోత్సవాలు ప్రతియేటా నిర్వహింపబడుతుండేవి. ఆంధ్రులకు ఆరాధ్యదైవం రాముడైతే, అభిమానకావ్యం శ్రీమదాంధ్ర మహాభారతం. తెలుగునాట ప్రతియింటా మహాభారతకావ్యం ప్రత్యక్షమౌతుంది. ఆంధ్రుడైన ప్రతివానినోట మహాభారతం పలుకుతుంది. పురాణపఠనంచేసి పారమార్థిక లబ్ధిని పొందగోరేవారు, రాగయుక్తంగా పద్యాలు పాడి పరవశించేవారు, భారత పాత్రల ఆకారాలతో వీధి నాటకాలుగా ఆడి ఆనందించేవారు. యావదాంధ్రలో చిత్తూరుజిల్లాలోనే అధికంగా వున్నారంటే అతిశయోక్తి కానేరదు. చిత్తూరు మండలవాసులు ధర్మస్వరూపుడైన ధర్మరాజును దేవుడుగా ఆరాధిస్తారు. ద్రౌపదమ్మను దేవతగా కొలుచుకొంటారు. అందుకే యెక్కడా యెక్కువగా కనిపించని ధర్మరాజుల దేవాలయాలు చిత్తూరు ప్రాంతంలో అత్యధికంగా గోచరిస్తాయి. ఇటువంటి దేవాలయాలదగ్గర శతాబ్దాల క్రితంనుండి పద్దెనిమిది రోజులకు తక్కువగాకుండా "ఇరవైఒక్క రోజులు", ఇరవై ఐదురోజులు," "ముప్పైరోజులు" వారి వారి ఆర్థిక స్థోమతననుసరించి "భారత మహోత్సవాలు" నిర్వహిస్తారు. ఈప్రాంతంవాళ్ళు ఈ ఉత్సవాలను "మహాభారత యజ్ఞం"గా చెప్పుకుంటారు. ఈ విధంగా భావించడానికి ఒకకారణం గోచరిస్తుంది. సనాతన వైదిక మతంలో యజ్ఞయాగాది క్రతువులను ఆచరించే హక్కు ఒక్క అగ్రవర్ణానికే భుక్తమై యుండేది. ఆ కారణంగా తక్కిన తక్కువ వర్ణాలవారందరు సమైక్యంగా ఈ భారత యజ్ఞాన్ని నిర్వహించుకొనేవారని ఊహింపవచ్చును. ఈ విధంగా ఈ భారతయజ్ఞాన్ని చిత్తూరుజిల్లాలో ప్రతి సంవత్సరం 150 ప్రాంతాలకుపైగా నిర్వహిస్తున్నాయి. భారతోత్సవాలకు "భారతమని, ద్రౌపదమ్మ తిరునాళ్ళని, ధర్మరాజుల తిరునాళ్ళని, అగ్గి తిరునాళ్ళని నామాంతరాలు గలవు.

భారత ఉత్సవాలలో " భారతకథా శ్రవణం, వీధినాటక ప్రదర్శన, అగ్నిప్రవేశం" ముఖ్యమైన అంగాలు. కార్వేటినగరం అగ్గి

తిరునాళ్ళలో రాచరికపు దర్పం, విలక్షణమైన ప్రాంతీయ ప్రభావం గోచరిస్తాయి. లప్పెట్లు, తాళాలు, దరువులు, తుడుము, పంబ, తాషా, గంటలగస్తు, గొల్లల పిల్లనగ్రోవి బృందనాట్యాలు ఆనాటి జానపద వేడుకలకు ఈనాటికీ అద్దం పడుతున్నాయి. రోజులు గతించినా, సంస్థాన వైభవం సమసిపోయినా, వివిధ నిద్దెలను, సుద్దులను చెప్పే పెద్దలు కన్నుమూసినా పరంపరగా వస్తున్న ప్రాచీన సంప్రదాయాలు, ఆచారాలు ఇప్పటికీ ఆదరింపబడుతూనే వున్నాయి. ఇవి ప్రాంతీయ సంస్కృతికి మచ్చుతునకలు.

కార్వేటినగరంలో అగ్గి తిరునాళ్ళను కమిటీవారు నిర్వహిస్తారు. ఈ ఉత్సవాలు ఉత్తరాయణ పుణ్యకాలంలో నిర్వహింపబడతాయి. ప్రతి సంవత్సరం" శ్రీ ద్రౌపదీదేవి సమేత ధర్మరాజులవారి బ్రహ్మోత్సవం"కులాలవారీగా యెంతో ఐకమత్యంతో రోషాలు, ద్వేషాలుమాని మహావైభవంగా జరుపుతారు. ఒక శుభముహూర్తాన ధ్వజారోహణంతో ప్రారంభించి, పాండవజననం, పాండవ విద్యాభ్యాసం, లాక్షాగృహదహనం, బకాసురవధ, ద్రౌపదీకళ్యాణోత్సవం, ద్రౌపదీ వస్త్రాపహరణం, రథోత్సవం, సైంధవ వధ, అర్జునుని తపస్సు, ఉత్తరగోగ్రహణం, అలుగునిలుపుట,, దుశ్శాసన దుర్యోధనుల వధ, అగ్ని ఉత్సవం, ఏకాంతసేవ, వసంతోత్సవం, ధ్వజావరోహణము" వరకు పదకొండు రోజులపాటు యెంతో సంబరంగా భారత యజ్ఞాన్ని నిర్విఘ్నంగా నెరవేరుస్తారు.

తిరునాళ్ళలో మొదటిరోజు ధ్వజారోహణాది ఉత్సవాలు జరిపేవంతు యాదవులది. పదిరోజుల ఉత్సవకాలంలో రోజూ మధ్యాహ్నం రెండు గంటలనుండి సాయంకాలం ఆరు గంటలవరకు ఆదిపర్వంతో ప్రారంభించి, స్వర్గారోహణ పర్వంవరకు మహాభారత కథాశ్రవణం జరుగుతుంది. ఏ కథాభాగాన్ని మధ్యాహ్నం విన్నారో ఆ భాగాన్నే రాత్రి వీధి భాగవతులు వీధి నాటకంగా ప్రదర్శిస్తారు. ఈ వీధినాటకం రాత్రి తొమ్మిది గంటలకు ప్రారంభమై ఉదయం ఐదు గంటలవరకు సాగుతుంది. ఈ ఉత్సవాలలో చుట్టు ప్రక్కల గ్రామాల ప్రజలు సమధికోత్సాహంతో పాల్గొంటారు. దేవాలయ ప్రాంగణంలోనే రంగస్థలాలను యేర్పాటు చేసుకొని "కోడిపందెములు, చెడుగుడు ఆటలు, బాణాకర్రలు, కుస్తీలు, ఉప్పర పట్టెలు, వెన్నెలకుప్పలాటలు, కోలాటాలు, పిల్లంకట్టెల బృంద నృత్యాలు" ఆడుతారు. అనుకూలమైన ఋతువులో ఇంత కోలాహలంగా జరిగే మహోత్సవం కార్వేటినగరంలో మరొకటిలేదు. ఈ అగ్గి తిరునాళ్ళ యెంత కాలంనుండి జరుగుతున్నవో యెవ్వరికీ తెలియదు. ద్రౌపదమ్మ గుడిపూజలు అగ్నికులక్షత్రియులకు వంశపారంపర్యంగా సంక్రమించిన హక్కు.-ఈ గుడిలో వీరు నిత్యదీపారాధన చేస్తుంటారు.

భారతకథా శ్రవణం దేవాలయ ముఖమంటపంలో సాగుతుంది. ఈ మంటపంలో చక్కనిరంగులతో అలంకరించిన పంచపాండవుల దివ్యమంగళ విగ్రహాలను ధర్మరాజు విగ్రహంతప్ప తక్కిన ద్రౌపది, భీమ, అర్జున, నకుల, సహదేవ, శ్రీకృష్ణ, పోతరాజు విగ్రహాలను ఉచిత స్థానాలలో అమర్చి వుంచుతారు. పోతరాజు ఉదంతం తెలుగు భారతంలో యెక్కడా ప్రస్తావింపబడలేదు. ధర్మరాజు విగ్రహాన్నిమాత్రం యెట్టి పరిస్థితులలోను గర్భగుడినుండి వెలుపలికి తీసుకొనిరారు. ఈ ఉత్సవాలలో కంగుందికుప్పం వీధి భాగవతులు కాంట్రాక్టు పద్ధతిలో వీధి నాటకాలను ప్రదర్శించేవారు.

కార్వేటినగరానికి ఆగ్నేయదిశలో ఒక సుందరమైన "స్కందపుష్కరిణి" అనబడే కొత్తగుంట కలదు. దీనిని శ్రీవేంకట పెరుమాళ్ళరాజు నిర్మించినట్లు చెబుతారు.తిరునాళ్ళు ప్రారంభమైన నాటినుండి ప్రతిరోజు ఉదయం, సాయంత్ర సంధ్యవేళలలో మేళతాళాలతో పోతరాజు పుష్కరిణినుండి పవిత్రోదకం తెచ్చి అమ్మవారికి అందిస్తారు.

సాయంత్రం ఏడుగంటలకు భీమునివేషధారి దున్నపోతులు కట్టిన బండిని చక్కగా అలంకరించి, వీధులవెంట ప్రతియింటికి వెళ్ళి భోజనపదార్థాలు "రకరకాల పిండి వంటలు, పప్పుకూడు, నేతికుండలు, గుడంబు, పెరుగుకడవలు," సేకరించి, బండినిండా ప్రోగుచేసి, గదాయుధాన్ని త్రిప్పుతూ, వీరగీతాలు పాడుతూ, ఊరివెలుపలికి వెళ్ళి, బకాసురుని వధించినట్లు నటించి, తోటిమిత్రులతో కలిసి బండి కుంభ మారగించి, విజయగర్వంతో బండిపైన దేవాలయం చేరుకుంటాడు.

మరొకఘట్టం అర్జునుని తపస్సు. ఈ ఉత్సవం శుక్రవారం ఉదయం జరుగుతుంది. పాశుపతాస్త్రంకోసం అర్జునుడు ఇంద్రకీలాద్రిపై తపమాచరించి, పరమేశ్వరుని మెప్పించి, పాశుపతాస్త్రాన్ని పొందుతాడు. పర్వతానికి ప్రతీకగా ఒక పొడవైన తాళవృక్షాన్ని పాతుతారు. దానికి ఇరువైపులా మేకులతో సోపానాలు అమర్చుతారు. అర్జునుడు తపోదీక్షతో చెట్టును అధిరోహిస్తాడు. చెట్టుచివర అర్ధవృత్తాకారంగా అమర్చిన ఆసనంమీద ఆసీనుడై తపస్సు ప్రారంభిస్తాడు. దిగువ కిరాతరూపంలో వచ్చిన పార్వతీసమేత పరమేశ్వరుడు నరునితో పోరు ప్రారంభిస్తాడు. తపస్సును విజయవంతంగా ముగించి, కోటి సూర్యప్రభల కాంతిపుంజాలతో ప్రకాశించే పాశుపతాస్త్రాన్ని పొంది, ఆనందోత్సాహాలతో అర్జునుడు చుట్టూచేరిన వేలాది జనసందోహంమీద నిమ్మపండ్లు, పుష్పాలు వెదజల్లుతాడు. పండ్లు, పుష్పాలు దొరికినవారికి కోరుకున్న కోరికలు ఫలిస్తాయని జానపదులకు నమ్మకం. అర్జునుడు పరమశివుని ప్రార్థిస్తే ఆదిదంపతులు నిజరూపాలతో ప్రత్యక్షమవుతారు. తరువాత

పార్వతీ సమేతుడైన పరమేశ్వరుడు నందివాహనారూఢుడై, పురవీధులలో ఊరేగుతూ, ఇంటింటా నారికేళ నీరాజనాలు అందుకుంటాడు.

ఆరోజు సాయంత్రం ఉత్తరగోగ్రహణం. వీధి నాటకం ప్రదర్శించే కౌరవ వేషధారులు సందెవేళ గోవులను అడ్డగిస్తారు. పాండవులు కౌరవులను ఓడించి, పశువులను సురక్షితంగా ఇండ్లకు మరలిస్తారు. అదేరోజు రాత్రి గుడిలో మూలవిగ్రహం ముందు అలుగు నిలుపుతారు. చిన్న మట్టిదుత్తమీద మంత్రజలంతో పూజచేసి, సుమారు మీటరు పొడవున్న అడ్డకత్తిని నిలబెడతారు. ఈ సన్నివేశం చూచేవారికి యెంతో ఆశ్చర్యాన్ని, భక్తిని కలిగిస్తుంది. ఆ విధంగా నిలపెట్టిన అలుగునిలిస్తేనే ఆనాటినుంచి జరగవలసిన ఉత్సవాలను జరుపుతారు. నిలువకుంటే అమ్మవారు ఆగ్రహించినారని గ్రామమంతా భయభ్రాంతులతో తల్లడిల్లిపోతుంది.

ధ్వజారోహణమైన తొమ్మిదవరోజు శనివారం అతిముఖ్యమైన పర్వదినాలలో ఒకటి. ఆ రోజు భీమదుర్యోధనుల గదాయుద్ధ ఘట్టం ప్రారంభమౌతుంది. పౌరాణికుడు కురుక్షేత్రయుద్ధంలో చివరిదైన దుర్యోధనుని ఊరుభంగ సన్నివేశాన్ని కళ్యాణమంటపంలో చెబుతుంటాడు. వీధినాటకంలో ఆరుబయట సుమారు 30-35 అడుగుల పొడవు 4-5 అడుగుల యెత్తుగలిగి శయనాకార భంగిమలో తయారుచేయబడిన దుర్యోధన, దుశ్శాసనుల మట్టిబొమ్మలుంటాయి. చిగురాకుపొడి, ఎఱ్ఱమట్టిపొడి, బొగ్గుపొడి, ముగ్గుపిండి, ఇటుకపొడి, పసుపుపొడి, సున్నము మొదలైన రంగులతో దుర్యోధనుని, దుశ్శాసనుని అలంకరిస్తారు. ఒక మట్టిముంతలో పసుపు, సున్నము కలుపగా తయారైన యెఱ్ఱరంగునీళ్ళతో ముంతనునింపి, మట్టిబొమ్మ దుర్యోధనుని తొడలో పూడ్చిపెట్టి, రంగునీళ్ళు ముంతగల ప్రాంతాన్ని సులభంగా గుర్తు పట్టేటట్లు అక్కడ ఒక గుర్తు నుంచుతారు. భీముడు కోపోద్రిక్తుడై తన గదాయుధంతో మట్టిముంత వున్నచోట దుర్యోధనుని తొడపై కొడతాడు. ముంతపగిలి నెత్తురువలె భాసించే ఎఱ్ఱని నీరు వెలుపలికి వస్తుంది. భీముని శపథం నెరవేరుతుంది. దుశ్శాసనుని కవోష్ణ రక్తంతో ద్రౌపదికురులు ముడి వేయబడతాయి. ద్రౌపదికురులు ముడిచిన సన్నివేశాన్ని పురస్కరించుకొని అమ్మవారికి కర్పూర నీరాజనాలు, నారికేళార్చనలు జరుగుతాయి. వెంటనే ద్రౌపదమ్మను భర్తలతోకూడ మూలస్థానానికి చేరుస్తారు. అక్కడ గుమిగూడిన ప్రజలు దుర్యోధన, దుశ్శాసనరూపాలను కసిదీరా కాలరాస్తారు. మరునాడు ఆదివారం "అగ్ని వసంతోత్సవదినం". అగ్గితిరునాళ్ళ పరాకాష్ట. వసంతద్రౌపదీదేవిని అలంకరించి పసుపుగుడ్డలో అగ్గిపోసి వడిబాలకడ్తారు. ఆ గుడ్డ కాలదు. అంతా అమ్మవారి మహిమ అని అక్కడిప్రజలు నమ్ముతారు. వందలకొలది వ్రతశీలురు భక్తిప్రపత్తులతో అమ్మవారి అనుమతిని, అంగీకారాన్ని అందుకొని కంకణధారులై అగ్నిప్రవేశం చేస్తారు. ఈ వ్రతంలో స్త్రీలు పాల్గొనరు. బ్రాహ్మణులు, హరిజనులుకూడ ప్రత్యక్షంగా పాల్గొనరు.

అగ్గితొక్కడం పూర్తయిన తరువాత అమ్మవారు సకలాలంకార శోభితయై, రంగరంగవైభోగంగా ఊరేగుతారు.

సోమవారం ఏకాంతసేవ. స్త్రీ, శాంతిపర్వాల కార్యక్రమం శోకసంతప్త మానసావృతమైన వాతావరణాన్ని సూచిస్తూ ప్రశాంతంగా, నిబ్బరంగా సాగుతాయి, సోమువారం ఉత్సవాలు. ఇవి అగ్గితిరునాళ్ళ ముగింపు వుత్సవాలు.

అనాదిగా కార్వేటినగరంలో జరుగు అగ్గితిరునాళ్ళకు సంస్థానాధిపతులైన సూర్యవంశరాజుల అండదండలు పుష్కలంగా వుంటూవచ్చాయి. చిత్తూరుజిల్లాలో జరుగు అగ్గి తిరునాళ్ళలో కార్వేటినగరంలో జరిగే అగ్గి తిరునాళ్ళకు ఒక ప్రత్యేకత వుంది. సంస్థానాలు కాలగర్భంలో కలిసిపోయినా, రాజుల అండదండలు లేకపోయినా, పురజనుల సహకారం, చుట్టుప్రక్కల గ్రామాల చేయూత వుండడంతో నేటికీ ఈ అగ్గితిరునాళ్ళు కార్వేటినగరంలో పురాతన పద్ధతులలోనే నిర్వహింపబడుతూ వున్నవి.

.................................................................................................................................

ఈ వ్యాసానికి ఆధారం అంతర్జాతీయ మాసపత్రిక "తెలుగువాణి" లో ప్రచురింపబడిన ఆచార్య శ్రీ విశ్వనాథ అరుణాచలంగారి వ్యాసం-సౌజన్యంతో.

## నాటకం:—

ఈ జగమే ఒక నాటకరంగం. మానవులందరూ నటులు. నటులను ఆడించే సూత్రధారుడు భగవంతుడు. అందుకే ఆయనకు "జగన్నాటక సూత్రధారి" అని పేరు.

"ఆంగికం భువనం యస్య వాచకం సర్వవాఙ్మయమ్
ఆహార్యం చంద్రతారాది తం వందే సాత్త్వికం శివమ్"

"ఎవనికి సమస్త లోకము ఆంగికమో, సర్వవాఙ్మయము వాచకమో, చంద్ర తారాదులు ఆహార్యమో అట్టి పరమశివునికి నమస్కరించుచున్నాను". అనగా "పరమేశ్వరుడు సాత్వికాభినయంగల ఒక మహానటుడైతే, సర్వజగత్తు ఆయనకు అభినయము, సమస్త వాఙ్మయము ఆయనకు సంభాషణలు, చంద్రుడు, తారలు ఆయనకు వేషము. అట్టి మహానటునికి నమస్కరిస్తున్నాను" అని అర్థం.

నానాభావోప సంపన్నం నానావస్థాంత రాత్మకమ్ ।
లోకవృత్తాను కరణం నాట్యమేతన్మ యాకృతమ్ ॥

అనేక భావాలను అనేక అవస్థలను, లోకవృత్తంతో రూపించుట నాట్యం. నాట్యమే నాటకం.

నాటకం నటప్రయుక్తం. నటనము అభినయ ప్రకాశితము. అభినయాన్విత లోకవృత్తమే నాటకం.

నాటక రంగస్థలంమీదనున్న నటీనటులు నాటక కథాపాత్రలకు ప్రతినిధులు. పాత్రావస్థలను అనుకరించి నటించువారు నటులు. నటులచే ప్రయోగింపబడునది నాటకం. లోకవృత్తమును రంగభూమిపై ప్రదర్శింపబడునది కావున "నాటకం" దృశ్యము, లేక "ప్రేక్షణీయము" అయినది.

నయనానందకరమైన నాటక ప్రదర్శనను "చాక్షుషక్రతువు" అంటారు.

"నాటకాంతం హి సాహిత్యమ్" సాహిత్యంలో శ్రేష్ఠమైనది, పరిణతి చెందినది, చివరిదశ "నాటకం" అని సంస్కృత ఆలంకారికుల అభిప్రాయం.

"కావ్యేషు నాటకం రమ్యమ్"

కావ్యాలలో "నాటకం" చాల రమ్యమైనది. ప్రేక్షకలోకాన్ని రంజింపజేయునది.

"విశ్వశ్రేయః కావ్యమ్"

విశ్వశ్రేయస్సును కాంక్షించేది కావ్యం.

"కావ్యం ఉపదేశయుజే...."

కావ్యానికి సదుపదేశం లక్ష్యంగా వుండాలన్నది ఆలంకారికుల మతం.

కావ్యాలు రెండు రకాలు.

1. శ్రవ్యకావ్యాలు.
2. దృశ్యకావ్యాలు.

1. శ్రవ్యకావ్యాలను చదవడంచేత, వినడంచేత రసార్ద్ర హృదయులైన పాఠకులకు మాత్రమే రసాస్వాదన సాధ్యమవుతుంది.

2. దృశ్యకావ్యాలను ప్రవీణులగు నటులు ప్రదర్శించునపుడు చూచిన ప్రేక్షకులు ఆబాలగోపాలం ఆనందసాగరంలో ఓలలాడుదురు. నటుడు యే అవస్థను పొందితే ప్రేక్షకులుకూడా అదేయవస్థను పొంది, రసానుభూతిని పొందుతారు. అందుకే "పదిమార్లు చదవడంకంటె ఒక్కమారు వినడం శ్రేష్ఠం. పదిమార్లు వినడంకంటె ఒక్కమారు చూడడం శ్రేష్ఠం" అని పెద్దలు చెబుతుంటారు.

చూడడంవలన సన్నివేశాలు హృదయానికి హత్తుకొనిపోయి రసానందం కలుగుతుంది.

"నాటకం సమాహారకళ"

'సాహిత్యం, సంగీతం, నృత్యం, వాద్యం, శిల్పం, చిత్రలేఖనం" వంటి లలితకళల సమిశ్రిత రూపం నాటకం.

నాటకానికి సాహిత్యం ఇతివృత్తాన్ని (కథావస్తువు), సంభాషణలను, గీతాలను, పద్యాలను సమకూరుస్తుంది. సంగీతం చక్కని స్వరకల్పన గావించి, వీనులవిందైన గంధర్వగానాన్ని ప్రసాదిస్తుంది. నృత్యం కన్నులపండువైన నాట్యాన్ని అందిస్తుంది.వాద్యం నాటకానికి అనుగుణమైన వీణా, వాయులీన, హార్మోనియం వంటి జంత్రసంగీత తరంగాలతోను, మృదంగ వాయిద్యోచిత జతులతోను, నాట్యవిదుషీమణుల కింకిణుల మంజులనిస్వనాలకు లయబద్ధమైన సంగీతాన్ని సమర్పిస్తుంది. శిల్పం అప్సరసలను తలదన్నే నాట్యకోవిదుల హావ, భావ, భంగిమలను వ్యక్తీకరిస్తుంది. చిత్రలేఖనం నటీనటుల ఆహార్యానికి ఆధారభూతమవుతుంది.

ఈ విధంగా లలితకళల సమ్మిశ్రిత సమాహార కళే "నాటకం".

ఒకప్పుడు లోకపాలురు బ్రహ్మదేవునిగూర్చి తపస్సుచేసి, క్రీడనీయము, (మనస్సునకాకర్షణీయము) చూడడానికి, వినడానికి యోగ్యమైన వినోదవస్తువును సృష్టించి యిమ్మని ప్రార్థించిరట.

"క్రీడనీయక మిచ్ఛామోదృశ్యం శ్రవ్యం చ యద్భవేత్" – నాట్యశాస్త్రము

అది ధర్మప్రతిపాదితమైనదిగా వుండాలని కోరారట.

సృష్టికర్త వారికోరికను మన్నించి, సమాధిస్థితుడై, చతుర్వేదాలను స్మరించి, "ఋగ్వేదం" నుండి పాఠ్యమును, "సామవేదం" నుండి సంగీతాన్ని, "యజుర్వేదం" నుండి అభినయాన్ని, "అథర్వణవేదం" నుండి రసాన్ని గ్రహించి నాట్యవేదాన్ని సృష్టించి, దానికి పంచమవేదము అని నామకరణం చేశాడట.

శ్లో॥ ధర్మమర్థ్యం యశస్యంచ సోపదేశ ససంగ్రహమ్
భవిష్యతశ్చ లోకస్య సర్వకర్మాను దర్శకమ్
సర్వశాస్త్రార్థ సంపన్నం సర్వశిల్ప ప్రవర్తకమ్
నాట్యాఖ్యం పంచమం వేదం సేతిహాసం కరోమ్యహమ్".

## నాట్యశాస్త్రము

"ధర్మప్రతిపాదకము, చదుర్విధ పురుషార్థసాధకము, యశస్కరము, ఉపదేశసహితము, సమ్యక్ జ్ఞానప్రదము, ముందు తరాలవారికి సత్కార్మ సమార్గ ప్రదర్శకము, సర్వశాస్త్రార్థసంపన్నము, సర్వశిల్ప ప్రవర్తకము, ఇతిహాస సహితము అగునట్లుగా నాట్యమనెడి పంచమవేదము"ను బ్రహ్మ సృష్టించినాడు.

ఇట "నాట్యము" అనగా నాటకం అను అర్థాన్ని గ్రహించవలసి వున్నది. నాటకము ఉపదేశ, వినోదాత్మకమైనది.

నాటకం సకలజనులను ఆకర్షించే ఉత్తమ సాహిత్యప్రక్రియ. ఈ నాటక కళ "అమరావలికి కనులకింపగు యజ్ఞం" అని కాళిదాసు "మాళవికాగ్నిమిత్ర" నాటకంలో అభివర్ణించాడు. "హృది దనియించు నాట్యమిల నెల్లరనున్ రుచిభేద చిత్తులన్" అని శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు అనువదించారు.

## నాటకోత్పత్తి : (Origin of Drama)

నాటకానికి 'రూపకము' అను నామాంతరము కలదు. రూపక శబ్దం సామాన్య వాచకం. ఇంగ్లీషులో Drama, Play అను పదాలకు సమానార్థకం.

నాటక (రూపక) ఆవిర్భావ సిద్ధాంతాలు:

### 1. అనుకరణ ప్రవృత్తి సిద్ధాంతం :

మానవుడు అనుకరణశీలి. పుట్టుకతోనే ఆతనికి అనుకరణశక్తి అలవడుతుంది. పసిపాపగా వున్నప్పుడే పెద్దలమాటలు, నడక, రకరకాల చేష్టలు అనుకరించవలెనన్న కోరిక ప్రగాఢమవుతుంది. అప్పుడే సాధన మొదలవుతుంది. అప్పటినుండే 'నటన' ప్రారంభమవుతుంది.

మానవునికి ఇతర మానవులవలె నటించాలన్న అభిలాష, మానవ జీవితాన్ని దర్శించి చూపాలన్న ఆకాంక్ష, సాటి మానవునివలె జీవించేశక్తి జన్మతః అలవడింది. నాటకం మానవ జీవితంనుండి సహజంగా ఆవిర్భవించినదని తెలుస్తూవుంది. అందుకే పెద్దలు "జగన్నాటకం" అన్నారు.

"All the world is a stage and all men and women are merely actors"అని ప్రపంచానికి, నాటకానికి అభిన్నత్వాన్ని చూపించారు.

### 2. శ్రమ సిద్ధాంతం :

శ్రమలోనుండి 'కళ' ఆవిర్భవించిందని కొందరు లాక్షణికులు సిద్ధాంతీకరించినారు.

ఎస్కిమోలు 'సీల్' జంతువును వేటాడడానికి 'సీల్' లాగా శ్రమించి ప్రాకుతూ వేటాడేవారట.

### 3. దేవపూజ సిద్ధాంతం :

గ్రామదేవతల జాతర్లలో మానవులు త్రాగి చిందులు వేసేవారు. ప్రత్యేక దుస్తులు ధరించేవారు. ఈ తంతు క్రమంగా రూపకంగా రూపొందిందని చరిత్రకారుల అభిప్రాయం. ఈ అభిప్రాయాన్ని గ్రీకు నాటకోత్పత్తి బలపరుస్తుంది.

### గ్రీకు నాటకోత్పత్తి :

ప్రాచీన 'గ్రీసు' దేశంలో ప్రతిసంవత్సరం రెండు తడవలు "డెమెటర్" (Demeter) లేదా "డయానిసస్" (Dionysus) లేదా "బాకస్" (Bacchus) అను దేవతనుగూర్చి ఉత్సవాలు జరిగేవి. ఈ ఉత్సవాలలో దేవాలయంముందు యెత్తైన వేదికపై 50మందికి పైగా బృందగాయకులు కూర్చుండి, ఆయా దేవతలనుగూర్చి పాటలు పాడేవారు. సంగీతంతోబాటు ఆ దేవతల పుట్టుపూర్వోత్తరాలను, మహిమలను అభివర్ణిస్తూ కథారూపంలో గానంచేసేవారు.

ఈ బృందగానానికి కీర్తనలు రచించే రచయితే సూత్రధారుడుగా వ్యవహరించేవాడు.

"థెస్పిస్' (Thespis) అను కళాకారుడు గాయకులనుండి సూత్రధారుని వేరుచేసి, నటుని సృష్టించాడు.

గాయకుడు విశ్రాంతి తీసికొను సమయంలో 'ప్రతిశీర్షం' (Mask) ధరించిన నటుని "థెస్పిస్" ప్రవేశపెట్టినాడు. ఈ నటుడు తనహాస్యంతో ప్రేక్షకులను ఆనందింప జేసేవాడు.

తరువాత ఈ గాయకులకు పల్లవినందిస్తూ, కథను నడపసాగినాడు. క్రమంగా 'నాంది, ప్రస్తావనలు, సంభాషణలు' చొప్పించి, ఈ బృందగానాలను 'థెస్పిస్' "రూపకం"గా రూపొందించినాడు.

ఈ ప్రక్రియ క్రమక్రమంగా మార్పుచెందింది.

"ఇస్కిలస్" అను నాటకకర్త ఇద్దరు నటులను ప్రవేశపెట్టినాడు. దీనితో గ్రీసుదేశంలో అసలురూపకం ఆవిర్భవించింది.

Demeter = డెమెటర్
Dionysus = డయానిసస్ ప్రాచీన గ్రీసుదేశ దేవతలు
Bacchus = బాకస్
Thespis = థెస్పిస్ : సూత్రధారుని సృష్టించిన కళాకారుడు
Mask = మాస్క్ : ప్రతిశీర్షము

Aeschylus= ఇస్కిలస్ : నాటక రచయిత. ఇతను ఇద్దరు నటులతో మొదట నాటకాన్ని రూపొందించిన గ్రీసుదేశ నాటకరచయిత.

## భారతీయ సిద్ధాంతాలు :

### 1. వేద సంవాద సిద్ధాంతం :

"ఋగ్వేదము" సంస్కృతభాషలోనేగాక ప్రపంచంలో అన్నిభాషలలోనూ ఆదిగ్రంథంగా పరిగణింపబడుతున్నది. ఇందులో 15 సంవాదక 'సూక్తాలు' గోచరిస్తాయి. వీనిలో కొన్ని ఇద్దరిమధ్య జరిగిన సంవాదక సూక్తాలు.

ఉదా : యమయమి సంవాదము, ఊర్వశీపురూరవ సంవాదము.

మరికొన్ని ముగ్గురిమధ్య జరిగిన సంవాదకసూక్తాలు.

ఉదా: ఇంద్రుడు, అతిథి, వామదేవుడు సంవాదము. అగస్త్యుడు, లోపాముద్ర, వారికుమారుడు సంవాదము.

యజ్ఞయాగాది క్రతువులలో ఋత్విక్కులు ఆయా సంవాదములను పురస్కరించుకొని రెండుమూడు బృందాలుగా యేర్పడి, వాటిలో ఒక్కొక్కపాత్ర పాఠ్యాన్ని ఒక్కొక్క బృందం పఠించేవారని, ఋత్విక్కులు ఆయా పాత్రల వేషధారణ కూడా చేసికొనేవారని, ఇట్టి సంవాదాలనుండే క్రమంగా రూపకం ఆవిర్భవించిందని కొందరుపండితులు అభిప్రాయపడ్డారు.

సంవాదములేగాక ఏకపాత్రవాచిక సూక్తాలుకూడా ఋగ్వేదంలో ఉన్నట్టు తెలుస్తుంది.

ఉదా : ఇంద్రుడు సోమపాన మత్తుడై తుళ్ళుతూ, తూలుతూ సోమరస ప్రాశస్త్యాన్ని ప్రశంసించే సూక్తాలు కొన్ని కనిపిస్తాయి. యాగానంతరం "ఋత్విక్కు" ఇంద్రవేషంలో వచ్చి ఈ సూక్తాన్ని పఠించేవాడట.

వర్షాపేక్షతో మండూక కరాళాలు ధరించి మండూక సూక్తం పఠిస్తూ నృత్యం చేసేవారట.

వేదక్రతువుల్లో నాటకీయతను ద్యోతకంచేసే ప్రదర్శనలు గోచరిస్తాయి. ఇటువంటి ప్రదర్శనలలో సోమరస విక్రయ గాథ ఒకటి. సోమరస విక్రేతను ఖరీదు ఇవ్వకుండా రాళ్లతో కొట్టడం ఈ సోమరస విక్రయగాథలో ఇతివృత్తం. ఇదేవిధంగా జూదరులకు సంబంధించిన గాథ ఒకటి కలదు.

"యజుర్వేదం"లో పశుమేధ విభాగంలో నరబలిని నటించేవారని కొందరు భావిస్తున్నారు. యజ్ఞసమయంలో ఋత్విక్కులు ఇంద్రాది దేవతల వేషాలు ధరించి పూజలందుకొనేవారు.

భారతీయ నాటకాలలో ప్రాధాన్యం వహిస్తున్న సంగీత, నృత్యాలు సామవేదంనుండి వచ్చాయి.

ఈ దృష్టాంతాలనుబట్టి రూపకం వేదాలనుండే ఆవిర్భవించిందని పండితుల అభిప్రాయం.

## 2. భరతముని సిద్ధాంతం :

పూర్వం కృత, త్రేతాయుగ సంధికాలంలో సర్వజనులు "కామ, క్రోధ,లోభ, మోహ, మద, మాత్సర్యా"లను అరిషడ్వర్గాలకు బానిసలై అధర్మపరులుకాగా, ధర్మప్రతిష్ఠాపనోద్దేశంతో ఇంద్రాది దేవతలు "దృశ్యము, శ్రవ్యము, చతుర్వర్ణములవారు పాల్గొన తగినది అయిన క్రీడావిశేషాన్ని ఒకదానిని సృష్టించి యిమ్మని చతుర్ముఖుని ప్రార్థించారట.

బ్రహ్మ తత్వవిదుడై చతుర్వేదాలను స్మరించి పంచమవేదాన్ని సృష్టించి, దానికి "నాట్యవేదం" అని పేరుపెట్టాడు. ఈ విషయం నాట్యశాస్త్రం పూర్వాధ్యాయంలో తెలియజేయబడింది.

బ్రహ్మ నాట్యవేదాన్ని భరతమునికి ఉపదేశించి, ప్రయోక్తవు కమ్మని ఆశీర్వదించాడు. భరతముని ఈ నాట్యవేదాన్ని తన నూర్గురు కుమారులకు బోధించాడు.

స్త్రీపాత్రధారణకు "మంజుకేశి" మొదలైన 24మంది అప్సరసలను బ్రహ్మ సృష్టించాడు. "ఇంద్రధ్వజ మహోత్సవ" సమయంలో "అసురపరాజయము" అను రూపకాన్ని ప్రదర్శించాడు. ఇది బ్రహ్మరచించిన రూపకం. ఈ రూపకాన్ని చూస్తున్న రాక్షసులు కోపోద్రిక్తులై నాటక ప్రదర్శనానికి ఆటంకం కలిగించడానికి ప్రయత్నించగా ఇంద్రుడు తనధ్వజంతో వారిని కొట్టి, ప్రదర్శనకు భంగం కలుగకుండా కాపాడినాడట.

భరతముని శివుని యెదుట 'సముద్రమధనము', 'త్రిపుర దాహము' అను రెండు రూపకాలను ప్రదర్శించాడట. శివుడు సంతోషించి 'తాండవము'ను వారికి బోధించగా, పార్వతి లలితమగు "లాస్యము"ను బోధించిందట.

తరువాత నహుషుని ఆహ్వానంపై భరతముని కుమారులు భూలోకానికి వచ్చి, నాటక ప్రదర్శన విధానాన్ని మానవులకు నేర్పినారని తెలుస్తుంది.

ఈ విధంగా రూపకం ఆవిర్భవించి, వ్యాప్తిచెందినట్లు భరతముని సిద్ధాంతం తెలియజేస్తుంది.

## 3. శారదా తనయుని సిద్ధాంతం :

కల్పాంతమందు శివుడు సర్వలోకాలను లయింపజేసి, (భస్మీపటలం చేసి) ఆనందతాండవమాడి, మనస్సంకల్పంతో తిరిగి బ్రహ్మను, విష్ణువును సృష్టించినాడట. పరమశివుని ఆజ్ఞప్రకారం సృష్టికర్త అన్నిలోకాలను సృష్టించి, పరమేశ్వరుని పురావృత్తమును ప్రత్యక్షంగా దర్శింప గోరినాడట. అప్పుడు నందికేశ్వరుడు నాట్యవేదాన్ని సప్రయోగంగా బోధించి, దానిప్రకారం ఒక రూపకాన్ని నిర్మించి నటులకు నేర్పినయెడల వారి రూపక ప్రయోగంవలన ప్రాక్తన కర్మలు ప్రత్యక్షమవుతాయని తెలియజేస్తాడు.

బ్రహ్మ నాట్యవేదం లభించినందుకు సంతోషించి, "త్రిపురదాహము"అను రూపకాన్ని రచించి, ప్రయోగింపజేశాడు. దానిని వీక్షిస్తున్న బ్రహ్మ చతుర్ముఖాలనుండి నాలుగు వృత్తులు, శృంగారాది నాలుగు ప్రధాన రసములు ఉద్భవించాయి.

నహుషుడు బ్రహ్మపదవినలంకరించినప్పుడు, ఆయన కోరికపై భరతముని కుమారులు భూలోకానికి వచ్చి నాటక ప్రయోగసాధనాన్ని

నేర్పి, రూపక ప్రదర్శనను ప్రతిష్టితం చేశారని ఈ సిద్ధాంతం తెలుపుతుంది.

### 4. పురాణకాలక్షేప సిద్ధాంతం :

భారతదేశంలో ప్రతిగ్రామంలోను, పట్టణంలోను సామాన్యంగా రాత్రులందు పురాణకాలక్షేపం జరగడం పరిపాటి. వర్షాలు పడకపోయినప్పుడు రామాయణంలోని సుందరకాండగాని, భారతంలోని విరాటపర్వంగాని పురాణం చెప్పించడం ఆచారం. ఈ పురాణకాలక్షేపంలో ఒకరు పురాణ గ్రంథంలోని రెండు శ్లోకాలను లేదా పద్యాలను చదివి, వానిలోని అర్థాన్ని ప్రేక్షకులకు పౌరాణికుడు వివరించి చెబుతూ వుంటాడు. శ్లోక, పద్యార్థాలకు అనుగుణమైన హావ, భావ,చేష్టలతో స్పష్టమైన ఉచ్ఛారణతో విశదీకరిస్తూ, ఒక రసమయ ప్రపంచాన్ని సృష్టించి, ప్రేక్షకలోకాన్ని ఆనందసాగరంలో ఓలలాడిస్తాడు. కథాసందర్భాన్నిబట్టి పాత్రలు ఆనందిస్తూవుంటే ప్రేక్షకులు ఆనందిస్తారు. పాత్రలు కష్టాలను అనుభవిస్తూవుంటే ప్రేక్షకులు అందులీనమై కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తారు. పాత్రపరమైన నటన ప్రేక్షకులను స్పందింపజేస్తుంది.

పురాణకాలక్షేప ప్రక్రియలో పౌరాణికుడు ఇతివృత్తంలోని పాత్రలనన్నింటిని తానొక్కడే అభినయిస్తూ ప్రేక్షకులను నవ్విస్తున్నాడు.. ఏడిపిస్తున్నాడు.

ఇట్టి పురాణపఠనంనుండి ఒక్కొక్కపాత్రను ఒక్కొక్క వ్యక్తి (నటుడు) నటించడంతో ప్రారంభమై రూపకం (నాటకం) ఆవిర్భవించిందని కొందరు పండితులు అభిప్రాయపడ్డారు.

### 5. జాగీర్దార్ సిద్ధాంతం :

పురాణాలు సూతుని కథాకథనంతో రూపొందాయి. వానిలో "సూతఉవాచ, శ్రీకృష్ణఉవాచ" అని కొంతవరకు సాగిన తరువాత తిరిగి "సూత ఉవాచ" అని వస్తుంది. ఇందులో "భీష్మ, భీమార్జున, శ్రీకృష్ణ, ద్రౌపది" ఇత్యాదులు భారత కథలోని పాత్రలు. సూతుడు మాత్రం పాత్రకాదు. ఎవరు యెవరితో చెప్పుచున్నారో సూచించి, సూతుడు రంగంనుంచి నిష్క్రమిస్తాడు. ఆ తరువాత భీష్మాది పాత్రలమధ్య సంభాషణ సాగుతుంది. ఈ సంభాషణ ముగిసిన తరువాత ఇంకొకపాత్ర మాట్లాడబోయేముందు సూతుడు మరల ప్రవేశించి, కొత్తపాత్రను పరిచయంచేసి, తాను తప్పుకుంటాడు. ఈ ప్రక్రియ పురాణంలో ఆదినుండి అంతంవరకు సాగుతుంది. ఈ పురాణప్రక్రియ నుండి 'రూపకం'ఆవిర్భవించిందని జాగీర్దార్ సిద్ధాంతం.

పురాణంలోని "సూతుడు" నాటక "సూత్రధారిగా" మారినాడు. పురాణంలోవలె సూత్రధారుడు మధ్యమధ్యలో ప్రవేశించకుండా, నాటక ప్రారంభంలో ప్రస్తావనను, నాటకాంతంలో భరతవాక్యమును పలుకుతున్నాడు.

సూతునిపాత్ర పరిచయాదులను, ప్రవేశనిష్క్రమణ సూచనలను, పూర్వాపర కథా సంవిధానమును నాటకంలో ప్రస్తావన, విష్కంభాలు నెరుపుతున్నవి.

బ్రహ్మ పంచమవేదమనబడే నాట్యవేదాన్ని సృష్టించి ఇంద్రునితో "నాట్యాఖ్యం పంచమం వేదం సేతిహాసం కరోమ్యహమ్" అని నాట్యాన్ని (నాటకం) ఇతిహాస సహితంగా సృష్టించినట్లు చెప్పడం, సంస్కృత రూపక కథలన్నీ ఇతిహాస, పురాణాలనుండి గ్రహించినవి కావడం ఈ సందర్భంలో గమనించతగ్గ విషయం.

సర్వకావ్యాలకు వృత్తులు మాతృకలని భరతముని సిద్ధాంతం. వృత్తి అనగా వ్యాపారం. వృత్తులు నాలుగు విధాలు.

అవి.
1. భారతీ వృత్తి
2. సాత్త్వతీ వృత్తి
3. ఆరభటీ వృత్తి
4. కైశికీ వృత్తి

1. భారతీ వృత్తి:- వాగ్రూప వ్యాపారం భారతీ వృత్తి-అనగా వాచికాభినయం.
2. సాత్త్వతీ వృత్తి:- మనోవ్యాపారం సాత్త్వతీ వృత్తి-అనగా సాత్త్వికాభినయం.
3. ఆరభటీ వృత్తి:- చేష్టావ్యాపారం ఆరభటీ వృత్తి-అనగా ఆంగికాభినయం.
4. కైశికీ వృత్తి:- పై మూడు వృత్తులలోని శోభ మొత్తం కైశికీ వృత్తి.

సూతుడు సూత్రధారుడుగా పరిణమించడంలో నాలుగు వృత్తులకు అనుగుణమైన నాలుగుదశలు కనిపిస్తున్నవి.

1. సూతుడు పౌరాణిక, ఐతిహాసిక కథలు చెప్పడం. – భారతీ వృత్తి (వాచికం)
2. సూతుడు ఇతర గాయకులతో కలిసి కథ చెప్పడం. – సాత్త్వతీ వృత్తి (సాత్వికాభినయం)
3. పౌరాణిక ఇతివృత్తాలు గాన, నృత్యాలతో కూడిన రంగాలుగా విభజించడం. – ఆరభటీ వృత్తి (ఆంగికాభినయం)
4. సూతుడు ఆహార్యంతో, నటితో కలిసి సంభాషణాపూర్వకముగా కథ చెప్పడం. – కైశికీ వృత్తి (ఆహార్యం)

ఈ విధంగా రూపకానికి అవసరమైన చతుర్విధాభినయములు సూత–సూత్రధార పరిణామంలోని నాలుగు దశలకు అనుగుణం కావడంవల్ల పురాణాల నుండే 'రూపకం' పుట్టినదని "జాగీర్దార్" నిర్ధారించినాడు.

### 6. మౌల్టన్ సిద్ధాంతం :

ఆదిమానవుడు అనాగరక దశలో సుఖదుఃఖాలను నేటి నాగరకునివలె తనలోనే అణుచుకోకుండా ఉద్ధృత క్రియారూపంలో బహిర్గతం చేసేవాడు. ఆనందాతిశయంలో ఆదిమానవుడు వేసిన చిందులనుండి నృత్యం ఆవిర్భవించింది. ఆనందపారవశ్యంలో అతడి హృదయాంతరాళంనుండి వెలువడిన ఆలాపనే సంగీతానికి తొలిరూపం. కష్టసుఖాలను సాటిమానవునికి వ్యక్తపరచాలనే హృదయ స్పందనతో చేసిన ప్రయత్నంనుండి వెలువడిన మాటల సముదాయమే కవిత్వానికి మూలం.

ప్రపంచంలో ప్రప్రథమంగా వెలువడిన రూపకాలు సంగీత, సాహిత్య, నృత్య సమిశ్రితాలు కావడంవల్ల, ఆదిమానవుని ఆలాపన, విలాప హృదయస్పందననుండి వెలువడిన పలుకుల, ఆవేశపూరితమైన చిందులనుండే రూపకం అవతరించిందని "ప్రొఫెసర్ మౌల్టన్" (Moulton) సిద్ధాంతీకరించినారు.

ఆది గ్రంథమైన ఋగ్వేదంలో ఆనాటి మానవుల సుఖదుఃఖాలనుండి వెలువడిన "సంగీత, కవిత్వ, నృత్యాలు" చిత్రితమవడం గమనించదగిన విషయం.

ఇవి రూపకావిర్భావ విషయంలో స్థూలంగా వెలువడిన భారతీయ సిద్ధాంతాలు.

నాటకం – నటప్రయుక్తం

సంగీత, సాహిత్య, నృత్య, శిల్ప, చిత్రలేఖన, వాయిద్యాది లలితకళల సమిశ్రిత రూపమే రూపకము. (నాటకం.)

సమాహారకళ

## నాటకోత్పత్తి (Origin of Drama) సిద్ధాంతాలు.

1. అనుకరణ ప్రవృత్తి సిద్ధాంతం
2. శ్రమ సిద్ధాంతం
3. దేవపూజ సిద్ధాంతం

## గ్రీకు నాటకోత్పత్తి

భారతీయ సిద్ధాంతాలు

1. వేదసంవాద సిద్ధాంతం
2. భరతముని సిద్ధాంతం
3. శారదా తనయుని సిద్ధాంతం.
4. పురాణ కాలక్షేప సిద్ధాంతం.
5. జాగీర్దార్ సిద్ధాంతం.
6. మౌల్టన్ సిద్ధాంతం.

వృత్తి = వ్యాపారము.

జాగీర్దార్ సిద్ధాంతంలో వృత్తులు నాలుగు.

1. భారతీ వృత్తి (వాచికాభినయం)
2. సాత్త్వతీ వృత్తి (సాత్త్వికాభినయం)
3. ఆరభటీవృత్తి (ఆంగికాభినయం)
4. కైశికీ వృత్తి ( ఆహార్యం, అలంకరణ)

అన్వయము :

సూతుడు సూత్రధారుడుగా పరిణామం చెందడంలో నాలుగువృత్తులకు అనుగుణమైన నాలుగు దశలు గోచరిస్తాయి.

1. సూతుడు పౌరాణిక,
ఐతిహాసిక కథలు చెప్పడం. - భారతీ వృత్తి (వాచికం)

2. సూతుడు ఇతర గాయకులతో కలిసి కథలు చెప్పడం - సాత్త్వతీవృత్తి (సాత్త్వికం)

3. పౌరాణిక ఇతివృత్తాలు గాన, నృత్యములతోకూడిన రంగాలుగా విభజించడం - ఆరభటీ వృత్తి (ఆంగికం)

4. సూతుడు ఆహార్యంతోవచ్చి నటితోకలిసి సంభాషణా పూర్వకంగా కథచెప్పడం - కైశికీ వృత్తి (ఆహార్యం)

## రూపక నిర్వచనము : (Definition of Drama)

రూపక సాహిత్యప్రక్రియను ఇంగ్లీషులో "డ్రామా" (Drama)అని, "ప్లే" (Play) అని వ్యవహరిస్తారు. Drama అనునది గ్రీకు పదం. Drama = A thing done. Drama అనగా "చేసిన పని" అని అర్థం. ఈ పదం "చేయు" (to do)అను ధాతువునుండి పుట్టింది.

"రూపకం" క్రియలను లేదా కార్యవ్యాపారాలను చేసే మానవులను చూపుతుంది" అని 'అరిస్టాటిల్' అభిప్రాయపడ్డాడు.

"రూపకరచన అంటే మానవప్రకృతికి దర్పణం పట్టడమే"

"To hold as it were the mirror upto nature" - Shakespeare.

Hemlet Act-3. Scene-2

"A plot ought to be just and lively immage of human Nature representing its passions and humours and image o fortune to which it is subjected, for the delight and instruction of manking.

Jhon Dryden - An essay on Dramatic Poesy.

("రూపకం మానవ ప్రకృతికి సరియైన, సజీవమైన ప్రతిబింబం కావలెను. ఆదిమానవ ప్రకృతిలోని మార్పులను మానవాళి వినోదంకోసం హితోపదేశంకోసం ప్రతిబింబింప చేయవలెను.")

రూపకము మానవ ప్రకృతికి ప్రతిబింబమనే భావాన్ని సంస్కృతలాక్షణికులుకూడా తెలియజేశారు.

శ్లో: "నానాభావోప సంపన్నం నానావస్థాంతరాత్మకమ్
లోకవృత్తాను కరణం నాట్యమేతన్మయా కృతమ్
యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖసమన్వితః
సోఽయం గాదభినయోపేతో నాట్యమిత్యభిధీయతే"

-నాట్యశాస్త్రం-1-112-119

"అవస్థానుకృతి ర్నాటకమ్" ధనంజయుడు-దశరూపకము-1-6-7.

"Imitate things as they ought to be" ("వస్తువులు ఏ విధంగా వుండవలెనో అట్టిదానిని అనుకరించవలెను")Aristatle (అరిస్టాటిల్)"A work of act produces its original not as it is in itself but as it appears to the senses". ('కళాఖండం మూలంలో ఉన్నదానిని ఉన్నట్లుకాక ఇంద్రియాలకు గోచరించిన విధంగా పునఃసృష్టిగావించడం")

Butcher-Theory of Poetry and Fine Arts.P.127

"Imitation ------- is a creative act"

("అనుకరణ సృజనాత్మక క్రియ")

Butcher : Theory of Poetry and Fine Arts.P.154

"The poet first derives inspiration from the world by the power of imagination; the art of poetry then imitates this imaginative inspiration in language."

Eber Krambi (ఏబర్‌క్రాంబి) Principles of literary criticism.P.86.(కవి ముందుగా తన భావనా శక్తిద్వారా ప్రపంచంనుండి ఆవేశాన్ని పొందుతాడు.'కవితాకళ' ఈ భావావేశాన్ని భాషతో అనుకరిస్తుంది.)

ఇది అరిస్టాటిల్ భావమని పై వ్యాఖ్యాత తెలియజేశాడు.

కవిత్వం పునఃసృష్టేకాని కేవలం అనుకరణకాదని వ్యక్తమవుతుంది.

సంస్కృతలాక్షణికులలో మొదటివాడుగా పరిగణింపబడుతున్న "ఆనందవర్ధనుడు" "అపారే కావ్యసంసారేకవిరేవ ప్రజాపతిః" అని తెలియజేశాడు.

"కవిసృష్టి బ్రహ్మసృష్టినికూడా మించినదని" మమ్మటుడు వర్ణించాడు.

"నాసృషిః కురుతే కావ్యమ్"అని భట్టతౌతుడు చెప్పాడు. ఈ సంస్కృత లాక్షణికులు చెప్పిన విషయాలను గమనిస్తే 'కవిక్రియ"ను సృష్టిగానే భావించినట్లు స్పష్టమవుతుంది. "అవస్థానుకృతిర్నాటకమ్' అన్న ధనంజయుడు "యద్వాౢ ప్యవస్తు కవి భావక భావ్యమానం తన్నాస్తి యన్న రసభావముపైతిలోకే" - దశరూపకము.4-85

("కవి భావకులచే భావ్యమానమైన రసముగా గాని, భావముగా గాని పరిణతి చెందలేదు.)

అని తెలియజేయడంలో కవిది కేవలం అనుకరణము కాదని ధనంజయుని అభిప్రాయమైనట్లు స్పష్టమవుతుంది.

నాటక (రూపక) ప్రయోజనము :

"For the delight and instruction of man kind" - Dryden

"హితోపదేశ జననం, ధృతిక్రీడాసుఖాదికృత్" "వినోద కరణంలోకే నాట్యమే తద్భవిష్యతి" అని భరతముని చెప్పడంలో "ఆనందము, హితోపదేశము" రూపక పరమాశయాలుగా వ్యక్తమవుతుంది.

"అనుకృతిని చూసి ఆనందించే ప్రవృత్తి మన అందరిలో నిక్షిప్తమై వుంది"

Aristatle-Poetics

"The Drama is not the image of life but the essence we must condence"-Lavoes Agri Art of Dramatic writing.P.166

"ఉద్వేగమే జీవితం. జీవితమే ఉద్వేగం. అందువల్ల ఉద్వేగమే రూపకం. రూపకమే ఉద్వేగం" అని 'మాజిన్ యల్. మలియొనవస్కీ'అను విమర్శకుడు తెలియజేశాడు.

"Life is emotion; emotion is life therefore emotion is drama and drama is emotion"

వ్యక్తీకరించుకొను అవస్థాపరంపరను చిత్రీకరించునది రూపకము అని తెలియజేశాడు.

"The Drama presents sequence of a situations in which characters express themselves through what happens in them which they do or (even) fail to do"

Producing the Play.Part.II

నిజానికి మానవజీవితం పూర్తిగా ఆసక్తిదాయకమైంది కాదు. జీవితంలో కొన్నిఘట్టాలు మాత్రమే ఆసక్తిదాయకమైనవి. అవే జీవితానికి సారాంశము వంటివి, సంక్షిప్త రూపాలు కూడ. నాటకంలో కొన్ని నిజాలు భ్రమలుగా చూపించి, అనవసర విషయాలను విడిచిపెట్టి, నాటకాన్ని ప్రదర్శించినప్పుడే అది రక్తికడుతుంది. దీనిని గ్రీకువాదం అంటారు. ఇదే సర్వత్రా అభిలషణీయం, ఆచరణయోగ్యం.

రూపకం దృశ్యకావ్యం కావడంవల్ల రచయిత తానై నేరుగా యేదీ ప్రేక్షకులకు వ్యక్తీకరించడు. పాత్రల ద్వారానే వ్యక్తీకరిస్తాడు. వారి అవస్థాపరంపరను చిత్రించడమే రూపక లక్ష్యం. అందుకే ధనంజయుడు "అవస్థానుకృతి ర్నాటకమ్"అని నిర్వచించాడు.

మానవప్రకృతిలోని లోపాలను, సమాజంలోని లోపాలను ప్రతిబింబింప జేయడంద్వారా ప్రేక్షకులకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో నాటకం హితోపదేశం చేస్తూవుంటుంది.

ఈ నాటికీ ఒక కావ్యాన్ని పరిశీలించి, విలువకట్టేటప్పుడు అది సమాజానికి యెటువంటి సందేశాన్ని యిస్తూవుంది? మానవాభ్యుదయానికి ఆ కావ్యం యేవిధంగా దోహదం చేస్తుంది? అని ప్రశ్నించడం సర్వసాధారణమైంది. అందుకే అది శ్రవ్యకావ్యమైనా, దృశ్యకావ్యమైనా "కావ్యం ఉపదేశయుజే -- అన్నపరమాశయాన్ని లక్ష్యంగా జేసికొంటుంది. కవి ఈ ఆశయాన్ని దృష్టిలో వుంచుకొని కావ్యరచనకు ఉపక్రమిస్తాడు. అట్టి కావ్యాలే త్రికాలములందు సమాజంచేత ఆదరింపబడతాయి. కళ నిజంకాదు. "కళ అబద్ధం చెబుతూ నిజాన్ని బయటపెడుతుంది."-క్రమ్మెల్స్.

మానవుడు కష్టంలో, సుఖంలో, ఆనందంలో, అనురాగంలో హృదయంలో రగిలే వేదనలే కళగా మార్చుకునేవాడు. జీవితంలోని వ్యధలను భరింపలేని మానవహృదయం జీవితాన్ని ప్రతిబింబించే నాటకాన్ని చూచినప్పుడు రసానుభూతిని పొందుతుంది.

మానవుడు శిలాయుగంనుండి బయటపడ్డాడు. సామాజిక వ్యవస్థను ఏర్పాటు చేసుకున్నాడు. ప్రకృతిశక్తులను వశపరుచుకున్నాడు. శాస్త్రీయమైన విధానాలతో సామాజిక కృషిని సాగిస్తున్నాడు. నేటి వాతావరణంలో కళాస్వభావం సాంఘిక ప్రయోజనంవైపు పురోగమిస్తుంది. ఆ ప్రయోజనంతోనే నేటి సాంఘిక నాటకాలు ధారాళంగా ప్రదర్శింపబడుతున్నవి.

"సాంఘిక దురన్యాయాలను తుడిచిపెట్టేందుకు కళ"అన్నాడు ప్రఖ్యాత నటుడు రిచర్డ్ బర్టన్.

కాబట్టి సమాజ ప్రయోజనానికి సరియైన గొప్పసాధనం నాటకం.

నాటకం విజయవంతం కావడానికి "నిపుణుడైన కవి, ప్రసిద్ధము, పటిష్టమునైన ఇతివృత్తము (కథావస్తువు), సమర్థులు, చక్కటి క్రమశిక్షణ, నైపుణ్యముగల నటీనటులు, సరసులు, రసజ్ఞులు, సద్విమర్శచేయగల ప్రేక్షకులు, సహనశీలి, కార్యదక్షుడు, నాటకాభినివేశంగల ప్రయోక్త (Director), అనుకూల పరిస్థితులు" అవసరం.

"నాటకం విజయసిద్ధికి నిపుణుడైన కవి, గుణగ్రాహిణియైన పరిషత్తు (ప్రేక్షకులు) చక్కని కథావస్తువు, దక్షులగు నటులు అవసరము"-శ్రీహర్షకవి - ప్రియదర్శిక.

అవస్థ : కేవలం భౌతికావస్థమాత్రమే కాదు, మానసికావస్థ కూడ.

ప్రకృతి : Nature, Image

అనుకృతి : Representation

అనుకరణ: Imitation

అవస్థలు : Passions and humours.

Drama : చేసిన పని, A thing done

Aristatle : A drama writer (English)

(అరిస్టాటిల్) : ఇతడు Poetics అను గ్రంథాన్ని రచించినాడు.
(బుచ్చర్)Butcher: A drama critic :
(షేక్స్పియర్) Shakespeare: A famous English drama writer
John Drydon (జాన్ డ్రైడన్) : "An essay on dramatic poesy"అను గ్రంథాన్ని వ్రాశాడు.
Lajos (లాజోస్) : "Art of dramatic writing"అనుగ్రంథాన్ని రచించాడు.
మాజల్ ఎల్. మలియోనవస్కీ : ఆధునిక నాటక విమర్శకుడు.
గార్నర్ : ఆధునిక నాటక విమర్శకులలో ముఖ్యుడు.
ఎబర్ క్రాంబీ : అరిస్టాటిల్ రచించిన Poetics కు వ్యాఖ్యానం వ్రాశాడు.
భరతముని : నాట్యశాస్త్రాన్ని రచించాడు.
ఆనందవర్ధనుడు : సంస్కృతలాక్షణికులలో అగ్రేసరుడు.
మమ్మటుడు : సంస్కృత లాక్షణికుడు
భట్టతౌతుడు : సంస్కృత లాక్షణికుడు
ధనంజయుడు : "దశరూపకము" అను సంస్కృత నాటక లక్షణగ్రంథాన్ని రచించాడు.

రంగస్థల చరిత్ర–క్రమ వికాసము

శ్లో॥ నానా భావోప సంపన్నం నానా వస్థాంత రాత్మకమ్ ।
లోక వృత్తానుకరణం నాట్యమే తన్మయాకృతమ్ ॥
–భరతముని! నాట్యశాస్త్రం. 1–112–119

"పలువిధములగు భావములు కలదియు, పలువిధములగు అవస్థలు కలదియునగు లోకవృత్తము ననుసరించునది 'నాట్యము".

నాట్యమే నాటకము

ఈజిప్టు, బాబిలోనియా, గ్రీసు, రోము,భారత, చైనా దేశాలలో ప్రాచీనకాలమునందే నాటకము పుట్టినట్లు చరిత్ర చెపుతుంది.

మొట్టమొదటి నాటకం గ్రీసుదేశంలో ఆవిర్భవించింది. అక్కడినుండి పశ్చిమదేశాలకు వ్యాప్తిచెందింది. గ్రీసుదేశంలో లభించిన మొదటినాటకం క్రీస్తుపూర్వం 5వ శతాబ్దానికి చెందినది.

ఈ పాశ్చాత్య నాటకాలు అభివృద్ధిచెంది, కాలక్రమాన పలువిధములైన నాటక భేదాలుగా పరిణమించినవి.

అవి:– (1) విషాద, (2) ఆహ్లాద, (3) ప్రహసన, (4) దివ్యలీల,అద్భుత (5) మూకాభినయ, (6) ప్రతిశీర్షిక, గేయ, నృత్య, సంగీతం మొదలగునవి.

గ్రీకు సాహిత్యానికి సమానంగా తులతూగ గల్గినది భారతీయ సంస్కృతసాహిత్యం.

సంస్కృత సాహిత్యంలో తొలిగ్రంథం ఋగ్వేదం. అందు సంభాషణలతో కూడిన "ఊర్వశీ పురూరవ సంవాదము, ఇంద్ర ఇంద్రాణి సంవాదము, సరమాఫణి సంవాదము, యమాయమి సంవాదము" వంటివి కలవు. వేదకాలంనాటి ఈ సంవాదములు తరువాత వచ్చిన పరిణత నాటకాలకు మూలరూపాలని చెప్పవచ్చును". పోతుకూరి సుబ్రమణ్య శాస్త్రిగారు, భారతి–జూన్, 1944

భరతఖండంలో నాటక ప్రక్రియ క్రమవికాస పరిణామం చెందినట్లు మన పురాణేతిహాసాలవలన తెలుస్తుంది.

వాల్మీకి రామాయణమందలి శ్రీరామ పట్టాభిషేక ఘట్టంలో నట, నర్తక సంఘము, గాయనీ, గాయకులుండినట్లు క్రింది శ్లోకాన్ని బట్టి వ్యక్తమవుతుంది.

శ్లో॥ నటనర్తక సంఘానాం గాయకానాంచ గాయతమ్
యతఃకర్ణ సుఖావాచః సుశ్రావ జనతాతతః॥
–వాల్మీకి రామాయణం

"హరివంశము" అను గ్రంథంలో "ప్రద్యుమ్న వివాహ ప్రకరణం" మరియు [illegible] అను నాటకాలు ప్రదర్శించిన ప్రస్తావన కలదు.

క్రీ॥పూ॥ 4వ శతాబ్దంలో "పాణిని" నట సూత్రాలను గూర్చి తెలియజేశాడు.

క్రీ॥పూ॥ 2వ శతాబ్దంలో "పతంజలి" తన "మహాభాష్యము" సందు "కంసవధ, బలి బంధనము" అను నాటకాలను తెలియజేశాడు.

ఈ నిదర్శనాలనుబట్టి క్రీస్తు పూర్వం 1వ శతాబ్దంనాటికే భరతఖండంలో సంస్కృత నాటకాలు పరిపుష్టదశకు చేరుకున్నాయని భావించవచ్చును.

కాని ఇంతవరకు మనకు లభ్యమైన సంస్కృతనాటకం అశ్వఘోషుని 'శారిపుత్ర ప్రకరణము' మాత్రమే. ఇది శిథిలమైన నాటకం. ఇందు మరో రెండు నాటకాల శిథిల భాగాలు కలవు. ఈ కారణంగా అశ్వఘోషునికి పూర్వమే సంస్కృత నాటకరచన ఉండేదని తోస్తుంది. "శారిపుత్ర ప్రకరణము" బౌద్ధసాహిత్యంలో కనిపిస్తున్న నాటకం. బౌద్ధసాహిత్యంలో నాటకాలుగూడ ఉండినట్లు "బోధిసత్వ నాటకం, శారిపుత్ర ప్రకరణము" అను రూపకాలనుబట్టి తెలుస్తుంది.

తెలుగుదేశంలో అధిక ఆదరణ పొందిన ధర్మసంప్రదాయం బౌద్ధం. బౌద్ధమతం ఆంధ్రదేశంలో యెప్పటినుండి వ్యాపించిందో తెలియదు. కాని మౌర్యవంశస్థుడైన అశోక చక్రవర్తి కాలంనాటికే బౌద్ధమతం ఆంధ్రదేశంలో వ్యాపించియుండినట్లు ఆధారాలున్నాయి. ఆంధ్రదేశంలోని "అశ్మక" "శ్రావస్తి" తో కలిపే వర్తకమార్గాలు బుద్ధునినాటికే వున్నట్లు బౌద్ధవాఙ్మయం తెలుపుతుంది. దక్కను వాసియైన నటుడొకడు బుద్ధుని సమకాలికుడైన బింబిసార మహీపాలుని సమక్షంలో "మహాబోధి" వరకు బుద్ధుని జీవితాన్ని నాటకంగా రచించి, ప్రదర్శించాడని, దక్షిణాపథంనుండి వెళ్ళిన మరికొందరు నటులు "శోభావతి" నగరాధిపతి సమక్షంలో "బుద్ధుని" నాటకాన్ని ప్రదర్శించారని బౌద్ధ గ్రంథాలు తెలియజేస్తున్నవి. ఈ ఆధారాలను బట్టి నాటకరచన, నాటక ప్రదర్శన బుద్ధుని కాలం నాటికే అనగా క్రీ.పూ.6వ శతాబ్దం నాటికే ఆంధ్రదేశంలో వున్నట్లు తెలుస్తుంది.

సంస్కృతనాటకాలు గ్రీకు నాటకాలకు అనుకరణములని ఒక వాదం వుంది. కాని అది నిరాధారం.

సంస్కృతలాక్షణికులు స్థూలదృష్టితో నాటకాలను రెండు తెగలుగా విభజించారు.అవి. 1.మార్గనాటకాలు 2.దేశినాటకాలు

1. మార్గనాటకాలు నాగరిక సమాజానికి సంబంధించినవి. అనగా నాగరికత అభివృద్ధి చెందిన నగరసమాజానికి మాత్రమే పరిమితమైంది. ముఖ్యంగా ఇవి సంస్కృత నాటకాలని చెప్పవచ్చు.

2. దేశినాటకాలు నాగరికత అభివృద్ధి చెందని అనాగరిక సమాజానికి సంబంధించినవి. అనగా పల్లెపట్టులందలి జానపద సమాజానికి పరిమితమైనది.

"సంస్కృత నాటకములు దేశినాటకములకు భిన్నములు. సంస్కృతభాషా స్వరూపమును తెలిసికొనుట అందరికీ అసంభవము. సమాజమున ఉన్నతస్థాన మందున్న అల్పసంఖ్యాకుల కొరకే మార్గనాటకము లుద్భవించినవి. సంస్కృతనాటకము కేవలమొక వర్గమువారి కళాభిరుచికి, హాస్యవినోదక్రీడకు ఆకరమై యున్నది. సామాన్యజనులతో వీనికే సంబంధము లేదు." - ఎ.బి. కీత్.

దేశినాటకాలలోని "కొంటె కోణంగి" వంటిపాత్రలు సంస్కృత నాటకాలలో ప్రవేశించి, క్రమంగా "విదూషక ' పాత్రరూపం దాల్చివుండవచ్చును.

యక్షగానములు:

తెలుగు దేశి నాటకాలలో "యక్షగానము" అత్యంత ప్రముఖ స్థానం వహించింది. మొదట పామర జనరంజకమై, క్రమక్రమంగా రాజమర్యాదలందుకున్న నాటకకళ యక్షగానం. సాహిత్యపరంగా యక్షగానం రాగ, తాళ ప్రాధాన్యంగల శ్రవ్య లేక దృశ్య రూపమైన రచన. యక్షగానమునే కులవృత్తిగ బ్రతుకువారు జక్కులవారు. వీరు ఆంధ్రదేశ ప్రాచీన జాతులలో 'యక్షులు' అనబడే ఒక తెగకు చెందినవారు.

యక్షగానము మొదటిదశలో గేయనృత్య ప్రాధాన్యం గలది. రెండవదశలో సంవాదరూపంగా మార్పుచెందింది. మూడవ దశలో నాటకాకృతిని దాల్చి, వీధి నాటకంగా మార్పుచెందింది.

జక్కులపురంధ్రి, జక్కిణి, జక్కిణులు గావించు లాస్యము "యక్షాందోళన నృత్యము"గా పిలువబడుతూవుంది.

కూచిపూడి నృత్యసంప్రదాయంలో ఒకదరువుకు "జక్కిణి" అను పేరున్నట్లు తెలుస్తుంది.

ఏ దేశచరిత్ర చూచినా, ఏ సాహిత్య ప్రక్రియను పరిశీలించినా దేశిప్రక్రియలే మార్గప్రక్రియలకు మార్గదర్శకమైనట్లు గోచరిస్తుంది.అందుచేతనే దేశినాటకాలు మార్గనాటకాలకు మాతృక అనవచ్చును.

## 1. భరతఖండంలో దేశినాటకాల స్వరూపం :

భారతదేశం బహుభాషల నిలయం. భిన్న సంస్కృతులకు ఆలవాలం. విభిన్న సంప్రదాయాలకు ఆకరం. ఎంత భిన్నత్వమున్నా రంగు రంగుల పూసలను కూర్చి హారంగా యేకంచేసే సూత్రం భారతీయత. ఈ భిన్నత్వంలోని యేకత్వమే ప్రపంచదేశాలకు భారతీయ ఆదర్శం.

ఇట్టి భిన్నభాషలుగల భారతదేశంలో విభిన్న దేశి నాటక రూపాలు గోచరిస్తాయి. అవి ఆంధ్ర, తమిళనాడులలో వీధి భాగవతాలుగాను, కేరళలో కథకళిగాను, బెంగాలులో యాత్రలుగాను, బీహారులో విదేశీయాలుగాను వుండినట్లు తెలుస్తుంది.

అవధి పూర్వహిందీ భాషలలో నిరాస, నౌటంకి, స్వాంగ బాండలు దేశినాటకాలు.

మహారాష్ట్రలో "లతములు, తమాషాలు", రాజస్థాన్‌లో "రాస, భూమర్, డోలామారులు", కాశ్మీర్‌లో "బంధ్‌పథేర్‌లు", అస్సాములో "అంకీయనాట్‌లు" దేశినాటకాలుగా ప్రచారంలో వుండినట్లు కనిపిస్తుంది.

భారతీయ భాషలలో తెలుగు ప్రాచీనమైన భాషగా పరిగణింపబడుతూ వుంది. ఆంధ్రులకు అతి ప్రాచీనమైన "చరిత్ర, సంస్కృతు"లున్నాయి.

మొట్టమొదటగా "ఐతరేయ బ్రాహ్మణం"లో ఆంధ్రజాతి పేర్కొనబడింది. ఐతరేయ బ్రాహ్మణం ఋగ్వేదకాలంనాటిదని, ఋగ్వేదం క్రీ.పూ.1000 సంవత్సరాల నాటిదని పండితుల అభిప్రాయం. అనగా ఇప్పటికి 3000 సంవత్సరాల కాలంనాటికే ఆంధ్రులు ప్రత్యేకతెగగా పరిగణింపబడే వారని పురాణాధారం.

రామాయణకాలంలోను, మహాభారతకాలంలోను ఆంధ్రులు దక్షిణాపథంలో నివసించేవారని తెలుస్తుంది.

భరతుని నాట్యశాస్త్రంలో 13వ అధ్యాయమునందు ఆంధ్రులు అనేక నృత్త, గీత, వాద్య లలితాభినయ ప్రియులని చెప్పబడివుంది.వీరు దాక్షిణాత్య ప్రవృత్తికి చెందినవారనికూడ చెప్పబడివుంది.

"అభినయ దర్పణము"ను నందికేశ్వరుడు రచించాడు. నాట్యశాస్త్రంతరువాత అంతటి ప్రాచుర్యం పొందిన గ్రంథం "అభినయ దర్పణం". నందికేశ్వరుడు ఆంధ్రుడు. అభినయ దర్పణంలో తెలియజేయబడిన 'నాటక, నాట్య' విషయాలన్నీ అప్పటికే ఆంధ్రదేశంలో బహుళప్రచారంలో వుండి వుండవచ్చును.

ఒకగ్రంథంలోని విషయాలు ఆ కాలపు సమాజంలోని ఆర్థిక, సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక స్థితిగతులకు లిఖితాధారాలు.

నాగార్జునకొండ త్రవ్వకాలలో "ఆరుబయలు రంగస్థలము" బయటపడింది. నాట్యశాస్త్రంలో చెప్పబడిన వేలకొలది ప్రేక్షకులకు సరిపోవు "చతురస్ర నాట్యశాల" క్రీ.శ.3వ శతాబ్దినాటికే వున్నట్లు తెలుస్తుంది. అప్పటికే తెలుగుదేశంలో "నాటక రచన, నాటక ప్రదర్శన" ప్రాచుర్యంలో వున్నట్లు విదితమవుతుంది. ఆనాడు ప్రదర్శించే నాటకాలు దేశినాటకాలు కావచ్చునని పరిశోధకుల అభిప్రాయం.

క్రీ.శ.13వ శతాబ్దంలో కాకతిగణపతిదేవచక్రవర్తి బావమరదియైన "జాయపసేనాని" (గజసేనాధిపతి) ఆనాటి దేశినృత్య సంప్రదాయాలైన "పేరిణి, ప్రేంఖణము, చర్చరి, రాసకము, నాట్యరాసకము, దండరాసకము, చిందు, కోలాటము" మొదలగువాని లక్షణాలను తెలియజేశాడు.

ఈ జానపద నృత్యాలను తంజావూరు నాయకరాజులు, మహారాష్ట్ర మహీపాలురు, మధుర నాయకరాజులు, పుదుక్కోట తొండమాన్ చక్రవర్తులు పోషించినారు. వీరు దేశినాటక రచనను, ప్రదర్శనను, మహోన్నతదశకు తెచ్చారు. క్రీ.శ.14వ శతాబ్దంలో శ్రీనాథుడు "క్రీడాభిరామము", 16వ శతాబ్దంలో బొడ్డుచెర్లతిమ్మయ్య "ప్రసన్న రాఘవము" అను గ్రంథాలను రచించారు. ఇవి నాటక ఛాయలుగల పద్యకావ్యాలు.

రాజుల ఆశ్రయానుగ్రహాలు పొందిన మతాలు, కళలు ఉచ్ఛస్థితిని పొందాయనడానికి పెక్కు చారిత్రకాధారాలు కలవు.

క్రీ.శ.1860కి పూర్వం తెలుగుదేశంలో "తోలుబొమ్మలాటలు, పగటివేషాలు, యక్షగానాలు, కలాపాలు, వీధినాటకాలు, కోలాటాలు" అను దేశినాటక ప్రక్రియలు బహుళ ప్రచారంలో వుండేవి. తెలుగు దేశినాటకాల యక్షగానం అత్యంత ప్రముఖస్థానాన్ని పొందింది. ఆ జానపద కళారూపాలే ఆధునిక ఆంధ్రనాటక రంగావిర్భావానికి సుప్రభాతం.

కీ.శే.కోరాడ రామచంద్ర శాస్త్రిగారు 1860లో "మంజరీమధుకరీయము"అను స్వతంత్ర నాటకాన్ని రచించి, ఆధునిక తెలుగు నాటక రచనాయుగానికి నాంది పలికినారు. ఇంతవరకు తెలిసినదానిని బట్టి తెలుగులో మంజరీమధుకరీయమే మొదటినాటకమని విజ్ఞుల అభిప్రాయం. ఇది సంస్కృత లక్షణాలతో రచింపబడిన పెద్దనాటకం అవడంచేత ప్రదర్శన భాగ్యానికి నోచుకోలేదు సరిగదా 1903 వరకు ప్రచురింపబడలేదు. 1903 వరకు ప్రచురింపబడలేదు. 1903లో ప్రచురింపబడింది.

శ్రీ రామచంద్ర శాస్త్రిగారు " వేణీసంహారము, ఉత్తరరామచరిత్ర, ఉన్మత్తరాఘవము, శాకుంతలము" అను సంస్కృత నాటకములను అనువదించి, నాటకానువాద ప్రక్రియకుకూడా ప్రథములైనారు.

1872లో శ్రీపరవస్తు వేంకటరంగాచార్యులుగారు "అభిజ్ఞాన శాకుంతలము" అను కాళిదాసు నాటకాన్ని తెలుగులోనికి అనువదించారు.

1875లో శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు ప్రప్రథమంగా ఆంగ్లనాటకాలను ఆంధ్రీకరించారు. తెలుగులో స్వతంత్ర పద్యరచనకు వీరే ఆద్యులు. వీరు"షేక్స్పియర్" వ్రాసిన 'జూలియస్ సీజర్' నాటకాన్ని అనువదించారు. 'నందకరాజ్యము' అను సాంఘిక నాటకాన్ని రచించి, సమాజానికి హితోపదేశం చేశారు.

ఆంగ్లనాటకాలను ఆంధ్రీకరించినవారిలో ప్రథములు శ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రిగారు, కందుకూరి వీరేశలింగం పంతులుగారు, గురజాడ శ్రీ రామమూర్తిగారు.

ఆంగ్లేయుల ప్రభావంతో 1875లో "ది మెడ్రాస్ డ్రమటిక్ సొసైటీ" స్థాపింపబడింది. అప్పటికి ఆంధ్రులు అవిభాజ్య మద్రాసు రాష్ట్రంలోనే వుండేవారు.

ధార్వాడ నాటకకంపెనీలు:

ఆంధ్రనాటక సాహిత్య చరిత్రలో 1880వ సంవత్సరం సువర్ణాక్షరాలతో లిఖింపదగింది. ఆ సంవత్సరమే "ధార్వాడనాటక కంపెనీవారు" అధునాతనమైన పద్ధతులలో ఆంధ్రదేశమంతటా ముఖ్యనగరాలలో 'మరాఠీ' నాటకాలను ప్రదర్శించారు. అదేసమయంలో శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు గారు రాజమహేంద్రవరములో "బ్రహ్మవివాహము, వ్యవహార ధర్మబోధిని" అను రెండు నాటకాలను (ప్రహసనములు) రచించి, ప్రకటించినారు. బ్రహ్మవివాహము నాటక ప్రపంచంలో నూతనోత్తేజాన్ని రేకెత్తించింది. "వ్యవహార ధర్మబోధిని" నాటకం బాలికోన్నత పాఠశాలలో మొదటిసారిగా ప్రదర్శింపబడింది. ఇదే తొలి తెలుగు నాటక ప్రదర్శన.

తెలుగుదేశంలో అంతవరకు ఆరుబయలు రంగస్థలమే వుండేది. ధార్వాడవారు ఈ రంగస్థలరూపాన్ని పూర్తిగా మార్చివేశారు. నాలుగువైపులా మూసిన ప్రదర్శనశాలలో మూడువైపులా మూసిన రంగస్థలం పైకి, క్రిందికి కదిలే తెరలతో, నేపథ్య జంత్ర సహకారంతో నాటకాలు ప్రదర్శించేసరికి తెలుగువారికి ఒక కొత్త నాటక ప్రపంచం గోచరించింది. నూతనోత్సాహం కలిగింది. ధార్వాడనాటకాల ప్రేరణతో శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు ప్రభావితులై, రాజమహేంద్రవరంలో ధార్వాడవారు నాటకాలాడి వదలివెళ్ళిన తాటాకుపాకలోనే "చమత్కార రత్నావళి, రత్నావళి" అను రెండునాటకాలు ప్రదర్శింపజేసి, ప్రప్రథమ నాటక ప్రయోక్త(Director) గా ప్రఖ్యాతిగాంచినారు. చమత్కార రత్నావళి 'షేక్స్పియర్' రచించిన 'కామిడీ ఆఫ్ ఎర్రర్స్' అను నాటకానికి, "రత్నావళి" శ్రీ హర్షుని "సంస్కృత రత్నావళికి" అనువాదములు.

ఈ విధంగా ఆధునిక ఆంధ్రనాటకరంగం ఆవిర్భవించింది.

ధార్వాడవారివలె నాటకాలు ప్రదర్శించాలనే ఉత్సాహంతో ప్రతి పట్టణంలో నూతన నాటక సమాజాలు వెలిశాయి. ప్రదర్శించడానికి నాటకాల అవసరం గుర్తించి, రచయితలు నాటక రచనకు పూనుకున్నారు.

నాటక రచయితలు పగటి వేషాలవంటి జానపద నాటక రూపాలను, సంస్కృత నాటకాలను ధార్వాడవారి నాటకాలను ఒరవడిగా

పెట్టుకొని నాటక రచన ప్రారంభించినారు. ఎక్కువగా పౌరాణిక వచన నాటకాలు వెలువడ్డాయి. అనువాద నాటకాల సంఖ్యగూడ గణనీయంగానే పెరిగింది.

శ్రీ కొక్కొండ వేంకటరత్నంగారు 1892లో "నరకాసుర విజయ వ్యాయోగము"ను అనువదించి ప్రచురించారు. ఆ తరువాత 1894లో "ధనంజయ వ్యాయోగము"ను, 1897లో "ప్రసన్న రాఘవము"అను రూపకాన్ని ఆంధ్రీకరించారు.

శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం మొదలగువారు పౌరాణిక ఇతివృత్తాలను గ్రహించి, వచన నాటకాలుగా వ్రాశారు. శ్రీ నాదెళ్ల పురుషోత్తమ శాస్త్రిగారు నాటకాలలో పాత్రోచిత భాషాప్రయోగానికి శ్రీకారం చుట్టినారు.

బళ్ళారి వాస్తవ్యులు "శ్రీ ధర్మవరం గోపాలాచార్యులు" గారు ఒక తెలుగు నాటకంవ్రాసి ప్రదర్శింపగా అది రక్తికట్టకపోవడంతో తెలుగుభాష నాటకానికి అనువైనదిగాదను అపప్రథ బయలుదేరింది. ఆ అపప్రథను పోగొట్టి, తెలుగుభాష నాటక రచనకు, ప్రదర్శనకు అనువైనదని రుజువుచేయడానికి "శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు"గారు నాటక రచనకు పూనుకున్నారు. సంస్కృత, ఆంగ్లనాటక సంప్రదాయాలను మిశ్రితంచేసి, కొత్తపోకడలతో స్వతంత్ర నాటకాలను రచించారు. శ్రీ రామకృష్ణమాచార్యులుగారు 1886లో రచించిన మొదటి నాటకం"చిత్రనళీయము", ఇది గద్య, పద్య, గేయాత్మకము. నాటకాన్ని రచించిన రామకృష్ణమాచార్యులుగారే స్వయంగా దర్శకత్వం వహించి, వేషంవేసి ఆకర్షణీయంగా ప్రదర్శించి, అశేష ప్రజానీకం యొక్క ఆదరాభిమానాలను చూరగొన్నారు. "విషాద సారంగధర" నాటకాన్ని రచించి, ప్రదర్శించి, గద్య, పద్య, గేయాత్మక పౌరాణిక నాటకాలకు, విషాదాంత నాటకాలకు ఆద్యులైనారు. విషాద సారంగధర నాటక రచనతో తెలుగు నాటక సాహిత్యంలో మరో కొత్తశకం ప్రారంభమైంది. వారి గద్య, పద్య, గేయాత్మక నాటక ప్రభావం తెలుగు నాటక సాహిత్యంమీద ప్రబలమైన ముద్రవేసిందనటే అతిశయోక్తికాదు. తరువాత వచ్చిన నాటక రచయితలందరూ రామకృష్ణమాచార్యులుగారిని ఒరవడిగా తీసుకొన్నారు.

ఈ ప్రభావానికి మొదటిసారిగా ప్రభావితులైనవారు శ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారు. ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారితో పోటీపడి, ఆయనమాదిరిగా వీరుకూడా నాటకాలు రచించారు. ధర్మవరంవారు పౌరాణిక నాటకాలు రాస్తే, కోలాచలంవారు చారిత్రాత్మక నాటకాలు రాశారు.

బళ్ళారి నాటకాలు రాయలసీమ సరిహద్దులుదాటి, సర్కారుజిల్లా ప్రవేశించి, ఆంధ్రప్రజానీకంచేత ఆకర్షింపబడి, ఆదరాభిమానాలు చూరగొన్నాయి. నటులు, ప్రేక్షకులు బళ్ళారివారి నాటకాలమీద మోజుచూపడంతో, వారిని సంతృప్తి పరచడానికి నాటక రచయితలు ఈ నూతన (బళ్ళారివారు ప్రవేశపెట్టిన గద్య, పద్య, గేయాత్మక విధానం) ప్రక్రియను అనుసరించక తప్పలేదు."చిలకమర్తి లక్ష్మీనరసింహం"వంటి వారు తమరచనా విధానాన్ని మార్చుకొని, బళ్లారివారి రచనా విధానాన్ని అనుసరించారు.

బళ్ళారివారి ప్రవేశంతో తెలుగు ప్రేక్షకుల అభిరుచిలో మార్పువచ్చింది. సంగీత ప్రాధాన్యంగల నాటకాలవైపు మొగ్గుచూపారు. పద్యాలు, పాటలు గల నాటకాలే నాటకాలన్న అభిప్రాయం దేశమంతటా వ్యాపించింది. సంగీత ప్రాధాన్యంగల పద్య నాటకాల యుగం ప్రారంభమైంది. ఈ ఒరవడిలోనే చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, తిరుపతి వేంకటకవులు, చక్రావధానుల మాణిక్యశర్మ, సోమరాజు రామానుజరావు మొదలగువారు పెక్కునాటకాలను రచించారు. వీరిచే రచింపబడిన "గయోపాఖ్యానము, పాండవ వనవాసము, శ్రీకృష్ణరాయబారము" వంటి నాటకాలలో వందలకొలది పద్యాలు చోటు చేసుకొన్నాయి.

గద్య, పద్య, గేయాత్మకమైన పౌరాణిక, చారిత్రాత్మక నాటకాల ప్రాబల్యంగల రోజుల్లో శ్రీ గురజాడ వెంకట అప్పారావుగారు క్లిష్టమైన సాంఘిక పరిస్థితులతో కూడిన ఆధునిక ప్రజాజీవితాన్ని చిత్రిస్తూ 1897లో "కన్యాశుల్కము" అను నాటకాన్ని రచించి, ప్రకటించాడు. అది సాంఘిక ఇతివృత్తముగా వ్యవహారిక భాషలో రచింపబడిన మొదటి సాంఘిక వచన నాటకం. ఈ నాటకంతో తెలుగు నాటక చరిత్రలో ఇంకొక వినూతన శకం ప్రారంభమైంది. కన్యాశుల్కనాటక రచనతో వాస్తవిక వాదానికి, వ్యవహారిక భాషావాదానికి పట్టుదొరికింది. గురజాడ అప్పారావుగారు "బిల్హణీయము" అను మరొక నాటకాన్ని రచించారు.

కన్యాశుల్కము వ్రాయబడిన సంవత్సరమే 1897లో మరొక గొప్పనాటకం "ప్రతాపరుద్రీయము" వెలువడింది. శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు ఈ నాటకాన్ని రచించి, ఇందులో పాత్రోచిత భాషావాదానికి సుస్థిర స్థానం కల్పించారు. ఈనాటకంలో సంస్కృత నాటక లక్షణాలే యెక్కువగా పాటింపబడ్డాయి.

ధర్మవరంవారివలె ఒక ప్రత్యేక ముద్రతో నాటకాలు రచించి, పేరుగాంచినవారు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు. వీరు

ఎక్కువగా పౌరాణిక, చారిత్రాత్మక, సాంఘిక ఇతివృత్తాలతో గద్య, పద్య గేయాలుకూర్చి నాటకాలు రచించి, తెలుగునాటక సాహిత్యానికి పరిపుష్టిని చేకూర్చారు. వారి "కంఠాభరణము, రాధాకృష్ణ" నాటకాలు తెలుగునాటక సాహిత్యంలో మణిపూసలు.

చిన్న చిన్న సంభాషణలతో, ప్రసన్నశైలితో అశేష ప్రజానీకాన్ని రంజింపజేసిన చిలకమర్తివారి "గయోపాఖ్యానము,"తిరుపతి వేంకటకవుల "పాండవోద్యోగ విజయాలు"వేలకొలది సార్లు ప్రదర్శింపబడి, సంగీత ప్రాచుర్యంగల పద్యనాటకాలుగా తెలుగు నాటక సాహిత్యంలోను, ప్రజాహృదయాల్లోను సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నాయి.

ఈ సమయంలోనే "బలిజేపల్లి లక్ష్మీకాంతకవి, శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి, కాళ్ళకూరి సాంబశివరావు, మారేపల్లి రామచంద్రకవి, కె.సుబ్రహ్మణ్యశాస్త్రి" మొదలగు వారెందరో పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలు రచించారు.

సంస్కృత అనువాద నాటకాలుగా కందుకూరివారి "శాకుంతలము", వడ్డాది సుబ్బారావుగారి "వేణీసంహారము" ప్రజాదరణను పొందాయి.

మొదటి ప్రపంచయుద్ధం ముగిసిన తరువాత భారతీయులలో "రౌలట్ శాసనం", పంజాబులోని జలియన్‌వాలాబాగ్" దురంతాలు పెద్ద సంచలనాన్ని సృష్టించాయి. రాజకీయ సంచలనంతోబాటు సాంఘిక, సారస్వత రంగాల్లోకూడ గొప్ప సంచలనం వచ్చింది. ఐతే, వాటిపై పాశ్చాత్య ప్రభావం యెక్కువగా పడింది.

ఈ ప్రభావంతో తెలుగులో క్రొత్తతరహా నాటకాలు అవతరించాయి. వాటిని రెండు రకాలుగా విభజింపవచ్చు.

అవిః– 1. చారిత్రక నాటకాలు.
2. భావ ప్రధాన నాటకాలు.

రాజకీయ సంచలనం కారణంగా, దేశభక్తి ప్రబోధం లక్ష్యంగా వెలువడినవి చారిత్రక నాటకాలు.

భావకవిత్వ ప్రభావంవల్ల మొలకెత్తిన సాంఘిక నాటకాలు భావప్రధాన నాటకాలు.

ఈ విధంగా వెలువడిన చారిత్రకనాటకాలు రెండు రకాలు.

అవి 1. పూర్వ చరిత్ర చిత్రణద్వారా దేశభక్తిని ప్రబోధించే నాటకాలు.
ఉదాః– "రసపుత్ర విజయము, రోషనారా"

'రసపుత్రవిజయము' రాజపుత్రుల దేశభక్తిని, శౌర్యపరాక్రమాలను చిత్రించే వీరరస నాటకము, 'రోషనారా' మహారాష్ట్ర వీరుల శౌర్యధైర్యాలను, దేశభక్తిని ప్రతిబింబించే నాటకం.

2. "సమకాలీన రాజకీయాలను చిత్రించడం ద్వారా దేశభక్తిని ప్రబోధించే నాటకాలు." శ్రీ దామరాజు పుండరీకాక్షుడు గాంధీజీ, ఆలీసోదరులు, చిత్తరంజన్‌దాస్, మొదలగు రాజకీయ నాయకులను పాత్రలుగా జేసి, ఆనాటి రాజకీయాలను చిత్రించడంద్వారా దేశభక్తిని ప్రబోధించే నాటకాలను రచించాడు.

ఉదాః– "గాంధీవిజయము, పాంచాలీ పరాభవము"

ఈ నాటకాలవలన ప్రభావితులైన "శ్రీపాద కామేశ్వరరావు, పింగళి నాగేంద్రరావు, జంధ్యాల శివన్నశాస్త్రి" మొదలగువారు బెంగాలీ, మహారాష్ట్ర నాటకాలను అనువదించారు. ముఖ్యంగా "ద్విజేంద్ర లాల్‌రాయ్"రచించిన నాటకాలను అనువదించి, తెలుగు నాటక సాహిత్యాన్ని పరిపుష్టం చేసినారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి "నర్తనశాల" అను పౌరాణిక నాటకం, "అనార్కలి," అను చారిత్రాత్మక నాటకం, చింతా దీక్షితులుగారి "శబరి," అబ్బూరి రామకృష్ణారావుగారి "నదీసుందరి" అనునాటకాలు సాహిత్య ప్రమాణాలు యెక్కువగా కలిగియున్నవి.

"కన్యాశుల్కము" తరువాత వచ్చిన సాంఘిక నాటకాలలో ముఖ్యమైనవి "కాళ్ళకూరి నారాయణరావు"గారి "చింతామణి", వరవిక్రయము, మధుసేవ". ఇవి సంఘ సంస్కరణకు సంబంధించిన ఇతి వృత్తంగల నాటకాలు. ఆనాడు సంఘాన్ని పట్టిపీడిస్తున్న 'వ్యభిచారం, వరశుల్కం. మధుపానం 'క్రమంగా పై మూడు నాటకాలకు ఇతివృత్తాలైనవి.

పురాణాలను నిశితంగా విమర్శించే నాటకాలుకొన్ని ఆ కాలంలో వెలువడ్డాయి. త్రిపురనేని రామస్వామి చౌదరి రచించిన "కురుక్షేత్ర సంగ్రామము, శంబూకవధ, ఖూనీ" ఈ కోవకు చెందిన నాటకాలు.

పురాణగాధలకు, పాత్రధర్మానికి క్రొత్తవ్యాఖ్యానంచేస్తూ పాత్రలను చిత్రించినవారిలో అగ్రేసరుడు 'గుడిపాటి వెంకటాచలం'. వీరు రచించిన "సావిత్రి, చిత్రాంగి" నాటకాలు తెలుగుదేశంలో సంచలనాన్ని సృష్టించాయి.

1920 నుండి 1930 వరకు ఒకదశాబ్దికాలం తెలుగు నాటక రంగానికి క్షీణదశ అని చెప్పక తప్పదు. ఈ కాలంలో అభినయాన్ని వదిలిపెట్టి, సంగీతం ప్రధానంగాగల ఒకస్థితిలో అవహేళస నాటకాలు వెలుగులోనికి వచ్చాయి. శ్రీ కె. చినరఘుపతి రావుగారు రచించిన "నాటక కోలాహలము", బి.టి. రాఘవాచార్యులు రచించిన "రంగసభ", మల్లాది అవధానిగారు రచించిన "అసంపూర్ణ రామాయణము" అవహేళన నాటకాలజాబితాలో చేరినవాటిలో ముఖ్యమైనవి.

ఒక్కదశాబ్దికాలంలో యెన్నోమార్పులొచ్చాయి.స్తబ్దత వహించిన నాటకం తిరిగి కదలసాగింది. 1930నాటికి జాతీయ, అంతర్జాతీయ నాటక సాహిత్యం ఆంగ్లభాష ద్వారా మనకు అందుబాటులోకి వచ్చింది. "ఇబ్సెన్, షా, చెకోవ్, టాల్‌స్టాయ్" ప్రభృతుల నాటకాలప్రభావం తెలుగు నాటక రచయితలమీద పడింది. ఫలితంగా పి.వి.రాజమన్నార్‌గారి "తప్పెవరిది", రంగారామ్‌గారి 'దంపతులు' బళ్ళారిరాఘవ (తాడిపత్రిరాఘవ)గారి "సరిపడని సంగతులు", మల్లాది అవధానిగారి "గాలివాన"ఇత్యాది నాటకాలు సరికొత్త ప్రక్రియకు శ్రీకారం చుట్టాయి. "స్త్రీ" సమస్యను ఆధారంగా జేసికొని రచింపబడ్డ నాటకాలివి.

ఆ తరువాత నాటక రచయితల దృష్టి సభ్యసమాజంలోని సమస్యలపై మళ్లింది. 1930లో సబ్నవీసు రామారావుగారు రచించిన "రైతుబిడ్డ" అను నాటకం రైతుసమస్యకు చెందిన ఇతివృత్తంకలది.హరిజన సమస్యలుగూడా ఆనాటి నాటకాల్లో చోటు చేసుకొన్నాయి. హరిజనోద్ధరణ ప్రభావంవల్ల "అస్పృశ్యవిజయము, నందనార్, పతితపావన"నాటకాలు వెలువడ్డాయి.

వావిలాలవారి "నందకరాజ్యము", కందుకూరివారి "వెనిస్ వర్తక చరిత్ర", రెంటాల సుబ్బారావుగారి "అథిల బింబము"అదే రోజుల్లో వెలువడిన పద్య నాటకాలు.

శ్రీ శివశంకర స్వామివారి"పద్మావతీచరణచారణ చక్రవర్తి", "దీక్షితదుహిత" పద్య, గేయ నాటకాలుగా ప్రసిద్ధి గాంచాయి.

తెలుగుదేశంలో 1940 నాటికి నూతన భావాలు నెలకొన్నాయి. సామ్యవాద, ఆర్థిక విధానంలో అభ్యుదయ నాటక సాహిత్యం, తెలంగాణా ప్రాంతంలో పుష్కలంగా వెలువడింది. సుంకర వాసిరెడ్డి రచించిన "ముందడుగు", "మాభూమి" అభ్యుదయనాటకాలు. కొండముది గోపాలరాయశర్మ, బోయ భీమన్న ఈ కోవకు చెందిన నాటక రచయితలు.

నాటక, నాటిక, ఏకపాత్రాభినయ పోటీలు నిర్వహించే నవశకం ప్రారంభమైంది. పరిషత్తులు నిర్వహించేవారు ఐదు సంవత్సరాలకు పూర్వం రచింపబడ్డ నాటకాలు పరిషత్తుపోటీలలో ప్రదర్శించడానికి అర్హతను కోల్పోతాయని ప్రకటన లిచ్చారు. ఇటువంటి ప్రకటనలు నాటక సాహిత్యం అభివృద్ధి చెందడానికి ఆరోగ్యకరమైన ఆలోచనే అని చెప్పకతప్పదు. నాటకరచయితల మేధ పదును పెట్టబడింది. సమాజంలో యెదురయ్యే సమస్యలే అభ్యుదయభావాలతో నాటకరూపం దాల్చాయి. సమస్యను పరిష్కరించే విధానంలోను, సమాజాన్ని ప్రబోధించే పద్ధతిలోను నాటకరచయిత కొత్తకొత్తతెన్నులు చూడవలసివచ్చింది. రచయిత బాధ్యత పెరిగింది. అధునాతన నాటక ప్రదర్శనలో స్త్రీపాత్ర సమస్యగా మారింది. ఆ సమస్యను పరిష్కరించడానికన్నట్లు స్త్రీపాత్రలేని కొన్ని నాటకాలు రచింపబడ్డాయి. ఈ నూతన ప్రక్రియలతో తెలుగు నాటక సాహిత్యం సుసంపన్నమైంది. రచనా విధానంలో వైవిధ్యం గోచరించింది.

1944లో ఆంధ్రనాటక కళాపరిషత్తు నాటక పోటీల నిర్వహణ ప్రారంభించింది. ఈ పోటీలలోపాల్గొనడానికి కొన్ని స్త్రీ పాత్రలేని నాటకాలు రచింపబడ్డాయి. ఇట్టి సరికొత్త పోకడలతో వెలువడిన నాటకాలలో గోపాలరాయ శర్మగారి "ఎదురీత", ఆచార్య ఆత్రేయగారి "ఈనాడు, ఎన్.జి.వో" ముఖ్యమైనవి.

రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన తరువాత శాంతి ఉద్యమము బయలుదేరింది. ఈ ఉద్యమ ప్రభావంతో వెలువడిన ఆత్రేయగారి "విశ్వశాంతి", అని శెట్టిగారి "శాంతి", గిడుతూరి సూర్యంగారు రచించిన "మానవుడు" నాటకాలు ముఖ్యమైనవి. వీటిలో 'యుద్ధానికి – శాంతికి' మధ్య సంఘర్షణ చిత్రితమైంది.

ఆనాటినుండి ఈనాటివరకూ సమాజంలో పెక్కుసమస్యలను ఇతివృత్తాలుగా జేసికొని అనేక నాటక, నాటికలు వ్రాయడం గుర్తించతగ్గ విశేషం. "రైతుకూలీ సమస్యలు, భూపోరాటాలు, సాంఘిక అన్యాయాలు, భూస్వామ్యవ్యవస్థ, ధనిక పేద వర్గాల మధ్య సంఘర్షణ, గ్రామీణ సమస్యలు, పంచవర్ష ప్రణాళికలు, అపరాధ పరిశోధన, స్వాప్నిక జగత్తు, జానపద గాథలు, రాజకీయాలు, వర్గపోరాటాలు," తెలుగు నాటక రచయితలకు కథావస్తువులైనాయి.

గత రెండు దశాబ్దాలుగా వెలువడుతున్న తెలుగు నాటక ఇతివృత్తాలలో ఉన్నంత వైవిధ్యం ఇంతకుపూర్వ మెప్పుడూ గోచరించదు. నాటక సాహిత్యంతో పాటే నాటికాసాహిత్యంకూడ అభివృద్ధి చెందుతూనే వచ్చింది.

మల్లాది విశ్వనాథ శాస్త్రి, భమిడిపాటి కామేశ్వరరావు హాస్యనాటికలను వ్రాశారు. పి.వి రాజమన్నారు గంభీరమైన నాటికలకు, కొప్పరపు సుబ్బారావు అల్లీముతా గేయనాటికలకు, అనిశెట్టి వ్రాసిన 'శాంతి' నాటిక మూకనాటికలకు మార్గదర్శకాలు.

ఈనాడు ఆకాశవాణి, దూరదర్శినుల ప్రాచుర్యం సమాజంలో అధికమైనందువలన పద్యనాటికలు, గద్యనాటికలు, గేయనాటికలు, నృత్యనాటికలు, నృత్యాలు, హరికథలు, బుఱ్ఱకథలు విరివిగా వెలువడుతున్నవి. నేటి చలన చిత్రరంగానికి తొలిమెట్టు నాటకరంగమని చెప్పక తప్పదు.

ఈ విధంగా ధార్వాడవారి నాటకాలతో ప్రభావితమైన తెలుగు నాటకరంగం క్రమపరిణామం చెందుతూ, నిత్యనూతన ప్రయోగస్థాయికి చేరుకున్నది.

### తెలుగులో నాటక ప్రయోగం—సరికొత్త పోకడలు :

1920 నుండి 1930 వరకు ఒక దశాబ్దకాలం తెలుగు నాటకరంగంలో స్తబ్దత ఆవరించినా, ఆ కాలాన్ని తెలుగునాటకరంగంలో ఆ కాలాన్ని తెలుగు నాటకరంగానికి సంధికాలమని చెప్పక తప్పదు.

అంతకుపూర్వం తెలుగు నాటకరంగం ప్రాచీన సంస్కృత నాటక లక్షణాలతో పరిమితమైనప్పటికీ, తరువాత పాశ్చాత్యనాటక సాహిత్య సంపర్కంతో ప్రభావితమై, అనువాద, అనుకరణలతో సుసంపన్నమైంది. ఆనాడు "కళ కళకోసం" అనే నమ్మకం ఉండేది. ప్రపంచం విజ్ఞానపరంగా యెంతో అభివృద్ధి చెందింది. సమాజంలో మార్పు కొట్టవచ్చినట్లు కనిపించింది. అన్నిరంగాల్లోను నూతనదృక్పథం గోచరించింది. మానవుడు కేంద్రంగా "మానవతావాదం" ప్రబలింది. 'ప్రయోగాత్మకమైన ప్రగతి' సమాజానికి అవసరమైంది. అన్నికళలలోను సరికొత్త నిర్వచనాలు వెలువడ్డాయి. మానవునిలో హృదయ వైశాల్యం యేర్పడింది. సంకుచితత్వం దూరమైంది. "కళ కళకోసం కాదు. సమాజంకోసం" అన్నభావన కలిగింది. ఈ ప్రభావం నాటక రంగంపైనకూడ పడింది. సంధికాలాన్ని అధిగమించి అధునాతన ప్రయోగంవైపు పయనించింది.

గత రెండు మూడు దశాబ్దాలకాలంలో తెలుగు నాటకరంగం ఒక నూత్న విధానాన్ని అనుసరించింది. నాటక రచనలోను, ప్రదర్శనలోను సాంఘిక పరమైన సమస్యలకు ప్రాధాన్యం లభించింది. నాటక రచయిత భాషాపరమైన సంకెళ్ళు తెంచుకొన్నాడు. మాండలిక భాషను, అందునా సమాజంలో అట్టడుగున వున్న ప్రజాజీవితంలోని నగ్నసత్యాన్ని నాటక ఇతివృత్తంగా గ్రహించి, వారిభాషనే సంభాషణలుగా మార్చి, నూతన ప్రయోగంచేసి సఫలీకృతుడైనాడు.

ఈ కొత్త ప్రయోగానికి శ్రీకారం చుట్టింది 1960-62 ప్రాంతంలో రాచకొండ విశ్వనాథ శాస్త్రిగారు. విశాఖజిల్లా ప్రాంతపు వాతావరణాన్ని చిత్రించి, "తిరస్కృతి, నిజం, విషాదం" అను నాటకాలు వ్రాసి ప్రయోగించాడు.

"ఆంధ్ర విశ్వకళా పరిషత్తు"లో దర్శకుడుగా పనిచేసిన ప్రఖ్యాత రంగస్థల నటుడు కీర్తి శేషుడైన శ్రీకత్తి వేంకటేశ్వరరావు కొత్తప్రయోగానికి ప్రభావితుడయ్యాడు. రాచకొండ విశ్వనాథశాస్త్రి, మంత్రి శ్రీనివాసరావు లాంటివారిని ఆదర్శంగా తీసుకొని శ్రీగణేశ్ పాత్రో "లాభం, పావలా, కొడుకుపుట్టాల" అను నాటికలను రచించి, నూతన విధానంతో ప్రదర్శించాడు. నటుడుగా, దర్శకుడుగా విశాఖజిల్లా గ్రామీణభాషలోని యాసను, మాండలిక శబ్దంలోని ఉచ్చారణాపద్ధతిని, పాత్రల ప్రవర్తనా తీరును చక్కగా తీర్చిదిద్దినాడు. ఈ నాటికలను చూస్తున్నంతసేపు విశాఖ జిల్లాలోని సముద్రతీర ప్రాంతం కండ్లకు కట్టినట్లు కనిపిస్తుంది. "కొడుకుపుట్టాల" అను నాటిక పెక్కు భారతీయ భాషలలోనికి అనువదింపబడినది. 1971లో ఆలిండియా రేడియో, ఢిల్లీ వారిచే సంక్రాంతినాడు ప్రసారం చేయబడింది.

ఇటువంటి ప్రయోగాత్మక రచనను అప్పటికి 20యేళ్ళకు పూర్వమే నెల్లూరు వాస్తవ్యులు పులుగుండ్ల రామకృష్ణయ్యగారు "తుఫాను" అనునాటికను నెల్లూరు మాండలిక భాషలో వ్రాసి ప్రదర్శించినారు. కాని ఆనాటి రచయితలపై ఆ నాటిక ప్రభావం అంతగా చూపలేక పోయింది.

శ్రీకాకుళం జిల్లాలోని "సవర్లు, జాతాపులు" అయిన గిరిజనులను పాత్రలుగా జేసికొని అత్తిలికృష్ణ "తూర్పు రేఖలు" అనునాటకాన్ని రచించి ప్రయోగించాడు. ఇది నేచ్యురలిస్టిక్ ప్లే అనవచ్చును.

శ్రీభూషణంగారు శ్రీకాకుళం గిరిజనుల పోరాటాన్ని కథావస్తువుగా "కొండగాలి" అను నాటకాన్ని వ్రాసి ప్రయోగించారు. ఈ

నాటకంలో గిరిజనులు నిత్యజీవితంలో యెదుర్కొను సమస్యలను, వాటిని వారు పరిష్కరించుకొను విధానాన్ని చక్కగా చిత్రించారు. నాటకాలలో మాండలిక భాషాప్రయోగం ఈ ప్రాంతానికే పరిమితమైంది.

1964లో యన్.ఆర్.నంది రచించిన "మరో మొహంజొదారో" ఒక విశిష్ట ప్రయోగం. ఇది అనేక భారతీయ భాషలలోనికి అనువదింపబడిన నాటకం. "వారే ఇన్‌సాన్" అనుపేరుతో హిందీలోనికి అనువదింపబడి, ఢిల్లీ నగరంలో పలుసార్లు ప్రదర్శింపబడింది. ఇది తెలుగువాడి ఘనత. ఈ నాటక ప్రభావం ఆ తరువాత వచ్చిన నాటక రచయితలమీద గాఢంగా ముద్రవేసింది. దాడి వీరభద్రరావు రచించిన "పలుకే బంగారమాయె" అను నాటకంలో మరోమొహంజొదారో రచనాశిల్పం స్పష్టంగా గోచరిస్తుంది. అమెరికన్ రచయిత 'Thorentor Wilder" రచన "అవర్ టౌన్" పోలికలు "మరోమొహంజొదారో"నాటకంలో కనిపిస్తాయి. రంగస్థల సామగ్రి లేకుండా, ఉందని ఊహించుకుని నటించడం, ఎదురుగా లేనివ్యక్తులు వున్నట్లూహించుకొని నటించడం ఈ నాటకప్రయోగంతో ప్రారంభమయ్యింది. "మరో మొహంజొదారో"ద్వారా తెలుగు నాటకరంగంలో "ఫ్రీజ్" ప్రవేశించింది.

ఆ తరువాత గొల్లపూడి మారుతీరావు ఒక మధ్యతరగతి కుటుంబంలోని ఒకసమస్యకు "ఈడిపస్‌కాంప్లెక్స్" జోడించి, రచించి ప్రయోగించిన నాటకం "కరుణించని దేవతలు". నాటక రంగంలోనే ఈ నాటకం ఒకసరికొత్త ప్రయోగంగా సమాజంలో ఒక సంచలనాన్ని సృష్టించింది.

"లావాలో ఎర్రగులాబీ" మరొక కొత్తపోకడలు కలిగిన నాటకం. లావావంటి కథానాయకుడు ఎర్రగులాబీ లాంటి కథానాయిక మధ్యకలిగిన మానసిక సంక్షోభాన్ని ఒకభిన్నమైన 'స్టేజ్ క్రాఫ్ట్'కి జోడించి ప్రయోగింపబడిన నాటకమిది. నటుడికి దర్శకుడికి కొత్తసవాలును సృష్టించిన నాటకం.

1969-70 మధ్య ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం మరొక నూతనాధ్యాయానికి నాంది పలికింది. ఈ సంఘం శాస్త్రీయ దృక్పథంతో పాతనాటకాలను ప్రయోగించింది. "మృచ్ఛకటికము, ప్రతాప రుద్రీయము, కన్యాశుల్కము" ఈ కోవకు చెందిన నాటకాలు.

తెలుగులో మొట్టమొదటి అనిబద్ధరూపకము "సంరక్షకుడు" ఎ.ఆర్.కృష్ణ ఈ నాటకాన్ని "హెరాల్డ్ పింటర్" వ్రాసిన "కేర్ టేకర్" నాటకానికి అనువాదంగా రచించి, ప్రయోగించాడు.

నాటకపరిషత్తులు జరుపడం వలన ఇతర భాషల్లోని కొన్ని ఉత్తమ నాటకాలను తెలుగులోనికి అనువదించి నాటక సంస్థలు ప్రదర్శించాయి. బాదల్‌సర్కార్ రచించిన "బాకీఇతిహాస్"ను "మిగిలిన చరిత్ర"గాను, శంభుమిత్ర రచించిన "కాంచనరంగ్"ను "బంగారులేడి"గాను,విజయ తెండూల్కర్ గారు రచించిన "శాంతతాకోర్ట్‌చాలూ ఆహే" నాటకాన్ని"నిశ్శబ్దం కోర్టు నడుస్తోంది"గాను తెలుగులోనికి అనువదించి, పరిషత్తులు జరిపిన నాటక పోటీలలో ప్రదర్శించడం జరిగింది. ఈ ప్రక్రియను ప్రోత్సహించిన ఘనత ఆంధ్రప్రదేశ్‌నాటక సంఘానికే దక్కుతుంది.

"వీకెండ్ థియేటర్" కార్యక్రమంద్వారా ఆంధ్రప్రదేశ్ నాటక సంఘం "నిజం" నాటకాన్ని కొన్ని వారాలు ప్రదర్శించింది.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు రచించిన నవల "మాలపల్లి" ఆధారంగా నగ్నముని "మాలపల్లి" అను నాటకాన్ని రచించాడు. ఇది ఒక కొత్త ప్రయోగం. క్లిష్ట తరమైంది. ఈ నాటకంలో పన్నెండు రంగస్థలాల్లో జరిగే విషయాలను, ఏకకాలంలో చూపిస్తూ 50 పాత్రలు పాల్గొనినట్లు చూపించాడు. ఈనాటకాన్ని ఎ.ఆర్. కృష్ణ ప్రయోగించి, తెలుగునాటకరంగ చరిత్రను మరోమలుపు త్రిప్పాడు.

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు నిజజీవితంలో జరిగిన ఒక సంఘటనను ఆధారంగా జేసికొని "యథాప్రజా తథారాజా" అనునాటకాన్ని రచించి ప్రయోగించాడు. ఇది ఆంధ్రలో పలుచోట్ల ప్రదర్శింపబడింది.

"ఊరుమ్మడి బ్రతుకులు" అనునాటికను రచించి ప్రయోగించి, నాటకా రచనలో ఒక కొత్త ఒరవడిని సృష్టించిన ఘనత శ్రీ సి.యస్.రావుగారిది.

"జగన్నాథ రథచక్రాలు", క్షీరసాగరమథనం, అంతంకాదిది ఆరంభం, యక్షగానం" అనునాటకాలను "రీయాక్షనరీ ప్లేస్" గా రచించి, ప్రయోగించడంలో శ్రీ యం.వి.ఎస్.హరినాధరావుగారు సిద్ధహస్తులు.

డాక్టర్ కొర్రపాటి గంగాధరరావుగారు రచించిన "పోటీనాటకం", యండమూరి వీరేంద్రనాథ్‌గారు వ్రాసిన "చీమకుట్టిన నాటకం", శ్రీ రత్నగిరి జగన్నాధంగారు రచించిన "పిచ్చోళ్ళు", శ్రీ కిరణ్‌గారు రచించిన "నటులుకావలెను" అనునాటిక, నాటకాలను ప్రదర్శించి, వాటిద్వారా తెలుగునాటక పోటీలలోని కుళ్ళును, చవకబారుతనాన్ని, కొందరు సినిమా వ్యామోహంలోపడి యెలా జీవితాలను పాడుచేసుకొంటారో

బహిర్గతం చేశారు. ఈ నాటకాలను చూచి కొందరు కుత్సితులైన ప్రయోక్తలు (Directors), నటులు (Actors) తమపద్ధతులను మార్చుకొని బాగుపడ్డారు.

"కీర్తిశేషులు, కుందేటి కొమ్ము" వంటి నాటకాలు సమాజంలోని కీర్తికండూతిని వ్యంగ్యధోరణిలో విమర్శించాయి.

తెలుగువారిలో ఒక సుగుణం గోచరిస్తుంది. ఇది నాటినుండి నేటివరకు తెలుగుకవులలోను, నాటక రచయితలలోను ఇనుమడించిందే తప్పనీరసించిపోలేదు. ఆనాడు సంస్కృత పురాణాలను తెలుగులోనికి అనువదించినకవులు తమ గ్రంథాలు అనువాదాలే అయినప్పటికీ తమదంటూ ఒకబాణిని, ఒక ఒరవడిని యేర్పరుచుకొని, అవి వారి స్వతంత్ర గ్రంథాలేమో అనుకొనేటంత గొప్పగా వ్రాశారు. వారి హృదయస్పందనే అందుకు కారణమని చెప్పవచ్చును.

"మృణాల్ సేన్"గారు రచించిన "మృగయా" నాటకాన్ని చదివి ప్రభావితుడై శ్రీయండమూరి వీరేంద్రనాథ్‌గారు "ఆర్తి" అనునాటకాన్ని రచించాడు. పీటర్‌షాఫర్ ఆంగ్లలో రచించిన "బ్లాక్‌కామెడీ" అనునాటకాన్ని ఆధారం జేసికొని "డ్యామిట్ కథ అడ్డం తిరిగింది" అను నాటకాన్ని వ్రాశాడు. ఈ నాటకంలో ఒకకొత్త "టెక్నిక్" ప్రవేశపెట్టబడింది. ఇది ఒక సంచలనాత్మక నాటకం. ప్రేక్షకులకు చీకటైతే పాత్రలకు వెలుగు, పాత్రలు వెలుతురులో ఉంటే ప్రేక్షకుల దృష్ట్యా చీకటి అన్నవిషయాన్ని స్థిరపడిన తరువాత వెలుతురువుండీ లేనట్లు నటించడం నటుడికి, దర్శకుడికి మధ్య కొత్తసవాలును సృష్టించిన నాటకం ఇది.

1973లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ స్పెషల్ ఆఫీసర్ శ్రీకె.ఆర్.పరమహంస ఆధ్వర్యంలో "థియేటర్‌వర్క్‌షాప్" ఆరుమాసాలపాటు నడపబడింది. శ్రీ చాట్ల శ్రీరాములుగారి పర్యవేక్షణలో "త్రిజాకీ యమదర్శనం" అను నాటకం రచింపబడింది. 40మంది ఔత్సాహికులకు నాటకరంగంలోని అన్ని శాఖల్లో శిక్షణ గరపడం జరిగింది. వీరు "త్రిజాకీ యమదర్శనం" నాటకాన్ని ఆంధ్రదేశంలోని పలుచోట్ల పన్నెండుసార్లు ప్రదర్శించారు. 40 మందికి పైగా నటులు పాల్గొని నటించిన రెండుమూడు పెద్ద నాటకాలలో ఒది ఒకటి. ఇది ఒక ప్రయోగాత్మక నాటకమనే చెప్పాలి.

అంగర సూర్యారావుగారు "ఇంద్రసేన" అనునాటకాన్ని రచించారు. ఈనాటకం పలుసార్లు ప్రదర్శింపబడి, ఉత్తమ నాటకంగా పరిగణింపబడింది.

"మృచ్ఛకటికం" ఆనాటి పరిస్థితులను, వేషభాషలను ప్రతిబింబింప జేసింది. కాని "త్రిజాకీయమదర్శనం," "చంద్రసేన" అను ఈ రెండు నాటకాలు ఆనాటి వేషభాషలతో ఈనాటి పరిస్థితులను వ్యక్తపరచడం ఒక వినూత్న, విశిష్టమైన ప్రయోగం.

సంగీత నాటక అకాడెమీవర్క్‌షాప్ తెలుగుదేశంలో నాటక ప్రయోగంలో రంగోద్దీపనానికి శ్రీకారం చుట్టింది. గత ఆరేండ్లలో రంగోద్దీపనంలో తెలుగు దేశమందు 'వర్క్‌షాప్' సాధించిన ప్రగతి గణనీయమైంది.

"బెర్టోల్డ బ్రెష్ట్" రచించిన "ఎక్సెప్షన్ అండ్ ది రూల్" అను నాటకాన్ని శ్రీడి.ప్రభాకర్ తెలుగులోనికి స్వేచ్ఛానువాదం చేశాడు. ఒకసారి గుంటూరులో "మంచిమనిషి" అనునాటకం ప్రదర్శింపబడింది. ఇదికూడ బ్రెష్ట్ నాటకానికి అనువాదమే.

"ఎక్సెప్షన్ అండ్ ది రూల్" నాటకానికి స్వేచ్ఛానువాదం చేసిన తరువాత దీనిని చదివి ప్రభావితుడైన శ్రీ శ్రీ ఈ నాటక ప్రయోగంకోసం కొన్ని (గీతాలు) గేయాలు వ్రాశాడు. ఈ నాటక ప్రయోగానికి ముఖ్యులు శ్రీగరిమెళ్ల రామమూర్తి, శ్రీడి.ప్రభాకర్.

ఈ విధంగా పరభాషల నాటకరంగాల ప్రభావంతో కొత్తపుంతలు తొక్కిన తెలుగు నాటకరంగం వాటితో సమానంగా తులతూగాలంటే ఇంకా యెంతగానో యెదగవలసివుంది. అధునాతన ప్రయోగాత్మక నాటకాలు వెలువడవలసి వుంది.

దీనికి ఆధారం – చాట్ల శ్రీరాములుగారి వ్యాసం – సౌజన్యంతో "కళ కళ కోసం" – ఒకనాటిమాట. "కళ సమాజంకోసం" – ఈనాటిమాట.

**నేచ్యురాలిస్టిక్ ప్లే :**

"మరో మొహంజొదారో – వారే ఇన్‌సాన్ (హిందీ) ఆంధ్రప్రదేశ్ నాటక సంఘం – వీక్‌ఎండ్ థియేటర్ ప్రోగ్రామ్ నిర్వహించింది.

థియేటర్ వర్క్‌షాప్ – స్పెషలాఫీసర్ కె.ఆర్. పరమహంస.

బెర్టోల్డ్ బ్రెష్ట్ – (Exception and the Rule) (నాటకంపేరు).

**రసము**

రసము : ఆస్వాదింపబడుచున్నది రసము. వివిధ రుచికరములైన పదార్థముల, ఓషధుల, ద్రవ్యముల సమపాళ్ల సంయోగమువలన రసములు

నిష్పన్నమగుచున్నట్లే, వివిధములైన విభావాదులచే ఉపగతములై, స్థాయి భావములుకూడ రసత్వము పొందుచున్నవి.

రసాస్వాదము: "వివిధములగు వ్యంజనములచే సంస్కరింపబడిన అన్నమును భుజించుచున్న సు మనస్కులైన పురుషులు రుచులను ఆస్వాదించుచు, హర్షాదులను పొందుచున్నట్లే, వాచిక ఆంగిక - సాత్వికాభినయములచే ప్రదర్శితములగుచున్న వివిధములగు భావములచే వ్యంజితములైన స్థాయి భావములను సుమనస్కులైన ప్రేక్షకులు ఆస్వాదించుచు, హర్షాదులను పొందుచున్నారు. కావుననే ఇవి "నాట్యరసములు" అని చెప్పబడినవి.

నాట్యశాస్త్రము:అధ్యాయము : 6. పేజి : 197.

నటుడు అభినయములచే భావములను వ్యక్తము చేయును. ఆ భావములు ప్రేక్షకులలోని స్థాయి భావములను వ్యంజితములను చేయును.

షడ్రుచులను (తీపి, వగరు, కారము, చేదు, పులుపు, ఉప్పు) "లౌకిక రసములు" అందురు. (షడ్రసములు).

"రసహీనమై ఏ అర్థమూ ప్రవర్తింపదు" అట్టిరసము విభావ - అనుభావ - వ్యభిచార భావముల సంయోగమువలన నిష్పన్నమగుచున్నది."

నాట్యశాస్త్రము : అధ్యాయము : 6. పేజి : 196

రూపకమందుకాని, కావ్యమందుకాని రసమేముఖ్యమనియు, రసముగా పరిణమించని లేదా రసమునకు పోషకముకాని ఏ అర్థమును వానియందుండరాదని సారాంశము. వ్యాఖ్యాత్ప - నట - సామాజికులదృష్టిలో రసమునకే ప్రాముఖ్యమని అభినవగుప్తుడు తెలియజేశాడు.

శ్లో: యథా బహుద్రవ్యయుతై ర్వ్యంజనైర్బహు భిర్యుతమ్
ఆస్వాదయంతి భుంజానా భక్తంభక్తవిదో జనాః
భావాభినయనం బద్ధాన్ స్థాయి భావాం స్తథా బుధాః
ఆస్వాదయంతి మనసా తస్మాన్నాట్యరసాః స్మృతాః

బహుద్రవ్యయుతములైన, బహువ్యంజనములతోకూడిన అన్నమును, అన్నముయొక్క రుచియెరిగిన జనులు భుజించుచు, రసనావ్యాపారముచే ఆస్వాదించుచున్నట్లే, భావ - అభినయములతో సంబద్ధములైన స్థాయి భావములను చర్వణచేయుచు, బుధులు మనోవ్యాపారముచే ఆస్వాదించుచున్నారు. అందుచేతనే ఇవి "నాట్యరసములు" అనబడినవి. - నాట్యశాస్త్రము:అధ్యాయము 6:పేజి 198.

"కవిగతమైన రసము బీజము. ఆ బీజంనుండి జన్మించిన కావ్యమే వృక్షము. అభినయాది నటవ్యాపారములచే ఆవిష్కృతములైన భావములు పుష్పస్థానీయములు. సామాజిక రసాస్వాదము ఫలస్థానీయము. ఈ విధంగా విశ్వము రసమయము. ఇట్లు కవిగతమైన రసము కావ్యగతమగుచున్నది. అట్లు కావ్యగతమైన రసమే నాట్య వ్యాపారముచే అభివ్యక్తమై, సామాజికునిచే ఆస్వాదింప బడుచున్నది. కావుననే "కవిర్హి సామాజిక తుల్య ఏవ" అని భట్టతౌతుడు చెప్పాడు.

నాట్యశాస్త్రం అధ్యా : 6. పేజి 200

అష్టరసములు : బ్రహ్మ ప్రవచించిన రసములు ఎనిమిది.

శ్లో॥ శృంగార - హాస్య - కరుణా - రౌద్ర - వీర - భయానకాః।
బీభ - త్సాద్భుత సంజ్ఞా చేత్యష్టౌ నాట్యే రసాస్స్మృతాః।

1. శృంగారము 2. హాస్యము 3. కరుణము 4. రౌద్రము 5. వీరము 6. భయానకము 7. బీభత్సము 8. అద్భుతము.

ఈ ఎనిమిది రసములను బ్రహ్మదేవుడే చెప్పినట్లు తెలుస్తుంది. ఎనిమిది రసములకు ఎనిమిది స్థాయి భావములు.

శ్లో॥ "రతి - ర్హాసశ్చ - శోకశ్చ - క్రోధోత్సాహౌ - భయం తథా।
జుగుప్సా - విస్మయశ్చేతి స్థాయీ భావాః ప్రకీర్తితాః।"

1. రతి 2 హాస్యము 3. శోకము 4. క్రోధము 5. ఉత్సాహము 6. భయము 7. జుగుప్స 8. విస్మయము

నవరసములు:- ఆ తరువాత వచ్చిన [illegible]

1. శృంగారము, 2. హాస్యము, 3. కరుణము, 4. రౌద్రము, 5. వీరము, 6. భయానకము, 7. బీభత్సము, 8. అద్భుతము, 9. శాంతము.

శ్లో॥ శృంగారహాస్య – కరుణా – రౌద్ర – వీర – భయానకాః
బీభత్సాద్భుత – శాంతాశ్చ నవనాట్యే రసాః స్మృతాః॥

(ఉద్భటుని కావ్యాలంకార సారసంగ్రహము. )

(చతుర్థవర్గము, 4వ.శ్లో)

........................................................................................................................................

కరుణ = దయ

'కరుణ'ను రసముగా చెప్పదలచి నప్పుడు "కరుణము" అని చెప్పవలెను.

రసములు తొమ్మిది అయినప్పుడు స్థాయి భావములుకూడ తొమ్మిది అవుతాయి.

శ్లో॥ రతి – ర్హాసశ్చ – శోకశ్చ – క్రోధోత్సాహౌ – భయం తథా!
జుగుప్సా – విస్మయ – శమాః స్థాయీ భావాః ప్రకీర్తితాః ॥

1. రతి, 2.హాసము, 3. శోకము, 4. క్రోధము, 5. ఉత్సాహము, 6.భయము, 7. జుగుప్స, 8. విస్మయము, 9. శమము.

శృంగారము రసరాజమని యెక్కువమంది ఆలంకారికులు అంగీకరించారు. నాటకమందు "శృంగార – వీర రసములు" అంగి రసములుగా అంగీకరింపబడ్డాయి.

లోకంలో శృంగారము సర్వప్రాణిసాధారణం. దీనివలన సంసారమేర్పడును. సంసార రక్షణమున వీరరసము అవసరమై యున్నది. ఆ సంసారము విచ్ఛిన్నమైనచో కలిగేది దుఃఖము. ఈ విధంగా "సృష్టి, స్థితి, లయములు" అనెడి మూడు జీవితావస్థలకు మూడు కావ్యరసములు పొందుపడియున్నవి. ఈ కారణంగా "శృంగార, వీర, కరుణ" రసములు మూడు ప్రధానములని కొందరి ఆలంకారికుల అభిప్రాయం.

అభినవగుప్తుడు రసముల క్రమవిధానాన్ని క్రింది విధంగా తెలియజేశాడు.

"కామం" సకలజాతి సులభం. "శృంగారం" అందరికి హృద్యమైంది. అందుచేత శృంగారం మొదటి రసంగా చెప్పబడింది. నిరపేక్షాభావం కల "హాస్యం", శృంగారానుగామి. అందుచేత హాస్యం రెండవది. శృంగారముయొక్క విపర్యయమే కరుణము. అందుచేత అది మూడవది. కరుణ నిమిత్తమైనది రౌద్రరసము. ఇది అమర్ష ప్రధానము. తరువాత "కామ – అర్థములు".

ధర్మమూలములగుటవలన ధర్మప్రధానమైన వీరరసము చెప్పబడుచున్నది. వీరము భీతభయ ప్రధాన సారమగుటచేత ఆ తరువాత భయానకము చెప్పబడింది. భయానక–బీభత్సరసముల విధానము లించుమించు సమానముగా ఉండడంచేత బీభత్సము వీరముచేతనే ఆక్షిప్తమగుచున్నది. వీరముయొక్క చివర దానియొక్క ఫలమే అద్భుతము. వీటిని మూడు వర్గములుగా విభజింపవచ్చును. ఈ యెనిమిది రసముల తరువాత మోక్షఫలమైన శాంతరసము చెప్పబడినది.

శృంగారము, హాస్యము, కరుణము, శాంతము కోమల రసములు. రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతములు ఉద్ధత రసములు.

పై రసములలో 'కావ్య, నాట్యము' లందు యేదేని ఒకరసము అంగి (ప్రధాన) రసముగా వుండును. తక్కినవానిలో కొన్ని అంగ (అప్రధాన) రసములగును. ఈ అంగరసములు అంగిరసమును మ్రింగివేయునట్లుగా కాక, అంగిరస పోషకములుగా మాత్రమే వర్ణింపబడవలెను." (అభినయింపబడవలెను).

(అభినవ భారతి – 1వసంపుటి.పుట 267)

**నవరసపోషణము :**

నవరసాలను పోషించడమంత సులభమైన పనేమీకాదు. కొందరు నటులు కొన్ని రసాలను మాత్రం మహా అద్భుతంగా పోషించారు. అన్నిరసాలను అందరు నటులూ పోషించలేరు. కాని కొందరిలోమాత్రం దైవదత్తమైన ప్రతిభ, నటనాకౌశలం ఉండడంచేత, వారు అన్ని రసాలను సునాయాసంగా పోషించగలిగారు. అలాంటి వేళ్లమీద లెక్కించదగిన రంగస్థల నటులలో శ్రీ బళ్ళారి రాఘవ లాంటివారు వుంటారు. చలనచిత్రరంగంలో కీ.శే.ఎస్.వి.రంగారావుగారు, శ్రీ ఎన్.టి.రామారావుగారు ఇటువంటి కోవకు చెందినవారు. "నవరాత్రి" చలన చిత్రంలో నవరసాలను పోషించడానికి ప్రయత్నించి, కొంతవరకు కృతకృత్యులైనవారు శ్రీ శివాజి గణేశన్ గారు, శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారు.

బళ్ళారి రాఘవ తరువాత వారి సహనటులు కళాభారతి బిరుదాంకితులు కీ.శే.పూని నాగేశంగారు నవరసాలు పోషించి, వాటిని 'ఫోటో'లలో బంధించడంచేత, ఈనాడు వాటిని మనం చూడగలుగుతున్నాము. శ్రీనాగేశంగారు పోషించిన నవరసాలలో అష్టరసాల (చిత్రాలు) ఫోటోలు మాత్రం మనకీనాడు లభ్యమవుతున్నాయి. నవరసాలను శ్రీనాగేశంగారి ఫోటోలతో సోదాహరణంగా వివరించడం జరిగింది. ఒక్క శృంగార రసానికి మాత్రం వారి "ఫోటో" లభ్యంకానందున రసవివరణచేసి, ఆ స్థానంలో వారి సాధారణ ఫోటో వుంచవలసి వచ్చింది.

**నవరసములు – వివరణ :**

1.శృంగారము : శృంగార రసము "రతి" అను స్థాయిభావమునుండి ఉత్పన్నమవుతుంది. లోకమందు యేదైనా శుచిగా, పవిత్రంగా, ఉజ్వలంగా, దర్శనీయంగా ఉన్నచో దానిని "శృంగారము"తో పోలుస్తారు. హృద్యమును, ఉజ్వలమును అగు వేషము కలదగుట వలన "శృంగార రసము" అనుపేరు స్థిరపడింది. ఈ శృంగారరసము నిండు యవ్వనములో ఉన్న ఉత్తమ స్త్రీ–పురుష ప్రకృతులకు సంబంధించి ఉంటుంది.

"ఋతు – మాల్య – అలంకారములు, విదూషకాది ప్రియజనులు, గీతాది హృద్య విషయములు, కావ్యములను వినుట, పఠించుట, ఉద్యానవన విహారము" మొదలగునవి శృంగారరసము ఉద్భవించడానికి కారణభూతములు.

శృంగార రసాభినయము : "నయన – వచన ప్రసన్నతలు, స్మితము (చిరునవ్వు) మధురవాక్కులు, ధృతి, ప్రమోదము, మధురములైన అంగహారములు" అనువానితో శృంగార రసమును అభినయించాలి.



శ్రీ పూని నాగేశంగారు–శృంగార రసపోషణ

2. హాస్యము : హాస్యరసము "హాసము" అనెడి స్థాయిభావమునుండి జనిస్తుంది.

"వికృతములైన పరవేష – అలంకారములు, నిర్లజ్జత, లౌల్యము, చక్కిలిగింతలు పెట్టుట (కుహకము), అసత్ప్రలాపము, అంగవికలులను చూచుట, అనిమిత్తభయాదులను, అకార్యకరణములను, వికృత వేషాదులను వర్ణించి చెప్పుట" మొదలగు విభావముల వలన హాస్యరసము ఉత్పన్నమవుతుంది.

హాస్యరసాభినయము : "పెదవులను, ముక్కు, చెక్కిళ్లను స్పందింపజేయుట, కనులను కొలదిగా మూయుట, విప్ఫారజేయుట, స్వేదము, ముఖరాగము, రెండు చేతులతో తనప్రక్కలను పట్టుకొనుట" ఇత్యాది చేష్టలచే హాస్యరసమును అభినయించవలెను.

హసితము : (Smile) చెక్కిళ్ళు వికసించవలెను. కనులు, ముఖము, బాగుగా విప్ఫారవలెను. పలువరుస కొంచెము కనబడునట్లు నవ్వవలెను. ఇట్టిది 'హసిత' మనబడును.



కళాభారతి శ్రీ పూని నాగేశం–హాస్యరస పోషణ

3. కరుణము : ఇది 'శోక' మనెడి స్థాయి భావమునుండి జనించును.

అంగములు వ్రేలాడుట, ఉఛ్వాస నిశ్వాసము అధికమగుట, మరపు," మొదలగు అనుభవములచే కరుణరసమును అభినయించవలెను.

ఇష్టజనుల వధను చూచుటవలనగాని, అప్రియ సంభాషణల వలనగాని, అనిష్టములైన వాక్యములను వినుటవలన గాని, "కరుణరసము" సంభవించును.

గట్టిగా ఏడ్చుట, మూర్ఛాదులనొందుట, పరిదేవనము చేయుట, విలపించుట, ఆయాసపడుట, గుండెలు బాదుకొనుట" మొదలగు అనుభవములచే కరణరసమును అభినయించవలెను.

కళాభారతి శ్రీ పూనినాగేశం-కరుణరస పోషణ

4. రౌద్రము : ఇది క్రోధమనెడి స్థాయి భావమునుండి జన్మిస్తుంది.

ఇది రాక్షసుల దానవుల, ఉద్ధత మనుష్యుల ప్రకృతులకు సంబంధించి వుంటుంది. ఇది యుద్ధము వలన పుట్టును.

క్రోధము, ఆదర్షణము (ఇతరుల భార్యలను చెరచుట) అధిక్షేపము (దేవ-జాతి-అభిజన-విద్యా-కర్మలను నిందించుట), అవమానము, అసత్యవచనము, ఉపఘాతము (పనివారిని బాధించుట), వాక్పారుష్యము (కొట్టుదును, చంపుదును అని భయపెట్టుట), అభిద్రోహము (చంపదలచుట), అసూయ మొదలగు విభావములచే రౌద్రరసము ఉత్పన్నమగును.

రౌద్రరసాభినయము : "కనులెఱ్ఱజేయుట, చెమట పట్టుట, బొమ ముడివేయుట, పండ్లు కొఱుకుట, ఔడుకఱచుట, చెక్కిళ్ళు అదరుట, అరచేతులు రెండింటిని రాయుట" మొదలగు అనుభవములచే రౌద్రరసమును అభినయించవలెను.

క్రోధము : రౌద్రములైన వాక్కులు, అంగములు చేష్టలు కలిగినదై, శస్త్రప్రహారములతో కూడినదై, ఉగ్రకర్మలతో నిండినదై రౌద్రము ఒప్పుచుండును.

యుద్ధమునందు కొట్టుకొనుట, నరకుట, వికృతముగా ఛేదించుట, చీల్చుట, శిరస్సును, మొండెమును, భుజములను తెగకోయుట.

కళాభారతి పూనినాగేశం-రౌద్రరసపోషణ

5.వీరము : ఉత్సాహము ఉత్తముల స్వభావము. ఉత్సాహాత్మకము కావున వీరముకూడ ఉత్తమ ప్రకృతికము.

కలత చెందకుండుట, పట్టుదల, సంధి - విగ్రహాదుల ప్రయోగము, ఇంద్రియజయము, చతురంగ బలము కలిగియుండుట, శత్రుమండలాదుల నాక్రమించుట, యుద్ధాదులందలి సామర్థ్యము, శత్రువులకు సంతాపమును కలిగించు ప్రసిద్ధి, అభిజన - ధన - మంత్రి సంపద" మొదలగు విభావముల వలన వీరరసము ఉత్పన్నమగుచున్నది.

వీర రసాభినయము : "స్థైర్యము, ధైర్యము, వీర్యము, గర్వము, ఉత్సాహము, పరాక్రమము, ప్రభావము, ఆక్షేపణ పూర్వకములైన వాక్యములు" ఇత్యాది అనుభావములచే వీర రసమును అభినయించవలెను
స్థాయి: ఉత్సాహము

కళాభారతి శ్రీ పూనినాగేశం-వీరరసపోషణ

6. భయానకము : భయానకరసము "భయము" అను స్థాయిభావమునుండి జనిస్తుంది.

స్థాయి : భయము

"వికారమైన అరపులు వినుట, పిశాచ దర్శనము, నక్కల, గుడ్లగూబల అరుపులు, ఇతరుల త్రాసమును, ఉద్వేగమును చూచుట, శూన్య గృహమునకు కాని, అరణ్యమునకు కాని వెళ్ళుట, స్వజనవధ, స్వజన బంధనములను చూచుట, వినుట, వధలకు సంబంధించిన



కథలు చెప్పుట" మొదలగు విభావముల వలన భయానకరసము ఉత్పన్నమగును.

భయానక రసాభినయము: కంపించుచున్న కరచరణములు, చలించుచున్న కనులు, పులకలు, ముఖవైవర్ణ్యము, స్వరభేదము" మొదలగు అనుభావములచే భయానక రసమును అభినయించవలెను.

కళాభారతి శ్రీపూనినాగేశం-భయానకరసపోషణ

7. బీభత్సము : ఇది జుగుప్స అను స్థాయిభావమునుండి ఉత్పన్నమగును.

స్థాయి: జుగుప్స.

"శరీరమును పిండీకృతము చేయుట, ముఖ సంకోచనము, వాంతి చేయుట (ఉల్లేఖనము), ఉమ్మివేయుట, మాలాదులను చూచుట, గాత్రమును ఎగురవేయుట" మొదలగు విభావములవలన బీభత్సరసము ఉదయించును.



బీభత్సరసాభినయము: 'ముఖనేత్రములను సంకోచింప జేయుట, ముక్కుమూసుకొనుట, ముఖమును వంచుట, ఎత్తెత్తి నేలకు అంటీ అంటకుండా అడుగులు వేయుట అనెడి అను భావములచే బీభత్సరసమును అభినయించవచ్చును.

కళాభారతి శ్రీపూని నాగేశం – బీభత్సరస పోషణ

8. అద్భుతము : అద్భుత రసము "విస్మయము" అనెడి స్థాయి భావమునుండి జనించును.

స్థాయి : విస్మయము.



"దేవతలను దర్శించుట, ఈప్సిత మనోరథము సిద్ధించుట, ఉద్యానవనములకు, దేవాలయములకు వెళ్ళుట, సభవిమానమాయాఇంద్రజాలాదులను చూచుట" మొదలగు వాని వలన అద్భుత రసము ఉత్పన్నమగును.

అద్భుతరసాభినయము : "విప్పారిన కనులు, రెప్పపాటులేని చూపు, రోమాంచము, అశ్రుపాతము, స్వేదము, హాహాకారము, చేతులను, వదనమును, వ్రేళ్ళను, వస్త్రములను ఆడించుట"మొదలగు అనుభావములచే అద్భుతరసము నభినయించవలెను.

కళాభారతి శ్రీపూనినాగేశం – అద్భుత రసపోషణ

9. శాంతము : శాంతరసము "శమము" అనెడి స్థాయి భావము నుండి జనించును.

స్థాయి : శమము.



"మోక్షము, తత్వజ్ఞానము, వైరాగ్యము, ఆశయ శుద్ధి, ఆధ్యాత్మము" మొదలగు విభావముల వలన శాంతరసము జనించును.

శాంత రసాభినయము : "యమ – నియమములు, ఆధ్యాత్మ – ధ్యాన – ధారణ – ఉపాసనములు, సర్వభూతదయ, వైరాగ్య చిహ్నములను ధరించుట" మొదలగు అనుభావములచే శాంతరసమును అభినయించవలెను.

కళాభారతి శ్రీ పూనినాగేశం – శాంత రస పోషణ

ఆంధ్రకర్ణాటక సామ్రాజ్యంలో "బళ్ళారి" అంతర్భాగంగా ఉండేది. శ్రీకృష్ణదేవరాయల సామ్రాజ్యంలో రాయలసీమ రతనాలసీమగా అలరారింది. స్వాతంత్ర్యానంతరం భాషారాష్ట్రాల పునర్విభజన జరిగేవరకు 'బళ్ళారి' ఆంధ్రరాష్ట్రంలో ఒకభాగమై రాయలసీమలో లలితకళా కేంద్రంగా రాణించింది.

పూర్వకాలం నుండి బళ్లారి పరిసర ప్రాంతాలలో 'బయలాట' అను జానపద కళారూపం విశేషంగా ప్రచారంలో వుండేది. బళ్ళారిలో "గరుడచేడు హనుమంతప్ప, రామసాగరం వెంకణ్ణ, కురుగోడు దొడ్డ కని," మొదలగువారు "జనల్ ఘాట్" "మేఘాట్" అను బయలాట కంపెనీలను ఆ కాలంలో నడుపుతూ వుండేవారు. ఆ తరువాత మహారాష్ట్ర నుండి "ధార్వాడ నాటక సమాజం" వారువచ్చి హిందీ, మరాఠీ నాటక ప్రదర్శనలు, "జంఖండి" నాటకాలపేరుతో 1870-80 ప్రాంతంలో బళ్ళారినుండి ప్రారంభించి, ఆంధ్రదేశమంతటా ప్రదర్శించారు. వివిధ రకాలైన రంగుల తెరలతో, చిత్రవిచిత్ర వేషభాషలతో నాటకాలను ప్రదర్శించి, ప్రజలలో ఒకనూతన చైతన్యాన్ని కలిగించారు.

## ధర్మవరం రామకృష్ణమాచార్యులు :



బయలాటల తరువాత కన్నడ భాషా ప్రభావంకల బళ్ళారిలో మొట్టమొదటిసారిగా కన్నడంలో రంగస్థల నాటకాలు ఆవిర్భవించాయి. వీటిని చూచి ప్రభావితులైన శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు కన్నడ భాషలో "బాణాసుర, ఉషాపరిణయం, వామనచరిత్ర" నాటకాలను రచించి, దర్శకత్వం నిర్వహించి, ప్రదర్శింప జేశారు. 1879లో శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు ఆంగ్లనాటకాలలో పాత్రలు పోషించి, స్వయంగా నాటకాలు ప్రదర్శించారు. కన్నడ నాటకాలు రచించి, విజయవంతంగా ప్రదర్శించడంతో ఉత్సాహం పుంజుకున్న శ్రీ ధర్మవరంవారు తన 20వ యేట తెలుగు నాటక రచనకు ఉపక్రమించారు. రచించిన నాటకాలను ప్రదర్శించడానికి ఒకనాటక సమాజం అవసరమైంది. శ్రీ రామకృష్ణమాచార్యులు 1885లో "సరసవినోదినీ" నాటక సమాజాన్ని స్థాపించారు. 1886లో "చిత్రనళీయం" అను తాను మొదట రచించిన తెలుగు నాటకాన్ని "సరసవినోదినీ" నాటకసమాజంద్వారా ప్రదర్శింపజేశారు. ఇదే ఆంధ్రదేశంలో ప్రప్రథమ తెలుగు నాటకసమాజం.

శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారు "చిత్రనళీయం,పాదుకాపట్టాభిషేకం, ప్రహ్లాద, విషాద సారంగధర, మోహినీ రుక్మాంగద, బృహన్నల, ముక్తావళి" మొదలగు 28తెలుగు నాటకాలను రచించి, తాను స్వయంగా "దశరథుడు, బాహుకుడు, రాజ రాజ నరేంద్రుడు" మొదలైన పాత్రలను ధరించి, నాటకాలను ప్రదర్శించారు. వీరు రచించిన నాటకాలన్నిటినీ బళ్ళారిలో "సరసవినోదినీ" నాటక సమాజంద్వారాను, మదరాసు "సుగుణవిలాస" సభలోను పలుసార్లు ప్రదర్శించారు.

శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు వృత్తిరీత్యా న్యాయవాది. గొప్పనాటక రచయిత. మంచినటులు, ఉత్తమ దర్శకులు. ఆ కాలంలో నాటక ప్రదర్శనలలో సంగీత ప్రాచుర్యం అధికంగా వుండేది. వీరి నాటకాలలో పద్యాలు, గేయాలతో కూడిన సంగీత ప్రాధాన్యం యెక్కువగా గోచరిస్తుంది. వీరు గొప్పనటులుగా, నాటక రచయితగా అచిరకాలంలోనే అఖిలాంధ్రదేశంలో అశేషకీర్తి ప్రతిష్ఠలు నార్జించుకున్నారు.

1910లో గద్వాల మహారాజుగారు శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులుని సాదరంగా ఆహ్వానించి "ఆంధ్రనాటకపితామహ" అను బిరుదునిచ్చి, ఘనంగా సన్మానించారు. గద్వాల పౌరులు నాటక కళపై తమకుగల ప్రగాఢమైన అభిమానాన్ని వ్యక్తపరుస్తూ, నవరత్నఖచిత బంగారు కిరీటాన్ని శ్రీ ధర్మవరం వారికి బహూకరించి, గొప్పగా సత్కరించారు.

## ధర్మవరం గోపాలాచార్యులు :

ఆ తరువాత నటులుగా, నాటక రచయితగా పేరు ప్రఖ్యాతులార్జించినవారు శ్రీ ఆచార్యులవారి సోదరులు శ్రీ ధర్మవరం గోపాలాచార్యులుగారు. వీరు కూడ ప్రముఖన్యాయవాది. "సరసవినోదినీ సభ" వ్యవస్థాపకులలో ఒకరు. వీరు "రామ కబీరు, ప్రేమచంద్రయోగి, అస్పృశ్యవిజయం" అనునాటకాలను రచించారు. వీరికి "భక్తరామదాసు" పాత్ర మహానటులుగా కీర్తి ప్రతిష్ఠలార్జించి పెట్టినది. శ్రీ గోపాలాచార్యులుగారు అన్నగారిమీద నున్న గౌరవంతో "ధర్మవరం రామకృష్ణమాచార్యుల నాటకశాల" అను ఒకనాటక ప్రదర్శన శాలను నిర్మించి, ఆనాడు బహుళ ప్రచారంలో వుండిన నాటకాలను ప్రదర్శించారు.

శ్రీగోపాలాచార్యులుగారు శ్రీ బి.వి.కృష్ణారావుగారి ప్రోత్సాహంతో రంగస్థల ప్రవేశం చేశారు. వీరు మద్రాసులో పచ్చియప్ప కళాశాలలో చదువుకుంటూ, తన ఇరవైయవయేటనే 'చెన్నపురి ఆంధ్రమహాసభ'లో సభ్యులుగాచేరి, పది సంవత్సరాలకుపైగా ఆంధ్రమహాసభ నాటకాలకు దర్శకత్వం వహించారు. వీరు ఆంధ్రమహాసభలో "రామదాసు, కృష్ణతులాభారం, ఖిల్జీరాజ్య పతనం, భీష్మప్రతిజ్ఞ" మొదలగు నాటకాలలో "రామదాసు, శ్రీకృష్ణుడు, ఖిజీర్ఖాను, భీష్ముడు" పాత్రలను అద్భుతంగా పోషించారు. భీష్మపాత్రను చూచిన ప్రముఖ సినీదర్శకులు శ్రీబి.యన్. రెడ్డిగారు గోపాలాచార్యులుగారిని గొప్పగా ప్రశంసించారు. రామదాసు నాటకంలో పద్మశ్రీచిత్తూరు నాగయ్యగారు కబీరుపాత్రను పోషించగా, శ్రీగోపాలాచార్యులుగారు రామదాసు పాత్రను పోషించి, జస్టిస్ సుందరం చెట్టిగారి నుండి బంగారు పతకాన్ని స్వీకరించారు. వీరు అనేక సాంఘిక నాటకాలలో విభిన్న పాత్రలను ధరించారు. జీవితాంతం నాటక కళామతల్లిసేవలో అంకితమైన మహానటులు శ్రీ ధర్మవరం గోపాలాచార్యులు గారు. గొప్ప నటులుగా, దర్శకులుగా, క్రమశిక్షణగల కార్యదక్షులుగా, రాయలసీమకు వన్నె తెచ్చిన జాతిరత్నం. అమరనటులు, ఆంధ్రనాటక కళామతల్లి ముద్దుబిడ్డ శ్రీబళ్ళారి రాఘవ మేనమామయైన శ్రీధర్మవరంవారి సరసవినోదినీ సభలోను, శ్రీకోలాచలంవారి సుమనోరమ నాటక సమాజంలోను నటించినా, నటనకు ప్రాధాన్యమిచ్చే సుమనోరమ నాటక సమాజ మంటేనే వీరికి అభిమానమెక్కువ. అందులోనే వీరెక్కువగా నటిస్తుండేవారు.

వీరికాలంలో పెక్కురు నాటక రచయితలు ఆవిర్భవించారు. శ్రీధర్మవరం, శ్రీకోలాచలంవారి తరువాత నాటక రచయితగా ప్రసిద్ధిగాంచినవారు బళ్ళారి వాస్తవ్యులు "శ్రీపండిత కె.సుబ్రహ్మణ్యశాస్త్రి"గారు. వీరు "శ్రీకృష్ణలీలలు, లవకుశ, రామరావణ యుద్ధం, లంకాదహనం, భక్తకుచేల, ద్రౌపదీ వస్త్రాపహరణము, మేవాడ శౌర్యాగ్ని, ప్రౌఢకృష్ణలీల" మొదలగు పౌరాణిక, చారిత్రాత్మక నాటకాలను రచించారు. వీరి "శ్రీకృష్ణలీలలు, లవకుశ," నాటకాలు చలనచిత్రాలుగా నిర్మింపబడి, విజయవంతంగా ప్రదర్శింపబడ్డాయి.

ఆ రోజులలో బళ్లారి నాటకరంగానికి నాటక రచయితలుగా పేరుప్రఖ్యాతులార్జించి పెట్టినవారిలో ప్రముఖులు "శ్రీరావు బహద్దర్ హనుమంతగౌడ్, పద్మనాభ వెంకోబాచారి, శ్రీతోరణగల్లు రాజారావు, శ్రీసుబ్బశాస్త్రి" మొదలగువారు.

ఒకనాడు బళ్ళారి పట్టణం ఆంధ్రనాటక కళామతల్లికి నవరత్న ఖచిత సువర్ణ శిరోభూషణం. ఔత్సాహికులైన నటులతో, నాటక రచయితలతో, పేరెన్నికగన్న నాటక సమాజాలతో, ప్రథమ ప్రదర్శన శాలలతో, కవులతో, దర్శక విమర్శకులతో, సరసులు, విజ్ఞులు అయిన ప్రేక్షక పౌరులతో నాటక కళామతల్లిని స్వర్ణసింహాసనంపై అధిష్టింపజేసి, నీరాజనంపట్టి, నివాళులర్పించిన ఘనమైన గడ్డ బళ్ళారి. తనపేరు ప్రతిష్ఠలను, కీర్తి పుంజాలను విశ్వంబరవీధిలో కోటిసూర్యప్రభలతో "సభూతో.........."అని జగజ్జేగీయ మానంగా ప్రకాశింప జేసిన విశ్వవిఖ్యాత మహానటుడు "శ్రీతాడిపత్రి రాఘవాచార్యుల"కు ఆశ్రయమిచ్చి, ఆయనపేరుతో అవినాభావ సంబంధం యేర్పరచుకొని, ఆ యశోభూషణుని కీర్తికాయ మున్నంతవరకు చిరస్థాయిగా నిలువగలిగిన స్థానాన్ని సంపాదించుకొని, ఆ మహనీయునిపేరులోనే యిమిడిపోయిన పుణ్యభూమి బళ్లారి.

## కోలాచలం శ్రీనివాసరావు :



శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యుల తరువాత ప్రథమాంధ్ర నాటకరంగ చరిత్రలో అంతటి కీర్తిప్రతిష్ఠ లార్జించిన వారు శ్రీకోలాచలం శ్రీనివాసరావుగారు. వృత్తిరీత్యా వీరుకూడా న్యాయవాదులే. వీరు ధర్మవరం వారికి సమకాలికులు. అన్నిటా సమవుజ్జీలనదగినవారు. వీరు బళ్ళారి వాస్తవ్యులు. 'పౌరాణికాంధ్ర నాటక పితామహ' బిరుదాంకితులు.

శ్రీకోలాచలం శ్రీనివాసరావుగారు "హరిశ్చంద్ర, కీచకవధ, లంకాదహనం, కుశలవ, పాదుకా పట్టాభిషేకం, చాంద్ బీబీ, రామరాజు చరిత్ర, మైసూరు రాజ్యం" మొదలగు 30 పౌరాణిక, చారిత్రాత్మక నాటకాలను రచించి ప్రదర్శించారు. వీరు బళ్ళారిలో "సుమనోరమ" అను నాటక సమాజాన్ని స్థాపించి, వీరు రచించిన నాటకాలను వీరి సమాజంద్వారానే ప్రదర్శింప జేశారు. శ్రీధర్మవరం వారి "సరసవినోదినీ సభ" సంగీతానికి ప్రాధాన్యమిస్తే, శ్రీకోలాచలంవారి "సుమనోరమ" నాటక సమాజం నటనకు ప్రాధాన్యమిచ్చేది.

**బళ్ళారి రాఘవ :**



నాటకరంగానికి ధృవతార "శ్రీ బళ్ళారి రాఘవాచార్యులు" క్రీ॥శ॥ 1880 ఆగస్టు 2వ తేదీన అనంతపురం జిల్లాలోని తాడిపత్రి గ్రామంలో "శ్రీ అష్టావధానం నరసింహాచార్యులు, శ్రీమతి శేషమ్మ" అను పుణ్యదంపతుల నోముల పంటగా జన్మించారు. తండ్రి మరణానంతరం ఆంధ్రనాటక పితామహ బిరుదాంకితులు శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యుల ఆశ్రయంలో బళ్ళారిలో పెరిగి, బళ్ళారి రాఘవాచార్యులుగా పిలువబడ్డారు. తాడిపత్రి, మద్రాసులలో విద్యనభ్యసించారు. మేనమామవలె న్యాయవాద వృత్తిని స్వీకరించారు. కళామతల్లి కాలిమువ్వగా మధురమంజుల నిస్వనాన్ని రసిక ప్రపంచానికి వినిపించారు. శ్రీ రాఘవ ఆజన్మ నటులు. చిన్నతనం నుండి నాటక కళపైన మక్కువ. తన పంద్రెండవ యేటనే శ్రీ రాఘవ రంగస్థల ప్రవేశం చేశారు. వీరు జన్మతః నటులవడం చేత, నటునికి కావలసిన లక్షణాలన్నీ పుణికి పుచ్చుకొని జన్మించిన కారణజన్ములు.

నటునికి "సర్వాంగసుందరమైన రూపం, మధురభాషణం, శాస్త్ర జ్ఞత" అవసరమని భరత శాస్త్రం చెబుతుంది. ఇవన్నీ శ్రీ రాఘవ గారి సొంతం. ఆయనను గూర్చి బళ్ళారి వాస్తవ్యులు, కవులు అయిన కీ॥శే॥ శ్రీ సంజీవ మూర్తి గారు ఇలా వ్రాశారు.

చ॥ పటుతర దేహసౌష్టవము బంధురమౌ

ముఖముద్రయున్ పరిస్ఫుటమగు

వాణియున్ నిశితబుద్ధియు గల్గి దృఢుక్తు

చిత్తమున్ త్రుటినివశంబు చేసికొను

నేర్పరి, నాట్యకళాప్రపూర్ణునిన్ నటజన

శేఖరున్ బహుజనప్రియు రాఘవున్ అర్థిగొల్చెదన్"

పై లక్షణాలన్నీ రాఘవునాశ్రయించినట్టివే. ఆజానుబాహుడు. ఆకర్ణాంతవిశాలమై, ఆకర్షణీయ అరవింద దళాయతాక్షుడు. విశాలమైన ఫాలభాగం, మిసమిసలాడే పసిమిఛాయతో, సన్నని పొడవైన, దృఢమైన శరీరం. చూపరులను అట్టే ఆకట్టుకొనే నిండైన, అందమైన విగ్రహం. స్ఫురద్రూపి ; ప్రబంధనాయకలక్షణ సమన్వితుడు శ్రీ రాఘవాచార్యులు.

మేనమామ శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు తెలుగునాటకరంగ సృష్టికర్తయై, పెక్కునాటకాలను రచించి, నటించి, ఒక నవ్యనాటక యుగానికి 'నాంది పలికితే, శ్రీ రాఘవాచార్యులు మామగారి అడుగుజాడలలో తన నాటకాలను నడిపిస్తూ, తానొక వినూత్న సామ్రాజ్యాన్నే సృష్టించుకొని, దానికి మకుటంలేని మహారాజుగా ఏకచ్ఛత్రాధిపత్యం చేశారు. శ్రీ రాఘవాచార్యులు ఆంధ్రనాటక కళకే అపూర్వమైన అజరామరమైన ఘనతను చేకూర్చిన మహనీయులు. ఈయన

"ఇంతింతై వటుడింతయై................॥ ఈవిశాల విశ్వాన్నే వ్యాపించినట్లుగా రాయలసీమలోని అనంతపురం జిల్లా, తాడిపత్రి గ్రామంలో జన్మించి, రాయలసీమ పరిధులుదాటి, ఆంధ్రావని అవధులు అధిగమించి, సంపూర్ణ భారతంలో సేతువునుండి, హిమవన్నగమువరకు యెత్తెదిగి, విశ్వవ్యాప్తంగా విదేశాలలో సహితం నాటి సాటినటులలో మేటిగా, విశ్వవిఖ్యాతి నార్జించిన మహామహుడు శ్రీ బళ్ళారి రాఘవ. ఈయన ఒకనాటక సమాజానికే పరిమితం కాలేదు. అన్ని నాటక సమాజాలూ ఈయనవే. ఈ విశాల విశ్వమే ఈయనకు రంగస్థలం. ఈయన "తెలుగు, కన్నడ, తమిళ, హిందీ, ఆంగ్ల," భాషలలో సుమారు 60 పౌరాణిక, చారిత్రాత్మక, సాంఘిక నాటకాలను వందలసార్లు దేశవ్యాప్తంగా ప్రదర్శించారు. విభిన్న మనస్తత్వంగల వివిధ పాత్రలను ధరించారు. సాత్వికాభినయానికి భాష్యం చెప్పారు. వీరిని "తాడిపత్రి రాఘవాచార్యులు, బళ్ళారి రాఘవ, రాఘవ" అని పిలుస్తారు. శ్రీ బళ్ళారి రాఘవ నటనలో పూర్వపు మొరటు తనానికి స్వస్తిచెప్పి, సున్నితత్వాన్ని ప్రవేశపెట్టారు. ఎన్నోవిప్లవాత్మకమైన మార్పులు తెచ్చారు. శ్రీ రాఘవ నటులుగా జన్మించారు. నటనలో జీవించారు. నటులుగా అమరులైనారు.

**శ్రీ రాఘవ ధరించిన పాత్రలు :**

శ్రీ రాఘవ ఆజన్మనటులు. తెలుగు, కన్నడము, తమిళము, హిందీ, ఆంగ్లభాషలలో అభినివేశమున్న స్థితప్రజ్ఞులు.ఇన్ని భాషలలో పౌరాణిక, చారిత్రాత్మక, సాంఘిక నాటకాలలోని విభిన్న పాత్రలను పోషించి, అద్వితీయమైన తన నాటనాకౌశలాన్ని విశ్వవ్యాప్తం చేసిన నటశేఖరులు శ్రీ బళ్ళారి రాఘవ. వీరు "దశరథుడు, హిరణ్యాకశిపుడు, యముడు, దుర్యోధనుడు, యుగంధరుడు, నలుడు, పఠాన్ రుస్తుమ్, రామదాసు, కబీరు, చాణక్యుడు, బాహుకుడు, రాజ రాజ నరేంద్రుడు, శివాజి, దుష్టబుద్ధి, కీచకుడు, కనకదాసు, పురందరదాసు, రంగూన్ రౌడి" "షేక్స్పియర్" రచించిన "మర్చెంట్ ఆఫ్ వెనీస్, హామ్లెట్" మొదలగు ఆంగ్ల నాటకాలలో "షైలాక్, ఒథెల్లో, హామ్లెట్, మొదలగు పాత్రలను ధరించి, వేషధారణలోను, పాత్రపోషణలోను, అభినయంలోను అమోఘమైన ప్రతిభను ప్రదర్శించి, స్వదేశ విదేశాలలో ఉత్తమనటులుగా మన్నన లందుకున్నారు.

నటనలో రాఘవకు రాఘవే సాటి.భావప్రకటనలో మేటి, భృకుటి విచక్షణలో సూటి, వాచికాభినయంలో మహాధాటి, సమయస్ఫూర్తిలో జగజ్జట్టి.

రసపోషణలో రాఘవకు రారెవరు సాటి అని ఈక్రింది సీసపద్యమే చెబుతుంది.

సీ.॥ శృంగార రససీమ – రంగారు బంగారు
వీరరసకిరీట – వారిరుహము
బీభత్సరసభామ – వేణికావల్లరి.
రౌద్రంపు ముంజేతి – భద్రరక్ష
కరుణారసమణి – కంఠహారంబు
హాస్యలలిత కులలలాట – తిలకరేఖ
భక్తి రసవనిత – ముక్తాఫలంబు
శాంతికాంతలతాంత – శబలమాల

గీ॥ భావభావనా భరిత నవరసరక్తి
భృకుటి కుటిలత ప్రకటించు ప్రకటనటుడు
నాటక కళాప్రపూర్ణుడన్న బిరుదు
రాణ ఒప్పారు – నీకురా – రాఘవర్యా"

(శ్రీ సి.భీమిశెట్టి, బి.ఏ., బి.ఎల్.అడ్వొకేట్, బళ్ళారి)

శ్రీ రాఘవ రసపోషణలో అత్యద్భుతమైన నేర్పును ప్రదర్శించేవారు. అది ఆయనకు భగవంతుడు ప్రసాదించిన వరం.

**రాఘవ సమయస్ఫూర్తి :**

నటనలో శ్రీ రాఘవవలె సమయస్ఫూర్తిని ప్రదర్శించిన నటులు చాల అరుదు. అది దైవానుగ్రహం అంటారాయన.

ఒకసారి విజయవాడ "దుర్గాకళామందిరం"లో "చంద్రగుప్త" నాటకం ప్రదర్శింపబడింది. ఆరోజు విజయవాడ పురప్రజలకు పర్వదినమనే చెప్పాలి. రెండు మహాసముద్రాలు కలిసినట్లు, ఉద్దండులైన ఇద్దరు మహానటులు కలిసి పాల్గొన్న నాటకమది. తక్కిన నటులుకూడ ఇంచుమించు వీరి స్థాయికి యెదిగినవారే. శ్రీ బళ్ళారి రాఘవ 'చాణక్య' పాత్రను, శ్రీ స్థానం నరసింహారావు'మురి' పాత్రను పోషించారు. సోదరప్రేమకు లొంగిపోయిన చంద్రగుప్తుడు నందులతో యుద్ధం చేయ నిరాకరించాడు. నందవంశ నిర్మూలనం జరిగితేగాని తన పరాభవాగ్ని చల్లారదంటుంది మురి. నందులు తనకుచేసిన అవమానానికి ప్రతీకారం తప్పదంటాడు చాణక్యుడు. జన్మనిచ్చిన మాతృమూర్తి, గురుదేవుల ఋణం తీర్చుకోవడానికే సిద్ధపడతాడు చంద్రగుప్తుడు. చాణక్యుడు చంద్రగుప్తుని ఆశీర్వదించి యుద్ధానికి పంపేఘట్టమది. ప్రేక్షకులు తన్మయులై నాటకం చూస్తున్నారు. చాణక్యుడు తన జోలిలో చేయిపెట్టి చూచాడు. అందులో కుంకుమ బరిణె లభించలేదు. కాళికాదేవి పూజాకుంకుమ భద్రపరచిన బరిణె అది. వెంటనే చాణక్యుడు తననొసటి కుంకుమను తీసి చంద్రగుప్తుని నొసటన తీర్చి, ఆశీర్వదించాడు. ఈ సన్నివేశాన్ని తిలకిస్తుండిన ప్రేక్షకుల ఆనందం అవధులు దాటింది. మిన్నుముట్టేలా హర్షధ్వానాలు చేశారు. బళ్లారి

పోయేటప్పటికి మీ నొసటి కుంకుమతీసి పెట్టవలెనన్న విషయం మీకెలాస్ఫురించింది?" అని అడుగగా "అంతా శివానుగ్రహం" అన్నాడు రాఘవ. జోలిలోని బరిణెను శ్రీస్థానం నరసింహారావుగారు ఉద్దేశపూర్వంగానే తీసి దాచిపుంచినారు. ఈ విషయం భాస్కరాచార్య రామచంద్రస్వామిగారు స్వయంగా చూచినట్లు చెప్పినారు.

ఇంకొకసారి ఇదే చంద్రగుప్తనాటకం ప్రదర్శింపబడింది. శ్రీరాఘవ చాణక్యపాత్రధారిగా నందులసభలో తనకు జరిగిన పరాభవానలంతో దందహ్యమాన హృదయుడై, ప్రళయ రుద్రునివలె నటించుచున్న ఘట్టంలో ఆకస్మికంగా ఒకకుక్క రంగస్థలం మీదికి వచ్చింది. రాఘవ ఏమాత్రం తడబడక కుక్కనుద్దేశించి "ఓ శునకరాజమా! నీకూ నేను లోకువయ్యానా?" అని సంబోధించే సరికి ప్రేక్షకులు సంభ్రమాశ్చర్యాలతో హర్షధ్వానాలు చేశారు.

శ్రీ రాఘవ ధారణాశక్తి అనన్యసామాన్యమైనది. ఆయన 'ఏకసంధాగ్రాహి' అనడానికి క్రిందిఘట్టం ఒక నిదర్శనం.

శ్రీకోలాచలం శ్రీనివాసరావుగారి ఆధ్వర్యంలో 'భారతయుద్ధం' అనునాటకం హైదరాబాదులో ప్రదర్శించడం జరిగింది. ప్రదర్శనశాల జనసందోహంతో క్రిక్కిరిసిపోయింది.నాటక ప్రదర్శన ప్రారంభమైంది. నాల్గవ అంకంలో ధర్మరాజు ప్రవేశించవలసి వుంది. ఇంతలో ధర్మరాజు పాత్రధారి కుమార్తెకు కలరా సోకిందని టెలిగ్రాం వచ్చింది. ధర్మరాజు పాత్రధారి వేషం మానుకొని ఇంటికి వెళ్ళిపోయాడు. శ్రీకోలాచలం వారికి దిక్కుతోచని పరిస్థితి. ప్రేక్షకులలో కూర్చొని వున్న శ్రీరాఘవ వద్దకువెళ్ళి "అయ్యా! ఎల్లాగైనా ఈ గండం నుండి మమ్మల్ని రక్షించండి" అన్నారు. రాఘవ సరేనన్నారు. వేషధారణ కానిస్తూనే ధర్మరాజుపాత్ర సంభాషణలు చదివించుకున్నారు. రంగప్రవేశం చేసి, నాటకాన్ని రక్తికట్టించారు. ప్రదర్శన నిర్విఘ్నంగాను, విజయవంతంగాను సాగిపోయింది. ఆ సమయంలో శ్రీరాఘవ శ్రీకోలాచలం వారికి ఆపద్బాంధవుడే అయ్యారు. ఆనందంపట్టలేక రాఘవను కౌగలించుకొని, ఆనందభాష్పాలు రాల్చారు.

సందర్భ సహితంగా సన్నివేశాల పొరబాట్లను సమర్థించడంలో రాఘవ తననేర్పును అతిచాకచక్యంగా ప్రదర్శించేవారు.

1936లో మహాకవులైన శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రిగారిని, కవిసామ్రాట్ శ్రీవిశ్వనాథసత్యనారాయణగారిని సన్మానించడం జరిగింది. కార్యక్రమంలో భాగంగా "ప్రహ్లాద" నాటకంలోని కొన్ని ఘట్టాలను ప్రదర్శించారు. రాఘవ దర్శకత్వంలో తీర్చిదిద్దబడిన బాలనటుడు 'శ్రీనివాస్' ప్రహ్లాద పాత్రధారిగ పలువురి మన్ననలందుకున్నారు. శ్రీరాఘవ హిరణ్యకశిపుని పాత్ర పోషించారు. ప్రదర్శన సమయంలో ప్రహ్లాద పాత్రధారికి " కంజాక్షునకుగాని కాయంబుకాయమే......." అను పద్యం చివర ఆటవెలదిలోని చివరి పంక్తులు జ్ఞప్తికిరాలేదు. తెరవెనుక నుండి అందించినా (Prompting) అందుకోలేకపోయాడు ఆ బాలనటుడు. ఎట్లో ఆ ఘట్టం పూర్తయింది.ప్రదర్శనానంతరం సభలో మాట్లాడుతూ ప్రహ్లాద పాత్రధారి చివరిపాదాలను చెప్పకపోవడం ఎంతో సమంజసంగా, సముచితంగా వుందని రాఘవ మాట్లాడడం సభలోని వారందరిని ఆశ్చర్యపరిచింది. హిరణ్యకశిపుడు మహాభక్తుడు, జ్ఞాని, రాజాధిరాజు అన్నిటికీ మించి జన్మనిచ్చిన తండ్రి. తండ్రిని కుమారుడు "పాదయుగము తోడి పశువుగాక" అని పశువుగా చిత్రించడం ఔచిత్యభంగమని భావించి ఈ ప్రహ్లాదుడు ఆ పాదమును చెప్పలేదని సమర్థించిన తీరు మహాకవులకు కూడ ఎంతో ఆనందం కలిగించింది.

శ్రీరాఘవ వృత్తిరీత్యా న్యాయవాది. ఆయన అభినయ నైపుణ్యం వారి న్యాయవాద వృత్తిలోకూడ ప్రతిబింబించేది.

ఒకసారి ఒకఖూనీకేసులో శ్రీ రాఘవ నిందితుని పరంగా 'వకాల్తా' పుచ్చుకొన్నారు. నిజంగా నిందితుడు ఆ ఖూనీ చేసినట్లు రాఘవకు నమ్మకం కలగలేదు. అప్పట్లో శ్రీనివర్తి మృత్యుంజయగారు పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా వుండేవారు. పోలీసువారి రికార్డు పకడ్బందీగావుంది. నిందితుని పక్షం సాక్షులుకూడా బలంగా నిలిచేటట్లులేరు. న్యాయమూర్తికూడ పబ్లిక్ ప్రాసిక్యూటర్ వాదనను అంగీకరించేటట్లున్నాడు. పబ్లిక్ ప్రాసిక్యూటర్ వాదనపూర్తయింది. తరువాత శ్రీ రాఘవవాదిస్తూ పదిమంది నిందితులున్న ఈ కేసులో నాక్లయింట్ నేరస్తుడనటానికి ఆధారం ఏమిటి?... అని వాదనను కొనసాగిస్తూ, ఆకస్మికంగా మూర్ఛిల్లి పడిపోయినట్లు కుర్చీలో కూలబడిపోయారు. అదిచూచి అక్కడున్న న్యాయవాదులందరూ హడావిడిగా ఒకరికంటే ఒకరు ముందుకువచ్చి ఆయనకు ఉపచారాలు చేశారు. కొంతసేపటికి మూర్ఛనుండి తెప్పరిల్లినట్లు లేచి "మీకందరికీ శ్రమ కల్పించాను. నాకిప్పుడు మొదట ఉపచారంచేసిన వారెవరో చెప్పండి?" అని ప్రశ్నించారు శ్రీ రాఘవ. ఎవరూ సమాధానం చెప్పలేకపోయారు.రాఘవ మాట్లాడుతూ "పబ్లిక్ కోర్టులో న్యాయమూర్తి సమక్షంలో నాకు మొదట ఉపచారం చేసిందెవరు?" అంటే సమాధానం చెప్పలేకపోయారు. నిర్జన ప్రదేశంలో జరిగిన హత్యలో పదిమంది నేరస్థులలో నా క్లయింటే అపరాధి అని ఎలా నిర్ణయిస్తారో, అసెస్సరులు ఎలా అంగీకరిస్తారో అర్థంకావడం లేదు" అన్నారు రాఘవ. తరువాత కేసు కొట్టివేయబడింది. అప్పటి జడ్జి "బార్న్స్‌వెల్" (బళ్ళారి రాఘవ – కొత్త దేశపతిరావు. పుట 76-77).

నట జీవితంలోనేగాక, నిజ జీవితంలో కూడ మహోన్నతవ్యక్తిగా వెలిగిన నాట్యకళా ప్రపూర్ణుడు శ్రీ రాఘవ.

రాఘవ ఔచిత్యదృష్టి :

శ్రీ బళ్ళారి రాఘవ నాటకాలలో పాత్రౌచిత్యానికి, సన్నివేశ ఔచిత్యానికి ప్రాధాన్యమిచ్చేవారు. 1943వ సంవత్సరం పెనుకొండలో గ్రంథాలయ మహాసభ జరిగింది. ఆ సభకు శ్రీ రాఘవ అధ్యక్షత వహించారు. ఆరోజు రాత్రి సాంస్కృతిక కార్యక్రమంలో భాగంగా "రాణాప్రతాప్" నాటకం ప్రదర్శింపబడింది. అందులో శ్రీ పి.వెంకటాచలం "రాజగురువు" పాత్రను ధరించారు. ఆయనకు ఔచిత్యమంటే యేమిటో తెలియని చిన్నవయస్సు. శ్రీ రాఘవగారు ప్రేక్షకులలో మొదటి వరుసలో ప్రత్యేకాసనంపై కూర్చొనివున్నారు. నాటకం ప్రారంభమైంది. తెరయెత్తగానే రాజగురువు ప్రవేశించాడు. అలంకరించి యుంచిన కాళికాదేవికి అష్టోత్తరనామాలతో పూజచేశాడు. అంతలో రాజసింహుడు, శక్తిసింహుడు ప్రవేశించి, ఆవేశంతో కత్తియుద్ధం ప్రారంభించారు.వారిని వారించడానికి రాజగురువు చేసిన ప్రయత్నం విఫలమైంది. అప్పుడు రాజగురువు తీవ్రమైన స్వరంతో "అన్నదమ్ములైన మీరు పరస్పరం రక్తదాహంతో పోరాడుతున్నారా? మీకు కావలసింది రక్తం కదా! ఇదిగో నేనిస్తున్నాను" అని కత్తితో యెదలో పొడుచుకొని, బాధనభినయిస్తూ, రక్తప్రవాహాన్ని చూపుతూ, తూలుతూ క్రిందపడితట్టుకూంటూ, ఒక సీసపద్యాన్ని పాడినాడు. అతడా పద్యం ప్రారంభించగానే రాఘవలేచి వెళ్లిపోయారట. కర్టన్ పడగానే వెంకటాచలం లోపలికి వెళ్ళాడు. రాఘవ అక్కడికి వచ్చి బ్రాహ్మణుడు ఎంత చక్కగా నటించాడండి. మంచి ఉచ్చారణ. ఓపెనింగ్ స్క్రీను బాగా రక్తికట్టించాడు. కాని పాడు పద్యాన్ని పాడించి బ్రాహ్మణ్ణి పాడుచేశారు.చచ్చేవానికి సంగీతమా? సీసపద్యం పాడడమా? ఏమి పద్యముల వ్యామోహమండి? ఔచిత్యం అక్కరలేదా? ఆ పద్యమే లేకుంటే ఆ అబ్బాయి నటన యెంత బాగుండేది? అన్నారట. మహానటులైన రాఘవ సందర్భ ఔచిత్యాన్ని యెత్తిచూపేటప్పటికి శ్రీ వెంకటాచలం సిగ్గుతో చిన్నబుచ్చుకున్నారు. వెంటనే శ్రీ రాఘవ ఆ అబ్బాయిని సానుభూతితో దగ్గరకుపిలిచి "బాగా నటించావబ్బాయ్. కాని పద్యం నిన్ను పాడుచేసింది. ఇకముందు ఔచిత్యాన్ని పాటించు". అనిచెప్పి ఆదరంతో అతనిచేతిని తనచేతులతో కలిపి, కరచాలనం చేశారట. ఈ విధంగా ఔచిత్యాన్ని గురించి తెలియజేయడం, ఔచిత్యాన్ని పాటించడం శ్రీ రాఘవగారికే చెల్లింది. అందుకే ఆయన నటనకోసమే జన్మించిన మహోన్నతవ్యక్తి.

శ్రీ రాఘవ కొన్నిపాత్రల స్వరూప స్వభావాలను, పూర్వపు సంప్రదాయాలనే మార్చివేశారు. అటువంటి పాత్రలలో "హిరణ్యకశిపుడు, యముడు, దుర్యోధనుడు" ముఖ్యమైనవి.

1930లో భక్తప్రహ్లాద నాటకం ప్రదర్శింపబడింది. అందులో శ్రీ రాఘవ హిరణ్యకశిపుడుగాను, శ్రీ సి.భీమప్ప శెట్టి ప్రహ్లాదుడుగాను నటించారు. అప్పటివరకు ఆంధ్రకర్ణాటక రంగాలలో హిరణ్యకశిపుని పాత్ర నిర్వహించడం ఒకపద్ధతిలో వుండేది. హిరణ్యకశిపుడు ఒక భయంకరమైన రాక్షసుడుగను, మానవత్వం లేని క్రూరమృగమనుకొని నటించేవారు. శ్రీ రాఘవ ఆ పద్ధతికి స్వస్తి చెప్పారు. హిరణ్యకశిపుని పాత్రకు ఒక నూతన దృక్పథాన్నే సృష్టించారు. ఈ పాత్రలో ఆయన చూపించే పుత్రవాత్సల్యం, మార్దవం, శత్రువు మీది క్రోధం, అసూయ మిళితంచేసి, ఫలితం పొందలేక, తన కుమారుణ్ణే లోబరుచుకోలేకపోతినన్న ఆవేదన, నిస్పృహ, అశక్తత, దుర్జనత్వాన్ని వెలిబుచ్చుతూ, హావభావ ప్రకటనతో, భావగర్భితంగా అమోఘమైన ప్రతిభతో నటించేవారు. ఇది శ్రీ రాఘవగారి ఒక అపూర్వమైన, నవీనదృక్పథంతో కూడిన సృష్టి.

శ్రీ రాఘవాచార్యులు సతీసావిత్రి నాటకంలో యముని వేషం వేసేవారు. అంతకుపూర్వం యముని పాత్రధారి రాక్షసునివలె భయంకరమైన వేషంతో, వికృతస్వరంతో రంగస్థలాన్ని దద్దరిల్ల జేసేవాడు. ప్రేక్షకులలో కలవరం పుట్టించేవాడు. నటుడూ, ప్రేక్షకులు అదే సహజమని భావించేవారు. కాని శ్రీ రాఘవ తన విప్లవాత్మకమైన భావాలతో, ఔచిత్యదృష్టితో యముని పాత్రయొక్క వేషభాషలనే మార్చివేశారు. సావిత్రి నాటకంలో యమునిపాత్ర ధరించిన శ్రీ రాఘవ సౌమ్యదేవతామూర్తిగా, ధర్మదేవతగా తెల్లని వస్త్రధారణతో రంగస్థలంలోకి ప్రవేశించారు. ఈ మార్పు ప్రేక్షకులకు వింతగా తోచింది. ఆ భ్రమను తొలగించడానికి శ్రీ రాఘవ యముడుగా రంగస్థలం ప్రవేశించిన వెంటనే సావిత్రి నుద్దేశించి "సావిత్రీ! నీవు మహాపతివ్రతవు. నిన్ను వెరపింపనొల్లక ఈ వేషమున అరుదెంచితిని" అన్నప్పుడు ప్రేక్షకులు అపూర్వం, అమోఘం అంటూ హర్షధ్వానాలు చేసేవారు. ఈ విధంగా రాఘవ పాత్రలయొక్క ఔచిత్యం దెబ్బతినకుండా పాత్రల రూపురేఖలనే మార్చివేసి, విప్లవాత్మకమైన నూతన పంథాను అనుసరించేవారు.

ఒకసారి గుడివాడలో కొందరు ఔత్సాహిక నటులు "రామదాసు" నాటకం ప్రదర్శిస్తున్నారు. రాఘవ ప్రేక్షకులమధ్య ముందు వరుసలో కూర్చొని మిత్రులతో మాట్లాడుతున్నారు. నాటకం ప్రారంభంకానున్నది. ముందుగా రంగస్థలంపైకి భజనబృందం వచ్చి భజన చేస్తూ వుంది. అప్పుడు శ్రీ రాఘవ తటాలున రంగ ప్రవేశంచేసి, "అయ్యా! మీరెక్కడికి వెడుతున్నారు?" అని అడిగారు. భజనవారు "భద్రాద్రికి " అని సమాధానం చెప్పారు. రాఘవ "నేనూవస్తాను, తీసుకు వెళ్ళండి" అన్నారు. భజనవారు "ఇలా కట్టుబట్టలతోనా? మీవారికెవరికీ చెప్పకుండానే వస్తారా?"అని అడిగారు. "అవును" అంటూ శ్రీ రాఘవ, "భద్రాద్రి రఘురాము భజనకు జనుచుండ

వంటిది. అందులో నటుని ప్రయత్నం ఒక అలవంటిది". కాని శ్రీ రాఘవ మాత్రం అనేక అలల ఆటుపోట్లతో నిండిన గంభీర సముద్రసముడు. కళలో పరిపూర్ణతను పండించుకున్న సంపూర్ణ మానవుడు. ఇంతటి మహోన్నత కళాతపస్వి కనుకనే ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు శ్రీ రాఘవను "కళాప్రపూర్ణ" బిరుదమువిచ్చి, ఘనంగా సత్కరించారు. ఈ సత్కారం శ్రీ రాఘవకు జరిగిందనడంకంటే మూర్తీభవించిన కళకు జరిగిందనడం సమంజసం.

శ్రీ రాఘవ ఆంధ్రుడు. మీదుమిక్కిలి రాయలసీమలో జన్మించిన రత్నం.అవధులు లేని నాటకలోకానికి మకుటం లేని మహారాజా.....అందుకే రాఘవకు రాఘవేసాటి.....రారు మరొకరు. కారుఒంకొకరు మేటి.

కళలో పరిపూర్ణుడై ఆయుష్షులో అసంపూర్ణుడై 66 సంవత్సరాలకే అమరుడైనాడు. 16.4.1946 న ఈ లోకాన్నివీడి, కళాలోకంలో చిరంజీవి అయ్యాడు.

## కెంగల్లు దొడ్డనగౌడ : బళ్ళారిజిల్లా.

శ్రీ కెంగల్లు దొడ్డన గౌడగారు రాయలసీమ నటరత్నం. కళాప్రపూర్ణ శ్రీ బళ్ళారి రాఘవగారి అనుంగు శిష్యులు. శ్రీ దొడ్డనగౌడగారు రాయలసీమలోని బళ్ళారిజిల్లాయందలి కన్నడ భాషా ప్రాచుర్యంగల జోళదరాశి అను కుగ్రామంలో ఒకసంపన్న రైతు కుటుంబంలో 1910వ సంవత్సరం శ్రీమతి రుద్రమ్మ, శ్రీ పంపన గౌడగార్లకు జన్మించినారు.మాతృభాష కన్నడమే అయినా, తెలుగుభాషను ఔపోశనపట్టారు. వీరు వీధిబడి చదువుతూనే పదునాలుగు సంవత్సరాలు గడిపారు. చిన్నతనం నుండే నాటకరంగంమీద అభిరుచి కలిగింది. ఆ తరువాత చదువు సాగలేదు. అయినా అప్పటికే కన్నడ, తెలుగు కావ్యాలను కంఠస్థం చేశారు.మధురమైన కంఠం, చిన్ననాటి నుండి కమ్మగా పాడడం శ్రీ దొడ్డన గౌడగారికి భగవంతుడిచ్చిన వరం. పాటలు, పద్యాలు వ్రాస్తుండేవారు. "బసవ, అక్కమహాదేవి" మొదలగు కన్నడ వచన కావ్యాలను తెలుగులోనికి అనువదించారు. వృత్తిరీత్యా వీరు కర్షకులు. ప్రవృత్తి నాటకాభినయం, రచనావ్యాసం, శూన్యసంవాద వ్యాఖ్యానం, గమక కళాప్రచారం.

జన్మస్థలమైన జోళదరాశి గ్రామంలో మొదటిసారిగా "లవకుశ" నాటకంలో లవుని పాత్రను ధరించి, గొప్పగా అభినయించి, బాలనటుడుగా గ్రామప్రజల, పెద్దల మన్ననలందుకున్నారు. అప్పటికే సుప్రసిద్ధ నటులుగా బళ్ళారి రాఘవ కీర్తిపుంజాలు నలుదిశలా వ్యాపించాయి. రాఘవగారి నాటక బృందంలో శ్రీ చాకిబండ తిప్పయ్యగారు శ్రీకృష్ణపాత్రను ధరించేవారు.



శ్రీ దొడ్డన గౌడగారు శ్రీ తిప్పయ్యగారిని జోళదరాశికి పిలిపించుకొని, వారి దర్శకత్వంలో "గరుడ గర్వభంగం" అను కన్నడ నాటకాన్ని నేర్చుకొని, జోళదరాశిలోను, గుంతకల్లులోను దిగ్విజయంగా ప్రదర్శించారు. శ్రీ దొడ్డన గౌడగారు గరుడ గర్వభంగం నాటకంలో కృష్ణపాత్రను పోషించి, ప్రశంసల నందుకున్నారు.

శ్రీ తిప్పయ్యగారు బాలనటుడైన శ్రీ గౌడగారి అభినయ ప్రతిభను శ్రీ రాఘవగారికి తెలియజేశారు. శ్రీ రాఘవ బృందంలోని సభ్యులైన శ్రీ రమణరావుగారు, శ్రీ భీమసేనాచార్యగారు, శ్రీ డి.హెచ్.కృష్ణారావుగారు 'రుక్మిణీకళ్యాణం' అను తెలుగు నాటకాన్ని ప్రారంభిస్తూ, శ్రీ దొడ్డన గౌడగారికి శ్రీకృష్ణ పాత్రను ఇచ్చారు. శ్రీ గౌడగారు ఆ పాత్రను ప్రశంసనీయంగా అభినయించి, రాఘవదృష్టిలో పడ్డారు. అప్పటినుండి శ్రీ దొడ్డనగౌడగారు శ్రీ బళ్ళారి రాఘవకు అత్యంత సన్నిహితులైనారు. ఒకదశలో శ్రీ రాఘవ శ్రీ గౌడగారితో "నాతరువాత నీవే" అని అన్నారంటే వారి అనుబంధమెంతటిదో అర్థమవుతుంది.

1946లో శ్రీ దొడ్డన గౌడగారు కన్నడ ప్రాంతంలో నాటకాలు ప్రదర్శిస్తున్నారు. పిడుగులాంటి వార్త తెలిసింది. శ్రీ గౌడగారు ఆఘమేఘాలమీద బళ్ళారికి చేరుకున్నారు. శ్రీ రాఘవగారి భౌతికకాయాన్ని చూచి, తండ్రిని కోల్పోయిన తనయుడులా విలపించారు. శ్రీ రాఘవ గౌడగారిని కన్నబిడ్డలా ప్రేమించేవారట.

శ్రీ రాఘవ గౌడగారికి నటనలో మెలకువలు నేర్పిన నాటక గురువు. గురుశిష్యులిద్దరూ కలిసి యెన్నోనాటకాలలో పాత్రలు ధరించి, సమతూకంగా నటించారు. రామదాసు హిందీనాటకంలో శ్రీ రాఘవ రామదాసుగా, శ్రీ గౌడ కబీరుగా నటిస్తూంటే శ్రీ రాఘవగారి నటనా వైదుష్యానికి, శ్రీ గౌడగారు మధురమైన కంఠంతో "కహాంరామ్" అని పాడే హిందీపాటకు, వారి గానమాధుర్యానికి ప్రేక్షకులు మంత్రముగ్ధులయ్యేవారు.

శ్రీ దొడ్డన గౌడ శ్రీ రాఘవచేత సానబెట్టిన జాతిరత్నం. గురుశిష్యులిద్దరూ "ప్రహ్లాద, సారంగధర, పాదుకాపట్టాభిషేకం, చాణక్య, తప్పెవరిది?" అను నాటకాలను ఆంధ్రదేశంలో ముఖ్యపట్టణాలైన "కర్నూలు, విజయవాడ, గుంటూరు, నెల్లూరు, తెనాలి, గుడివాడ"లలోను, మద్రాసులోను ప్రదర్శించారు. ఆంధ్రదేశంలోనేగాక కన్నడదేశంలోకూడ పెక్కు నాటకాలను ప్రదర్శించారు.

శ్రీ గౌడగారు నటుడేగాదు, నాటక రచయితకూడ. వీరు "[illegible], బసవణ్ణ, కనకదాస", అనునాటకాలను కన్నడంలో రచించారు. వీరు గమక కళాకోవిదులు. కన్నడ భక్త కవులరచనలేగాక, [illegible] కీర్తనలు రచించి, మూడు సంపుటాలుగా ప్రచురించారు. వీరు తెలుగులో "గేయగుంజారవం, వచనామృతకం, [illegible]" మొదలగు కృతులు రచించారు. కన్నడంలో రామేశవచనగళు, నందేనానోరిదె, బయలగలికెయబెళగు, దేశీయవచనగళు," మొదలగు కావ్యాలను రచించారు.

1943లో బళ్ళారి పురపాలక సంఘమువారు 'గమక కళాప్రవీణ' అను బిరుదమునిచ్చి సత్కరించారు.



శ్రీ రాఘవ మరణానంతరం ఆయన ఆశయాలకు స్మృతిచిహ్నంగా 18సంవత్సరాలు శ్రీ జోళదరాశి దొడ్డనగౌడగారు అహర్నిశలు కృషిచేసి, యెన్నో నాటక ప్రదర్శనలిచ్చి, నిధిని ప్రోగుచేసి 1964లో "రాఘవ కళామందిరం" నిర్మించి, శిష్యుడుగా తనరుణం తీర్చుకున్నారు.

శ్రీ దొడ్డనగౌడగారికి తనువ్రాసిన "క్రాంతి పురుష బసవణ్ణ" అను నాటకం అంటే మక్కువయెక్కువ. ఇది గొప్పగా జనాదరణ పొందింది. ఈ నాటకంలో శ్రీ గౌడగారు బసవేశ్వరుడుగా నటించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రుడైనాడు.

శ్రీ గౌడగారు రచించిన "సమ్మోహ లంపె, యాత్రికుడు, పసపర్ణ" ఖండకావ్యాలు ప్రజాదరణను పొందాయి. శ్రీ రాఘవ జీవితచరిత్రను మైసూరు సంగీత నాటక అకాడమీవారు శ్రీ రాఘవ సంస్మరణ సంచికగా ఆవిష్కరించిన సందర్భంగా శ్రీ జోళదరాశి దొడ్డన గౌడగారిని ఘనంగా సన్మానించారు. వీరికి "గమక కళానిధి, గమక గంధర్వ, శరకవి" అను బిరుదులు గలవు. గుల్బర్గా విశ్వవిద్యాలయమువారు శ్రీ దొడ్డన గౌడగారికి గౌరవ డాక్టరేట్ పట్టానిచ్చి సత్కరించారు.

శ్రీ దొడ్డన గౌడగారు కన్నడ నాటక కళాపరిషత్తు వ్యవస్థాపకులై, పరిషత్ సమావేశాలను అత్యంత వైభవంగా నిర్వహిస్తున్న కార్యదక్షులు.

గురువుగారివలె తను జన్మించిన ఊరిపేరును తనపేరుకు ముందు చేర్చుకొని "జోళదరాశి దొడ్డనగౌడ"గా జన్మభూమికి చిరకీర్తినార్జించిపెట్టిన ఘనుడు శ్రీ దొడ్డనగారు.

నటుడుగా, మధురగాయకుడుగా, కవిగా, నాటక రచయితగా, గమక కళాప్రవీణుడుగా, "ఆంధ్ర, కర్ణాటక తల్లులిద్దరికి"ముద్దుబిడ్డడై ఘనకీర్తి గడించిన ధన్యజీవి శ్రీ జోళదరాశి దొడ్డన గౌడగారు. వెలలేని రాయలసీమ రత్నం.

## శ్రీ సి.భీమప్ప శ్రేష్ఠి :

శ్రీ సి.భీమప్పశ్రేష్ఠిగారు అనంతపురంజిల్లా. శ్రీ ధరగట్ట గ్రామంలో ఒక సంపన్న కుటుంబంలో జన్మించారు. వీరు అతిచిన్న వయసులోనే రంగస్థలప్రవేశం చేశారు. తన ఆరవ ఏటనే "హరిశ్చంద్ర" నాటకంలో "లోహితుని" పాత్ర పోషించారు.



1935లో శ్రీ బళ్ళారి రాఘవతో కలిసి "భక్త ప్రహ్లాద" నాటకంలో శ్రీ భీమప్పశ్రేష్ఠిగారు ప్రహ్లాద పాత్రను ధరించి, శ్రీ రాఘవ మన్ననలకు పాత్రులైనారు. "వీరాభిమన్యు" నాటకంలో శ్రీ రాఘవ కర్ణ పాత్రను ధరించగా శ్రీ భీమప్పశ్రేష్ఠిగారు "అభిమన్యుని" పాత్రధరించి, బంగారు పతకాన్ని స్వీకరించారు. వీరు విద్యార్థిగా అనేక ఆంగ్ల నాటకాలలో నటించారు.

శ్రీ శ్రేష్ఠిగారు "కనకదాస, పురందరదాస, తోలుగట్టి" మొదలగు కన్నడ నాటకాలలో స్త్రీ, పురుష పాత్రలు ధరించారు. వీరు "పాదుక" నాటకంలో దశరథుడు, చిత్రనళీయంలో బాహుకుడు, చాణక్య, లోహితాస్య, ప్రహ్లాద, సీత, ద్రౌపది," మొదలగు పాత్రలను పోషించారు. ఇవన్నీ తెలుగు నాటకాలే. "శాంతరస, భక్తిరస, వీరరస," ప్రధానములైన పెక్కుపాత్రలను అత్యద్భుతంగా నిర్వహించి, ఉత్తమనటుడుగా పేరు ప్రఖ్యాతులు ఆర్జించినారు.

శ్రీ శ్రేష్ఠిగారు విదేశాలలో పర్యటించి, ఏకపాత్రాభినయ ప్రదర్శనలిచ్చి, పెద్దల మన్ననలందుకున్నారు. 1971లో మైసూరు ప్రభుత్వం ఉత్తమనటునిగా గుర్తించి, రాష్ట్ర ప్రభుత్వ అవార్డు నిచ్చింది.

శ్రీ భీమప్పగారు యెన్నో గౌరవపదవులను నిర్వహించారు. వృత్తిరీత్యా న్యాయవాదులు. 1964 నుండి 1968 వరకు ప్రభుత్వ న్యాయవాదిగా పనిచేశారు

వీరు "బళ్ళారి రాఘవ మెమోరియల్ అసోసియేషన్" నిర్మాణ కార్యదర్శిగాను, "ఆంధ్ర కళాసమితి", "బళ్ళారి కళాప్రేమసంఘం," "మైసూర్ సంగీత, నాటక అకాడమీ" సభ్యులుగాను పనిచేశారు.

శ్రీ భీమప్ప శ్రేష్ఠిగారు నటుడుగా, కళారాధకుడుగా, నాటకసమాజ నిర్మాతగా ఘనమైన కీర్తిని సంపాదించుకున్న ధన్యజీవి. వీరి కుటుంబమంతా కళకే అంకితమైంది.

## అనంతపురం జిల్లా

19వ శతాబ్ది ఉత్తరార్థం ఆంధ్రదేశ నాటకరంగ చరిత్రలో ఒక సువర్ణాధ్యాయముగా చెప్పవచ్చును. ధార్వాడ నాటక సమాజాలు ప్రప్రథమంగా "బళ్ళారి, కళ్యాణదుర్గం, పెనుగొండ, అనంతపురం" మొదలగు రాయలసీమ ప్రాంతాలలో ప్రవేశించి, అధునాతన పద్ధతులలో హిందీ, కర్ణాటక నాటకాలను ప్రదర్శించారు. ఈ కారణంగానే ధార్వాడ నాటక సమాజాలు రాయలసీమ రంగస్థలాన్ని ప్రభావితం చేశాయని చెప్పకతప్పదు. రాయలసీమ అన్ని జిల్లాలలో నటులు, నాటక రచయితలు ఆవిర్భవించారు. అట్టివారిలో నటులుగా, నాటక రచయితలుగా, ప్రయోక్తలుగా కీర్తిప్రతిష్ఠ లార్జించినవారు "శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు, శ్రీ కోలాచలం శ్రీనివాసరావు, శ్రీ తాడిపత్రి రాఘవాచార్యులు, శ్రీ కల్లూరు కృష్ణారావు, శ్రీ హొళగొంది రామారావు, శ్రీ భవానీ శంకరరావు, శ్రీ ఎ.బి. రావు, శ్రీ సాదరి సంపంగి రామశాస్త్రి, శ్రీ యస్.యన్.రామస్వామి, శ్రీ పొట్టి నంజుండరావు, శ్రీ కురుగడప్పారావు, శ్రీ అశ్వత్థ నారాయణ శాస్త్రి, శ్రీ చిలుకూరి నారాయణరావు, శ్రీ పైడి లక్ష్మయ్య" మొదలగు వారెందరో మహానుభావులు అనంతపురంజిల్లా వాస్తవ్యులుగా రాయలసీమ కీర్తికిరణాలను దశదిశలా వ్యాపింపజేశారు.

మొట్టమొదట నాటక రచనచేసి, ప్రదర్శింపజేసిన "శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు" అనంతపురం జిల్లా, ధర్మవరం పట్టణానికి చెందినవారు. వీరి మేనల్లుడు విశ్వవిఖ్యాత రంగస్థలనటులు శ్రీ బళ్ళారి రాఘవ అనంతపురం జిల్లాలోని తాడిపత్రి గ్రామస్థులు. నటులుగా, ప్రయోక్తలుగా, నాటక కళాపోషకులుగా పేరుగాంచిన రావుబహద్దర్ శ్రీ రొద్దం రాజారావుగారు, హాస్యనట చక్రవర్తిగా అశేష ఆంధ్రప్రజానీకంచేత నివాళులందుకున్న రొద్దం హనుమంతరావుగారు అనంతపురంజిల్లాలో విజయనగర చక్రవర్తులకు రెండవ రాజధానియైన పెనుకొండ వాస్తవ్యులు.

20వ శతాబ్ది పూర్వార్థంలో కళాతృష్ణగల ఔత్సాహికులైన నటుల కృషిఫలితంగా అనంతపురం పట్టణంలో అనేక నాటక సమాజాలు ఆవిర్భవించి, సంగీత ప్రాధాన్యంగల పెక్కు పౌరాణిక, జానపద, చారిత్రాత్మక నాటకాలను కిరాయి నాటకాలుగా ప్రదర్శించేవారు.

1916-20 ప్రాంతంలో "శ్రీ భవానీ శంకరరావు, శ్రీ పొట్టి నంజుండరావు, శ్రీ కురుడప్పారావు" మొదలగు వారు సుప్రసిద్ధ రంగస్థల నటులుగా పేరు ప్రఖ్యాతు లార్జించుకున్నారు. ఆ రోజులలోనే నాటక ప్రదర్శనల కొరకు అనంతపురం పట్టణంలో "విక్టోరియా జూబ్లీహాలు" అను నాటకశాల నిర్మింపబడింది.

**అనంతపురం :**

**1. లలిత కళాపోషక సమితి : అనంతపురం :**

1920 ప్రాంతంలో శ్రీ అశ్వత్థ నారాయణ శాస్త్రిగారు అనంతపురంలో "లలిత కళాపోషకసమితి" అను నాటక సమాజాన్ని స్థాపించి "చింతామణి, సతీసావిత్రి, ప్రాండవోద్యోగం, సక్కుబాయి" మొదలగు పౌరాణిక నాటకాలను ఆంధ్రదేశంలోనేగాక, కర్ణాటక, తమిళనాడు ప్రాంతాలలో విరివిగా ప్రదర్శించారు. వీరు "విప్రనారాయణ, యముడు, కీచకుడు" మొదలగు పాత్రలలో ఘనకీర్తిని సంపాదించారు. లలిత కళాపోషక సమితిద్వారా కొన్ని వందల నాటక ప్రదర్శనలిచ్చారు. అపర విప్రనారాయణగా ప్రసిద్ధిగాంచిన శ్రీ అశ్వత్థ నారాయణశాస్త్రిగారు కొన్ని వృత్తికళాకారుల నాటకసమాజాలను రావించి, నెలలతరబడి వారిని పోషిస్తూ వారిచేత నాటక ప్రదర్శన లిప్పించేవారు. ఆ రోజులలోనే నాటక సమాజాల పోషణకు, వారి సన్మానాలకు పిత్రార్జితమైన లక్షలాస్తిని మంచినీళ్లప్రాయంగా వెచ్చించిన కళాపోషకులు శ్రీ అశ్వత్థనారాయణ శాస్త్రిగారు. రెవిన్యూశాఖలో ఉద్యోగంచేస్తూ నాటక కళాపోషణకు తన సర్వస్వాన్ని ధారపోసిన కళారాధకులు, కళాతపస్వి శ్రీ అశ్వత్థనారాయణ శాస్త్రిగారు కళామాతకి ముద్దుబిడ్డగా రాయలసీమ నాటకరంగచరిత్రలో సుస్థిర స్థానాన్ని యేర్పరచుకున్నారు.

## 2. జిల్లా గవర్నమెంటు నాన్‌గెజిటెడ్ ఆఫీసర్సు నాటక సమాజం – అనంతపురం :

1922లో ఔత్సాహికులైన ప్రభుత్వ ఉద్యోగులు నాటకకళను అభివృద్ధి పరచాలన్న ధ్యేయంతో "జిల్లా గవర్నమెంటు నాన్‌గెజిటెడ్ ఆఫీసర్సు నాటకసమాజం" అనుపేర ఒక నాటక సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజంలో (12)పన్నెండు వందలమంది ప్రభుత్వోద్యోగులు సభ్యులుగా వుండేవారు. వీరందరూ గెజిటెడ్ స్థాయికి తక్కువగానున్నవారే. వీరు తరచుగా ఆనాటి సుప్రసిద్ధ పౌరాణిక, జానపద, చారిత్రాత్మక నాటకాలను ప్రదర్శిస్తూ వుండేవారు.

అప్పటికే శ్రీ బళ్లారి రాఘవగారు పేరుమోసిన నటులుగా బళ్ళారి, అనంతపురంలలోనేగాక ఆంధ్రదేశమంతటా ఘనకీర్తిని సంపాదించారు. వీరితో శ్రీ రొద్దం రాజారావుగారు, శ్రీ రొద్దం హనుమంతరావుగారు తదితరులు నటించారు.

## 3. అనంతపురం అమెచ్యూర్స్ అసోసియేషన్ :

కొంచెం ఇంచుమించుగా అదేకాలంలో ఆంధ్ర ప్రజానీకంచేత హాస్యనట చక్రవర్తిగా పేరు ప్రఖ్యాతు లార్జించిన శ్రీ రొద్దం హనుమంతరావుగారి ఆధ్వర్యంలో అనంతపురం పట్టణంలో "అనంతపురం అమెచ్యూర్స్ అసోసియేషన్" అను మరియొక నాటక సమాజం స్థాపింపబడింది. ఈ సమాజంలో "శ్రీ టి. అశ్వత్థనారాయణ, శ్రీ టి. సుబ్రమణ్యం శాస్త్రి, శ్రీ సి.ఎస్. వెంకట్రావు, శ్రీ సంపంగి రామస్వామి, శ్రీ యం.పి.అనంతనారాయణ శాస్త్రి, శ్రీ ఎ.మహదేవశాస్త్రి" మొదలగువారు సభ్యనటులుగా "విప్రనారాయణ, శ్రీ కృష్ణతులాభారం, చింతామణి, భక్తకబీరు" మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

## 4. ఆంధ్ర విజ్ఞానసమితి :

కాలగమనంలో గోచరించిన మార్పు ప్రేక్షకలోకంలోకూడ కొట్టవచ్చినట్లు గోచరింపసాగింది. "కళ కళకోసం" అన్న అభిప్రాయం క్రమంగా మరుగున పడి, "కళ సమాజం కోసం" అన్న ఆలోచన సమాజపరంగా బలపడసాగింది. ప్రేక్షకులదృష్టి సంఘంలో తలెత్తిన సాంఘిక దురన్యాయాలపై ప్రసరించింది. సంఘంలోని రుగ్మతలను యెత్తిచూపి, సమాజాన్ని సంస్కరించగల ఏకైక పరమసాధనం "నాటకం" అన్నది నిర్వివాదాంశం. ప్రేక్షకుల అభిరుచి సాంఘిక ఇతివృత్తాలపై మళ్ళింది. అదేసమయంలో సంఘ సంస్కర్తలు జన్మించడం, అంటరానితనం, బాల్య వివాహాలు, సాంఘిక అసమానతలు తొలగించడంవంటి సాంఘికపరమైన దురాచారాలను యెత్తిచూపి, సమాజాన్ని సంస్కరించి, రుజుమార్గంలో నడిపించడానికి పూనుకున్నారు. అట్టి తరుణంలో సాంఘిక ఇతివృత్తంతో నాటకాలు వ్రాయడం, వాటిని ప్రదర్శించడం జరిగింది. అలా రచింపబడిన నాటకమే శ్రీ గురజాడ అప్పారావుగారి "కన్యాశుల్కం" అను సాంఘిక నాటకం, శ్రీ బళ్ళారి రాఘవగారి "సరిపడని సంగతులు" "తెగని సమస్యలు" మొదలగునవి.

శ్రీ రొద్దం హనుమంతరావుగారు పౌరాణిక నాటకాలను వదలిపెట్టి, సాంఘిక నాటకాలను ప్రదర్శించడానికి పూనుకున్నారు. అనంతపురంలో "ఆంధ్ర విజ్ఞానసమితి" అను సరికొత్త నాటకసమాజాన్ని స్థాపించి, ఆంధ్రదేశమంతటా నాటక ప్రదర్శనలిచ్చారు. వీరు నటించిన సాంఘిక నాటకాలలో "కళోపాసన, కళోద్ధారకులు, ఎన్.జి.వో (N.G.O.), పెళ్లి ట్రైనింగు, టీకప్పులో తుఫాను, పెళ్ళిచూపులు, నాటకం, స్వాతంత్ర్యయజ్ఞం, సంసారనౌక, పెండ్లి, కులంలేని పిల్ల, రంగూన్ రౌడి, దొంగవీరడు" మొదలగునవి అతిముఖ్యమైనవి.

## 5. ఆదర్శ విజ్ఞానసమితి :

1950లో ఔత్సాహికులైన యువనటులు కొందరుచేరి,అనంతపురంలో "ఆదర్శ విజ్ఞానసమితి" అను నాటకసమాజాన్ని స్థాపించారు. వీరు ఆనాడు మిక్కిలి ప్రచారంలో వుండిన అనేక పౌరాణిక, జానపద, చారిత్రాత్మక, సాంఘిక నాటకాలను స్థానికంగాను, ఇతర ప్రాంతాలలోను పలుసార్లు ప్రదర్శించి, నాటక కళారంగంలో అనంతపురం ఖ్యాతిని ఇనుమడింపజేశారు.

## 6. చెన్నకేశవ నాట్యమండలి :

1955లో "చెన్నకేశవ నాట్యమండలి" అను నాటక సమాజం అనంతపురంలో స్థాపింపబడింది. సంగీత ప్రాధాన్యంగల ఆ రోజుల్లో ఈ సమాజంవారు యెక్కువగా పౌరాణిక, చారిత్రాత్మక నాటకాలను ప్రదర్శించారు. అప్పుడప్పుడు "దొంగవీరడు, రంగూన్ రౌడి" వంటి సాంఘిక నాటకాలను కూడ ప్రదర్శిస్తూ వుండేవారు.

కలిసి అన్ని సమాజాలలో నటిస్తూ వుండేవారు. శ్రీ కుంచాల సత్యరంగారావు, శ్రీ రొద్దం హనుమంతరావు, శ్రీ వై. రామాంజనేయులు, శ్రీ జగన్నాథాచారి, శ్రీ టి.వెంకటరెడ్డి, అడ్వొకేట్ శ్రీ చౌడప్ప గౌడు, శ్రీమతి లక్ష్మీదేవి, కుమారి సావిత్రి" మొదలగు నటీనటులు "శ్రీ కృష్ణలీలలు, గయోపాఖ్యానం, పాండవోద్యోగం, భక్తకబీరు, హరిశ్చంద్ర, చింతామణి, విప్రనారాయణ, రంగూన్ రౌడి", మొదలగు నాటకాలను విరివిగా ప్రదర్శించేవారు. సినిమాలు అంతగాలేని ఆ రోజులలో రంగస్థల నాటకాలకు యెంతో ప్రోత్సాహం, ఆదరణ లభించేది.

## 8. లలిత కళా పరిషత్తు :

1955వ సంవత్సరం అనంతపురం నాటకరంగ చరిత్రలో యెంతో ప్రాముఖ్యతను సంతరించుకున్నది. ఈ సంవత్సరంలో పెక్కు ఔత్సాహిక నాటక సమాజాలు అనంతపురంలో ఆవిర్భవించాయి. కాని శాశ్వతంగా నిలిచి, తనకంటూ ఒక విశాలమైన, ఆధునిక హంగు పొంగులతో అలరారే నాటక ప్రదర్శనశాలను నిర్మింపజేసికొని, ఆవిర్భవించిననాటినుండి నేటివఱకు అనునిత్యం యేదో ఒక సాంస్కృతిక కార్యక్రమంతో అనంతపురం పట్టణానికి అఖండఖ్యాతిని ఆర్జించి పెట్టినది "లలిత కళాపరిషత్తు".

"పద్మశ్రీ కల్లూరు సుబ్బారావుగారు, శ్రీ రొద్దం హనుమంతరావుగారు, అప్పటి జిల్లా కలెక్టరు శ్రీ కొండప్రావు, ఐ.ఎ.యస్.గారు, శ్రీ మల్లిరెడ్డి, యమ్.ఎ., ఎల్.ఎల్.బి.గారు, శ్రీ జి.వెంకటరెడ్డిగారు, శ్రీ పప్పూరు రామాచార్యులుగారు" వ్యవస్థాపక సభ్యులుగా 1955వ సంవత్సరం అనంతపురం పట్టణంలో "లలితకళాపరిషత్తు" అను నాటక సమాజం స్థాపింపబడింది. ఈ సమాజానికి స్థాపింపబడిన నాటినుండి స్థానిక జిల్లాకలెక్టర్లు అధ్యక్షులుగా ఉండడం ఆనవాయితీగా వస్తున్న సంప్రదాయం.

లలిత కళాపరిషత్తుకు మొదటి అధ్యక్షులు ఆనాటి జిల్లాకలెక్టరైన శ్రీ కొండప్రావుగారు, ఉపాధ్యక్షులు శ్రీ కల్లూరు సుబ్బారావుగారు, ప్రథమకార్యదర్శి శ్రీ రొద్దం హనుమంతరావుగారు. ఆ రోజులలో కళాప్రపూర్ణ బిరుదాంకితులు, మాజీ మంత్రి అయిన శ్రీ పైడిలక్ష్మయ్యగారు గొప్పనటులు, నాటక రచయిత. వీరు రచించిన "మల్లమ్మకథ, శ్రీశైల మాహాత్మ్యము, సాయిలీలలు" మొదలగు నాటకాలను లలిత కళాపరిషత్తు తరపున అనేక పర్యాయాలు ప్రదర్శించారు. ఇవిగాక "శ్రీ కృష్ణలీలలు, గయోపాఖ్యానం, పాండవోద్యోగం, రంగూన్ రౌడి, దొంగవీరడు" మొదలగు నాటకాలను ప్రదర్శించారు. ఈ విధంగా అనంతపురం గొప్పనటులను, నాటక రచయితలను, పెక్కు నాటకాలను ఆంధ్ర నాటకరంగానికి ప్రసాదించింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని మూడు ప్రాంతాలలో మూడు నాటక విద్యాలయాలను స్థాపించారు. తెలంగాణా ప్రాంతానికి సంబంధించి హైదరాబాదులోను, రాయలసీమ ప్రాంతానికి సంబంధించి అనంతపురంలోను స్థాపించడం జరిగింది. అనంతపురంలో స్థాపించిన నాటక విద్యాలయానికి శ్రీ రొద్దం హనుమంతరావుగారు ప్రథమ "ప్రిన్సిపాలు"గా నియమితులయ్యారు.

ప్రస్తుతం "లలిత కళాపరిషత్తు"కు అనంతపురంజిల్లా కలెక్టరు శ్రీ జె.సత్యనారాయణ, ఐ.ఏ.యస్‌గారు అధ్యక్షులుగాను, శ్రీ బి.సి. ఓబులేసప్ప, బి.ఏ., బి.ఎల్.గారు, శ్రీ మేడాసుబ్బయ్య శెట్టిగారు ఉపాధ్యక్షులుగాను, శ్రీ ఆదవేని నరసింహమూర్తిగారు కార్యదర్శిగాను, శ్రీ ఆర్.మల్లేశ్వరగుప్తగారు కోశాధికారిగాను, శ్రీ ఎస్.మారుతీ ప్రసాద్‌గారు ఉపకార్యదర్శిగాను పనిచేస్తున్నారు.

లలిత కళా పరిషత్తువారు "చింతామణి, రామదాసు, తానీషా, విజయదుందుభి, పెండ్లి ట్రైనింగు, ప్రెసిడెంటు" మొదలగు యెన్నో నాటకాలను పలుసార్లు ప్రదర్శించారు. సుమారు పది సంవత్సరాలు నాటకాలను ప్రదర్శిస్తూ, కళకు సేవచేసిన "లలిత కళా పరిషత్తు" వారికి 1965లో లలిత కళాపరిషత్తు ఆధ్వర్యంలో నెలవారి కార్యక్రమాలు జిల్లా స్థాయిలో నిర్వహించాలన్న సంకల్పం కలిగింది. సంకల్పం కలగడమే తరువాయి; వెంటనే కార్యరూపందాల్చింది. జిల్లాస్థాయిలో నెలవారి కార్యక్రమాలు నిర్వహించడం జరిగింది. ఈ కార్యక్రమాలలో లలితకళా పరిషత్తువారు పౌరాణిక, చారిత్రాత్మక, సాంఘిక, నాటక, నాటికలను ప్రదర్శించడం, ఇతరులచేత ప్రదర్శింపజేయడం చేశారు. ప్రస్తుతం ప్రతిసంవత్సరం రాష్ట్రస్థాయి నాటక, నాటిక పోటీలు నిర్వహింపబడుతున్నవి. దశాబ్దాలు కాలగర్భంలో కలసిపోతున్నా, ఈ కార్యక్రమాలు నిరాటంకంగా నేటికీ నిర్వహింపబడుతున్నవి. వివిధ కళారంగాలలో లబ్ధప్రతిష్ఠులైన కళాకారులను ఆహ్వానించి, సగౌరవంగా సన్మానించడం జరుగుతూవుంది.

1980లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ హైదరాబాదువారు, లలిత కళాపరిషత్తు అనంతపురంవారు కలిసి, లలిత కళాపరిషత్తు ప్రాంగణంలో 22-12-80 నుండి 25-12-80 వరకు "తెలుగు నాటక మరియు బళ్ళారి రాఘవ శతజయంత్యుత్సవాలు" యెంతో ఘనంగా నిర్వహించారు. ఈ ఉత్సవాలలో రాష్ట్రం నలుమూలలనుండివచ్చి అనేక నాటక సమాజాలు పాల్గొన్నవి. నాలుగురోజులు నాటకోత్సవాలు మహావైభవంగా నిర్వహింపబడ్డాయి. ఎందరో మహామహులు సన్మానింపబడ్డారు. అనంతపురం ఆంధ్రనాటక కళామతల్లికి రంగస్థలమే అయ్యింది.

రంగస్థలాన్ని (స్టేజ్ మరియు గ్రీన్ రూములు) స్వయంగా నిర్మించుకున్నారు. ఈ నిర్మాణం వెనక యెందరో అధికారుల, కళాభిమానుల, కళారాధకుల, కళాతపస్వుల నిరంతరకృషి ద్యోతకమౌతుంది. ప్రత్యేకించి మాజీమంత్రి, కళాప్రపూర్ణ శ్రీ పైడి లక్ష్మయ్యగారి పరిపూర్ణ సహకారహస్తం గోచరిస్తుంది. అందుకే ఈ భవనానికి "కళాప్రపూర్ణ శ్రీ పైడి లక్ష్మయ్యగారి కళాక్షేత్రం" అని నామకరణం చేశారు.

ప్రస్తుతం లలితకళాపరిషత్తు కార్యవర్గ సభ్యులు పరిషత్తుకు వజ్రోత్సవం జరిపించే ప్రయత్నాలు చేస్తున్నారు. ఇప్పుడా కళాభవనాన్ని నాటక, నృత్యప్రదర్శనలకు, ఆధ్యాత్మిక ఉపన్యాసాలకు, కవితాగోష్టులకు ఉపయోగిస్తున్నారు. కళాభవన ప్రాంగణంలో కొన్ని గదులున్నాయి. వాటిలో సంగీతం, హార్మోనియం విద్యార్థులకు పాఠశాల నిర్వహింపబడుతూవుంది. లలిత కళాపరిషత్తువారు నెలజీతంమీద శాశ్వతమైన "హార్మోనిస్టు"ను నియమించియున్నారు. ప్రఖ్యాత నటీ, నటులుగా పేరుగాంచిన "శ్రీ రొద్దం హనుమంతరావుగారు, శ్రీ కుంచాల సత్యరంగారావుగారు, శ్రీ వై. రామాంజనేయులుగారు, శ్రీ జగన్నాధాచారిగారు, శ్రీ ఆదవేని నారాయణాచార్యులుగారు, శ్రీ జి.వెంకటరెడ్డిగారు, అడ్వొకేట్ శ్రీ చౌడప్పగౌడుగారు, కుమారి సావిత్రిగారు, శ్రీమతి లక్ష్మీదేవిగారు మొదలగువారు అనంతపురంలోని అన్ని నాటక సమాజాలలో నటించారు.

## 9. అభ్యుదయ కళాసమితి :

1958లో శ్రీ కుంచాల సత్యరంగారావుగారి ఆధ్వర్యంలో "అభ్యుదయ కళాసమితి" అను నాటకసమాజం అనంతపురంలో స్థాపించబడింది. ఈ సమాజానికి శ్రీ ఇ.జగన్నాధాచారి, ఐ.ఎ.యస్.గారు అధ్యక్షులుగాను, శ్రీ కె. సత్యరంగారావుగారు కార్యదర్శిగాను, వ్యవహరించారు. ఈ నాటకసమాజంలో "శ్రీ కె.మల్లేశ్వరయ్య, శ్రీ పి.వి.రామశాస్త్రి, శ్రీ పి.వీరరాజు, శ్రీ డి. పురుషోత్తం, శ్రీ కె. శ్రీరాములు, శ్రీ ఎ.గోపీనాథ్, శ్రీ జి. రంగయ్య, శ్రీ మారుతీప్రసాద్, శ్రీ పి.సి.వెంకటేశ్వర్లు, శ్రీ ఫ్రాన్సిస్, శ్రీ జానకీనారాయణప్ప, శ్రీ పి.వెంకటాచలం మొదలగువారు ప్రముఖనటులు. వీరు "హరిశ్చంద్ర, తానీషా, 1857(నాటకం), విజయదుందుభి, భక్తకబీరు, ఆత్మశక్తి, మాట తప్పకు, పెండ్లి ట్రైనింగు, కుక్కపిల్ల దొరికింది, ఉలిపికట్టె" మొదలగు నాటకాలను వివిధ ప్రాంతాలలో అనేకసార్లు ప్రదర్శించారు. శ్రీ కుంచాల సత్యరంగారావుగారు మంచినటులు, ఉత్తమదర్శకులు. శ్రీ రొద్దం హనుమంతరావుగారు నటించిన అన్నినాటకాలలో నాయకపాత్ర (Hero Character) ధరించారు. శ్రీ సత్యరంగారావుగారు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ సభ్యులు.

"అభ్యుదయ కళాసమితి"వారు "నరసాపురం, ఏలూరు, విజయవాడ, గుంటూరు, బళ్ళారి, నెల్లూరు, మద్రాసు" మొదలగు ప్రాంతాలలో అనేక పరిషత్తుల నాటక పోటీలలో పాల్గొని, పెక్కు బహుమతులను అందుకున్నారు. ఈ సమాజం 20 ఏండ్లు అవిచ్ఛిన్నంగా నాటక, నాటికలను రాష్ట్రవ్యాప్తంగా ప్రదర్శించి, ప్రఖ్యాతి గాంచినది. ప్రభుత్వం తరఫున పెక్కు ప్రచారనాటకాలను ప్రదర్శించింది.

1964వ సంవత్సరం ఆంధ్రనాటక కళాపరిషత్తు 21వ వార్షిక మహాసభలు, 1969లో ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం తరఫున ప్రాంతీయస్థాయి నాటకోత్సవాలు నిర్వహించి, బహుధా ప్రశంసలనందుకున్నది.

ఈ సమాజం 15 సంవత్సరాలు వరుసగా ప్రతి ఏట నాటక, నాటిక పోటీలు నిర్వహించి, అనేక యువకళాకారులను ప్రోత్సహించినది. "అభ్యుదయ కళాసమితి" అనంతపురంజిల్లాలో ప్రముఖ నాటక సంస్థగా వాసికెక్కినది.

1974లో అనేకమంది ఉన్నతాధికారుల ఆశీస్సులతోను, మిత్రుల సహాయ సహకారాలతోను, కళాభిమానులైన పురప్రముఖుల ఆదరాభిమానాలతోను, శ్రీ సత్యరంగారావుగారు సుమారు ఒక లక్షరూపాయలు విరాళాలుగా సేకరించి, అధునాతన ఆరుబయలు రంగస్థలాన్ని (Open Air Theatre) అత్యంత సుందరంగా నిర్మింపజేశారు.

## 10. వాణీ కళానిలయం :

శ్రీ పులమతి బాలచంద్రరావుగారు 1969వ సంవత్సరం అనంతపురంలో "వాణీకళానిలయం" అను సాంస్కృతిక సంస్థను స్థాపించి, అనేక నాటకాలను ప్రదర్శించారు. వీరు "పరీక్ష, మాస్టర్జీ, పల్లె పడుచు, మాటతప్పకు, మారని మనిషి, ఆరణి, పంచమవేదం, మహానటుడు, దేవుడు! నిద్రలే, సమిధ, ఛాయ, ప్రతిధ్వనులు, నీడలో నిజం, పరాజితులు, నటసామ్రాట్, మరో జవహర్ పుట్టాడు, కీ, అల్లూరి సీతారామరాజు, అమరత్యాగి, కోహినూర్, గాలిపటం" మొదలగు 120 నాటకాలను, నాటికలను ప్రదర్శించారు.

ఈ సమాజంవారు "హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణం, రాజమండ్రి, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, ఎమ్మిగనూరు, వెంకటగిరి, తిరుపతి" మొదలగు ప్రాంతాలలో నిర్వహింపబడిన పరిషత్తు నాటక, నాటికల పోటీలలో పాల్గొని, పెక్కు బహుమతులను

అందుకున్నారు.

మొదట ఈ సమాజం "ఆర్.టి.ఆర్.సి" విభాగంద్వారా నడిచేది. ఈ విభాగాన్ని ఆపేసేసిన తరువాత "వాణీ కళానిలయం" కనుమరుగైంది.

**11. రవాణా కళానిలయం :**

1983లో శ్రీ పులమతి బాలచంద్రరావుగారి ప్రోత్సాహంతో ఆర్.టి.సి. కార్మికకళాకారులందరు కలిసి "రవాణా కళానిలయం" అను నాటక సమాజాన్ని స్థాపించారు. ఈ సంస్థలో ఔత్సాహిక కళాకారులందరూ సభ్యులే. శ్రీ బాలచంద్రరావుగారు ఈ సంస్థకు కార్యదర్శిగా, దర్శకులుగా వ్యవహరిస్తూ అనేకపరిషత్తులలో నాటక పోటీలందు పాల్గొని, పెక్కు బహుమతులనందుకున్నారు. ఈ సంస్థవారు ప్రతియేటా వార్షికోత్సవాలు జరిపిస్తూ, వివిధ కళారంగాలలో ప్రజ్ఞాపాటవాలు చూపిన ప్రముఖ కళాకారులను రావించి, వారికి సన్మానాలు చేస్తున్నారు. వివిధ సాంస్కృతిక పోటీలు నిర్వహిస్తున్నారు. వీరు సన్మానించిన వారిలో "శ్రీ ఆర్.వి.ఎస్.రామస్వామి – రచయిత, శ్రీ నేరెళ్ల లక్ష్మణరావు, (మిమిక్రీ కళాకారులు) అమీర్ భాషా – నృత్యకళాకారులు" మొదలగువారు ముఖ్యులు.

రవాణా కళానిలయం వారు "గాలిపటం, తిమ్మరుసు, దేవుడూ! నిద్రలే" మొదలగు నాటకాలను ప్రదర్శించారు. ఈ సమాజం నేటికీ "ఉడతాభక్తి" అన్నట్లు నాటక కళామతల్లికి తనవంతుసేవ చేస్తూనే వున్నది.

**12. శ్రీ సీతారామాంజనేయ యువనాట్యమండలి :**

శ్రీ కె.సి.పోతులయ్య వ్యవస్థాపకులుగా 1982లో "శ్రీ సీతారామాంజనేయ యువనాట్యమండలి" అను నాటకసమాజం అనంతపురంలో స్థాపింపబడింది. ఈ సమాజానికి "శ్రీ ఎన్. శంకరయ్య – అసిస్టెంట్ ఇంజనీరుగారు అధ్యక్షులుగాను, శ్రీ బి.జయరాముడు – విలేజ్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరుగారు కార్యదర్శిగాను, శ్రీ పి.సోమనాధరెడ్డిగారు (అనంతపురం) కోశాధికారిగాను, శ్రీ కె.సి.పోతులయ్యగారు దర్శకులుగాను వ్యవహరిస్తున్నారు.

"శ్రీ ఎన్.శంకరయ్య, బి.జయరాముడు, శ్రీ పి.సోమనాథరెడ్డి, శ్రీ ఎస్.లక్ష్మీనారాయణ, శ్రీ సి.నారాయణ, శ్రీ డి.నాగేశ్వరరావు, శ్రీ కె.యం.నారాయణ," మొదలగువారు ముఖ్యులుగా వున్నారు. ఈ సమాజం పతాకంక్రింద "శ్రీ కృష్ణరాయబారము, శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి జీవితచరిత్ర, సిఫార్సు, యథారాజాతథాప్రజ, శిథిలాలయము", మొదలగు నాటకాలను అనంతపురం లలిత కళాపరిషత్తు, రైల్వే కళాసమితి – గుత్తి, రైల్వేకళాసమితి – గుంతకల్లు, తెలుగు విశ్వవిద్యాలయంవారిచే రాజంపేటలో నిర్వహింపబడిన నాటకపోటీలలో పాల్గొని, వివిధ బహుమతులను అందుకున్నారు.

ఈ సమాజంవారు "శ్రీ వీరబ్రహ్మంగారి జీవిత చరిత్ర" అను నాటకాన్ని "ఎమ్మిగనూరు, కర్నూలు, అనంతపురం" మొదలగు పట్టణాలలో ప్రదర్శించి ప్రజలమన్నన అందుకున్నారు.

**13. ఎన్.టి.ఆర్.కల్చరల్ అసోసియేషన్ :**

శ్రీ వి. అశ్వత్థనారాయణగారి ఆధ్వర్యంలో "ఎన్.టి.ఆర్.కల్చరల్ అసోసియేషన్" అను నాటకసమాజం అనంతపురంలో స్థాపింపబడింది. ఈ సమాజానికి శ్రీ వి. అశ్వత్థనారాయణగారు అధ్యక్షులుగా, శ్రీ సి.పాండురంగ మూర్తిగారు కార్యదర్శిగా వ్యవహరిస్తున్నారు. ఈ సమాజంవారు "శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్ర, శ్రీ కృష్ణ తులాభారం, హరిశ్చంద్ర, చింతామణి" మున్నగు పౌరాణిక నాటకాలను అనేకసార్లు, పలుప్రాంతాలలో ప్రదర్శించి, ప్రేక్షకుల మన్ననలందుకున్నారు. ఈ సమాజంలోని నటులందరూ నాటకకళపై అభిమానము, అభిరుచిగల ఔత్సాహిక కళాకారులు.

**14. యువ కళానిలయం :**

అనంతపురంలో "లలితకళా పరిషత్తు" ఒకచైతన్య కళాస్రవంతి. అనంతపురంలో లెక్కకు మించిన నాటక సమాజాలు ఆవిర్భవించినాయి. 1955 తరువాత స్థాపింపబడిన నాటక సమాజాలన్నిటికి "లలిత కళాపరిషత్తు" ఒకప్రేరణ అని చెప్పవచ్చును.

నాటక కళమీద అభిమానంగల శ్రీ బాషాగారు ఔత్సాహికులైన యువకళాకారులను కలుపుకొని "యువకళానిలయం" స్థాపించి, పెక్కు సాంఘిక నాటక, నాటికలను ప్రదర్శించారు. స్థానికంగానేగాక, ఇతర ప్రాంతాలలో నిర్వహింపబడిన పరిషత్తు నాటక పోటీలలో

## 15. ఇందిరా ప్రియదర్శిని కల్చరల్ అసోసియేషన్ :

ఇంచుమించుగా అదేకాలంలో కొందరు ఔత్సాహిక యువకులు కలిసి "ఇందిరా ప్రియదర్శిని కల్చరల్ అసోసియేషన్" అను నాటక సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజానికి శ్రీయం.రామిరెడ్డిగారు అధ్యక్షులుగాను, శ్రీరామకృష్ణారెడ్డిగారు కార్యదర్శిగాను వ్యవహరిస్తున్నారు.

ఈ సమాజంవారు "ఉలిపికట్టె, పెండ్లి ట్రయినింగు, దేవుడా! నిద్రలే, కుక్కపిల్ల దొరికింది, గాలిపటం" మొదలగు నాటకాలను స్థానికంగానేగాక, ఆంధ్రప్రదేశ్‌లోని అనేక నాటక పరిషత్తులలో పాల్గొని ప్రదర్శించారు. పెక్కు బహుమతులతోబాటు, ప్రేక్షకుల ప్రశంసలను అందుకున్నారు.

## 16. రాయల కళాపరిషత్తు :

"శ్రీతూముకుంట భీమసేనరావు"గారు శ్రీబళ్ళారి రాఘవగారి అభిమానులు. వారితో నటించినవారు. నాటకకళమీదనున్న ఉత్సాహం శ్రీతూముకుంట భీమసేనరావుగారిచేత "రాయల కళాపరిషత్తు"ను స్థాపింప జేసింది. ఈ సమాజానికి శ్రీ తూముకుంట భీమసేనరావుగారే అధ్యక్షులు. వీరితోబాటు అనేకమంది యువనటులు ఈ సమాజంలో వుండేవారు. వీరు పెక్కునాటకాలను ప్రదర్శించారు. పరిషత్తు తరపున నాటక, నాటిక, ఏకపాత్రాభినయ పోటీలు నిర్వహించారు. ఎన్నో సన్మానాలు కళాకోవిదులైన వారికి చేశారు. అవార్డులు బహూకరించారు.

## 17. పైడి లక్ష్మయ్య సాంస్కృతిక సంస్థ :

నటులు, నాటక రచయితలు, కవులు, గాయకులు, ఆంధ్రప్రదేశ్ మాజీమంత్రివర్యులు అయిన కళాప్రపూర్ణ శ్రీపైడి లక్ష్మయ్యగారి స్మృత్యర్థం 1978లో "పైడి లక్ష్మయ్య సాంస్కృతిక సంస్థ" అను నాటకసమాజం అనంతపురంపట్టణంలో స్థాపింపబడింది. ఈ సమాజానికి డా॥ కేశన్నగారు అధ్యక్షులుగాను, శ్రీడి.వై.రఘురామ్‌గారు కార్యదర్శిగాను వ్యవహరిస్తున్నారు. ఈ సమాజంవారు శ్రీపైడి లక్ష్మయ్యగారిచే రచింపబడిన "మార్కండేయ విజయం, శ్రీశైలీయం, సంసారనౌక, సాయిలీలలు, మహాత్మాకబీర్, భక్తమల్లమ్మ" మొదలగు పౌరాణిక, చారిత్రాత్మక, సాంఘిక నాటకాలను పలుసార్లు ప్రదర్శించారు. ఇవిగాక సమకాలీన ప్రఖ్యాత సాంఘిక నాటక, నాటికలను ప్రదర్శించారు.

ఈ సమాజంవారు ప్రతియేటా శ్రీపైడి లక్ష్మయ్యగారి స్మారకార్థం పెక్కు సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. అంతేగాక పెక్కు రాయలసీమలోని పరిషత్తులు నిర్వహించు నాటకపోటీలలో పాల్గొని, అనేక నాటకాలను ప్రదర్శించి, ప్రేక్షకుల ప్రశంసలతోబాటు, బహుమతులనుకూడ అందుకుంటున్నారు.

ఒక కళాప్రపూర్ణుని జ్ఞాపకార్థం స్థాపింపబడిన ఈ నాటకసమాజం ఈనాటికీ నాటక కళామతల్లికి అకుంఠిత సేవ చేస్తున్నది.

## 18. శ్రీ అరుణోదయ ఆర్ట్స్ – అనంతపురం :

1983వ సంవత్సరం, అనంతపురం పట్టణంలో శ్రీ వై. కుళ్ళాయప్ప గారి ఆధ్వర్యంలో "శ్రీ అరుణోదయ ఆర్ట్స్" అను నాటక సమాజం స్థాపింపబడింది. స్థాపింపబడిననాటినుండి ఈనాటి వరకు శ్రీ వై. కుళ్ళాయప్పగారే గౌరవాధ్యక్షులుగాను, దర్శకులుగాను పని చేస్తున్నారు. శ్రీ కె. ప్రభుదాస్ అధ్యక్షులుగాను, శ్రీ ఎ. నాగరాజు కార్యదర్శిగాను, శ్రీ జి. హరిదాస్ కోశాధికారిగాను, ఈ సమాజంలో యెన్నుకోబడినారు.

ఈ సమాజంలో సర్వశ్రీ "వై. కుళ్ళాయప్ప, ఎ. నాగరాజు, ఎ. శ్రీరాములు, బి. నారాయణ స్వామి, జి. హరిదాస్, కె. ప్రభుదాస్, వి. కాలేబు, జి. కర్రెయ్య, వి. రమణ, టి.వి. రాజు, నరసింహులు" మొదలగు వారు నటులుగా వున్నారు. ఈ సమాజం పౌరాణిక నాటక సమాజం. వీరు తక్కువ నాటకాలను యెక్కువసార్లు ప్రదర్శించారు. ఈ సమాజంవారు "శ్రీకృష్ణరాయబారం, గయోపాఖ్యానం, సత్యహరిశ్చంద్ర" అను పౌరాణిక నాటకాలను పెక్కు పర్యాయాలు, పలు ప్రాంతాలలో ప్రదర్శించారు.

... లలిత కళా పరిషత్తు-అనంతపురం, శ్రీకృష్ణ కళామందిరం-అనంతపురం, రైల్వే [illegible] ఆడిటోరియం-ధర్మవరం, రవీంద్ర భారతి-హైదరాబాద్, మునిసిపల్ ఆడిటోరియం-కర్నూలు, రైల్వే ఆడిటోరియం-పాకాల, అవంతి థియేటర్-మదనపల్లె, రాఘవ కళానిలయం-బళ్ళారి, కళాభారతి ఆడిటోరియం-బెంగుళూరు, తుంగభద్రడ్యాం ఆడిటోరియం - మునిరాబాద్, జడ్.పి. హైస్కూల్ ఆడిటోరియం-ఆత్మకూరు, జడ్.పి. హైస్కూల్స్-యాడికి, చందన, కూడేరు, కల్లూరు, బత్తలపల్లె, పామిడి, తరిమెల, తాడిపత్రి" మొదలగు ప్రాంతాలలో పౌరాణిక నాటకాలను ప్రదర్శించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు.

ఈ సమాజానికి సభ్యుల స్వంతవసరులు, ప్రజల ఆదరణే ఊపిరి. వీరు తమ సమాజానికి "తబలా, హార్మోనియం,క్లారినెట్" ఇత్యాది అత్యవసర వాద్యపరికరాలు కొన్నారు.

ఈ విధంగా "శ్రీ అరుణోదయ ఆర్ట్స్" నాటక సమాజం రాయలసీమలో పేరు ప్రతిష్టలున్న ఒక పౌరాణిక నాటక సమాజం దినదినాభివృద్ధి చెందుతూ నాటక కళామతల్లికి సేవచేస్తూ వుంది.

## 19. శ్రీ వేంకటేశ్వర నాటక సమాజం :

అనంతపురంలోని వృత్తికళాకారులందరు కలిసి 1971లో "శ్రీ వేంకటేశ్వర నాటక సమాజం"అను పేర ఒక నాటక సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజంలో "శ్రీదాసరి తిరుపాల్ దాసు, శ్రీ మడ్డి శంకరయ్య, శ్రీ కురాకులటపాల రంగనాథం, శ్రీ బి. కొండల రావు, శ్రీమతి మేట శారద, శ్రీమతి చిగుర్చి విజయ కుమారి, శ్రీమతి తలారి మరియమ్మ దేవి, శ్రీమతి ఎన్. సీతమ్మ" మొదలగు వారు నటీనటులుగా అనేక పౌరాణిక, జానపద నాటకాలను వందలసార్లు ప్రదర్శించారు. వీరు సంగీత ప్రాధాన్యం గల నాటకాలనే ఎక్కువగా ప్రదర్శించారు. పాట, పద్యం తెలిసిన నటీ, నటులందరూ శ్రావ్యమైన గాత్రాలతో మధురగానం చేసేవారు. వీరందరూ వృత్తికళాకారులవడంచేత ఇటు భుక్తిని, అటు ముక్తిని కళామతల్లి సేవలో పొందగలుగుతున్నారు. సురభివారి తరువాత ఆ పద్ధతిలో నాటకాలను ప్రదర్శిస్తూ, తమ జీవనయాత్రతోబాటు, కళారాధకులైన రాయలసీమ రసికజనానికి ఆనందాన్ని పంచిపెట్టూ, తమవంతు కళాసేవ చేస్తున్నారు. వీరు శ్రీ వేంకటేశ్వరనాటకసమాజం పతాకం క్రింద"గయోపాఖ్యానం, శ్రీకృష్ణరాయబారం, శ్రీకృష్ణతులాభారం, తారాశశాంకం, హరిశ్చంద్ర, కర్ణార్జున యుద్ధం, బాలనాగమ్మ, చింతామణి, కురుక్షేత్రం, రామాంజనేయ యుద్ధం, సతీసావిత్రి, లవకుశ, రాజయోగి, పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్ర, మోహినీ భస్మాసుర" మొదలగు పౌరాణిక, జానపద నాటకాలను, "పల్లెపడుచు, కథానాయకుడు, రంగూన్ రౌడి, రక్తపిపాస, కోడెనాగు, మాధవసేవ, హేమారెడ్డి మల్లమ్మ, చిల్లరకొట్టు చిట్టెమ్మ, పూలరంగడు, మంచంమీద మనిషి" మొదలగు చారిత్రాత్మక, సాంఘిక నాటకాలను వందలసార్లు ప్రదర్శించి ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు. ఈ సమాజం నేటికీ కళాసేవ చేస్తూ వృత్తికళాకారులకు జీవనాధారంగా నిలిచి వుంది.

## 19. తవలమట్టి - అనంతపురం జిల్లా :

అనంతపురం జిల్లా, కదిరి తాలూకాలో తవలమట్టి గ్రామం వుంది. గ్రామం చిన్నదే అయినా విద్యాపరంగా కొంత అభివృద్ధి చెందిందనే చెప్పాలి. కళావిషయకమైన ఆలోచనకు అవకాశం కలిగి, గ్రామంలోని ఉత్సాహవంతులైన యువకులందరూ కలిసి "యువజన సేవాసంఘం" అను ఒక నాటక సమాజాన్ని 1975లో స్థాపించుకున్నారు. ఈ సమాజానికి శ్రీ కె. రామచంద్రారెడ్డి గారు అధ్యక్షులుగాను, శ్రీ వెంకట రమణగారు కార్యదర్శిగాను, శ్రీ యం. ఎస్. ఇమాంకాశి సాబ్ సంయుక్త కార్యదర్శిగాను, శ్రీ కందుకూరి రెడ్డెప్పగారి వంటి ఔత్సాహికులు కొందరు ఆ సమాజంలో సభ్యులై అనేక నాటకాలను ప్రదర్శించారు. ఈ సమాజంవారు "కురుక్షేత్రం, బాలనాగమ్మ, పుటుక్కు జరజర డుబుక్కు మే" ఇత్యాది అనేక నాటకాలను ప్రదర్శించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు.

సహజంగా పల్లె ప్రాంతాలలో స్థాపింపబడిన నాటక సమాజాలు ఒక్కొక్క పౌరాణిక నాటకాన్నిగాని, జానపద నాటకాన్నిగాని, పలుప్రాంతాలలో అనేకపర్యాయాలు ప్రదర్శించే అలవాటుంది. ఈ అలవాటు ప్రకారం వీరు "కురుక్షేత్రం" నాటకాన్ని విరివిగా ప్రదర్శించారు. "బాలనాగమ్మ" నాటకాన్ని కనీసం 20 సార్లైనా ప్రదర్శించి వుంటారు.

### పెనుగొండ-రొద్దంవారి కళాసేవ :

విజయనగర సామ్రాజ్యానికి రెండవ రాజధానిగ చారిత్రక ప్రాధాన్యంగల నగరం "పెనుగొండ". ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో రాయలసీమ ప్రాంతమందలి అనంతపురం జిల్లాలో ఒక ముఖ్యపట్టణం. పరిసరాలు ప్రకృతి రామణీయతకు, మనోహర దృశ్యాలకు ఆటపట్టు. సమున్నతమైన పర్వతసానువుల మధ్య ద్రాక్ష, దానిమ్మ, చీనీ, నిమ్మతోటలతోను, రసికజన హృదయాలను పరవశింప జేసే ప్రకృతిసౌందర్యంతోను విరాజిల్లిన "పెనుగొండ" యెందరో కవులకు, మరెందరో మహానటులకు మాతృభూమి అయ్యింది.

పెనుగొండలో రొద్దంవారి కుటుంబం అన్నివిధాల సుసంపన్నమైంది. లలితకళలకు నిలయం. ఈ పట్టణంలో ప్రముఖన్యాయవాదిగా, కవిగా, కళాపోషకులుగా శ్రీ రొద్దం హనుమంతరాయకవి పేరు ప్రతిష్టలార్జించుకున్నారు. వీరు "స్వప్నవాసవదత్త" కావ్యాన్ని ఆంధ్రీకరించి లఘుటీకతో ప్రచురించారు. "స్వారోచిషము" అను మరొక కావ్యాన్ని రచించి, సంప్రదాయకవులలో స్థానం ఏర్పరచుకున్నారు. వీరి కుమారులు శ్రీ రొద్దం వెంకోబరావు గారు గొప్పనటులు. సుప్రసిద్ధ న్యాయవాదులు. వీరిని లక్ష్మీ, సరస్వతులకు ప్రియపుత్రులని చెప్పవచ్చును. విద్యావినయగుణసంపన్నులు, సిరిసంపదలలో కుబేరులు. వీరు సంపదసంతా కళాపోషణకు వెచ్చించారు.

శ్రీ రొద్దం వెంకోబరావు గారు పెనుగొండలో రాజవైభవాన్ని సూచించునట్లుగా ఒక గొప్ప ప్రాసాదాన్ని నిర్మించుకున్నారు. ఆ భవనం నిరంతరం భక్తి పారవశ్యాన్ని గొలిపే భజనలతో, సంగీత సాహిత్యగోష్టులతో, నృత్యప్రదర్శనలతో ఇంద్రసభను గుర్తుచేసే ఒక కళాప్రాంగణంగా గోచరించేది. కళాకారులను సన్మానాలతో సత్కరించడానికి, సాహిత్య, ఆధ్యాత్మిక కావ్యకలాపాలకు, ధనాన్ని మంచినీళ్ల ప్రాయంగా వ్యయంచేసేవారు. శ్రీ వెంకోబరావుగారి ధర్మపత్ని శ్రీమతి వెంకమ్మగారు అపర అన్నపూర్ణ అన్నదానాదితో, అతిథి అభ్యాగతులతో ఆ యిల్లు సందడిగా వుండేది. వచ్చినవారికి భోజనవసతులు కల్పించడంలో యేమరుకలేని వెంకమ్మగారి చెయ్యి అలుపెరిగేది కాదు. భగవంతుడిచ్చిన సంపదను అందరికీ పెట్టి ఆనందించే ఆదర్శగృహిణి ఆ యిల్లాలు. అటువంటి యింట ఆదర్శ దంపతులకు జన్మించిన ఆరుగురి సంతానంలో మొదటి యిద్దరు శ్రీ రొద్దం రాజారావు గారు, శ్రీ రొద్దం హనుమంతరావు గారు. వీరిరువురు గొప్పనటులు, మరొక మహానటుడు శ్రీ బళ్ళారి రాఘవకు సమకాలికులు, కలిసి నటించినవారు. ఆ రోజులలో శ్రీ (బళ్ళారి) రాఘవను, రొద్దం సోదరులను కలిపి "ర" కార త్రయం అనేవారు. ఈ త్రిమూర్తులు రాయలసీమకు చెందిన అనంతపురం జిల్లావారగుట ఆ జిల్లా చేసుకొన్న పూర్వపుణ్య సుకృతం. వీరు ముగ్గురు సుప్రసిద్ధ న్యాయవాదులు. నటచక్రవర్తులు. నాటక కళామతల్లి సేవలో కళారాధనకు సర్వంధారపోసిన త్యాగధనులు. రాయలసీమలో వెలసిన "నటరత్నాలు".

శ్రీ రొద్దం సోదరులకు నాటక కళపైన అభిరుచిని, ప్రేరణను కలిగించింది బళ్ళారి రాఘవ.

శ్రీ రొద్దం వెంకోబరావు నటులుకావడంతో తనకుమారులను చిన్ననాటినుండి నాటక కళవైపు ప్రోత్సహించారు. శ్రీ రొద్దం రాజారావు, శ్రీ రొద్దం హనుమంతరావు గారలు చిన్నతనంనుండి నాటకాలలో పాత్రలు ధరించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు. మధురమైన కంఠస్వరాలతో, గంభీరమైన వాచికాభినయంతో, అద్వితీయమైన నటనతో అందమైన ఆకృతితో శ్రీ రొద్దం సోదరులు రంగస్థలంమీద రాణించేవారు. కళాప్రియులు, సంగీత సాహిత్యాభిమానులు. మీదు మిక్కిలి జన్మతః నటులు.

శ్రీ రొద్దం సోదరులిద్దరూ యెంతో అన్యోన్యంగా కలిసి నాటకాలాడేవారు. అన్నగారైన శ్రీ రాజారావుగారు పురుషవేషాలు ధరిస్తే, తమ్ముడు శ్రీ హనుమంతరావుగారు స్త్రీపాత్రలు పోషించేవారు. పాదుకా పట్టాభిషేకంలో అన్న "భరతుడు", తమ్ముడు "కైక", సతీసావిత్రిలో అన్న "సత్యవంతుడు", తమ్ముడు "సావిత్రి", శ్రీకృష్ణదేవరాయ విజయంలో అన్న "శ్రీకృష్ణదేవరాయలు", తమ్ముడు "తిరుమల దేవి", ప్రమీలార్జునీయంలో అన్న "అర్జునుడు", తమ్ముడు "ప్రమీల", చిత్రనళీయంలో అన్న "నలుడు", తమ్ముడు "దమయంతి, బాహుకుడు", సారంగధరలో అన్న "సారంగధరుడు" తమ్ముడు "చిత్రాంగి", రామదాసు నాటకంలో అన్న "రామదాసు" తమ్ముడు "తానీషా భార్య"గా నటించి, ఆంధ్రరంగస్థల చరిత్రలో అనంతపురం జిల్లాకొక విశిష్టస్థానాన్ని సృష్టించిపెట్టిన కళావతంసులు శ్రీ రొద్దం సోదరులు.

శ్రీ రాజారావు గారు 26సంవత్సరాలకే బి.ఎల్. డిగ్రీ పుచ్చుకొని, న్యాయవాద వృత్తిని స్వీకరించారు. తండ్రిగారితో కలిసి కొంతకాలం పెనుగొండలో పనిచేసి, వృత్తిరీత్యా హిందూపురం చేరి అక్కడ స్థిరపడ్డారు.

శ్రీ రాజారావు గారు న్యాయవాద వృత్తిలో వున్నప్పటికీ ప్రజాహిత కార్యక్రమాలలోను, సాహిత్య, సంఘ సేవలలోను నిర్విరామంగా పనిచేశారు. వీరి నిస్వార్థసేవను గుర్తించి ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వము వీరికి రావుసాహెబ్ బిరుదమునిచ్చి సత్కరించింది.

శ్రీ రాజారావుగారికి నాటక కళ అంటే చిన్నతనం నుండి వల్లమాలిన అభిమానం. ఎందరో ఔత్సాహిక యువకులను ప్రోత్సహించి, పెక్కు నాటకాలను ప్రదర్శించారు. శ్రీ రాజారావు గారు సోదరునితో నటించిన పాత్రలేగాక "రసపుత్ర విజయం"లో రాజసింహుడు, "రాణా ప్రతాప"లో ప్రతాపసింహుడు, "స్థానేశ్వర యుద్ధం"లో పృథ్వీరాజు మొదలగు పాత్రలను యెంతో వైవిధ్యంతో పోషించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు.

1940లో శ్రీ రాజారావు గారు 'ఆంధ్ర నాటకకళాపరిషత్తు'ను హిందూపురమునకు ఆహ్వానించి, తొమ్మిదవ వార్షికోత్సవాన్ని అత్యంత వైభవంగా నిర్వహించారు.

1946లో ఏలూరులో నిర్వహింపబడిన ఆంధ్రనాటక కళాపరిషత్తుకు అధ్యక్షత వహించారు. హిందూపురంలో "రాయలసీమ కళాపరిషత్తు"ను స్థాపించి, అనేక సాహిత్యసభలు, పండితగోష్ఠులు నిర్వహించారు.నాటక పరిషత్తులు జరిపించి, ఔత్సాహిక నాటక సమాజాలకు, ఔత్సాహిక నటులకు తగిన ప్రోత్సాహమిచ్చారు. కవులను, పండితులను సన్మానాలతో సత్కరించారు. శివభారతం రచించిన శ్రీ గడియారం వెంకటశేష శాస్త్రులకు గండపెండేరం తొడిగి, వారి కవితా ప్రతిభను గౌరవించారు. "రాణా ప్రతాపసింహ చరిత్ర"ను రచించిన శ్రీ రాజశేఖర శతావధాని గారికి రత్నకిరీటాన్ని సమర్పించి, తమ కవితాహృదయాన్ని చాటుకున్నారు.

శ్రీ రాజారావుగారు కవిపండిత పోషకులు. ఉదారచరితులు, మహానటులు. నిష్కళంక కళారాధకులు. వీరు కళాపోషకులుగా అనల్పమైన ఖ్యాతిని గడించి, అల్పాయుష్కులై 49సంవత్సరాలకే 1950లో అమరులై, అమరలోకాలకు చేరుకున్నారు.

ఆంధ్రకర్ణాటక రాజ్యరమా వల్లభులు, లలితకళా సమరాంగణ సార్వభౌములు అయిన శ్రీకృష్ణదేవరాయలు జనరంజకంగా పాలించిన రతనాలసీమయైన రాయలసీమలో జన్మించి, లలితకళామతల్లికి ముద్దుబిడ్డయై, అపర కృష్ణదేవరాయలనిపించుకొని, అటు జన్మనిచ్చిన మాతాపితలకు, ఇటు మాతృభూమికి అజరామర కీర్తినార్జించి పెట్టిన మహోన్నత వ్యక్తి శ్రీ రొద్దం రాజారావుగారి జన్మ ధన్యం.

అన్నగారైన రొద్దం రాజారావుగారు అకాల మృత్యువు వాతబడడంతో ఒంటరివాడైన శ్రీ హనుమంతరావు గారు న్యాయవాదిగా అనంతపురంలో స్థిరపడ్డారు. నాటకరంగానికి అంకితమైన శ్రీ హనుమంతరావు గారు ఆ తరువాత ఉత్తర గోగ్రహణంలో "బృహన్నల" పాత్రను పోషించి రాణించారు.

తరువాత శ్రీ హనుమంత రావుగారి నటజీవితం మలుపు తిరిగింది. జన్మతః హాస్యప్రియులైన వీరు స్త్రీపాత్రలు మాని, హాస్యరస భరితములైన పురుషపాత్రలను ధరించి, హాస్యనటచక్రవర్తిగా ఆంధ్రుల అంతఃకరణాలపై చెరగని ముద్ర వేశారు.

"విప్రనారాయణ"లో శ్రీనివాసుడు, శ్రీకృష్ణ తులాభారం"లో వసంతుడు, "చింతామణి"లో సుబ్బిశెట్టి "భక్త కబీరులో" శెట్టి, వీరు ధరించిన ముఖ్య హాస్యపాత్రలు.

ఆ రోజులలో "రొద్దం వారి" కళాసేవ పెనుగొండ విజయనగర సామ్రాజ్య వైభవాన్ని ప్రతిబింబించేదని ప్రతీతి.

శ్రీ హనుమంతరావు గారు పౌరాణిక, చారిత్రాత్మక నాటకాలలోనే గాక సాంఘిక నాటక, నాటికలలో గూడ నటించి, తన ప్రతిభను ప్రకటించుకున్నారు. అనంతపురంలో మొట్టమొదటిసారిగా "ఆంధ్రవిజ్ఞాన సమితి' అను నాటక సమాజాన్ని స్థాపించి, "కళోపాసన, కళోద్ధారకులు, ఎన్.జి.ఓ., పెండ్లి ట్రయినింగ్, పెండ్లి చూపులు, టీకప్పులో తుఫాను, నాటకం, స్వాతంత్ర్య యజ్ఞం, సంసారనౌక, పెండ్లి, కులం లేని పిల్ల, దొంగ వీరడు, రంగూన్ రౌడీ, గాలివాన, అపోహ" వంటి యెన్నో సాంఘిక నాటక, నాటికలను ఆంధ్రదేశమంతటా ప్రదర్శించారు. 1956లో "గుంతకల్లు, మద్రాసు" మొదలగు పట్టణాలలో "పెండ్లి ట్రయినింగ్" నాటికలో ఉత్తమ నటులుగా

ప్రస్తుతం అనంతపురంలో వున్న "లలితకళాపరిషత్తు" వ్యవస్థాపకులలో ఒకరై, జీవితాంతం లలితకళాపరిషత్తుకు కార్యవర్గసభ్యులుగా వుండి, పరిషత్తు అభివృద్ధికి తోడ్పడిన గొప్ప కళాకారులు.

అనంతపురం లలితకళాపరిషత్తులో నాటక విద్యాలయాన్ని స్థాపించడానికి అవిరళ కృషిచేసి, 1964లోనాటక విద్యాలయాన్ని స్థాపించి, దానికి మొదటి "ప్రిన్సిపాల్"గా తానే నియమింపబడి, విద్యాలయ పురోభివృద్ధికి అహర్నిశలు కృషిచేసిన కళాతపస్వి శ్రీ రొద్దం హనుమంతరావుగారు.

1964లో శ్రీ హనుమంతరావుగారు "ఆంధ్రనాటక కళాపరిషత్తు"కు ఉపాధ్యక్షులుగా యెన్నికైనారు. ఆ తరుణంలో వీరి ఆధ్వర్యాన రాష్ట్రస్థాయిలో అనంతపురంలో నాటక పోటీలు నిర్వహించడం జరిగింది.

శ్రీ హనుమంతరావుగారిని ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని నాటక సమాజాలు ఘనంగా సన్మానించి, సత్కరించాయి. వీరు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ సభ్యులుగా అనేకసార్లు యెన్నుకోబడినారు. నాటక కళకు వీరుచేసిన సేవలను గుర్తించి, "ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ" వీరికి అకాడమీలో విశిష్ట సభ్యత్వాన్నొసగి గౌరవించింది.

శ్రీ రొద్దం హనుమంతరావుగారు చివరిశ్వాస వున్నంతవరకు నాటకకళోద్ధరణకు పాటుపడ్డ మహనీయులు. తన జీవితాన్నే నాటక కళకు అంకితంచేసిన మహానటులు. ధన్యజీవి. హాస్యనటచక్రవర్తి. 74 సంవత్సరాల నిండు నటజీవితాన్ననుభవించి, 1980లో నాటక కళామతల్లి ఒడిలో అంతిమశ్వాస విడిచి అమరులైనారు.

నాటకకళ, నటన ఒక ప్రత్యేక తపస్సు. పుట్టుకతోనే స్వయంప్రతిభను తోడుతెచ్చుకున్న మహానటులు, కళాపోషకులు, కళారాధకులు శ్రీ రొద్దంసోదరులు.

తరాల కళాసేవలో శ్రీరొద్దంవారు తారాపథాన్నందుకున్నారు. కళాపోషణలో, కళారాధనలో రాయలసీమకే వన్నెతెచ్చిన ఘనమైన వంశం.

1954లో పెనుగొండనగరంలో "బోర్డు హైస్కూలు కల్చరల్ అసోసియేషన్" అను నాటకసమాజం స్థాపింపబడింది. ఈ సమాజంవారు నాడు బహుళప్రచారంలో వుండిన పెక్కు నాటకాలను ప్రదర్శించారు. ఆ తరువాత "ఫ్రెండ్స్ డ్రమెటిక్ అసోసియేషన్" అను మరియొక నాటక సమాజం స్థాపింపబడింది. ఈ సమాజాలలో శ్రీ జి.జానకిరాం, శ్రీ టి.సుబ్రమణ్యశాస్త్రి మొదలగువారు నటులుగా పనిచేశారు.

పెనుకొండ వాస్తవ్యులైన శ్రీ ఎస్.ఎన్. రామస్వామిగారు శ్రీ బళ్ళారి రాఘువతోను, శ్రీ రొద్దంసోదరులతోను యెన్నో పౌరాణిక, చారిత్రాత్మక నాటకాలలో నటించారు. వీరు సంగీత నాటక అకాడమీ సభ్యులు. సంగీత, కవిత్వాలలో చక్కని అభినివేశమున్న మంచినటులు. "రాయల కళాపరిషత్తు" వీరిని "కళాకోవిద, కళాప్రవీణ" అనుబిరుదములతో సత్కరించింది.

ఈ విధంగా పెనుగొండ విజయనగరరాజుల కళావైభవానికి ప్రతీకగానే నిలిచివుంది.

**కళ్యాణదుర్గం :**

"కళ్యాణదుర్గం"లో సుప్రసిద్ధ రంగస్థలనటులుగా పేరుప్రఖ్యాతు లార్జించినవారు "శ్రీ తూముకుంట రావు"గారు. వీరు పౌరాణిక నాటకాలలో ముఖ్యంగా "రాజు, మంత్రి, నారదుడు" మొదలగు పాత్రలు ధరించేవారు. వీరు మైసూరులోని వరదాచార్యుల నాటకాలను, మదరాసు గోవిందస్వామి నాయర్ కంపెనీ నాటకాలను, శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు, శ్రీ కోలాచలం శ్రీ నివాసరావు, శ్రీ బళ్ళారి రాఘవగార్ల నాటకాలను చూచి ప్రభావితులై, 1901-1903 ప్రాంతంలో "శ్రీ హరిహరేశ్వర నాటక మండలి" అను నాటక సమాజమును స్థాపించి, అనంతపురంలో నాటక ప్రదర్శనలిస్తుండేవారు. శ్రీ ఆదిమూర్తిరావుగారు ఈ కాలానికి సంబంధించిన గొప్పనటులు.

1890-1910 ప్రాంతంలో కళ్యాణదుర్గం తాలూకా తూముకుంట గ్రామంలో కరణం గుండూరావుగారు "శ్రీ హరిహరేశ్వర సహాయ నాటకకంపెనీ" అను నాటక సమాజాన్ని స్థాపించి, అనంతపురంజిల్లా అంతటా విరివిగా నాటకాలను ప్రదర్శించారు. శ్రీ కరణంగుండూరావుగారు శాస్త్రీయ సంగీతం తెలిసిన వ్యక్తి. మధురంగా పాడగలడు. మంచినటుడు. గొప్పకళాకారుడు. అనంతపురంజిల్లాలో 'శ్రీ హరిహరేశ్వర సహాయనాటక కంపెనీ' గుండూరావు కంపెనీ అనుపేరుతో ప్రచారం పొందింది.

రావునా హబి శ్రీ రొద్దం రాజారావుగారు కళాపోషక కుటుంబంలో జన్మించారు. వీరి తాతగారు శ్రీ రొద్దం హనుమంతరావుగారు పెనుకొండలో ప్రముఖ న్యాయవాది. వీరు కవులు, నాటకరచయితలు. వీరు తోలుబొమ్మలాటలు, వీధి నాటకాలను పోషించారు. శ్రీ రాజారావుగారి తమ్ముడు శ్రీ రొద్దం హనుమంతరావుగారు గొప్ప హాస్యనటశేఖరులు. శ్రీ రాజారావు గారు పెనుకొండలో ఉన్నప్పుడే శ్రీ బళ్ళారి రాఘవచే ప్రభావితులై, పెద్దపల్లి రాఘవేంద్రాచార్యులు, కల్లూరు కృష్ణారావు, పాణ్యం చంద్రమౌళి" మొదలగువారితో కలిసి నాటక ప్రదర్శనలిస్తుండేవారు. ఆ తరువాత కొంతకాలం శ్రీ రొద్దం సోదరులిద్దరూ శ్రీ బళ్ళారి రాఘవతో కలిసి అనేక నాటకాలు ప్రదర్శించారు.

1934లో శ్రీ రొద్దం రాజారావుగారు న్యాయవాదిగా హిందూపురంలో స్థిరపడ్డాడు. వీరు 1934 నుండి 1950 వరకు హిందూపురంలో నాటక సంస్థలను స్థాపించి, "రసపుత్రవిజయము, రోషనార, విజయనగర సామ్రాజ్యపతనం" మొదలగు నాటకాలలో శ్రీ కృష్ణరాయాది ప్రముఖపాత్రలను పోషించి, ప్రజానురంజకంగా నటించిన మేటినటులు.

శ్రీ రాజారావుగారు, శ్రీ పక్కా నరసింగరావు, మసూద్ ఆలి, ఆదవేని నారాయణాచార్యులు, పక్కా గోపీనాధ్ మొదలగువారితో కలిసి "శ్రీ కృష్ణలీలలు, లవకుశ, చింతామణి" ఇత్యాది నాటకాలను విజయవంతంగా ప్రదర్శించారు.

1941లో తొమ్మిదవ (9) ఆంధ్రనాటక కళాపరిషత్తు సభలను హిందూపురంలో జరిపించి, అనేకమంది కవులను, పండితులను, రంగస్థల కళాకారులను సన్మానించారు. ప్రప్రథమంగా ఆంధ్రనాటక కళాపరిషత్తు సభలను రాయలసీమలోని హిందూపురంలో జరిపించిన ఘనత శ్రీ రొద్దం రాజారావుగారికే దక్కింది.

1945లో "రాయల కళాపరిషత్తు"ను స్థాపించి, ఏలూరు, మైసూరు, బెంగళూరు, రాజంపేట మొదలైన ప్రాంతాలలో పరిషత్తు ఉత్సవాలను జరిపించి, నాటక ప్రదర్శనలను ఏర్పాటుచేశారు.

1957లో "కర్ణాటక సంఘం" అను సంగీత సమాజం ఒకటి స్థాపింపబడింది.

1958లో "లలిత కళాసమితి" స్థాపింపబడింది. ఈ సమాజాలు నేటికీ కళాసేవ జేస్తున్నవి. హిందూపురంలో సూర్యప్రకాశరావు మున్సిపల్ కమీషనర్‌గా వున్నప్పుడు "లలిత కళాసమితి"తరపున అనేక నాటకాలు ప్రదర్శింపబడ్డాయి. ప్రస్తుతము లలిత కళాసమితి నాటకకళకు సేవచేస్తూవుంది.

శ్రీ పక్కా నరసింగరావు, శ్రీ మసూద్ ఆలి, శ్రీ ఆదవేని నారాయణాచార్యులు, శ్రీ పక్కా గోపీనాధ్‌గారు పై సమాజాలలో పనిచేసిన నటులు.

శ్రీ ములుగూరు గురుమూర్తిగారు, శ్రీ చిలుకూరి నారాయణరావుగారు, శ్రీ సొదలి సంపంగి రామశాస్త్రిగారు పేరుమోసిన నాటకరచయితలు. శ్రీ సొదలి సంపంగి రామశాస్త్రిగారు "శ్రీ కృష్ణదేవరాయవిజయం, రసపుత్ర విజయం, రాణాప్రతాప్" మొదలగు నాటకాలను రచించారు. శ్రీ ములుగూరు గురుమూర్తిగారు, శ్రీ చిలుకూరి నారాయణరావుగారు "పెండ్లిచూపులు, అచ్చికాపువలపు, నాటకంలో నాటకం" (బోరయ్యశెట్టి) అను నాటకాలను రచించి, అనంతపురంజిల్లాలో నాటక కళాభివృద్ధికి తోడ్పడ్డారు,

## ధర్మవరం :

ధర్మవరం అనంతపురంజిల్లాలో పట్టువస్త్రాలకు ప్రసిద్ధి చెందిన పట్టణం. "ఆంధ్రనాటక పితామహ" బిరుదాంకితులు శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారికి జన్మస్థలం. కాని వారు నటులుగా ఆంధ్రదేశానికి పరిచయమైంది బళ్ళారి వాస్తవ్యులుగానే. అక్కడినుండే ఆయన ఒక అమూల్యమైన నటరత్నాన్ని తీర్చిదిద్ది, ప్రపంచమహానటుల సరసన నిలబెట్టారు. వారుకూడా బళ్ళారి వాస్తవ్యులుగానే ప్రపంచానికి పరిచయమయ్యారు. వారే శ్రీ రాఘవ. ఆశ్రయమిచ్చి ఆదుకున్న అమ్మలాంటి బళ్ళారిని తనపేరుకు ముందుచేర్చుకొని, నటుడుగా తన కీర్తికాయమున్నంతవరకు "బళ్ళారి" యశశ్చంద్రికలను విశ్వవ్యాప్తంగా ప్రకాశింపజేసిన కళామూర్తి శ్రీ బళ్ళారి రాఘవ. ఒక మహానటుడైన రాఘవ, ఒక నాటక పితామహునికి మేనల్లుడు. ఇద్దరూ అనంతపురం జిల్లాకు చెందినవారే.

అటువంటి ధర్మవరంలో విద్యావంతులైన కొందరు మొట్టమొదట 1892లో "ఎడ్విన్ కారొనేషన్ మరియు సరస్వతీ నిలయం"ను స్థాపించారు. దానికి అనుబంధంగా 1927లో సరస్వతీనిలయం లైబ్రరీ స్థాపింపబడింది. ఇది స్థానికులైన వారికి విశ్రాంతి సమయాలలో కేవలం గ్రంథపఠనానికి, చిన్న చిన్న ఆటలకు నిర్దేశింపబడింది. మారుతున్న కాలంతోబాటు మనుషుల ఆలోచనలో కూడ మార్పు వచ్చింది.

సుధ" సమావేశమందిరం నిర్మింపబడ్డాయి. మొదట్లో ఆంధ్రనాటకపితామహవర్థంతి కార్యక్రమాలు, త్యాగరాజ జయంత్యుత్సవాలు నిర్వహింపబడేవి. ఆ తరువాత సాహితీవేత్తలైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు, శ్రీ గడియారం వెంకటశేషశాస్త్రిగారు, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు మొదలగు సాహిత్యవేత్తలను పిలిపించి, సన్మానించడం జరిగింది.

ఆంధ్రనాటకపితామహ శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారి వర్థంతిని ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు "కళాజ్యోతి" ఆధ్వర్యంలో జరిపించారు. ఆ సందర్భంగా శ్రీ రామకృష్ణమాచార్యుల జీవిత సంగ్రహాన్ని పుస్తకరూపంలో విడుదల చేయడం జరిగింది.

1974లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీకి అప్పుడు స్పెషల్ ఆఫీసరుగానున్న పరమహంసగారి ప్రోత్సాహంతో "కళాజ్యోతి నాటక సమాజాన్ని" ఆంధ్రప్రదేశ్ సంగీత నాటకఅకాడమీకి అనుబంధం చేయడం జరిగింది. అదే సంవత్సరం సంగీత నాటక అకాడమీ గ్రాంటుతో అకాడమీ అనుబంధ సంస్థగా "కళాజ్యోతి నాటక సమాజం" సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించడం జరిగింది.

1978లో కళాజ్యోతి మాతృసంస్థ "ఎడ్విన్ కారొనేషన్ రీడింగ్ రూమ్" స్వర్ణోత్సవాలు జరిగాయి.

"కళాజ్యోతి నాటక సమాజం" ఆధ్వర్యంలో "నెల్లూరు రామకృష్ణ నాట్యమండలి" వారిచే ధర్మవరం రామకృష్ణమాచార్యులు రచించిన నాటకాలను ధర్మవరంలో ప్రదర్శించడం జరిగింది. "హైదరాబాదు త్యాగరాజ సభ" వారిని పిలిపించి, నాటక ప్రదర్శన లిప్పించారు. "ఆర్ట్ లవర్స్ యూనియన్" చిత్తూరువారిని కూడ పిలిపించి కళాజ్యోతి తరపున నాటక ప్రదర్శన లిప్పించడం జరిగింది.

1983లో కళాజ్యోతి నాటక సమాజం నాటక వారోత్సవాలు నిర్వహించింది. అప్పటి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ సభ్యురాలైన శ్రీమతి జమునా రమణారావుగారిచే ప్రారంభోత్సవం జరిపించారు. ఆ సందర్భంగా కవులను, నటులను, సంగీత కళాకారులను సన్మానించడం జరిగింది. "శ్రీమతి జమున, శ్రీ రామన్న పంతులుగారు, శ్రీ జోళదరాసి దొడ్డనగౌడ్‌గారు, దివాకర్ల వెంకటావధానిగారు, శ్రీ శ్రీగారు, శ్రీ ఆరుద్రగారు, శ్రీ సి.నారాయణరెడ్డిగారు "మొదలగువారు సన్మానింపబడినవారిలో ముఖ్యులు. వీరినేగాక చలనచిత్ర రంగంలో ప్రసిద్ధులైన శ్రీ చిత్తూరు నాగయ్యగారు, శ్రీ రాజనాల, శ్రీమతి సావిత్రి, శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, శ్రీ ధూళిపాళ సీతారామశాస్త్రి, శ్రీ పద్మనాభం" మొదలగు నటులను కూడ కళాజ్యోతి నాటక సమాజం సన్మానించింది.

కళాజ్యోతి నాటక సమాజంవారు నాటక పోటీలను నిర్వహించడమేగాక, ఇతర నాటక పరిషత్తులలో నాటకాలు ప్రదర్శించడం బహుమతులు సంపాదించడం జరుగుతూవుంది. "కళాజ్యోతి నాటక సమాజం"వారు ప్రదర్శించిన నాటకాలలో "అతిధిదేవుళ్ళొస్తున్నారు, వాపస్, పంచమవేదం" మొదలగునవి ముఖ్యమైనవి. "కళాజ్యోతి నాటక సమాజం" వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ డి.డి. నారాయణరావు (అడ్వొకేట్)గారు, కార్యదర్శి శ్రీ ఆర్.నారాయణశాస్త్రిగారు, వ్యవస్థాపక సభ్యులు శ్రీ పల్లెం వెంకటేశం ఎక్స్ యం.ఎల్.ఏ., శ్రీ కె.ఆదిమూర్తి, శ్రీ పి.వి.చౌదరి ఎక్స్ మినిస్టరు, ఆంధ్రప్రదేశ్. ప్రస్తుతం శ్రీ డి.డి. నారాయణరావుగారు కళాజ్యోతి నాటక సమాజానికి అధ్యక్షులుగాను, శ్రీ ఏ.ఆర్.ఎస్.హరినాథ్ (అడ్వొకేటు)గారు కార్యదర్శిగాను వున్నారు.

ప్రస్తుతం ఆంధ్రనాటక పితామహ మెమోరియల్ సభాభవన నిర్మాణం పూర్తయింది. త్వరలోనే వజ్రోత్సవం జరపాలని కార్యవర్గ సభ్యులు నిర్ణయించారు.

## గుంతకల్లు :

"గుంతకల్లు" రాయలసీమలోని అనంతపురంజిల్లాలో కలదు. దక్షిణ రైల్వేకేంద్రం. 1945నుండి లలిత కళాకేంద్రమని చెప్పవచ్చును.

1945 ప్రాంతంలో "రైల్వే ఇన్స్టిట్యూట్ కళాసమితి" స్థాపింపబడింది. వ్యవస్థాపకులు శ్రీ ఏ.వి.సుబ్బశర్మ, శ్రీ మాధవరామయ్య, శ్రీ కె.జయరాం, శ్రీ శ్రీనివాసాచార్యులు. రైల్వే ఇన్స్టిట్యూట్ కళాసమితికి సర్వదా రైల్వేడివిజనల్ ఆఫీసరు అధ్యక్షులుగా వుండడం ఆనవాయితి. ప్రధమకార్యదర్శి శ్రీ పెద్ద ఆంజనేయులు. దీనికి అనుబంధసంస్థ "రైల్వే కల్చరల్ అసోసియేషన్".

మొదట్లో రైల్వే కళాసమితివారు లలిత సంగీతపోటీలు, కర్ణాటక సంగీత పోటీలు నిర్వహించేవారు. ఆ తరువాత ఔత్సాహికులైన నటులు కలిసి నాటకాలు ప్రదర్శించడం, ఇతర పరిషత్తులలో పాల్గొనడం జరుగుతూ వచ్చింది.

సంగీతం, నాట్య పోటీలు కూడా నిర్వహించబడినవి.

1959లో మొట్టమొదటిసారిగా ఏకపాత్రాభినయ పోటీలు నిర్వహించడం జరిగింది. అప్పటినుండి ప్రతి సంవత్సరం "రైల్వేకళాపరిషత్తు" సాంస్కృతిక కార్యక్రమాలు, నాటక, నాటిక, ఏకపాత్రాభినయ పోటీలు నిర్వహించడం జరుగుతూవచ్చింది. ఏకపాత్రాభినయ పోటీలలో శ్రీ ధూళిపాళ సీతారామశాస్త్రి, శ్రీ పులికంటి కృష్ణారెడ్డి "దుర్యోధన, మయసభ"ను ప్రదర్శించి బహుమతులతోపాటు, సన్మానాలను స్వీకరించారు.

రైల్వేకళాసమితి నాటక సమాజం స్థాపించిన తొలిరోజులలో ఔత్సాహికులైన యువకులు "నేటి నటులు, బంగారు పంజరం, అనంతం, పెండ్లిచూపులు, దొంగవీరుడు" మొదలగు నాటకాలను పలుపరిషత్తులలో ప్రదర్శించి, బహుమతులు పొందివున్నారు.

రైల్వేకళాపరిషత్తు నాటకయజ్ఞం ప్రారంభించడంతో గుంతకల్లు పట్టణంలో నాటకకళలో చైతన్యం కలిగిందనే చెప్పాలి. ఔత్సాహికులైన స్థానిక యువనటులు, రైల్వేఉద్యోగులు కళాసమితికి సంబంధంలేని కొన్ని సమాజాలను స్థాపించి, నాటక కళకు ఇతోధికమైన సేవచేస్తున్నారు.

**1962నుండి గుంతకల్లులో వెలసిన నాటక సమాజాలు :**

**1."వాణీ నాట్యకళానికేతన్":**-1967లో "వాణీ నాట్యకళానికేతన్" స్థాపింపబడింది. ఈ సమాజంలో శ్రీ ఆర్.బలరామయ్య, శ్రీ ఆర్.శ్రీరాములు, ఎన్.శ్రీరాములు, శ్రీ ఆర్.బి.చెన్నయ్య, శ్రీ సి.వి.సుంకప్ప, శ్రీ రాజు సభ్యులుగా వుండేవారు. వీరు "ఊబి, రైలు దోపిడి, రైలుప్రమాదం," మొదలగు నాటకాలను ప్రదర్శించి, అనేక బహుమతులను సంపాదించినారు.

**2."శారదా నాట్యకళాసమితి":**- ఈ సమాజానికి వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ ఆంథోనిస్వామి. వ్యవస్థాపక కార్యదర్శి శ్రీ హెచ్.రామాంజనేయులు, ఉపాధ్యక్షులు శ్రీ హెచ్.దాసు , శ్రీ జె.సి.సత్యప్రకాష్, శ్రీ డి.లక్ష్మయ్య, శ్రీ యం.నారాయణస్వామి, శ్రీ గోవిందప్ప, శ్రీ పిచ్చయ్య సభ్యులుగా వుండేవారు. ఈ నాటక సమాజం తరపున "తప్పునాది, నిష్కృతి, పంజరం, మహానటుడు, చాణక్య, నిర్మల, పరాజితులు, స్వీకారం, జ్వాల" మొదలగు నాటక, నాటికలను పెక్కుసార్లు ప్రదర్శించి, నెల్లూరు, శ్రీ కాళహస్తి, వెంకటగిరి, హైదరాబాదు మొదలగుచోట్ల బహుమతులందుకున్నారు. ఈ సమాజంలో శ్రీ హెచ్.రామాంజనేయులుగారు ప్రధానభూమికలు ధరించి, గుంతకల్లు పట్టణంలోని నటులలో ఒకరుగా కీర్తి ప్రతిష్టలను సంపాదించారు.

**3."యువజన అభ్యుదయ నాట్యమండలి":**- ఈ సమాజానికి "శ్రీ సైమన్" అధ్యక్షులుగా వుండిరి. శ్రీ పరశురామ్, శ్రీ ధనోజిరావు, శ్రీ ఆచారి సభ్యులు. వీరు "వెంకన్నకాపురం, రైలుప్రమాదం, రెండ్రెళ్ళ ఆరు, సాధన, తస్మాత్ జాగ్రత్త" మొదలగు నాటకాలను పలుమార్లు ప్రదర్శించి, పారితోషికాలందుకున్నారు.

**4."దుర్గాకళాసమితి":**- ఈ సమాజం శ్రీ బి.నారాయణగారి ఆధ్వర్యంలో స్థాపింపబడింది. ఈయన గుంతకల్లు పట్టణంలోని ఔత్సాహిక యువకులను చేర్చుకొని, వారికి నాటకాలు నేర్పించి, ప్రదర్శించేవారు. వీరు ప్రదర్శించిన నాటకాలలో "రైలు దోపిడి, వెంకన్న కాపురం, రైలుప్రమాదం" ప్రసిద్ధమైనవి.

**5 "ప్రభానాట్యమండలి":**- ఈ నాటక సమాజంలో శ్రీ చక్రపాణి అధ్యక్షులుగాను, శ్రీ జె.డి.ప్రభాకర్ కార్యదర్శిగాను, శ్రీ ఓబన్న, శ్రీ గోవిందప్ప మొదలగువారు సభ్యులుగాను వుండేవారు. వీరు "పశ్చాత్తాపం, అడుగుజాడలు, అడవి," మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

**6. "రామాఅమెచ్యూర్స్":**- "తారకరామా ఫిలింసొసైటీ" స్థాపకులైన శ్రీ పుండరీకాక్షయ్య సోదరులు శ్రీ బలరామయ్యగారు వ్యవస్థాపక సభ్యులుగా" రామా అమెచ్యూర్స్"అను నాటక సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజంలో శ్రీ సి.వి.రామమూర్తి, శ్రీ గణి, శ్రీ రాజు, శ్రీ జి.ఎన్. రాము సభ్యులు. వీరు "పల్లెపడుచు, తిమ్మరుసు, శ్రీ రామపాదుకలు, కర్ణ, వేణరాజు," మొదలగు నాటకాలను అనేక పర్యాయాలు ప్రదర్శించారు. ఈ సమాజం నేడు నాటక ప్రదర్శనలిస్తూవుంది. శ్రీ రాధామోహన్ గారు ఈ సమాజానికి నాటకకవిగా వున్నారు.

**7."రవీంద్ర ఆర్ట్స్ నాటకసమాజం":**- 1969లో శ్రీ వై.విశ్వనాథయ్య, శ్రీ హెచ్.రామాంజనేయులు, శ్రీ జె.చంద్రయ్యగార్ల ఆధ్వర్యంలో "రవీంద్ర ఆర్ట్స్ నాటక సమాజం" స్థాపింపబడింది. వ్యవస్థాపక అధ్యక్షులుగాను, నాటక దర్శకులుగాను శ్రీ జె.చంద్రయ్యగారు వ్యవహరించేవారు. శ్రీ కె.సుబ్బన్న కార్యదర్శి. శ్రీ సి.వి.రామమూర్తి, శ్రీ కె.భీమారావు, శ్రీ ఎన్.ఆనంద్, శ్రీ జి.యం.పి. ఓబయ్య

సభ్యులుగా వుండేవారు. ఈ సమాజంచాల ఉత్సాహంగా పనిచేసింది. ఎన్నో పరిషత్తు నాటకపోటీలలో పాల్గొన్నారు. ఎన్నో పారితోషికాలు సంపాదించి, గుంతకల్లు పట్టణానికి నాటకరంగంలో చిరకీర్తిని ఆర్జించి పెట్టారు. వీరు "కథ కంచికి , పల్లెపడుచు, ఆరాధన, భయం, విరజాజి, మానవుడు, సమర్పణ,సాధన, త్యాగమయి, నథింగ్ బట్ ట్రూత్, ఛాయ, నటనాలయం," మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

**8. "కర్ణాటక నాటక సంఘం":-** గుంతకల్లు పట్టణం దక్షిణ రైల్వేకేంద్రం అవడం వలన తెలుగువారికేగాక, కన్నడిగులకు, తమిళులకు కూడ ఉద్యోగరీత్యా కేంద్రమైంది. రైల్వే కళాపరిషత్తు, స్థానికమైన తెలుగు నాటక సమాజాలు కన్నడిగులకు, తమిళులకు ప్రేరణ కలిగించాయి. కన్నడిగులు తాముకూడ నాటకాలు ప్రదర్శించాలన్న ధ్యేయంతో కర్ణాటక సంఘం స్థాపింపబడింది. శ్రీ అహోబిళ శాస్త్రి ఈ సంఘానికి వ్యవస్థాపక అధ్యక్షులు. శ్రీ రమణ, శ్రీ నారాయణ స్వామి సభ్యులుగా వుండేవారు. అవసరాన్నిబట్టి నటులను రావించుకొని నాటక ప్రదర్శనలిచ్చేవారు. ఈ సంఘం తరపున ప్రదర్శించిన నాటకాలలో "ధర్మరాత్నకర, హుచ్చో-హుచ్చు"అనునవి ముఖ్యములు.

**9. "తమిళనాటక సంఘం":-** గుంతకల్లులో రైల్వే ఉద్యోగులైన కొందరు తమిళ ఔత్సాహిక నటులు "తమిళ నాటక సంఘం" అనుపేర ఒక సమాజాన్ని స్థాపించి, తమిళంలో నాటకాలను ప్రదర్శించేవారు. ఈ సమాజానికి శ్రీ ఎస్.నటరాజన్ అధ్యక్షులు. "శ్రీ సదాశివన్, శ్రీ మనోహరన్, శ్రీ దొరపాండ్యన్, శ్రీ వెంకటస్వామి, శ్రీ మైలాండన్" మొదలగువారు ఈ సంఘంలో సభ్యులు. వీరు "వీరపాండ్యకట్ట బ్రహ్మన్, రాజరాజచోళన్, డాక్టర్ బైనెట్ లిల్లీ" మొదలగు నాటకాలను పెక్కుసార్లు ప్రదర్శించారు.

**10. "ప్రగతి నాట్య మండలి":-** ఈ సమాజ వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ తిరుపాలప్ప. కార్యదర్శి శ్రీ లక్ష్మణసింగ్, శ్రీ ఎస్.సంజన్న, శ్రీ నారాయణరెడ్డి, శ్రీ చిన్నఓబయ్య, శ్రీ బి.సత్యనారాయణ, మొదలగువారు సభ్యులు. ఈ సమాజంవారు "ఊరుమ్మడిబతుకులు, ఒరే (నాటకం) కండ్లు," మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

**11. "రాజ రాజేశ్వరి నాట్యమండలి":-** ఈ సమాజ వ్యవస్థాపకులు శ్రీ జి.పుల్లయ్య. ఈ సమాజంలో శ్రీ కోటేశ్వరరావు, శ్రీ జి.నారాయణ స్వామి సభ్యులు. గుంతకల్లులోని తక్కిన అన్ని సమాజాల సభ్యులతోను కలిసి నాటకాలు ప్రదర్శించేవారు. వీరు "భక్తరామదాసు, రైలుదోపిడి, రావణబ్రహ్మ" మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

**12. "మినర్వా ఆర్ట్స్ నాటక సమాజం":-** శ్రీ జి.ఎన్. వీరన్న, శ్రీ ఆరోగ్యస్వామి, శ్రీ చిన్ననారాయణ స్వామి మొదలగువారు సభ్యులుగా వుండేవారు. వీరు స్థానికులైన మరికొందరు యువకులతో కలిసి "వేళాకోళం, శ్రీకృష్ణలీలలు, భక్తరామదాసు" మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

**13. "వేంకటేశ్వర నాట్యమండలి":-** ఈ సమాజంవారు యెక్కువగా పౌరాణిక నాటకాలనే ప్రదర్శించారు. శ్రీ జి.ఎం.వెంకటేశ్వరులు, శ్రీ చిన్న వెంకటేశ్వరులు, శ్రీ జయరామయ్య, శ్రీ లింగన్న, శ్రీ ఆనందరావు" మొదలగువారు సభ్యులు. వీరు "కృష్ణరాయబారం" నాటకాన్ని పలుసార్లు ప్రదర్శించారు. "రామాంజనేయ యుద్ధం, గయోపాఖ్యానం, సత్యహరిశ్చంద్ర, బాలనాగమ్మ" మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

ఇవేగాక కేవలం స్థానిక పరిషత్తు నాటకపోటీలలో పాల్గొనడంకొఱకే అప్పటికప్పుడు కొన్నిపేర్లతో ఆవిర్భవించి, ఆ తరువాత మరుగునపడే నాటక సమాజాలు కూడ గుంతకల్లులో వున్నట్లు తెలుస్తుంది. 1960 నుండి 1985 వఱకు సుమారు రెండు దశాబ్దాలకు పైబడి గుంతకల్లు పట్టణంలో ఔత్సాహిక నటులతో నాటక సమాజాలు నూతనోత్సాహంతో దేదీప్యమానంగా వెలిగినట్లు తెలుస్తుంది. అంతేకాదు. తెలుగు, కన్నడ, తమిళ నాటక సమాజాలు స్థాపింపబడి, సమాన స్థాయిలో నాటక ప్రదర్శన లివ్వడం రాయలసీమలో ఒక్క గుంతకల్లు పట్టణంలోనే జరిగిందని చెప్పవచ్చును.

మహానటుల యుగం చివరిరోజుల్లో రాయలసీమ రసికజన హృదయాలపై గుంతకల్లు కళాలక్ష్మి పన్నీటిజల్లు చిలకరించింది. కళాహృదయుల తాపాన్ని తన మందమలయమారుతంతో "రైల్వే కళాసమితి" పోగొట్టి సేద తీర్చింది.

"రైల్వే కళాపరిషత్తు" నాటక, నాటిక ఏకపాత్రాభినయ, సంగీతపోటీలు నిర్వహించడం ప్రారంభించి 1989 సంవత్సరానికి 27 సంవత్సరాలు పూర్తికావడంతో 1989లో 27వ నాటక, నాటిక ఏకపాత్రాభినయ, సంగీతపోటీలు నిర్వహింపబడినవి. ప్రస్తుతం కళాపరిషత్తువారు నాటకాలు ప్రదర్శించడంలేదు. పరిషత్తు సాంస్కృతిక కార్యక్రమాలు అనగా నాటక, నాటిక, ఏకపాత్రాభినయ, సంగీత పోటీలను మాత్రమే నిర్వహిస్తున్నారు.

1990లో శ్రీసి.వి.సుంకప్ప కళాసమితి కార్యదర్శిగాను, శ్రీ ఎన్.ఆనంద్, శ్రీవై.విశ్వనాథయ్య, శ్రీఎస్.ఏ. బాషా, శ్రీ కె.భీమారావు, శ్రీవి.రామమూర్తి మొదలగువారు సభ్యులుగాను, కళాసమితి సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు.

"రైల్వే ఇనిస్టిట్యూట్ కళాసమితి" స్థాపించిన నాటినుండి నేటివరకు "శ్రీ పెద్ద ఆంజనేయులు, శ్రీ కె.భీమారావు, శ్రీ అహోబిళ శాస్త్రి, శ్రీ కె.సుబ్బన్న, శ్రీ ఏ.వి.నారాయణ, శ్రీ జె.చంద్రయ్య, శ్రీవై.విశ్వనాథయ్య, శ్రీవి.శామ్యూల్, శ్రీ హెచ్.రామాంజనేయులు, శ్రీ యం.సి.ఓబయ్య, శ్రీటి. కోటేశ్వరరావు, శ్రీ సి.వి. రామమూర్తి, శ్రీ జి.యం.పి.ఓబయ్య, శ్రీ వి.ప్రసాదరావు, శ్రీ బి.సత్యనారాయణ, శ్రీ కె.వసంతకుమార్, శ్రీ ఎన్.ఆనంద్" మొదలగువారు కార్యదర్శులుగా పనిచేశారు.

## రొద్దం రాజారావు :



విశ్వవిఖ్యాతమైన విజయనగర సామ్రాజ్యానికి రెండవ రాజధానిగా చరిత్ర ప్రసిద్ధిగాంచిన నగరం "పెనుగొండ". ఇది ఈనాడు శ్రీ కృష్ణదేవరాయలు పరిపాలించిన రతనాలసీమ రాయలసీమలోని అనంతపురం జిల్లాలో ఒక ముఖ్యపట్టణం. దాని పరిసరాలు ప్రకృతి రామణీయతకు, మనోహరదృశ్యాలకు ఆటపట్టు. సమున్నతమైన పర్వత సానువులమధ్య ద్రాక్ష, దానిమ్మ, నిమ్మతోటలతోను, ప్రకృతి సంపదతోను విరాజిల్లిన పెనుగొండ రసికజన హృదయాలను ఉత్తేజపరచి, యెందరినో కళోపాసనకు పురికొల్పింది. అటువంటి కళోపాసకులలో శ్రీ రొద్దం రాజారావుగారు సుప్రసిద్ధ కళారాధకులు.

శ్రీ రొద్దం రాజారావుగారు 1901లో అనంతపురంజిల్లా, పెనుగొండ పట్టణంలో శ్రీ రొద్దం వెంకోబరావు, శ్రీమతి వెంకమ్మగార్ల ప్రథమ సంతానంగా జన్మించారు. శ్రీ రాజారావుగారి బాల్యమూ, ప్రాథమిక విద్యాభ్యాసమూ పెనుగొండలోనే పూర్తయింది. తరువాత బెంగుళూరు వెళ్లి ప్రభుత్వ ఉన్నత పాఠశాలలోను, సెయింట్ జోసఫ్ ఉన్నత పాఠశాలలోను చదివి, స్కూలు ఫైనలు పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. అనంతపురం తిరిగివచ్చి అనంతపురం కళాశాలలో బి.ఏ.చదివి పట్టాపుచ్చుకున్నారు. కొంతకాలం పెనుగొండ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేశారు. ఆ తరువాత మదరాసులోను, తిరువనంతపురంలోను బి.ఎల్.చదివి డిగ్రీ సంపాదించారు. 1927లో న్యాయవాదవృత్తిని స్వీకరించి, తండ్రిగారితో కలిసి, పెనుగొండలో న్యాయవాదిగా కొన్నాళ్లు పనిచేశారు. వృత్తిరీత్యా హిందూపురం మారారు.

శ్రీ రాజారావుగారు న్యాయవాదవృత్తిలో వున్నప్పటికీ ప్రజాహిత కార్యక్రమాలలోను, సాహిత్యసేవలోను, సంఘసేవలోను నిర్విరామంగా పనిచేశారు. అందుకు ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం వీరికి "రావు సాహెబ్" బిరుదునిచ్చి సత్కరించింది.

శ్రీ రాజారావుగారికి నాటకకళ అంటే చిన్ననాటినుండి ఒక ప్రత్యేకమైన అభిమానం. అనేకమంది ఔత్సాహిక యువకులను ప్రోత్సహించి, అనేక నాటకాలు ప్రదర్శించారు. స్వయంగా రంగస్థల ప్రవేశంచేసి, అనేక ముఖ్యభూమికలను పోషించారు.

శ్రీ రాజారావుగారి సోదరులు శ్రీ రొద్దం హనుమంతరావుగారుకూడ సుప్రసిద్ధనటులు. శ్రీ రొద్దం సోదరులిరువురు యెంతో అన్యోన్యంగా కలిసి నాటకాలాడేవారు. అన్నగారైన శ్రీ రాజారావుగారు పురుషవేషంధరిస్తే, తమ్ముడు శ్రీ హనుమంతరావుగారు స్త్రీవేషం ధరించేవారు. వీరిద్దరు కలిసి "పాదుకాపట్టాభిషేకం, సతీసావిత్రి, శ్రీ కృష్ణదేవరాయ విజయము, ప్రమీలార్జునీయం, చంద్రగుప్త, రాణాప్రతాప, రసపుత్రవిజయం, చిత్రనళీయం, సారంగధర, భక్తరామదాసు" మొదలగు నాటకాలను ప్రదర్శించేవారు.

"పాదుకాపట్టాభిషేకం"లో శ్రీ రాజారావుగారు భరతుడుగాను, శ్రీ హనుమంతరావుగారు "కైక"గాను, "సతీసావిత్రి"లో రాజారావుగారు "సత్యవంతుడు"గాను, హనుమంతరావుగారు "సావిత్రి"గాను, శ్రీ కృష్ణదేవరాయ విజయంలో రాజారావుగారు "శ్రీ కృష్ణదేవరాయలు"గాను హనుమంతరావుగారు "తిరుమలదేవిగాను, ప్రమీలార్జునీయంలో రాజారావు "అర్జునుడు"గాను, హనుమంతరావుగారు "ప్రమీల"గాను, చిత్రనళీయంలో రాజారావు "నకులుడు"గాను, హనుమంతరావు "బాహుకుడు"గాను "దమయంతి"గాను, సారంగధరలో రాజారావు "సారంగధరుడు"గాను, హనుమంతరావు "చిత్రాంగి"గాను, భక్తరామదాసులో రాజారావు "రామదాసు"గాను, హనుమంతరావు "తానీషా భార్య"గాను, శ్రీ కోలాచలంవారి "విజయనగర పతనం"లో అన్న "పఠాన్"గాను, తమ్ముడు "ఆషాబి"గాను నటించి, రాయలసీమ రంగస్థల చరిత్రలో తమకంటూ ఒక విశిష్ట స్థానాన్ని సృష్టించుకున్న కళావతంసులు శ్రీ రొద్దం సోదరులు.

ఇవిగాక శ్రీ రాజారావుగారు "రసపుత్రవిజయం"లో రాజసింహుడు, "రాణాప్రతాప్"లో ప్రతాపసింహుడు, 'సారంగధర"లో సారంగధరుడు, సొదిరి సంపంగి శాస్త్రిగారు రచించిన "స్థానేశ్వరయుద్ధం"లో "పృథ్వీరాజు" మొదలైన పాత్రలను యెంతో వైవిధ్యంతో

పోషించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు.

శ్రీ రొద్దం సోదరులిరువురు శ్రీ బళ్లారి రాఘవగారి సరసన నటించారు. శ్రీ పాద కామేశ్వరరావుగారు రచించిన "చంద్రగుప్త"లో శ్రీ బళ్లారి రాఘవ చాణక్యుడుగాను, శ్రీ రాజారావు గారు చంద్రగుప్తుడుగాను నటించారు. వీరు మధురమైన గాత్రంతో చక్కగా పాడగలరు.

1940లో శ్రీ రాజారావుగారు ఆంధ్రనాటక కళాపరిషత్తును హిందూపురానికి ఆహ్వానించి, తొమ్మిదవ వార్షికోత్సవాన్ని అత్యంత వైభవంగా నిర్వహించారు. 1946వ సంవత్సరం ఏలూరులో నిర్వహింపబడిన ఆంధ్రనాటక కళాపరిషత్తుకు అధ్యక్షత వహించారు. హిందూపురంలో "రాయలసీమ కళాపరిషత్తు"ను స్థాపించి, అనేక సాహిత్యసభలు, పండితగోష్టులు నిర్వహించారు. నాటక పరిషత్తులు జరిపించి, ఔత్సాహిక నాటక సమాజాలకు, నటులకు తగిన ప్రోత్సాహమిచ్చారు. కవులను, పండితులను సన్మానాలతో సత్కరించారు. "శివభారతం" రచించిన శ్రీ గడియారం వెంకటశేష శాస్త్రులకు గండపెండేరంతొడిగి, వారి కవితాప్రతిభను గౌరవించారు. 'రాణాప్రతాపసింహ చరిత్ర'ను రచించిన శ్రీ రాజశేఖర శతావధానిగారికి రత్నకిరీటాన్ని సమర్పించి, తన కవితా హృదయాన్ని చాటుకున్నారు.

శ్రీ రాజారావుగారు కవిపండితపోషకులు, ఉదారచరితులు, మహానటులు, నిష్కల్మష కళారాధకులు. వీరు కళాపోషకులుగా అనల్పమైన ఖ్యాతిని గడించి, అల్పాయుష్కులై 49 సంవత్సరాలకే అమరులై, అమరలోకాలకు చేరుకున్నారు.

ఆంధ్రకర్ణాటక రాజ్యరమావల్లభులు, లలితకళాసమరాంగణ సార్వభౌములు, అయిన శ్రీ కృష్ణదేవరాయలు ప్రజారంజకంగా పరిపాలించిన రతనాలసీమ రాయలసీమలో జన్మించి లలిత కళామతల్లికి ముద్దుబిడ్డయై, అపరకృష్ణదేవరాయ లనిపించుకొని, అటు జన్మనిచ్చిన తల్లిదండ్రులకు, ఇటు జన్మభూమికి అజరామర కీర్తినార్జించిపెట్టిన మహోన్నతమైన వ్యక్తి శ్రీ రొద్దం రాజారావుగారు. వారి జన్మ ధన్యం.

## శ్రీ పైడిలక్ష్మయ్య :



శ్రీ పైడి లక్ష్మయ్యగారు అనంతపురం జిల్లా, కళ్యాణదుర్గం తాలూకా, అచ్చంపల్లె గ్రామంలో 1904లో ఒకరైతు కుటుంబంలో జన్మించారు. చిన్నతనంలోనే వీరికి సంగీత, సాహిత్య, నాటక కళలపైన ప్రత్యేకమైన అభిమానము, ఆకర్షణ యేర్పడ్డాయి. చిరుతప్రాయంలోనే పౌరాణిక నాటకాలలో బాలపాత్రలు ధరించి, బాలనటులుగా ప్రేక్షకుల మన్ననలకు పాత్రులైనారు. అతి చిన్నవయసులోనే చెన్నపల్లి టీచర్ 'సిద్దప్ప'తో కలిసి "లవకుశ, మార్కండేయవిజయం" మొదలగు నాటకాలు ప్రదర్శించారు. చుక్కలూరు నరసారెడ్డిగారు వ్రాసిన "చుక్కలూరు రామనాటకం"లో సీతపాత్రను ధరించారు. మూడవఫారం చదువుతున్నప్పుడు పాఠశాలలో "పరశురామ గర్వభంగం" అను నాటకంలో శ్రీ రాముని పాత్ర ధరించారు. పెద్దయిన తరువాతకూడ వీరు పెక్కునాటకాలలో వివిధ రకాలైన పాత్రలను పోషించి, విశ్వవిఖ్యాత మహానటులు శ్రీ బళ్ళారి రాఘవగారు, శ్రీ రొద్దం హనుమంతరావుగార్లతో సాన్నిహిత్యం సంపాదించుకున్న మహామహులు. వీరిని శ్రీ రాఘవగారు "దానవీరకర్ణ" అను నాటకాన్ని వ్రాయమని ప్రోత్సహించారు. శ్రీ లక్ష్మయ్యగారు నటులేకాదు, సంగీతంలో అభినివేశమున్న కళాకారులు. చిన్నతనంనుండి శాస్త్రీయ సంగీతాన్ని సాధనచేసి, విద్యార్థిగా వున్నప్పుడే హార్మోనియం వాయించడం చక్కగా అధ్యయనం చేశారు. భక్తప్రహ్లాదనాటకం వేసినప్పుడు శ్రీ లక్ష్మయ్యగారు విద్యార్థిదశలోనే ఆ నాటకానికి హార్మోనియం వాయించి, పలువురు పెద్దలచేత ప్రశంసింపబడ్డారు. "చమత్కారసుందరి" నవలను వ్రాశారు. శ్రీ లక్ష్మయ్యగారు చేయితిరిగిన నాటక రచయితలు. వీరు శివపురాణాలను అనుసరించి, "మార్కండేయ విజయము, శ్రీ శైలీయము" అను నాటకాలను రచించారు. "సంసారనౌక, సాయిలీలలు, మహాత్మకబీర్, భక్తమల్లమ్మ," మొదలగు పెక్కు ఇతర నాటకాలను, బాబాస్వామినాథ మహారాజుగారి జీవితచరిత్ర, శ్రీ శైలం, భక్తమల్లమ్మ, హరికథలు, బుర్రకథలు, శ్రీ శైలమల్లిఖార్జున మాహాత్మ్యం యక్షగానము" మొదలగు రచనలుచేశారు. శ్రీ లక్ష్మయ్యగారు రచించిన "మార్కండేయ విజయం," నాటకాన్నిచూచి బద్వేలి సమీపంలోగల బాలశెట్టివాస్తవ్యులు శతావధాని శ్రీ బీరం సుబ్బారెడ్డిగారు "చితికోచరంబు బెల్లము, కుటిలాలకు మోవితేనె, కసుమాని ఛాయాసమునటుడా లక్ష్మయ్యనేడు వ్రాగుచు బెల్లమిన్న" అని ప్రశంసించారు.

శ్రీ లక్ష్మయ్యగారు నాటక, సంగీత, సాహిత్య రంగాలలో అమితోత్సాహాన్ని ప్రదర్శించి చదువును నిర్లక్ష్యంచేశారు. చదువు మధ్యలోనే ఆగిపోయింది. 1922లో కంబయారం ప్రాథమిక పాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగా పనిచేశారు. కొంతకాలం తరువాత 1932లో చెన్నపురి న్యాయకళాశాలలో "లా" చదివి అనంతపురంలో గొప్ప న్యాయవాదిగా పేరుప్రతిష్టలు సంపాదించారు.

శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవిగా వున్నప్పుడు రాజమహేంద్రవరంలో విద్వత్సభ జరిపి, శ్రీ పైడి

లక్ష్మయ్యగారికి "కవిచకోరచంద్రోదయ" బిరుదునిచ్చి సత్కరించారు. ఇదేకాదు, శ్రీ లక్ష్మయ్యగారికి "కవికుల తిలక, కవిశిరోమణి," అను బిరుదులు కూడా లభించాయి. 1978 లో "ఆంధ్ర విశ్వకళాపరిషత్తు " స్వర్ణోత్సవ సందర్భంగా శ్రీ లక్ష్మయ్యగారికి "కళాప్రపూర్ణ" బిరుదు ప్రదానంచేసి సత్కరించింది.

శ్రీ పైడి లక్ష్మయ్యగారు కళాప్రియులు. జానపదకళాఖండమైన తోలుబొమ్మలాటలను యెంతగానో ప్రోత్సహించారు. వృత్తి కళాకారులను ఆదరించారు.

శ్రీ లక్ష్మయ్యగారు స్నేహశీలి. వీరు మాజీరాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి గారికి అత్యంత ప్రీతిపాత్రులైన మిత్రులు. సదామిత్రుని మదిలో నిలుపుకోవడం కోసం తనకుమారునికి శ్రీ సంజీవరెడ్డిగారి పేరు పెట్టుకున్న సరళహృదయులు.

శ్రీ లక్ష్మయ్యగారు సేవాతత్పరులు. కార్యదీక్షాదక్షులు. వీరి సేవానిరతికి, కార్యదక్షతకు మెచ్చి 1945లో అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం "రావుబహద్దూర్" బిరుదు ప్రదానం చేసింది. కాని క్విట్ ఇండియా ఉద్యమంలో జైళ్ళపాలైన మిత్రులకోరికపై శ్రీ లక్ష్మయ్యగారు రావుబహద్దూర్ బిరుదును తిరస్కరించి, తన మిత్రవాత్సల్యాన్ని, దేశభక్తిని నిరూపించుకున్న త్యాగశీలి.

శ్రీ లక్ష్మయ్యగారు జిల్లాబోర్డు అధ్యక్షులుగా వున్నప్పుడు పెక్కు కవితాగోష్టులు, అష్టావధానాలు ఏర్పాటుచేశారు. మహానటులు శ్రీ బళ్ళారి రాఘవకు జిల్లాబోర్డు తరపున ధర్మవరం పాఠశాలలో ఘనంగా సన్మానంచేశారు.

స్వాతంత్ర్యానంతరం శ్రీ లక్ష్మయ్యగారు అనేక వున్నత పదవులను అలంకరించి, నిస్వార్థబుద్ధితో ప్రజాసేవచేశారు. చివరిరోజులలో "జ్ఞాపకాలు-వ్యాపకాలు " అను పుస్తకాన్ని రచించారు. ఈ పుస్తకంలో గత 50 సంవత్సరాలలో రాయలసీమ ప్రజల సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక విలువలను ప్రతిబింబింపచేశారు.

శ్రీ పైడిలక్ష్మయ్యగారు కళాకారులు, కళారాధకులు , కళాపోషకులు. అనంతపురంలోని లలిత కళాపరిషత్తు భవన నిర్మాణానికి యెంతగానో కృషిచేశారు. వారి స్మృతిచిహ్నంగా నేడాభవనానికి (ప్రదర్శనశాల)"కళాప్రపూర్ణ శ్రీ పైడి లక్ష్మయ్యగారి కళాక్షేత్రం" అని పేరు పెట్టారు.

శ్రీ పైడిలక్ష్మయ్యగారు "మంచినటులుగా, సంగీత సాధకులుగా, నాటక రచయితగా, నాటక ప్రయోక్తలుగా, ఆశుకవి ప్రవోక్తలుగా, (ఆంధ్రభూమి దినపత్రిక, 28-4-1990) వక్తగా, న్యాయవాదిగా, ప్రజాసేవకులుగా, కవిగా, కార్యదీక్షాదక్షులుగా, రాయలసీమ రత్నాలలో ఒకరుగా, శ్రీ పి.ఎల్. సంజీవరెడ్డి, ఐ.ఏ.యస్. వంటి మరియొక రత్నానికి జన్మనిచ్చిన తండ్రిగా, ఆంధ్రదేశ చరిత్రలో చిరస్మరణీయులుగా నిలిచిపోయారు.

## రొద్దం హనుమంతరావు :

కళాహృదయం దైవప్రసాదితం. అది వంశపారంపర్యంగా రావడం అదృష్టం. ఒక కవివరేణ్యునికి ముద్దులమనుమడై, ఒక కళాపోషకునికి అనురాగపట్టియై, మరొక కళోపాసకునికి అనుంగు సోదరుడై, నాటక కళోద్ధరణకు అవతరించిన శ్రీ రొద్దం హనుమంతరావుగారు "రతనాల రాయలసీమలో ప్రకాశించిన అమూల్యమైన నటరత్నం".



రమణీయమైన పర్వతసానువులతో, శిథిల శిల్ప సంపదతో, చారిత్రాత్మక ప్రాధాన్యం కలిగి, ప్రకృతికాంత ఒడిలో పరవశించిన నగరం పెనుగొండ. ఒకనాటి రాయలరసికతకు ఈనాటి తీపిగుర్తు. అటువంటి పెనుగొండ నగరంలో శ్రీ రొద్దం హనుమంతరాయకవి ముద్దుల మనుమడై, శ్రీమతి వెంకమ్మ, శ్రీ వెంకోబరావుగార్లకు ద్వితీయ సంతానంగా 1906లో శ్రీ రొద్దం హనుమంతరావుగారు జన్మించారు. శ్రీ వెంకోబరావు కళాపోషకులు మాత్రమేగాక, స్వయంగా నటులై కుమారులిరువురిని చిన్నతనంనుండి నాటకాలలో వేషం ధరించమని ప్రోత్సహిస్తూ వుండేవారు. రాయలసీమ నటరత్నమైన శ్రీ రొద్దం రాజారావుగారు శ్రీ రొద్దం హనుమంతరావుగారికి అన్న. సోదరులిరువురు కలిసి యెంతో అన్యోన్యంగా నాటకాలాడేవారు. శ్రీ హనుమంతరావుగారు మొదట అన్నగారితో కలిసి స్త్రీ పాత్రలనే ధరించేవారు. వీరు ఆనాటి సుప్రసిద్ధ పౌరాణిక, చారిత్రాత్మకనాటకాలలో అన్నగారి సరసన పాదుకాపట్టాభిషేకంలో కైకగా, సతీసావిత్రిలో సావిత్రిగా, చిత్రనళీయంలో దమయంతిగా, ప్రమీలార్జునీయంలో ప్రమీలగా, సారంగధరలో చిత్రాంగిగా, శ్రీకృష్ణదేవరాయ విజయంలో తిరుమలదేవిగా, విజయనగర పతనంలో ఆషాబిగా, రామదాసులో తానీషా

భార్యగా అనేక కథానాయిక పాత్రలను, స్త్రీలను మరిపించే విధంగా పోషించి, ప్రముఖుల ప్రశంసలకు పాత్రులైనారు. శ్రీ రొద్దం సోదరులిరువురు మహానటులు. శ్రీ బళ్ళారి రాఘవ సరసన అనేక పర్యాయాలు నటించారు. అన్నగారైన శ్రీ రాజారావుగారు అకాలమృత్యువుకు గురికావడంతో నాటక రంగంలో శ్రీ హనుమంతరావుగారు ఒంటరివాడైనారు.

1906లో జన్మించిన శ్రీ హనుమంతరావుగారు (22) ఇరవైరెండేండ్ల చిరుప్రాయంలోనే బి.ఎల్.పరీక్షలో ఉత్తీర్ణులై, నాలుగు సంవత్సరాలు తండ్రిగారివద్దనే పనిచేశారు. శ్రీ హనుమంతరావుగారు కాలేజి చదివేరోజులలోనే "విజయనగర పతనం"లో రామరాజు భార్య "తిరుమలాంబ" పాత్రతో మొట్టమొదటిసారిగా రంగస్థలప్రవేశం చేశారు. తరువాత 1933లో అనంతపురంచేరి, స్వతంత్రంగా న్యాయవాద వృత్తిని చేపట్టారు. నాటకరంగానికి అంకితమైన శ్రీ హనుమంతరావుగారు ఆ తరువాత ఉత్తర గోగ్రహణంలో "బృహన్నల" పాత్రధరించి రాణించారు. అసలువీరు ప్రప్రథమంగా పురుషవేషం ధరించింది బృహన్నల నాటకంలో ఉత్తరకుమారునిపాత్ర. ఆ తరువాత అదేనాటకంలో ఊర్వశి పాత్రను అమోఘంగా నటించారు.

శ్రీ హనుమంతరావుగారు 1931లో పద్మశ్రీ స్థానం నరసింహారావుగారితో కలిసి మైసూరులో "కన్యాశుల్కం" నాటకంలో రామయ్యపంతులుగా నటించారు. ఒంటరివాడైన శ్రీ హనుమంతరావుగారు అనంతపురంలో న్యాయవాదిగా స్థిరపడ్డారు. ఆ తరువాత వీరినటజీవితం ఒక మలుపుతిరిగింది. స్త్రీపాత్రలు మాని పురుషపాత్రలను ధరించడం ప్రారంభించారు. శ్రీ బళ్ళారి రాఘవతో కలిసి సారంగధరలో సారంగధరుడు, సుబుద్ధి; చంద్రగుప్తలో వాచాలుడు, రామదాసులో ధర్మకర్తపాత్రలు ధరించి, శ్రీ రాఘవ ప్రశంసలనందుకుని, వారికి సన్నిహితులైనారు. శ్రీ హనుమంతరావుగారు జన్మతః హాస్యప్రియులు. వీరు శ్రీ స్థానం నరసింహారావుగారి సరసన శ్రీ కృష్ణతులాభారంలో శ్రీ కృష్ణుడు, వసంతుడు; చింతామణిలో సుబ్బిశెట్టి, విప్రనారాయణలో శ్రీ నివాసుడు, భక్తకబీరులో శెట్టి మొదలగు పాత్రలను పోషించి, ఆంధ్రదేశంలో గొప్ప హాస్యనటులుగా చిరకీర్తి నార్జించుకున్నారు. అందుకే ఈయన సహజమైన తన హాస్యధోరణిలో

"దశావతారములలో భగవంతుడు క్రమక్రమంగా మత్స్యావతారం నుండి రామావతారం వరకు మార్పుచెంది, సంపూర్ణ మానవుడైనట్లు, తానుకూడ నాటకాలలో మొదట స్త్రీ వేషధారియై, తరువాత బృహన్నలై, తుదకు పురుష పాత్రలు వహించితిని" అని ఛలోక్తిగా అనేవారు.

శ్రీ రొద్దం హనుమంతరావుగారు ఆరంభదశలో మహానటులు శ్రీ బళ్ళారి రాఘవతోకలిసి ఆంధ్రదేశమంతా అనేక నాటక ప్రదర్శనలిచ్చారు. వీరు "శ్రీ బందా కనకలింగేశ్వరరావు, శ్రీ సూరిబాబు, శ్రీ ఈలపాటరఘురామయ్య, శ్రీమతి రాజేశ్వరి" మొదలగు ప్రఖ్యాత నటీనటుల సరసన నటించారు. శ్రీ హనుమంతరావుగారి సరసన నటించినవారిలో "శ్రీ టి. అశ్వత్థనారాయణ, శ్రీ టి. సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ సి.ఎన్.వెంకట్రావు, శ్రీ సంపంగి రామస్వామి, శ్రీ యం.పి. అనంతనారాయణశాస్త్రి, శ్రీ ఎ.మహదేవశాస్త్రి, శ్రీ పెద్దపల్లి రాఘవేంద్రాచార్యులు, శ్రీ జి.జానకీరామశర్మ, శ్రీ ఆదినారాయణరావు, శ్రీ ఆదోని నారాయణాచార్యులు, శ్రీ బేగూరు గుండూరావు, శ్రీ కలచవీడు శ్రీ నివాసాచార్యులు" మున్నగువారు పౌరాణిక, చారిత్రాత్మక నాటకాలలో పాల్గొన్న ప్రముఖులు.

కాలగమనంలో గోచరించినమార్పు ప్రేక్షకలోకంలోకూడ రాసాగింది. సమాజరుగ్మతలు వెఱ్ఱితలలు వేస్తుంటే ప్రేక్షకులదృష్టి సాంఘిక ఇతివృత్తాలపైకి మళ్ళింది. శ్రీ హనుమంతరావుగారు పౌరాణిక, చారిత్రాత్మక నాటకాలలోనేగాక సాంఘిక నాటకాలలోగూడ నటించడం ప్రారంభించారు. అనంతపురంలో మొట్టమొదటిసారిగా "ఆంధ్రవిజ్ఞాన సమితి"నిస్థాపించి, ఆంధ్రదేశమంతటా నాటక ప్రదర్శనలిచ్చారు. వీరు (నటించిన సాంఘిక నాటకాలలో) "కళోపాసన, కళోద్ధారకులు, ఎన్.జి.వో., పెండ్లి ట్రైనింగు, పెండ్లిచూపులు, టీకప్పులో తుఫాను, నాటకం, స్వాతంత్ర్యయజ్ఞం, సంసారనౌక, పెండ్లి, కులంలేనిపిల్ల, దొంగవీరడు, రంగూన్‌రౌడి, గాలివాన, అపోహ," వంటి యెన్నో నాటకాలను, నాటికలను ప్రదర్శించి గొప్పగా నటించి, పౌరాణిక, చారిత్రాత్మక నాటకాలనేగాక సాంఘిక నాటకాలనుగూడ అత్యుత్తమంగా ప్రదర్శించగలరన్న ఖ్యాతిని గడించారు. "గుంతకల్లు, మద్రాసు" మొదలగు పట్టణాలలో 1956లో "పెండ్లి ట్రెయినింగ్" నాటికలో ఉత్తమనటులుగా యెన్నిక అయినారు. ఉత్తమనాటికకు ప్రథమ బహుమతి నందుకున్నారు.

శ్రీ హనుమంతరావుగారు ప్రదర్శించిన అన్ని సాంఘిక నాటక, నాటికలలో "శ్రీ కుంచాల సత్యరంగారావు కథానాయక పాత్రలను పోషించి, ఘనకీర్తిని గడించారు. వీరితోబాటు "శ్రీ ఫ్రాన్సిస్, శ్రీ జానకీ నారాయణప్ప, శ్రీ పి.వెంకటాచలం, శ్రీ ఎ. శ్రీరాములు, ఆమ్లదిన్న గోపీనాథ్, శ్రీ ఎ.నరసింహమూర్తి, శ్రీ యం.ఎస్. వెంకటరమణ" మొదలగు వారెందరో శ్రీ హనుమంతరావుగారి సరసన నటించి, రాయలసీమ నటులుగా అనంతపురం జిల్లా కీర్తి పుంజాలను నలుదిశలా ప్రసరింపజేశారు.

అనంతపురంలో ప్రస్తుతమున్న "లలిత కళాపరిషత్తు" వ్యవస్థాపకులలో ఒకరై, జీవితాంతం లలిత కళాపరిషత్తుకు కార్యవర్గసభ్యులుగా

వుండి, కళాసేవచేసిన గొప్ప కళాకారులు.

"లలిత కళాపరిషత్తు" అనంతపురంలో నాటక విద్యాలయాన్ని స్థాపించుటకు అవిరళకృషిచేసి, 1964లో నాటక విద్యాలయాన్ని స్థాపించి, దానికి మొట్టమొదటి అధ్యక్షులు (Principal)గా తానే నియమింపబడి, నాటక విద్యాలయ పురోభివృద్ధికి అహర్నిశలు పాటుబడిన కళాతపస్వి శ్రీ రొద్దం హనుమంతరావుగారు.

1964లో శ్రీ హనుమంతరావుగారు "ఆంధ్రనాటక కళాపరిషత్తు" కు ఉపాధ్యక్షులుగా యెన్నికైనారు. ఆ తరుణంలో వీరి ఆధ్వర్యంలో రాష్ట్రస్థాయిలో నాటకపోటీలు నిర్వహించడం జరిగింది.

ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని నాటకసమాజాలు శ్రీ హనుమంతరావుగారిని ఘనంగా సన్మానించి, సత్కరించాయి. వీరు ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమీ సభ్యులుగా పెక్కుసార్లు యెన్నుకోబడినారు. నాటక కళారంగానికి వీరు చేసిన సేవలను గుర్తించి, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వీరికి విశిష్టసభ్యత్వాన్నొసగి గౌరవించింది.

శ్రీ రొద్దం హనుమంతరావుగారు చివరిశ్వాస వున్నంతవరకు నాటక కళారంగోద్ధరణకు పాటుపడ్డ మహనీయులు. తన జీవితాన్నే నాటకకళకు అంకితంచేసిన మహానటులు. ధన్యజీవి. హాస్యనట చక్రవర్తి. వీరు 1980లో కళామతల్లి ఒడిలో అంతిమశ్వాస విడిచి, అమరులైనారు.

ఈ మహనీయునికి, మహానటునికి ఆంధ్రప్రదేశమంతటా శిష్య, ప్రశిష్యులెందరో వున్నారు. ఈ కళామూర్తి జీవితం ఔత్సాహిక నటులందరికి ఆదర్శప్రాయం, ఆచరణీయం. నాటక కళ, నటన ఒక ప్రత్యేక తపస్సు. పుట్టుకతోనే స్వయంప్రతిభను తోడుతెచ్చుకున్న మహానటులలో శ్రీ రొద్దం హనుమంతరావుగారు ఒకరు.

నటులుగా, గాయకులుగా, దర్శకులుగా అజరామరకీర్తి నార్జించి, తారాపథాన్నందుకున్న నటతార, రాయలసీమకే వన్నెతెచ్చిన నటరత్నం హనుమంతరావుగారు.

## శ్రీ భాస్కర పద్మనాభశాస్త్రి :

శ్రీ భాస్కరపద్మనాభశాస్త్రి గారు 1915లో అనంతపురం జిల్లాలోని వజ్రకరూర్‌లో జన్మించారు. ప్రాథమికవిద్య జన్మస్థలంలోనే సాగింది. ఆ తరువాత అనంతపురంచేరి హైస్కూలు, కాలేజి చదువులు పూర్తిచేశారు. విద్యార్థిదశలోనే పెక్కునాటకాలలో వేషాలు ధరించి, నాటకానుభవాన్ని సంపాదించారు.



ఆంధ్రదేశంలో అగ్రశ్రేణినటులుగా ఖ్యాతిగాంచిన "శ్రీ బళ్ళారి రాఘవ, శ్రీ పులిపాటి వెంకటేశ్వరులు" మొదలగువారితో సుమారు సల్భై సంవత్సరాలు పౌరాణిక, చారిత్రక, జానపద, సాంఘిక నాటకాలలో విభిన్న పాత్రలను ధరించి, ఆంధ్రప్రేక్షకుల అభిమానానికి పాత్రులైనారు.

శ్రీ భాస్కర పద్మనాభశాస్త్రిగారు "ధర్మరాజు, దుర్యోధనుడు, భీముడు, రామదాసు, దశరథుడు, విశ్వామిత్రుడు, కృష్ణుడు, నారదుడు, వశిష్ఠుడు, వసంతకుడు, రాజరాజనరేంద్రుడు, రంగూన్‌రౌడి" మొదలగు పురుషపాత్రలను, "రుక్మిణి, రాధ, గుండమ్మ" మొదలగు స్త్రీ పాత్రలను, అనేక యేకపాత్రాభినయములను నిర్వహించి వాటికి న్యాయంచేకూర్చారు. పాత్రపోషణలో, భావప్రకటనలో, సమయస్ఫూర్తిలో, స్పష్టమైన ఉచ్చారణలో శ్రీ రాఘవ, శ్రీ స్థానంవారికేమాత్రం తీసిపోకుండా వారిసరసన తననటనా వైదుష్యాన్ని ప్రదర్శించిన కళాజీవి శ్రీ భాస్కర పద్మనాభశాస్త్రి గారు.

## పెద్దిపోగు రామయ్య :

శ్రీ పెద్దిపోగు రామయ్యగారు 1927లో అప్పటి ఒంగోలు జిల్లా (ప్రకాశంజిల్లా), పోతవరం గ్రామంలో శ్రీమతి నాగమ్మ, శ్రీ లింగయ్యగార్లకు జన్మించారు. వీరు వృత్తి కళాకారులు. వీరు 1939లో "తెలుగు తల్లి" నాటకంతో నాటకరంగంలో ప్రవేశించారు. వీరు 1948లో స్థాపింపబడిన "దుద్దుకూరు బాలమిత్ర, విశ్వేశ్వర బాలనాట్యసభ, శారదామనోవినోదిని," అను నాటక సమాజాలలో సభ్యులుగా పనిచేశారు.

శ్రీ రామయ్యగారు "శ్రీ కృష్ణతులాభారం, రామదాసు, రంగూన్‌రౌడి, కృష్ణలీలలు, తెలుగుతల్లి, కరుణామయ, చింతామణి,



కనకతార, ప్రహ్లాద" మొదలగు నాటకాలలో వివిధ పాత్రలను పోషించారు. గుడివాడ గౌరీశంకర్ హాలు, వరంగల్ పోతన ఆడిటోరియం, హైదరాబాదు రవీంద్రభారతి, గాంధీభవనం" మొదలగుచోట్ల కిరాయి నాటకాలను ప్రదర్శించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు.

వీరు "శ్రీకృష్ణుడు, బిల్వమంగళుడు, నారదుడు, యశోద, సత్య, సావిత్రి," పాత్రలకు పెక్కు బహుమతుల నందుకున్నారు. ప్రేక్షకలోకంలో వీరికి ఘనమైన ఖ్యాతిని గడించిపెట్టినవి "శ్రీకృష్ణుడు, బిల్వమంగళుడు, నారదుడు, యశోద, సత్యభామ" మొదలగు పాత్రలు.

శ్రీ రామయ్యగారు వృత్తికళాకారులైనప్పటికీ వీరిలోని నటనను గుర్తించి, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వము వీరిని ఘనంగా సన్మానించింది. వీరికి "చిక్కడపల్లి, త్యాగరాయగానసభ-రేపల్లె" మొదలగుచోట్ల ఘనంగా సన్మానాలు జరిగాయి. గుడివాడలో ప్రశంసాపత్రము లభించింది. వీరు పుట్టింది సర్కారాంధ్ర ప్రాంతంలో. నాటకాలు ప్రదర్శించింది ఆంధ్రదేశమంతటా. స్థిరపడింది రాయలసీమలోని అనంతపురంలో.

వీరు డ్రస్ కంపెనీ నడుపుతున్నారు.వీరు గొప్పనటులు. నాటక కళకు సంబంధించిన "సంగీతము, దర్శకత్వము, మేకప్, రంగాలంకరణ" మొదలగు రంగాలలో అభినివేశము సంపాదించారు. మధురమైన గాత్రంతో చక్కగా పాడగలరు. వీరు మృదంగం, తబలా వాయిద్యాలలో చేయితిరిగినవారు. తబలా, మృదంగంలలో యువకులకు శిక్షణనిస్తూ, శిష్యులను తయారుచేస్తున్నారు. తబలా వాద్యమందు అనంతపురంజిల్లాలో 116 మంది శిష్యులకు నేర్పించాలన్నది వీరి జీవితాశయంగా చెబుతారు.

**దాసరి తిరుపాల్‌దాసు :**

శ్రీ దాసరి తిరుపాల్‌దాసు గారు 1929లో అనంతపురం జిల్లా "బుజ్జికాయసముద్రం" అను గ్రామంలో జన్మించారు. వీరి తండ్రి దాసరి రామప్ప, తల్లి నాగమ్మ. వీరు వృత్తికళాకారులు. వీరు 1955వ సంవత్సరంలో వీధి నాటకంతో రంగస్థలప్రవేశం చేశారు. పెక్కు వీధినాటకాలను ప్రదర్శించారు. 1971లో స్థాపింపబడిన "వేంకటేశ్వర నాటక సమాజం" లో సభ్యులై అనేక నాటకాలను ప్రదర్శించారు. 1974లో వృత్తికళాకారు లందరు కలిసి "వృత్తి కళాకారుల సంఘం" అనుపేర ఒక సమాజాన్ని స్థాపించి, "గయోపాఖ్యానం, శ్రీకృష్ణరాయబారం, సత్యహరిశ్చంద్ర, లంకాదహనం, కర్ణార్జున విజయం, చింతామణి, బాలనాగమ్మ, చెంచులక్ష్మి" మొదలగు పౌరాణిక, జానపద నాటకాలను విరివిగా , పలుప్రాంతాలలో ప్రదర్శించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు.



శ్రీ తిరుపాల్‌దాసుగారు "నారదుడు, హరిశ్చంద్రుడు, నక్షత్రకుడు, అర్జునుడు, గయుడు, బాలవర్ధిరాజు, కార్యవర్థిరాజు, భవాని, చెంచులక్ష్మి, మండోదరి" మొదలగు స్త్రీ, పురుష పాత్రలను యెంతో వైవిధ్యంతో ప్రదర్శించేవారు. "అర్జునుడు, నారదుడు, హరిశ్చంద్రుడు, చెంచులక్ష్మి, మండోదరి" పాత్రలు వీరినటనాకౌశలానికి మచ్చుతునకలు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారి ఆదేశంమీద శ్రీదాసుగారు ప్రాచీన భారతీయ జానపద కళారూపమైన వీధినాటకాన్ని రాష్ట్రవ్యాప్తంగా అనేక ప్రాంతాలలోను, హైదరాబాదు రవీంద్రభారతిలోను ప్రదర్శించి పెక్కు సన్మానాలందుకున్నారు. తిరుపతి శ్రీవేంకటేశ్వర నాట్య కళాపరిషత్తు, లలిత కళాపరిషత్తు అనంతపురం, రాజమండ్రి, హైదరాబాదు మున్నగుచోట్ల నిర్వహించిన నాటక పోటీలలో పాల్గొని, బహుమతులందుకున్నారు. శ్రీ దాసుగారిని ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు రాజమండ్రిలో ఘనంగా సన్మానించారు. కర్నూలులో శ్రీనటరాజ రామకృష్ణగారు వీరికి దుశ్శాలువ కప్పి, ఘనంగా సన్మానం చేశారు.

వీరు వీధినాటక పద్ధతిలోను, రంగస్థల నాటక పద్ధతిలోను చక్కగా పాటలు, పద్యాలు పాడగలరు. వీరు వీధి నాటకాలకు దర్శకత్వం నెరపుతుంటారు. గ్రామ ప్రాంతాలకు వెళ్ళి వీధి నాటకాలు నేర్పుతుంటారు. శ్రీ దాసరి తిరుపాల్ దాసుగారు అనంతపురం వృత్తి కళాకారుల సంఘానికి కార్యదర్శిగా వుంటూ, వృత్తికళాకారుల సంక్షేమంకోసం శాయశక్తులా కృషి చేస్తున్నారు. పల్లెప్రాంతాలలోని నటులకు ప్రభుత్వం నుండి ప్రోత్సాహం లభించేటట్లు పాటుపడుతూ, నాటకరంగానికి సేవచేస్తున్నారు.

**కుంచాల సత్యరంగారావు :**

శ్రీ కుంచాల సత్యరంగారావు గారు 1930వ సంవత్సరం కర్నూలు జిల్లా, వెల్దుర్తి గ్రామంలో కీ.శే. లక్ష్మీదేవమ్మ, రంగారావుగార్లకు జన్మించారు. వీరిది ఒక సామాన్యకుటుంబము. వీరు చిన్నతనంలో నంద్యాల మున్సిపల్ ఉన్నత పాఠశాలలో చదువుతూ, 1944లో పాఠశాల

శ్రీ సత్యరంగారావుగారి నటజీవితం ప్రారంభమైంది. వీరు ఔత్సాహిక నటులు.



శ్రీ సత్యరంగారావుగారిది పెద్దకుటుంబం. కుటుంబభారాన్ని మోసే తండ్రిగారి మరణంతో శ్రీ సత్యరంగారావుగారి చదువు ఎస్.ఎస్.ఎల్.సి. తో చరమగీతంపాడింది. కుటుంబ భారమంతా తన భుజస్కందాలమీద పడింది. రెవెన్యూ డిపార్టుమెంటులో ఉద్యోగంలో చేరారు. కుటుంబ బాధ్యతలు, ఆర్థిక ఇబ్బందులులాంటి అడ్డంకులు యెన్నివున్నా అవి శ్రీ సత్యరంగారావుగారిలోని కళాకారుణ్ణి నిరుత్సాహపరచలేక పోయాయి. ఇనుమడించిన కళాతృష్ణతో శ్రీ సత్యరంగారావుగారు అనేక నాటక సమాజాలతో కలిసి పెక్కునాటకాలను ప్రదర్శించారు. కరువుజిల్లాలలో అనంతపురంజిల్లా ఒకటి. అహోరాత్రాలు శ్రమించి, పలు కళాసంఘాలతోకలిసి యెన్నోనాటకాలు ప్రదర్శించి, యెన్నోసంగీత కార్యక్రమాలలో పాల్గొని, క్షామనిధిని ప్రోగుచేశారు.

శ్రీ సత్యరంగారావుగారు జన్మించింది కర్నూలు జిల్లాలోనే అయినా, ఉద్యోగరీత్యా అనంతపురంజిల్లా, అనంతపురంలో స్థిరపడ్డారు. అప్పటికే అనంతపురం నాటక కళామతల్లికి రంగస్థలమై, మూడుపువ్వులు ఆరుకాయలుగా విరాజిల్లుతూ వుంది. ఎందరో మహానుభావులకు, మరెందరో మహానటులకు జన్మనిచ్చిన అనంతపురం నాటకకళకుకూడ తల్లియై శ్రీ సత్యరంగారావువంటి నటనా వతంసులకు ఆశ్రయమిచ్చింది. వీరికి అందమైన విగ్రహంతోబాటు, శ్రావ్యమైన కంఠం వరప్రసాదంగా వచ్చాయి. వీరికి సంగీతంలోకూడ అభినివేశం కలదు. 1957 లో ఏలూరులో నిర్వహింపబడిన సంగీత, నాటకపోటీలలో పాల్గొని, లలిత సంగీతంలో ఉత్తమగాయకులుగా ఎన్నికై ప్రథమ బహుమతిని స్వీకరించారు.

1958లో అనంతపురంలో "అభ్యుదయ కళాసమితి" అను నాటకసమాజాన్ని స్థాపించి, శ్రీ ఇ.జగన్నాధాచారి, ఐ.ఏ.యస్.గారి సారథ్యంలో "కబీరు, రామదాసు" మొదలైన సంగీత ప్రాధాన్యంగల నాటకాలను ప్రదర్శించారు. ఉద్యోగరీత్యా అనంతపురంలో స్థిరపడిన శ్రీ సత్యరంగారావుగారు ప్రతివారము ఒక నాటకాన్ని ప్రదర్శించాలను నియమంతో, నియమం తప్పకుండా ప్రతివారం ఒకనాటకాన్ని ప్రదర్శించారు. ప్రతినాటకం తాను నటించి పురప్రజల ప్రశంసలకు పాత్రులైనారు.

1960లో "తంజావూరు సిస్టర్స్" గా ఖ్యాతిగాంచిన "పద్మిని, రాగిణీ"ల నృత్యప్రదర్శనకు నేపథ్యగానంచేసి, (పాటపాడి) వారిచేత ప్రశంసింపబడినారు. అదే సంవత్సరం అప్పటి గవర్నరు శ్రీ భీమసేన సచార్ గారియెదుట "రామదాసు" నాటకాన్ని ప్రదర్శించి, అందులో స్వయంగా కబీరు పాత్రను పోషించి, గవర్నరుగారిచే బంగారు పతకం అందుకున్నారు. 1964లో శ్రీ సత్యరంగారావుగారి బహుముఖ ప్రజ్ఞను గుర్తించి, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు సభ్యత్వాన్నిచ్చి గౌరవించారు.

1965 నుండి సంగీత నాటక అకాడమీవారు అనంతపురంలో నిర్వహించిన నాటక విద్యాలయంలో అధ్యాపకులుగా పనిచేశారు.

1965లోనే "రావి వెంకటాచలం"గారి "మాటతప్పకు" అను నాటకాన్ని తీసుకొని రాష్ట్ర వ్యాప్తంగా ప్రదర్శించి, అశేష ఆంధ్రప్రజానీకంచేత ప్రశంసలందుకున్నారు. ఆంధ్రనాటక కళాపరిషత్తు-గుడివాడ, ఆంధ్రనాటక కళాపరిషత్తు-గుంటూరు, నెఫ్జా-నెల్లూరు, నెఫ్కా-మద్రాసు, ప్రొద్దుటూరు, నరసాపురం, ఏలూరు, విజయవాడ, బళ్ళారి, మొదలగు ప్రాంతాలలో పరిషత్తులు నిర్వహించిన నాటక పోటీలలో పాల్గొని, ప్రథమ బహుమతులను అందుకున్నారు. "మాటతప్పకు" నాటకంలో "శంకరశాస్త్రి" పాత్రకు జీవంపోసి, ఉత్తమనటులుగా, ఉత్తమదర్శకులుగా బహుమతులందుకున్నారు.

శ్రీ సత్యరంగారావుగారు పాకిస్తాన్ దురాక్రమణ సందర్భంగా "జయదుందుభి" నాటకాన్ని రచించి, కేంద్రమంత్రులైన శ్రీ కొత్తరఘురామయ్య, శ్రీ దామోదరం సంజీవయ్యగార్ల సమక్షంలో ప్రదర్శించి, దేశభక్తిగల నాటక రచయితగా, ఉత్తమనటులుగా వారి ప్రశంసల నందుకున్నారు.

1970లో గుంటూరు పట్టణంలో జరిగిన అఖిలాంధ్రస్థాయి "సత్యహరిశ్చంద్ర" నాటకపోటీలలో ప్రథమంగా విశ్వామిత్రపాత్రను ధరించి, అద్భుతమైన తన నటనా వైదుష్యాన్ని ప్రదర్శించి, ఉత్తమ బహుమతిగా రజతగోపురాన్ని స్వీకరించారు. అదే నాటకంలో వీరికుమారుడు చిరంజీవి శ్రీధర్ లోహితాస్యుడుగా నటించి, ఉత్తమబాలనటుడుగా ప్రథమ బహుమతిని అందుకున్నారు.

శ్రీ సత్యరంగారావుగారు ప్రదర్శించిన "శ్రీకృష్ణతులాభారం" నాటకంలో నారదపాత్ర, "స్వాతంత్ర్యయజ్ఞం" నాటకంలో "తాంతియాతోపే" పాత్ర వీరినటనకు పరకాష్ఠ.

పౌరాణిక, చారిత్రాత్మక, సాంఘిక నాటకాలెన్నో ప్రదర్శించి, సుమారు 50 సంవత్సరాలు నాటక కళామతల్లికి సేవచేశారు.

వీరు 1974లో అనేకమంది ఉన్నతాధికారుల ఆశీస్సులతోను, కళాభిమానులైన ప్రముఖుల ఆదరాభిమానాలతోను ఒకలక్షరూపాయలు విరాళాలు సేకరించి అనంతపురంలో "కృష్ణ కళామందిర్" అను అధునాతన ఆరుబయలు రంగస్థలాన్ని(Open air theatre)అత్యంత సుందరంగా నిర్మించారు.

శ్రీ సత్యరంగారావుగారి వంటి వ్యక్తులు చాలా అరుదుగా జన్మిస్తూ వుంటారు. ఇటువంటి వారిని ఆ పరమాత్మ యెందుకు సృష్టిస్తాడో, వారాధ్యేయం వైపు యెదురయ్యే ఆటంకాలను అధిగమించి, ఈతిబాధల సుడిగుండాలను దాటుకుంటూ, ఆర్థిక ఇబ్బందులను దాటుకుంటూ వెళతారు. వీరికేమీ అంటవు. గమ్యంవైపు దూసుకుపోయే ధైర్యం, సహనం వీరికి భగవంతుడే ప్రసాదిస్తాడు.

ఒక మహానటులుగా, ఉత్తమ దర్శకులుగా, ఉన్నత ఆదర్శాలుగల రచయితగా, క్రమశిక్షణగల కార్యనిర్వాహకులుగా, రసమయరాగాలను స్వంతంచేసుకున్న మంచి గాయకులుగా రాణించిన రాయలసీమ రత్నం శ్రీ సత్యరంగారావుగారు పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలలో విభిన్న పాత్రలను అత్యద్భుతంగా పోషించి, తన జీవితాన్నే కళాసేవకు కైంకర్యంచేసిన కళాతపస్వి, యశస్వి.

శ్రీ సత్యరంగారావుగారి బహుముఖ ప్రజ్ఞను గుర్తించి "కళాపరిషత్తు-బళ్ళారి" వారు వీరికి "నటశేఖర" బిరుదునిచ్చి ఘనంగా సన్మానించారు. 1987లో ప్రతిష్టాకరమైన "బళ్ళారి రాఘవ" అవార్డును బహూకరించి గొప్పగా సత్కరించారు. వీరివంటి నిస్వార్థ కళాసేవకులు, కళారాధకులు, అతి తక్కువమంది మాత్రమే వుంటారు. వీరికి అందమైన ముఖం, శ్రావ్యమైన కంఠం భగవంతుడనుగ్రహించిన వరప్రసాదం. వీరు కర్నూలు మండలంలో జన్మించినా ఉద్యోగరీత్యా, కళాపరంగా అనంతపురానికే అంకితమైపోయారు. అది అనంతపురం తెచ్చుకున్న అదృష్టం.

వీరు ఒక చిరుఉద్యోగంలో చేరి, అంచెలంచెలుగా పెరిగి, తహసీల్దారువరకు ఎదిగి, ప్రస్తుతం ఉద్యోగ విరమణచేసి, అనంతపురంలో విశ్రాంతి తీసుకొంటున్నారు.

కూరాకుల టపాల రంగనాథం :

శ్రీ కూరాకుల టపాల రంగనాథంగారు 1930లో అనంతపురం జిల్లా, వజ్రకరూర్ గ్రామంలో శ్రీమతి వెంకమ్మ, శ్రీ పుల్లన్నగార్లకు జన్మించారు. శ్రీ రంగనాథంగారు వృత్తికళాకారులు. వీరు 1950లో "హరిశ్చంద్ర, చింతామణి" నాటకాలలో రంగస్థల ప్రవేశంచేశారు. 1958లో ఉరవకొండలో స్థాపింపబడిన "తాలూకారాఘవ కళాసమితి" అను నాటక సమాజంలో సభ్యులై పెక్కుపౌరాణిక నాటకాలలో ప్రముఖ పాత్రలను పోషించి, ప్రజల ఆదరాభిమానాలకు పాత్రులైనారు. ఆ తరువాత ఉరవకొండలో స్థాపింపబడిన "శ్రీ సరస్వతీ నాటక మండలి" అను నాటక సమాజంలో సభ్యులై అనేక పౌరాణిక, జానపద నాటకాలను ప్రదర్శించారు. అనంతపురంలోని వృత్తికళాకారులందరు యేకమై 1971లో "శ్రీ వేంకటేశ్వర నాటక సమాజం" అను నాటక సమాజాన్ని స్థాపించి "కురుక్షేత్రం, సత్యహరిశ్చంద్ర, చింతామణి, రాజయోగి, వీరబ్రహ్మంగారి చరిత్ర" మొదలగు నాటకాలను రాష్ట్రవ్యాప్తంగా ప్రదర్శించి, వృత్తి కళాకారులలో మేటి అనిపించుకున్నారు.



వీరు "అర్జునుడు, అశ్వత్థామ, నక్షత్రకుడు, భవాని, సిద్దయ్య" మొదలగు పాత్రలను అద్భుతంగా నటించారు."అశ్వత్థామ, అర్జునుడు, నక్షత్రకుడు, భవాని" పాత్రలు వీరికి ప్రజలలో నటుడుగా పేరుతెచ్చినవి.

వీరు నాటక రచయితలు.కొన్ని సాంఘిక నాటకాలు వ్రాసి ప్రదర్శింపజేశారు. వీరికి సాహిత్య సంగీతాలలో అభినివేశం కలదు.వీరు ఉత్తమదర్శకులు. పౌరాణిక, సాంఘిక నాటకాలకు దర్శకత్వం వహించి, ఉత్తమ నాటకాలను ప్రదర్శింపజేశారు. మధురమైన గాత్రంతో చక్కగా పాడగలరు. వీరు లలిత కళాపరిషత్తు-అనంతపురం, ప్రొద్దుటూరు, బళ్ళారి, గుంటూరు, రాయదుర్గం" మొదలగు ప్రాంతాలలో పాల్గొని, ప్రథమ, ద్వితీయ బహుమతు లందుకున్నారు.

శ్రీ రంగనాథంగారు హరిదాసు. వీరు హరికథలుకూడా చెప్పుంటారు. వీరు యెంత వృత్తికళాకారులైనా, కళను వ్యాపారదృష్టితోగాక, కళాదృష్టితో గ్రహించిన ఉత్తమ కళాకారులు. వీరు ప్రజాసేవ కార్యక్రమాలను గూడ నిర్వహించారు. ఆర్థికంగా ఇబ్బందులు పడే పాఠశాలలకు, కళాశాలలకు నాటకాలద్వారా నిధిని ప్రోగుచేసి యిచ్చారు. 1977లో తుఫాను బాధితుల సహాయార్థం నాటక ప్రదర్శనలిచ్చి 2522/-

రూపాయలను రాష్ట్ర గవర్నరుకు పంపించారు. ఇంకా యెందరికో యెన్నోవిధాలుగా సహాయ సహకారాలందించారు. వీరు భుక్తికోరకు నాటక కళను ఆశ్రయించినా, కళాసేవలోనే వీరికి ముక్తి లభిస్తుందన్న నమ్మకంతో కళాసేవ చేస్తున్నారు. ఈనాటికీ వీరు శ్రీ సరస్వతీ నాటక మండలిలో దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

శ్రీ కూరాకుల టపాల రంగనాథంగారు మంచినటులు, ఉత్తమ దర్శకులు, హరిదాసు, రచయిత, రాయలసీమకు వన్నెతెచ్చిన మహానటుడు.

## బి. కొండలరావు :



శ్రీ బి.కొండలరావుగారు 1932లో జన్మించారు. వీరు వృత్తి కళాకారులు. 19వయేటనుండి వీరు నాటకాలాడుతున్నారు. వీరు "గయోపాఖ్యానం" నాటకంతో రంగస్థల ప్రవేశంచేశారు. 1971లో అనంతపురంలో వృత్తి కళాకారులు కలిసి స్థాపించుకున్న "శ్రీ వేంకటేశ్వర నాటక సమాజం" లో సభ్యులై యెన్నో నాటకాలు ప్రదర్శించారు.

శ్రీ కొండలరావుగారు "గయోపాఖ్యానం, చింతామణి, శ్రీ కృష్ణతులాభారం, బాలనాగమ్మ, మోహినీ భస్మాసుర, కురుక్షేత్రం, రామాంజనేయ యుద్ధం," మొదలగు పౌరాణిక, జానపద నాటకాలను కొన్ని వందలసార్లు ప్రదర్శించారు. వీరు "శ్రీ కృష్ణుడు, బాలవర్ధి, భవాని" మొదలగు పాత్రలను అద్భుతంగా పోషించారు. శ్రీ కొండలరావుగారు గయోపాఖ్యానంలో కృష్ణుడుగా తననటనా వైవిధ్యాన్ని ప్రదర్శించి, ప్రజల మన్ననలకు పాత్రులైనారు. వీరి శ్రీ కృష్ణపాత్రకు ప్రజలు ముగ్ధులై స్వర్ణకంకణం బహూకరించి గౌరవించారు. అనంతపురం లలిత కళాపరిషత్తువారు వీరిలోని నటనను గుర్తించి దుశ్శాలువతో ఘనంగా సత్కరించారు.

వీరికి సంగీతంలోకూడ అభినివేశంకలదు. "క్లారినెట్" విద్వాంసులు. ఔత్సాహిక సంగీతాభిలాషులకు స్థానికులైనవారికి చాలమందికి క్లారినెట్ నేర్పించి, యెందరో కళాకారులను తయారుచేస్తున్నారు.

శ్రీ కొండలరావుగారు జీవనాధారంకోసం కళనాశ్రయించినా, నటులుగా, క్లారినెట్ కళాకారులుగా, రాయలసీమలోని నటులలో ఒకరుగా గుర్తింపుపొందారు.

వీరు సహృదయులు. గొప్పనటులు. క్లారినెట్ వాద్యకారులు. రాయలసీమ నటరత్నాలలో చేర్చదగినవారు.

## అంకే జయమ్మ :



శ్రీమతి అంకే జయమ్మగారు 1936లో శ్రీ అంకే పెద్దన్న, శ్రీమతి వెంకటమ్మగార్లకు అనంతపురం పట్టణంలో జన్మించారు. వీరు వృత్తికళాకారిణి.వీరు తన13వ యేటనుండి నాటకాలాడడం ప్రారంభించారు. వీరు ప్రప్రథమంగా "శ్రీ కృష్ణలీలలు" అను పౌరాణిక నాటకంలో "యశోద" పాత్రతో రంగస్థల ప్రవేశంచేశారు. వీరు వృత్తికళాకారులతో కలిసి అనేక నాటకాలను పలుపర్యాయాలు, పలుప్రాంతాలలో ప్రదర్శించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు.

వీరు "శ్రీ కృష్ణలీలలు, బాలనాగమ్మ, రామాంజనేయయుద్ధం, కురుక్షేత్రం, గయోపాఖ్యానం, చింతామణి, దేవదాసి," మొదలగు నాటకాలను దిగ్విజయంగా ప్రదర్శించారు.

శ్రీమతి జయమ్మగారు "యశోద, బాలవర్ధి, శాంతిమతి, ద్రౌపది, రాధ, సుభద్ర" మొదలగు విభిన్న మనస్తత్వాలుగల అనేక పాత్రలను యెంతో వైవిధ్యంతో నటించి ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు."రాధ, బాలవర్ధి," పాత్రలు వీరి నటనకు పరాకాష్ఠ. వీరిని నటిగా గుర్తింపజేసినవి.

శ్రీమతి జయమ్మగారు అనంతపురంలోని వృత్తి కళాకారుల సంఘమైన "శ్రీ వేంకటేశ్వర నాటక సమాజం"లో సభ్యులు. ఆనాటి ఔత్సాహిక నటులుగాని, వృత్తి కళాకారుల సంఘంలోని నటులుగాని సంగీత ప్రాధాన్యంగల పౌరాణిక, జానపద నాటకాలనే యెక్కువగా ప్రదర్శించేవారు. పాటలు, పద్యాలు లేని నాటకాలు నాటకాలుగా ఆ రోజులలో పరిగణించేవారుకాదు. ఆ కారణంగా నాటకాలలో నటించే

శ్రీమతి జయమ్మగారుకూడ సలక్షణమైన రాగాలతో పద్యాలు ఆలపించేవారు. వృత్తి కళాకారుల సంఘంలోని వారందరూ తక్కువ నాటకాలను యెక్కువసార్లు కిరాయి నాటకాలుగా ప్రదర్శించి, భుక్తిని, రక్తిని సంపాదించుకొనేవారు. అటువంటి కళాకారుల సంఘంలో సభ్యులై, వారితో కలిసి శ్రీమతి అంకే జయమ్మగారు అనేక సంగీత ప్రధాన్యంగల నాటకాలలో నటించి పలువురి ప్రముఖులచేత ప్రశంసింపబడినారు. వీరురాయలసీమ నటరత్నాలలో స్థానమేర్పరచుకున్నారు.

### మడ్డి శంకరయ్య :

శ్రీమడ్డి శంకరయ్యగారు 1936లో అనంతపురం జిల్లా, ఉరవకొండ తాలూకా, బూదగవి గ్రామంలో శ్రీమడ్డి సుంకప్ప, శ్రీమతి అంజినమ్మగార్లకు జన్మించారు. వీరు వృత్తి రీత్యా ప్రాథమికోపాధ్యాయులుగా పనిచేస్తున్నారు. వీరు ఔత్సాహిక నటులు. వీరికి చిన్నతనం నుండి నాటక కళపైన అభిమానమెక్కువ. వీరు 1955లో రంగస్థలప్రవేశం చేశారు.వీరు పౌరాణిక, సాంఘిక, జానపద నాటకాలలో నటించారు.

శ్రీశంకరయ్యగారు ఉరవకొండలో 1958వ సంవత్సరం స్థాపింపబడిన "రాఘవకళాసమితి" సభ్యులై పెక్కు నాటకాలలో నటించారు. ఆ తరువాత అనంతపురంలో 1971లో వృత్తి కళాకారులు స్థాపించిన "శ్రీవేంకటేశ్వర నాటక సమాజం"లో సభ్యులై వృత్తికళాకారులతో కలిసి అనేక పౌరాణిక నాటకాలను, పలుప్రాంతాలలో ప్రదర్శించారు. ఉరవకొండలో స్థాపింపబడిన "సరస్వతీ నాటక సమాజం"లో సభ్యులై పౌరాణిక, జానపద నాటకాలతోపాటు సాంఘిక నాటక, నాటికలను కూడ ప్రదర్శించారు.



వీరు "లవకుశ, రామాంజనేయయుద్ధం, కురుక్షేత్రం, తారాశశాంకం, చింతామణి, గయోపాఖ్యానం, బాలనాగమ్మ" అను పౌరాణిక, జానపద నాటకాలలోను, "చిల్లరకొట్టు చిట్టెమ్మ, పూలరంగడు, మంచంమీద మనిషి" మొదలగు సాంఘిక నాటక, నాటికలలోను వివిధ పాత్రలను పోషించారు. వీరు నటించిన "ఆంజనేయులు, కార్యవర్తి, లంబు" పాత్రలు ప్రజాదరణను పొంది, పలువురి ప్రశంసలకు పాత్రమైనాయి. ఆంజనేయులు పాత్రకు ఒకమెడలు, వెండికప్పు బహుమతులుగా లభించాయి. ఉరవకొండ "బాలాజీ కళానికేతన్" వారు శ్రీశంకరయ్యగారి నటనను గుర్తించి ఘనంగా సన్మానించారు.

వీరు నటులేకాదు, దర్శకులుకూడ. సాంఘిక నాటక, నాటికలకు దర్శకత్వం వహించారు. గ్రామప్రాంతాలలో ఔత్సాహిక యువకులను నటులుగా తీర్చిదిద్దడం, వారిచేత నాటకాలు ప్రదర్శింపజేయడం, అవకాశం దొరికినప్పుడు నాటకాలలో నటించడం ప్రస్తుతం వీరు చేస్తున్న కళాసేవ.

మంచినటులుగా, ఉత్తమ దర్శకులుగా, క్రమశిక్షణగల శిక్షకులుగా, ఆదర్శ ఉపాధ్యాయులుగా శ్రీశంకరయ్యగారు రాయలసీమ నటరత్నాలస్థాయికి అంచెలంచెలుగా యెదిగారు. వీరు సహృదయులు, నిస్వార్థ కళాసేవకులు.

### ఎన్. సీతమ్మ :

శ్రీమతి ఎన్. సీతమ్మగారు 1938లో అనంతపురం పట్టణంలో జన్మించారు. వీరు వృత్తి కళాకారిణి. స్త్రీలు సహజంగా అన్ని ప్రాంతాలలోను నాటక సమాజాలవారివద్ద కిరాయి తీసికొని నాటకాలలో పాత్రలు ధరిస్తారు. పురుషులవలె నాటకకళకోసం పాటుపడిన స్త్రీలు చాల అరుదు. ఆ విధంగా నిస్వార్థ కళాసేవచేయడానికి హైందవ సమాజంగాని, ఇంటి పరిస్థితులుగాని సమ్మతించవు. పురుషులు నాటకాలు ప్రదర్శిస్తే నేగౌరవించలేని ఆనాటి సమాజంలో, స్త్రీలు స్త్రీపాత్రలు ధరించడం ఏటికి ఎదురీతే అవుతుంది.అట్టి పరిస్థితులలో శ్రీమతి ఎన్. సీతమ్మగారు 1958లో "గయోపాఖ్యానం" పౌరాణిక నాటకంలో "శ్రీకృష్ణుడు, సుభద్ర" పాత్రలతో ప్రప్రథమంగా రంగస్థలప్రవేశం చేశారు. అనంతపురంలోని "శ్రీవేంకటేశ్వర నాటకసమాజం" లో సభ్యులై "గయోపాఖ్యానం, బాలనాగమ్మ, శ్రీకృష్ణతులాభారం, కురుక్షేత్రం, చింతామణి" మున్నగు నాటకాలలో విభిన్న పాత్రలను పోషించి, ప్రజల మన్ననలకు పాత్రులైనారు.



వీరు "శ్రీకృష్ణుడు, చిత్రరేఖ, సుభద్ర, బాలనాగమ్మ, రాధ" మొదలగు పాత్రలను యెంతో వైవిధ్యంతో పోషించి, రాయలసీమ నటీమణులలో నటిగా గుర్తింపు పొందారు. రాధ పాత్రలో వీరు జీవించారు.

శ్రీమతి ఎన్. సీతమ్మగారు వృత్తి కళాకారిణిగా ఒకప్పుడు వెలిగి, నటీమణిగా రాయలసీమలో

పేరు ప్రతిష్ట లార్జించుకున్నారు.

ప్రస్తుతం వీరు నటజీవితానికి స్వస్తిచెప్పి, అనంతపురంలో చిన్న హోటల్ నడుపుకుంటూ శేషజీవితాన్ని సాగిస్తున్నారు.

స్త్రీలు నటించే రోజులలో వారి నటనావైదుష్యానికి ప్రశంసలతో, చప్పట్లతో ఆకాశానికెత్తే సభ్యసమాజం వారిని సగౌరవంగా ఆదరించే సహృదయతను పెంచుకోలేక పోతూవుంది. ఒకప్పుడు నటతారలుగా వెలిగిన రంగస్థల నటీమణులు ఈనాడు దుర్భరమైన జీవితాన్ని గడుపుతూ, జీవచ్ఛవాలుగా బ్రతుకులు వెళ్ళదీస్తున్నారు. కళలను పోషించాలన్న సహృదయంగల ప్రభుత్వం వృద్ధకళాకారులకు కనీసం తిండి, బట్ట అయినా యివ్వగలిగే బాధ్యతను స్వీకరించాల్సిన బాధ్యత యెంతైనా వుంది.

## తలారి మరియమ్మదేవి :

శ్రీమతి తలారి మరియమ్మదేవిగారు 1939లో అనంతపురంజిల్లా, బుక్కరాయ సముద్రం గ్రామంలో శ్రీ వెంకటప్ప, శ్రీమతి పాపక్కగార్లకు జన్మించారు. వీరు వృత్తి కళాకారిణి. అనంతపురంలోని "శ్రీ వేంకటేశ్వర నాటక సమాజం" అను వృత్తి కళాకారుల సంఘంలో సభ్యురాలిగా చేరి, పెక్కు రంగస్థల నాటక ప్రదర్శనలలో పాల్గొన్నారు.

వీరు "బాలనాగమ్మ, సత్యహరిశ్చంద్ర, కురుక్షేత్రం, గయోపాఖ్యానం, చింతామణి, రాజయోగి, శ్రీకృష్ణ తులాభారం, శ్రీకృష్ణ రాయబారం, పల్లెపడుచు" మొదలగు పౌరాణిక , జానపద, సాంఘిక నాటకాలలో వివిధ పాత్రలను యెంతో నేర్పుతో నటించారు. బాలనాగమ్మ నాటకంలో బాలనాగమ్మగా, శ్రీకృష్ణ తులాభారం లో సత్యభామగా, హరిశ్చంద్రలో చంద్రమతిగా, కురుక్షేత్రంలో ద్రౌపదిగా నటించి, తన నటనా ప్రాభవాలను ప్రదర్శించి పదుగురిలో పదిలమైన పేరు ప్రఖ్యాతుల నార్జించుకున్నారు. ప్రముఖులచేత ప్రశంసలను అందుకున్నారు.



శ్రీమతి మరియమ్మదేవి గారు వృత్తికళాకారిణి అయినప్పటికీ కేవలం, ధనార్జనే ధ్యేయంగా పెట్టుకోక, అనేక ప్రజాహిత కార్యక్రమాలలో ఉచిత నాటకప్రదర్శనలిచ్చి, సాటిమానవులను ఆదుకున్నారు.1987 లో గోదావరి వరద బాధితుల సహాయార్థం నిర్వహింపబడిన ర్యాలీలో పాల్గొని వరద బాధితుల సహాయనిధికి రూ.4000/-లు సేకరించి సమాజం తరపున పంపగలిగారు.

వీరు అనంతపురం జిల్లాలో నిర్వహించిన అనేక నాటక పరిషత్తులలోను, అకాడమీలలోను పాల్గొని పలువురి ప్రశంసలందుకున్నారు.

శ్రీమతి మరియమ్మదేవి గారు నటించిన పాత్రలలో వారికి ఘనకీర్తినార్జించి పెట్టినవి "బాలనాగమ్మ, సత్యభామ" పాత్రలు. ఎంత నటించినా నటికి, నటునికి ఇంకా నటించాలన్న ఆసక్తిని కలిగించే పాత్రలివి. నటనలో జీవించడానికి అవకాశం కల్పిస్తాయి. శ్రీమతి మరియమ్మగారు వృత్తికళాకారిణి అయినప్పటికీ నిర్మల హృదయంతో కళాసేవ చేసి, సాటిమానవులనాదుకున్న నటీమణి. రాయలసీమ రత్నాలలో చేర్చదగిన మంచినటి.

## కాకర్ల చంద్రశేఖర చౌదరి (కె.సి.శేఖర్) :

శ్రీ కాకర్ల చంద్రశేఖర్ చౌదరిగారు 1940లో అనంతపురం జిల్లా, గుత్తి పట్టణంలో శ్రీ కాకర్ల చెన్నప్ప, శ్రీమతి మంగమ్మగార్లకు జన్మించారు. వీరు వృత్తికళాకారులు. చిన్నతనంనుండి నాటకకళపైన అభిమాన మెక్కువ. వీరు తమ 13వ యేట "వెంకాయమ్మ కాపురం" అను సాంఘిక నాటకంతో రంగస్థలప్రవేశం చేశారు. 1961లో గుత్తి పట్టణంలో స్థాపింపబడిన "నటరాజ నాట్యమండలి"లో సభ్యులైనారు. అప్పటినుండి వీరు కొన్ని వందలసార్లు నాటక ప్రదర్శనలలో పాల్గొని, విభిన్న పాత్రలను పోషించి నటులుగా స్థిరపడ్డారు.

శ్రీ చంద్రశేఖర్ చౌదరి గారు "బాలనాగమ్మ, హరిశ్చంద్ర, మోహినీ భస్మాసుర, వీరబ్రహ్మం గారి చరిత్ర, రాజయోగి, చింతామణి, కురుక్షేత్రం, గయోపాఖ్యానం, అల్లూరి సీతారామరాజు, వీరపాండ్య కట్ట బ్రహ్మన, రామాంజనేయ యుద్ధం, మల్లమ్మపుసురు, శ్రీకృష్ణ తులాభారం, చెంచులక్ష్మి, భలే పెండ్లి, మాయలమారిలోకం, వీధి నాటకం, కన్నబిడ్డ, పల్లెపడుచు, టీకప్పులో తుఫాను, దొంగ వీరడు, ఆ రాత్రి, శ్రీకారం" మొదలగు నాటకాలను ప్రదర్శించి, ఆంధ్రప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నారు.

వీరు "మాయల మరాఠీ, సుబ్బి శెట్టి, వీరపాండ్య కట్ట బ్రహ్మన, కక్కయ్య, వీరబాహుడు, కేశవుడు" మొదలగు పాత్రలను అత్యద్భుతంగా నటించి, ఉత్తమ నటులుగా బహుమతులందుకున్నారు. వీరు మాయల మరాఠీ పాత్రను 1130 సార్లు ప్రదర్శించారు. మరాఠీ

ప్రదానం చేయించారు. వీరపాండ్య కట్ట బ్రహ్మన ఏకపాత్రాభినయమునకు శ్రీ చంద్రశేఖర్ గారు బంగారు పతకాన్ని అందుకున్నారు. "స్వీకారం" అను సాంఘిక నాటికలో ప్రతినాయకుని పాత్రకు ప్రముఖ సినీనటి అంజలీదేవిగారినుండి ప్రథమ బహుమతిని అందుకున్నారు.

వీరు అనంతపురం లలిత కళాపరిషత్తు కృష్ణకళామందిర్, అనంతపురం, గుంతకల్ రైల్వే ఇన్‌స్టిట్యూట్, రాఘవ కళామందిరం, బళ్ళారి పి.టి.ఎమ్. పరిషత్తు మొదలగు పరిషత్తులు నిర్వహించిన నాటక పోటీలలో పాల్గొని ఉత్తమనటులుగా యెన్నికైనారు.

వీరు డ్రస్‌కంపెనీ నడుపుతున్నారు. నాటక రంగానికి సంబంధించి "మేకప్, రంగాలంకరణ" వంటి కళలలో నిపుణులు. శ్రీ చంద్రశేఖర్ గారు మంచి దర్శకులు. పరిసర ప్రాంతాలలోని నటులకు శిక్షణయిస్తూ, వారిచేత నాటకాలు ప్రదర్శింపజేస్తూ, తానుకూడా వారితో నటిస్తూ కళాసేవ చేస్తున్న కళారాధకులు. కళ ద్వారా భుక్తిని, రక్తిని, ముక్తిని సాధించాలన్న తపనగల ఉత్తమ నటులు. అనంతపురం జిల్లా వృత్తికళాకారుల సంఘానికి దర్శకులుగా పనిచేస్తున్నారు.

గొప్ప నటులుగా, ఉత్తమదర్శకులుగా, మేకప్ ఆర్టిస్టుగా శ్రీ కాకర్ల చంద్రశేఖర చౌదరిగారు రాయలసీమ నటరత్నాలలో విలువైన రత్నం.

## వై. కుల్లాయప్ప – అనంతపురం :



శ్రీ వై. కుల్లాయప్ప గారు 1942వ సంవత్సరం, అనంతపురంజిల్లా, చక్రాయపేట బండమీద పల్లె అను గ్రామంలో శ్రీమతి నారమ్మ, శ్రీ మల్లెల చిన్న ఓబన్న గార్ల నోముల పంటగా జన్మించారు. వీరు ఔత్సాహిక నటులు. చిన్నతనంనుండి వీరికి నాటక కళపైన అంతులేని అభిమానమున్నప్పటికీ 1973 వరకు రంగస్థల ప్రవేశం చేసే అవకాశం లేకపోయింది. 1973లో ప్రప్రథమంగా శ్రీ కుల్లాయప్పగారు "శ్రీ కృష్ణరాయబారం"లో రాయబారం సీనులో "శ్రీ కృష్ణుడు"గా రంగస్థల ప్రవేశం చేశారు. అప్పటినుండి వీరు నాటకకళకు అంకితమైపోయారు.

శ్రీ కుల్లాయప్పగారు 1973 నుండి 1982 వరకు అనంతపురంలోని "శ్రీ అరుంధతీ నాటక కళాసమితి"కి, 1983 నుండి ఇప్పటివరకు అనంతపురంలోని "శ్రీ అరుణోదయా ఆర్ట్స్" అను నాటక సమాజానికి గౌరవాధ్యక్షులుగా పనిచేశారు. ఇప్పటికీ శ్రీ అరుణోదయా ఆర్ట్స్‌కు గౌరవాధ్యక్షులుగా వున్నారు.



శ్రీ కుల్లాయప్పగారు సంగీతంలో కాస్త డొక్కశుద్ధి కలవారు. వీరు ప్రదర్శించిన నాటకాలన్నీ పౌరాణికాలే. నిండైన విగ్రహం, శ్రావ్యమైన కంఠం గల శ్రీ కుల్లాయప్పగారు పురాణ పురుషులైన "శ్రీ కృష్ణుడు"గా "సత్యహరిశ్చంద్రుడు"గా ప్రేక్షకుల హృదయాలలో చెరగని ముద్ర వేశారు. వీరు శ్రీకృష్ణరాయబారంలో పూర్తిగా కృష్ణ పాత్రను, గయోపాఖ్యానంలో యుద్ధసీను కృష్ణ పాత్రను, సత్యహరిశ్చంద్రలో వారణాసి హరిశ్చంద్ర పాత్రను సుమారు (100)వందకు పైగానే ప్రదర్శించారు. సత్యహరిశ్చంద్ర నాటకాన్ని 55 పర్యాయాలు ప్రదర్శించారు. పరిషత్తులలో ప్రదర్శించినప్పుడు శ్రీకృష్ణుడుగా పాత్రకు పలుసార్లు ప్రథమ బహుమతులు లభించాయి. రాష్ట్రస్థాయి పోటీలలో శ్రీకృష్ణ పాత్రకు ద్వితీయ బహుమతి లభించింది.

శ్రీ కుల్లాయప్పగారికి భారతంలోని "పాస్పు"సీనులోను, "రాయబారం"సీనులోను శ్రీకృష్ణ పాత్ర పేరుప్రఖ్యాతు లార్జించి పెట్టింది. ఈ పేరు యెంతవరకు వచ్చిందంటే శ్రీ కుల్లాయప్పను యెరిగివున్నవారు, స్నేహితులు, "ఏమయ్యా కృష్ణ!" అని పిలిచేవారట. వీరు అనంతపురం లలిత కళాపరిషత్తు, కృష్ణకళామందిర్, రైల్వే ఆడిటోరియంలలో లెక్కలేనన్నిసార్లు కృష్ణ పాత్రను ప్రదర్శించారు. వీరు నటించిన శ్రీ కృష్ణ పాత్రను పెక్కురు పండితోత్తములు యెంతగానో ప్రశంసించారు. ఆశీర్వదించారు. 1984లో

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక శాఖవారు అనంతపురంలో రాష్ట్రస్థాయి పోటీలు నిర్వహించినప్పుడు "శ్రీకృష్ణరాయబారం"అను పౌరాణిక నాటకంలో ఆదినుండి తుదవరకు నాటకం పూర్తయ్యేదాక అలుపెరగకుండా నటించారు శ్రీ కుల్లాయప్పగారు. ఆనాటి న్యాయ నిర్ణేతలు శ్రీశాస్త్రిగారు (హైదరాబాదు), శ్రీ నాయుడుగారు (హైదరాబాదు), శ్రీ వేమూరి గగ్గయ్యగారి కుమారుడు శ్రీ వేమూరి రామయ్యగారు. వీరి నాటకం ప్రారంభమయ్యేటప్పటికి రాత్రి 8.30గంటలు. లలిత కళాపరిషత్తు ప్రేక్షాగారం క్రిక్కిరిసిన ప్రేక్షకులతో నిండిపోయింది. వీరు పాత్రలో లీనమై నటిస్తూ, గానంచేస్తున్నారు. పోటీనాటకాలలోని నియమనిబంధనలను విస్మరించి, ప్రేక్షకులు ప్రతిపద్యానికీ "ఒన్స్‌మోర్" అంటూ మరలా పాడి తీరాలని బలవంతం చేస్తున్నారు. ప్రేక్షకుల ఉత్సాహం చూచిన న్యాయనిర్ణేతలు నిబంధనలను సడలించి తిరిగి వీరిని పాడమని అనుమతించారు. ఆవిధంగా నాటకం చివరవరకు ఈలలతో,చప్పట్లతో ఒన్స్‌మోర్‌లతో కేరింతలతో ప్రేక్షకులు తమ హర్షామోదాలను తెలియజేశారు. 3గంటల లోపల ముగియవలసిన నాటకం 5గంటలసేపు సాగింది. "సంతోషంబున సంధి సేయుదురే" అను పద్యానికి నటనను మరియొకసారి చేసిచూపమని పట్టుబట్టినారు. నాటకాంతంలో ప్రేక్షకులు, న్యాయనిర్ణేతలు వచ్చి, హృదయపూర్వక ప్రశంసలతో శ్రీకుల్లాయప్పగారిని చుట్టుముట్టారు. శ్రీ కుల్లాయప్పగారు జన్మతరించినట్లుగా ఆనందాబ్ధిలో ఓలలాడారు. నిజమైన కళాకారుడు పొందే అనుభూతి అదే. ఈ సంఘటన వీరి జీవితంలో అపూర్వమైంది. నాటకం చివరలో కొంతమంది "పోటీనాటకాల నియమనిబంధనలను యెలా సడలించా"రని న్యాయనిర్ణేతలను ప్రశ్నించినపుడు వారు ముక్తసరిగా "మాకుగూడ శ్రీకృష్ణుని నటన చూడాలనిపించింది" అని అన్నప్పుడు శ్రీ కుల్లాయప్ప గారు తమ జన్మధన్యమైనట్టు భావించారని వారిమాటల వలన తెలుస్తుంది.

శ్రీ కుల్లాయప్పగారు "సమాజాన్ని ప్రభావితంచేసే లలితకళలంటే చాలాయిష్టం" అంటారు. వీరు ఎంతటి కళాకారులో అంతటి కరుణా స్వభావులు. వీరు "అరుణోదయ ఆర్ట్స్" సమాజం ద్వారా నిస్సహాయులైన యెంతోమంది వృత్తికళాకారులకు నాటక ప్రదర్శనలిప్పించి ఆర్థిక సహాయం చేశారు. వీరు తమ సంస్థద్వారా అనేక సాంస్కృతిక ప్రదర్శనలిచ్చి "కుటుంబ నియంత్రణ" ప్రచారం సాగించారు. అనంతపురం జిల్లా విద్యాధికారి ఆధ్వర్యంలో జిల్లా అంతటా పలు ప్రదర్శనలిచ్చి సంగీత నాటక కళలను సామాజిక ప్రయోజనార్థం ప్రయోగించిన ప్రయోక్త శ్రీ కుల్లాయప్పగారు.

శ్రీ కుల్లాయప్పగారి ఆధ్వర్యంలో నడిచే ఈ నాటక సమాజంద్వారా అనంతపురం జిల్లాలోనే గాకుండా, హైదరాబాద్ - రవీంద్రభారతి, కర్నూలు - మున్సిపల్ ఆడిటోరియం, బెంగుళూరు - కళాభారతి, మదనపల్లి - అవంతిథియేటర్, పాకాల - రైల్వేరిక్రియేషన్ క్లబ్, సూళ్ళూరుపేట, రాజంపేట" ఇత్యాది అనేక చోట్ల నాటక ప్రదర్శనలిచ్చారు. ఈ సంస్థద్వారా పెక్కుమంది కవులకు, మంత్రులకు, కళాకారులకు, ప్రజాప్రతినిధులకు సన్మానాలు చేశారు.

శ్రీ కుల్లాయప్పగారు ఈనాడు నటనలో ఇంతటి మహోన్నతస్థితికి యెదగడానికి కారకులు వీరి గురువుగారైన విద్వాన్ శ్రీ యస్.సి. కాశీ రావు గారేనని భక్తిప్రపత్తులతో, సవినయంగా చెబుతారు శ్రీ కుల్లాయప్పగారు.

శ్రీ వై. కుల్లాయప్పగారు గొప్ప నటులు, ఉత్తమ దర్శకులు, మంచి గాయకులు. సాటి వారికి సహాయపడాలనుకొనే సహృదయులు. నాటకకళను ఒక సాధనంగా గ్రహించి సమాజాన్ని చైతన్యవంతం చేయాలన్న తపనగల సంస్కరణాభిలాషి. మానవతావాది. మంచి మనిషి. స్నేహశీలి. రాయలసీమ రత్నాలగనిలో మహోజ్వలంగా ప్రకాశిస్తున్న అమూల్యరత్నం.

**పులమతి బాలచంద్రరావు :**



శ్రీ పులమతి బాలచంద్రరావుగారు 1950వ సంవత్సరము అనంతపురం జిల్లా, ధర్మవరంలో శ్రీమతి సీతమ్మ, శ్రీ సంజీవరావు అను పుణ్యదంపతులకు జన్మించారు. వీరికి కళాతృష్ణ విద్యార్థిదశ నుండే కలిగింది. విద్యార్థిగా 1964లో "పరీక్ష" నాటికలో ప్రప్రథమంగా నటించారు. 1968లో ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీవారు నిర్వహించిన నాటక విద్యాలయంలోచేరి, నటనలో 'డిప్లొమా' సంపాదించారు. 1969లో హిందూపురంలో రాయల కళాపరిషత్తు వారు నిర్వహించిన చారిత్రక నాటికలపోటీలలో పాల్గొని శ్రీ మండ్యాల శ్రీనివాసులుగారి "అమరత్యాగి"లో శ్రీకృష్ణదేవరాయల పాత్రను పోషించి, ఆనాటి ముఖ్యఅతిథి ప్రముఖ సినీనటులు శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావుగారిచే ప్రత్యేక బహుమతిని, ప్రశంసలను అందుకున్నారు. ఆనాటి వారి దీవనలే శ్రీ బాలచంద్రరావుగారి ఈనాటి నటజీవితానికి నాంది అని చెప్పవచ్చును.

1969లో శ్రీ బాలచంద్రరావు గారు "వాణి కళానిలయం" అను సాంస్కృతిక సంస్థను స్థాపించి అనేక నాటకాలను ప్రదర్శించారు.

వీరు ఇంతవరకు "పరీక్ష, మాస్టర్జీ, పల్లెపడుచు, మాటతప్పకు, మారని మనిషి, ఆరణి, పంచమవేదం, మహానటుడు, దేవుడూ నిద్రలే, సమిధ, ఛాయ, ప్రతిధ్వనులు, నీడలోనిజం, పరాజితులు, నటసామ్రాట్, మరో జవహర్ పుట్టాడు, కీ. అల్లూరి సీతారామ రాజు, అమర త్యాగి, కోహినూర్, గాలిపటం" మొదలగు 120 నాటక, నాటికలలో వివిధ పాత్రలను పోషించి, అనేక ప్రథమ, ద్వితీయ బహుమతులను స్వీకరించారు. వీరు "హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణం, రాజమండ్రి, నెల్లూరు, చిత్తూరు, కర్నూలు, కడప, ఎమ్మిగనూరు, వెంకటగిరి, తిరుపతి" మొదలగుచోట్ల నిర్వహించిన పరిషత్తులలో పాల్గొని "ఉత్తమ నటుడుగా"గా, "ఉత్తమ ప్రతినాయకుడు"గా, 'ఉత్తమ క్యారెక్టర్ యాక్టర్'గా పెక్కు బహుమతులందుకున్నారు. 1987లో శ్రీ వేంకటేశ్వర నాట్య కళాపరిషత్తు- తిరుపతి వారు "ఉత్తమ వాచికము"నకు బహుమతినిచ్చారు. వీరు నటులే కాదు. ఉత్తమదర్శకులు కూడా. ఉత్తమదర్శకులుగా బహుమతులనందుకున్నారు. 12సంవత్సరాలుగా దర్శకానుభవంగల దర్శకరత్న.

శ్రీ బాలచంద్రరావుగారు ఆకాశవాణి దూరదర్శన్ నాటక ప్రదర్శనలలో నటుడుగా యెన్నికైనారు. వీరిప్పటి వరకు 30 ఆకాశవాణి నాటక, నాటికలలో పాల్గొన్నారు.

మొదట వీరు ఉద్యోగరీత్యా ఆర్.టి.ఆర్.సి. లో పనిచేస్తూ వుండేవారు. ఈ విభాగాన్ని ఆపివేసిన తరువాత 1983లో ఆర్.టి.సి. కార్మికులనందరిని కలిపి "రవాణా కళానిలయం" అనుపేర ఒక నాటక కళాసంస్థను స్థాపించి ఇప్పటికీ కళాసేవ చేస్తున్నారు. ఈ సంస్థకు కార్యదర్శిగా, దర్శకులుగా ఈనాటికీ వ్యవహరిస్తున్నారు. రవాణా కళానిలయాన్ని సొసైటీ ఏక్ట్ క్రింద రిజిస్టరు చేయించి, పరిషత్తులలో పాల్గొనడమేగాక ప్రతియేటా వార్షికోత్సవాలు జరిపిస్తూ వివిధ సాంస్కృతిక పోటీలను నిర్వహిస్తున్నారు. వీరు సన్మానించిన వారిలో "శ్రీ ఆర్.వి.యస్. రామస్వామి (రచయిత), శ్రీ నేరెళ్ళలక్ష్మణ రావు (మిమిక్రీ ఆర్టిస్ట్) అమీర్ బాషా (నృత్యకళాకారులు) మొదలగు ప్రముఖ కళాకారులు వున్నారు.

శ్రీ బాలచంద్ర రావుగారు అనేక నాటక పరిషత్తులకు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు. ప్రస్తుతం వీరు అనంతపురంలో ఏ.పి.ఎస్.ఇ.బి. వారికి, పోస్టల్ కాళా సంస్థలకు దర్శకులుగా వున్నారు. "గాలిపటం" నాటికలో విశ్వపతి పాత్ర, "'ప్రతిధ్వనులు" నాటికలో రంగారావు పాత్ర, "మాట తప్పకు" నాటకంలో శంకర శాస్త్రి పాత్ర, "పంచమ వేదం"లో గౌరీనాథ శాస్త్రి పాత్ర వీరికి నచ్చినవి, ప్రజలుమెచ్చినవి.

వీరు ఔత్సాహిక యువకళాకారులు. చిన్నతనంనుండి నాటక కళామతల్లి అనుగ్రహం లభించిన ఉత్తమనటులు. కళ ద్వారా జాతిని జాగృతం చేయాలన్న సదాశయంగల ఆదర్శకళామూర్తి. నిస్వార్థ కళాసేవకులు. నాటక కళామతల్లి సేవకు అంకితమై తనవంటి నటులను తయారుచేసి, కళామతల్లిసేవలోనే కన్నుమూయాలన్న జీవితాదర్శం కల మంచి మనిషి. శ్రీ బాలచంద్ర రావు గారి నటనావైదుష్యాన్ని గుర్తించి, "టిప్-టాప్ ఆర్ట్స్" అనంతపురం వారు "ఆంధ్ర నాటకరంగ భూషణ" బిరుదుతో సత్కరించారు. వీరి కళాసేవను గుర్తించి 1987లో స్థానిక రంగస్థల కళా సంస్థ 'రాఘవ నృత్యనటనాలయం" వారి "బళ్ళారి రాఘవ" అవార్డునిచ్చి సన్మానంచేశారు. వీరుగూడా రాయలసీమ నటరత్నాలలో ఒకరు.

## కందుకూరి రెడ్డెప్ప :

శ్రీ కందుకూరి రెడ్డెప్పగారు అనంతపురం జిల్లా, కదిరి తాలూకా, తవలమఱ్ఱి గ్రామంలో 1951వ సంవత్సరం శ్రీమతి మల్లమ్మ, శ్రీ వీరప్ప గార్లకు జన్మించారు. వీరు ఔత్సాహిక నటులు. చిన్నతనంనుండి వీరికి నాటక కళయందు అభిరుచి యెక్కువ. వీరు 1969లో "ప్రతి ధ్వనులు" నాటికలో రౌడీ పాత్రతో నాటక రంగంలో ప్రవేశించారు.



వీరు 1957లో తవలమఱ్ఱిలో స్థాపింపబడిన "యువజన సేవా సంఘం"అను నాటకసమాజంలో సభ్యులుగా వుంటున్నారు. వీరు "కురుక్షేత్రం, బాలనాగమ్మ, హీరో మిస్టర్ జీరో, భంచిక భం, పుటుక్కు జర జర డుబుక్కు మే, రాయబారం పడకసీను" మొదలగు నాటకాలలో వివిధ పాత్రలను పోషించారు. కురుక్షేత్రంలో దుర్యోధనుడుగాను, రాయబారం పడకసీనులో శ్రీకృష్ణుడుగాను, బలనాగమ్మలో మొదటి ఫకీరు, చాకలి తిప్పడుగాను, తలారి రాముడుగాను, హీరో మిస్టర్ జీరోలో డా। పప్పెట్ లాల్ గాను, పుటుక్కు జర జర డుబుక్కు మే నాటికలో చాకలివాడు గాను నటించి ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు. వీరు బాలనాగమ్మ నాటకంలో 'ఫకీరు, తిప్పడు' పాత్రలను సుమారు 20సార్లు ప్రదర్శించారు. తిప్పడు పాత్రకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఉత్తమ బహుమతి లభించింది.

శ్రీ రెడ్డెప్పగారు స్వతహాగా హాస్యప్రియులు. వీరు చాలవరకు హాస్యపాత్రలనే నటించారు. ఉత్తమ హాస్యనటులుగా బహుమతులందుకున్నారు. "భంచిక భం" నాటకలో ఉత్తమ హాస్యనటుడుగా యెన్నుకోబడినారు.

వీరు నటనలోనేగాక రచన, సంగీతం, చిత్రలేఖనములలో కూడ ప్రావీణ్యం సంపాదించారు. వీరి రంగుల కుంచెతో తయారైన 15 చిత్రాలను శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోని చరిత్ర విభాగంలో చూడవచ్చు.

శ్రీ రెడ్డెప్పగారు పాటలు, పద్యాలు రాగయుక్తంగా పాడగలరు. చిన్నచిన్న గేయాలు, నాటికలు కూడ వ్రాస్తుంటారు. వీరు రచించిన నాటికే "హీరో మిస్టర్ జీరో". జానపద గేయాలు వ్రాసి, స్వయంగా స్వరకల్పన చేసి, పాడగల నిపుణులు. వృత్తిరీత్యా శ్రీ రెడ్డెప్పగారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో చరిత్ర విభాగంలో లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. 1990 సెప్టెంబరు 2 వ తేదీన నిర్వహింపబడిన విశ్వవిద్యాలయ వ్యవస్థాపక దినోత్సవంలో చాకలి తిప్పడు ఏకపాత్రాభినయమును, "స్వర్గానికి ఇంటర్వ్యూ" అను నాటికలో రాజకీయ నాయకుడుగాను నటించారు.

శ్రీ రెడ్డెప్పగారు సహృదయులు. రాయలసీమ నటరత్నాలలో చేర్చవచ్చును. ఎంతో భవిష్యత్తుగల నటులు.

**బి. జయరాముడు :**

శ్రీ బి. జయరాముడుగారు 1953లో అనంతపురం పట్టణమందు కీ॥శే॥ బి. సుబ్బరాయుడు, శ్రీమతి నాగమ్మ గార్లకు జన్మించారు. వీరు ప్రభుత్వ వ్యవసాయశాఖలో సబ్ అసిస్టెంటుగా పని చేస్తున్నారు. ఔత్సాహిక కళాకారులు.

శ్రీ జయరాముడుగారికి బాల్యంనుండి నాటకకళమీద అభిరుచి యెక్కువ. వీరు ప్రప్రథమంగా అల్లూరి సీతారామరాజు ఏకపాత్రాభినయం 1982లో చేశారు. ఆ తరువాత "సిఫార్సు" అను సాంఘిక నాటికలో నటించారు.



వీరు 1982లో "శ్రీ సీతారామాంజనేయ యువ నాట్యమండలి"అను నాటక సమాజాన్ని మిత్రులతో కలిసి స్థాపించి "శ్రీ కృష్ణ రాయబారం, శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి జీవిత చరిత్ర, ప్రజాసేవకులు, యథారాజా తథా ప్రజ, శిథిలాలయం, సిఫార్సు" మొదలగు నాటకాలను అనేకసార్లు ప్రదర్శించారు.

జయరాముడు గారు "దుర్యోధనుడు, వీరబ్రహ్మం, సీతారామరాజు" మొదలగు పాత్రలను పోషించి ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు. వీరు లలితకళాపరిషత్తు-అనంతపురం, గుత్తి, కర్నూలు, ఎమ్మిగనూరు, గుంతకల్లు, రాజంపేట మొదలగు పరిషత్తులలో పాల్గొని పెక్కు బహుమతులు, ప్రశంసలు అందుకున్నారు.

శ్రీ జయరాముడుగారి దుర్యోధన పాత్రను మెచ్చి కర్నూలు, ఎమ్మిగనూరు, అనంతపురం,పరిషత్తులలో వీరికి ఘనమైన సన్మానం చేశారు.

వీరికి దర్శకత్వం, మేకప్, రంగాలంకరణలలో కూడ మంచి అనుభవం కలదు. శ్రీ జయరాముడుగారి ఆధ్వర్యంలో "పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్ర" అను నాటకాన్ని అనంతపురం, ఎమ్మిగనూరులలోనే గాక కర్నూలు ఇత్యాది ఇతర జిల్లాలలో కూడ అనేకమార్లు ప్రదర్శించి ప్రజల మన్ననలను అందుకున్నారు.

శ్రీ జయరాముడుగారిది నిండైన విగ్రహం. గంభీరమైన వాచకం. శ్రావ్యమైన కంఠం. నటునికి కావలసిన లక్షణాలు గల వీరు రాయలసీమ నటరత్నాలలో చేర్చదగినవారు.

**శ్రీ మేటి మృత్యుంజయగౌడు :**

శ్రీ మేటి మృత్యుంజయ గౌడు గారు 1958లో శ్రీమతి గౌరమ్మ, శ్రీ కరి బసవప్ప గార్లకు జన్మించారు. వీరు వృత్తికళాకారులు. 1974లో "కోర్టీయర్సు"అను ఆంగ్లనాటకంలో చిన్నపాత్రతో రంగస్థల ప్రవేశం చేశారు. 1978లో అనంతపురంలో "నటరాజ కళామందిర్" నాటక సమాజం స్థాపింపబడింది. ఈ సమాజంలో శ్రీ మృత్యుంజయ గౌడు సభ్యులుగా చేరి, పెక్కు నాటకాలలో వివిధ పాత్రలను నటించారు. వీరు "సుధన్వార్జునీయము, రామాంజనేయ యుద్ధం, బభ్రువాహన, కురుక్షేత్రం, బాలనాగమ్మ, హరిశ్చంద్ర,

చింతామణి" మొదలగు నాటకాలను అనంతపురం లలిత కళాపరిషత్తులోను, బళ్లారి రాఘవ కళామందిర్‌లోను, హైదరాబాదు రవీంద్ర భారతిలోను పెక్కుసార్లు ప్రదర్శించారు. వీరు "యయాతి, సుధన్వుడు, దుర్యోధనుడు, అంగదుడు, సత్యకీర్తి, తలారి రాముడు, చాకలి తిప్పడు, వీరబాహుడు, కేశవుడు, దామోదరుడు, నకులుడు" మొదలగు పాత్రలను పోషించి ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు. వీరికి నటుడుగా గుర్తింపు తెచ్చినవి "చాకలి తిప్పడు, కేశవుడు, తలారి రాముడు, నకులుడు"పాత్రలు.



శ్రీ మృత్యుంజయ గౌడు గారు ఇందిరా ప్రియదర్శిని అసోషియేషన్ వారు నిర్వహించిన జాతీయ లలిత కళల పోటీలలో ఉత్తమ ద్వితీయ బహుమతిని, ప్రశంసాపత్రాలను అందుకున్నారు. రవీంద్రభారతి హైదరాబాదులో ప్రశంసాపత్రమును స్వీకరించారు.

వీరు నటనలోనే గాక నాటక కళకు సంబంధించిన "దర్శకత్వం, మేకప్, రంగాలంకరణ" మొదలగు రంగాలలో కూడ అభినివేశాన్ని సంపాదించారు. వృత్తిరూపంగానైనా నాటక కళకు సేవచేస్తున్న రాయలసీమ ఆధునిక నటులలో ఒకరు. రాయలసీమ నటరత్నాలలో చేర్చదగినవారు.

## కేసరి రామకుమార్ :

శ్రీ కేసరి రామకుమార్ గారు 1958వ సంవత్సరం అనంతపురం జిల్లా, తాడిపత్రి పట్టణంలో శ్రీమతి సత్యవతి, చంద్రయ్యగార్లకు జన్మించారు. వీరు ఔత్సాహిక నటులు. 1973లో వీరు "దేశ ద్రోహులు" అను నాటికలో "కిరణ్" పాత్రతో రంగస్థల ప్రవేశం చేశారు. అప్పటినుండి శ్రీ రామకుమార్ గారు నాటక, నాటిక, ఏకపాత్రాభినయములెన్నో ప్రదర్శించారు. వీరు "వంచకుడు, ప్రేమపక్షులు, నేటి విద్యార్థి, సుడిగుండం, మనుషులొస్తున్నారు జాగ్రత్త, త్రివేణి, ఏక్‌దిన్‌కా సుల్తాన్, మీరైతే ఏంచేస్తారు? అడ్రసు లేని మనుషులు, కోహినూరు, ఓటున్న ప్రజలకు కోటిదండాలు, విప్లవ జ్యోతి, ప్రజా ద్రోహులు"అను సాంఘిక నాటికలలోను "అల్లూరి సీతారామ రాజు" అను చారిత్రాత్మక నాటికలోను, "యధా ప్రజ-తథా రాజు" అను సాంఘిక నాటకములోను, "పల్లెసీమ పిలిచింది" అను రేడియో నాటికలోను విభిన్న పాత్రలను పోషించి, తమనటనా ప్రతిభను ప్రదర్శించారు.



వీరు "చాణక్య, అప్పాజీ, శ్రీనాథుడు, అల్లూరి సీతారామరాజు"అను చారిత్రాత్మక ఏకపాత్రాభినయములను, "గమ్యం యెక్కడ?, మురారి"అను సాంఘిక ఏకపాత్రాభినయములను ప్రదర్శించి గొప్పనటులలో ఒకరుగా కీర్తి ప్రతిష్టలనందుకున్నారు. వీరు "ప్రగతి ఆర్ట్స్" అనంతపురం, "సహోదయ ఆర్ట్స్" అనంతపురం, "రాయలకళాసమితి" హిందూపురములలో స్థాపింపబడిన నాటకసమాజాలలో సభ్యులుగా వున్నారు.

శ్రీ రామకుమార్ గారు "ఆంధ్రకళాసమితి-బళ్ళారి, లలితకళాపరిషత్తు-అనంతపురం, రవీంద్ర భారతి-హైదరాబాదు" మొదలగు ప్రాంతాలలో నిర్వహించిన నాటక పరిషత్తులలో పాల్గొని ప్రథమ, ద్వితీయ బహుమతులను స్వీకరించారు. వీరికి నచ్చిన, ప్రజలు మెచ్చిన పాత్రలలో "చాణక్య, మురారి, (కీర్తిశేషులు), అల్లూరి సీతారామ రాజు, బాస్టియన్" పాత్రలు ముఖ్యమైనవి.

శ్రీ రామకుమార్‌గారు నటులేగాక దర్శకులు కూడా. వీరు కళాతృష్ణగల ఉత్సాహవంతులైన యువనటులు. ఈనాడు అనంతపురంలోని నటులలో చెప్పుకోతగినవారు. నాటకకళపైన నిర్దిష్టమైన భావాలు గల కళాకారులు.

## వనార్చ సరోజ :

శ్రీమతి వనార్చ సరోజ 1958లో శ్రీమతి వరలక్ష్మి, శ్రీరమణయ్యగార్లకు అనంతపురం పట్టణంలో జన్మించారు. వీరు వృత్తికళాకారిణి. వీరు 1967లో "బాలనాగమ్మ" నాటకంలోని "బాలవర్ధిని" పాత్రతో రంగస్థల ప్రవేశం చేశారు. అనంతపురం వృత్తికళాకారుల కల్పవృక్షం "శ్రీ వేంకటేశ్వర నాటక సమాజం" లో సభ్యులు. సమాజ సభ్యులతో కలిసి అనేక ప్రాంతాలలో పెక్కు నాటకాలను

రక్తపిపాస, రక్త కన్నీరు, పల్లె పడుచు, నరకాసుర వధ, పద్మవ్యూహం, హరిశ్చంద్ర, మాయాబజార్, యమాంజనేయ యుద్ధం" మొదలగు పౌరాణిక, జానపద, సాంఘిక నాటకాలలో ముఖ్యపాత్రలను పోషించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు.



శ్రీమతి సరోజగారు "సీత, బాలనాగమ్మ, బాలవర్ధి, సావిత్రి, చిత్రరేఖ, సుభద్ర, ద్రౌపది, సత్యభామ, శ్రీకృష్ణుడు, చింతామణి, శాంతిమతి, రాధ, చంద్రమతి" మొదలగు పాత్రలను అద్భుతంగా నటించి, పలువురి మన్ననలకు పాత్రులైనారు.

"చంద్రమతి, బాలనాగమ్మ, ద్రౌపది, చింతామణి, సత్యభామ" పాత్రలలో వీరు జీవించారు. ఈ పాత్రలు వీరికి ప్రజలలో కీర్తి ప్రతిష్టలను సమకూర్చి పెట్టాయి. వీరు కృషిచేసి నాటకాలలో పాటలు, పద్యాలు పాడడం నేర్చుకున్నారు.

వీరు "లలితకళాపరిషత్తు-అనంతపురం, కృష్ణకళామందిర్-అనంతపురం, రాఘవ కళామందిర్-బళ్ళారి, ప్రొద్దుటూరు కళామందిరం అను నాటక పరిషత్తులు నిర్వహించిన నాటక పోటీలలో పాల్గొని ఉత్తమనటి బహుమతులందుకున్నారు.

శ్రీమతి వనార్చ సరోజ గారు వృత్తికళాకారిణి అయినప్పటికి నాటకకళకు యెనలేని సేవ చేస్తున్నారు. ఈనాటి రాయలసీమ నటీమణులలో ఒకరు. నటరత్నాలలో చేర్చదగినవారు.

### మేటి శారద :

శ్రీమతి మేటి శారద గారు 1959లో శ్రీమతి రాజరత్నమ్మ, శ్రీ కె.ఎన్. దేవరాజాగార్లకు అనంతపురం పట్టణంలో జన్మించారు. వీరు వృత్తి కళాకారిణి. 1974లో ప్రథమంగా నాటకంలో నాట్యంచేస్తూ రంగస్థల ప్రవేశం చేశారు. వీరు అనంతపురం వృత్తికళాకారుల సంఘం "శ్రీ వేంకటేశ్వర నాటక సమాజం"లోను, కళ్యాణదుర్గం "శ్రీ కృష్ణదేవరాయ నాటక సమాజం"లోను సభ్యురాలుగా చేరి అనేక పౌరాణిక, జానపద, సాంఘిక నాటకాలను ప్రదర్శించారు.

వీరు "బాలనాగమ్మ, శ్రీకృష్ణ తులాభారం, చింతామణి, కురుక్షేత్రం, రామాంజనేయ యుద్ధం, కర్ణార్జున విజయం, పల్లెపడుచు, కథా నాయకుడు, రంగూన్ రౌడీ, రక్త పిపాస, కోడె నాగు, మధుసేవ" మొదలగు నాటకాలలో వివిధ పాత్రలను యెంతో వైవిధ్యంతో నటించి, ప్రేక్షకుల ప్రశంసలనందుకున్నారు.



వీరు "చిత్ర, మంజరి, లచ్చి, కలహకంఠి, శాంతిమతి, ద్రౌపది, చిత్రరేఖ, సుభద్ర, లక్ష్మి, శారద" మొదలగు పాత్రలను పలుసార్లు ప్రదర్శించి ప్రజల మన్ననలకు పాత్రులైనారు. వీరు నటించిన "లచ్చి, మంజరి, చిత్ర" పాత్రలు నటనలో వీరిని కీర్తి శిఖరాలకు చేర్చాయి.

శ్రీమతి శారదగారు హైదరాబాదు రవీంద్రభారతిలోను, బెంగుళూరు "రవీంద్ర కళాక్షేత్రం"లోను పలుసార్లు నాటక ప్రదర్శనలలో పాల్గొన్నారు. వీరు చక్కగా నాట్యం చేయగలరు. నృత్యంతోనే రంగస్థల ప్రవేశం చేశారు. నాటకాలలో ప్రదర్శించే నృత్యంలో అందె వేసిన చేయి. ఎన్నో ప్రశంసలు లభించాయి. 1989లో ఇందిరా ప్రియదర్శిని అసోసియేషన్ వారు జాతీయ లలితకళా ప్రదర్శనలో ద్వితీయ బహుమతిని ప్రదానం చేశారు.

శ్రీమతి మేటి శారద గారు నాట్యంలోను, నటనలోను ఆధునిక రాయలసీమ నటీమణులలో ఒకరు. రాయలసీమ నటరత్నాలలో చేర్చదగినవారు.

### చిగుర్చి విజయకుమారి :

శ్రీమతి చిగుర్చి విజయకుమారి గారు 1959లో అనంతపురం పట్టణంలో శ్రీమతి భవాని, శ్రీ పి.రామారావు గార్లకు జన్మించారు. వీరు వృత్తికళాకారిణి. వీరు 1969లో "చింతామణి" నాటకంలోని "రాధ" పాత్రతో రంగస్థల ప్రవేశం చేశారు. వీరు అనంతపురంలో 1971లో స్థాపింపబడిన "గోవర్ధన నాటక సమాజం"లోను "గజపతి నాటకసమాజం"లోను బెంగుళూరిలోని "వేంకటేశ్వర నాట్య కళామండలి"లోను సభ్యులుగా వుంటూ, ఆ సమాజాలవారితో కిరాయి నాటకాలు ప్రదర్శిస్తున్నారు.

వీరు "సత్య హరిశ్చంద్ర, శ్రీకృష్ణ తులాభారం, కురుక్షేత్రం, బాలనాగమ్మ, శశిరేఖా పరిణయం, చింతామణి, సతీసావిత్రి, లవకుశ, కృష్ణాంజనేయ యుద్ధం, శ్రీ కృష్ణరాయబారం, పల్లెపడుచు" మొదలగు పౌరాణిక, జానపద, సాంఘిక నాటకాలలోని విభిన్న పాత్రలను పోషించి, రాయలసీమ ఆధునిక నటీమణులలో ఒకరుగా గుర్తింపు పొందారు. వీరు "చింతామణి, సత్యభామ, చంద్రమతి, రాధ, ద్రౌపది, ఉత్తర, శశిరేఖ, బాలనాగమ్మ, సంగు, చిత్రరేఖ, సుభద్ర" మొదలగు పాత్రలను యెంతో వైవిధ్యంతో నటించారు. వీరిని ప్రజలలో నటిగా గుర్తింపజేసిన పాత్రలు "సత్యభామ, బాలనాగమ్మ, చంద్రమతి, ద్రౌపది, చింతామణి".



శ్రీమతి విజయ కుమారి గారిని అనంతపురం లలిత కళాపరిషత్తులో రూ.1500/-లు పారితోషికమిచ్చి ఘనంగా సన్మానించారు. ప్రొద్దుటూరులో రజిత బహుమానం అందజేశారు. లలిత కళాపరిషత్తు -అనంతపురంలో వీరు ప్రదర్శించిన భరతనాట్యానికి ప్రశంసా పత్రం రూ.500/-లు పారితోషికం యిచ్చారు. వీరు అనంతపురం లలిత కళాపరిషత్తులోను, పోతన ఆడిటోరియంలోను, గాంధీ భవన్-హైదరాబాదులోను నాటక ప్రదర్శనలు, నృత్య ప్రదర్శనలు ఇచ్చారు. వీరికి సంగీతంలో కూడ అభినివేశము కలదు. వీరు డ్రస్ కంపెనీ నడుపుతున్నారు.

శ్రీమతి విజయ కుమారి గారు శాస్త్రీయ సంగీతం, భరత నాట్యం తెలిసిన ఉత్తమ నటీమణి. రాయలసీమ నటరత్నం.

## కర్నూలు జిల్లా

### కర్నూలు :

రాయలసీమలో కర్నూలు రాజకీయంగా ప్రఖ్యాతి గాంచిన పట్టణం. అమర జీవి శ్రీ పొట్టి శ్రీరాముల త్యాగఫలంగా అవతరించిన ఆంధ్రరాష్ట్రానికి రాజధాని. కోటలు, బురుజులతో చారిత్రక ప్రాధాన్యం గల పట్టణం. అటువంటి పట్టణంలో మొదట ఆంధ్ర దేశంలోని అన్ని ప్రాంతాలలోవలె జానపద కళలు ప్రచారంలో వుండినట్లు సాహిత్య చరిత్రను బట్టి, చారిత్రక ఆధారాలనుబట్టి తెలుస్తుంది.

20వ శతాబ్ది ప్రథమార్థంలో కర్నూలు పట్టణం, పరిసర ప్రాంతాలలో వీధి నాటకాలు విరివిగా ప్రదర్శింపబడుతూ వుండేవి. ఈ వీధి నాటకాల ప్రభావానికిలోనై, మొదటి వీధి నాటకాలలో నటుడుగా పరిచయమై, స్వయంకృషితో "హార్మోనియం, తబలా" వాయిద్యాలను నేర్చుకొని, పౌరాణిక నాటకాలకు సంగీతం, దర్శకత్వం నిర్వహించి, సుప్రసిద్ధ కళాకారుడుగా ఆంధ్రదేశంలో కీర్తి ప్రతిష్టల నార్జించిన వారు నటశేఖర శ్రీ "పి.జి. సత్యనారాయణ"గారు.

### కర్నూలు మండల లలిత కళాపరిషత్తు :

1949లో శ్రీ పి.జి. సత్యనారాయణ గారు ప్రథమంగా కర్నూలు పట్టణంలో ఉస్మానియా కళాశాల వైస్ ప్రిన్సిపాల్ శ్రీ ఘూలి నారాయణ రావు గారి సహకారంతో "కర్నూలు మండల లలిత కళాపరిషత్తు' అను నాటక సమాజాన్ని స్థాపించారు. శ్రీ పి.జి సత్యనారాయణగారు ప్రథమ కార్యదర్శిగాను, దర్శకులుగాను పనిచేసి, సమాజపురోభివృద్ధికి యెంతగానో కృషి సల్పినారు.

కర్నూలు పట్టణంలో స్థాపింపబడిన మొట్టమొదటి నాటక సమాజం "కర్నూలు మండల లలిత కళాపరిషత్తు" అని అందరూ చెబుతారు. ఈ సమాజ ఆధ్వర్యంలో "ఆంధ్రజ్యోతి, రేవతి, ఛత్రపతి శివాజి, ఖిల్జీ రాజ్య పతనం, మహారాణి రుద్రమ, సాయిలీలలు, మార్కండేయ విజయం, సతీసక్కుబాయి, వేమారెడ్డి మల్లమ్మ, పల్లె పిల్ల" మొదలగు పౌరాణిక, చారిత్రాత్మక, సాంఘిక నాటకాలను పెక్కుసార్లు ప్రదర్శించి, ప్రజలమన్నన లందుకున్నారు. స్థానిక మండలంలోనే గాక "కడప, అనంతపురం, మహబూబ్ నగర్" జిల్లాల వారి ఆహ్వానం మీద ఆయా ప్రాంతాలలో నాటక ప్రదర్శనలిచ్చి బహుమతులను, ప్రశంసాపత్రాలను సంపాదించారు.

### అభ్యుదయ కళా సమితి :

1954లో ఔత్సాహికులైన కొందరు యువకులు చేరి "అభ్యుదయ కళాసమితి" అను నాటక సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజం వారు "బలిదానం, ఒకే కుటుంబం, మారిన మనసులు, జన్మహక్కు" మొదలగు సాంఘిక నాటకాలను దిగ్విజయంగా ప్రదర్శించారు. ఈ సమాజంలోని శ్రీ జి. సత్యనారాయణ రావు, శ్రీ ఎ. కోదండరామయ్య, శ్రీమతి యం.యస్. శకుంతలా దేవి, శ్రీ హనుమయ్య, శ్రీపట్టంశెట్టి ఉమామహేశ్వర రావు మొదలగు వారు సభ్యులుగా ఉండి, కర్నూలు జిల్లాలో గొప్పనటులుగా పేరు గాంచినారు.

## కర్నూలు డ్రమెటిక్ అసోసియేషన్ :

ఇంచుమించు "అభ్యుదయ కళాసమితి" స్థాపింపబడిన కాలంలోనే "కర్నూలు డ్రమెటిక్ అసోసియేషన్" స్థాపింపబడింది. ఈ సమాజంలో శ్రీ బి.వి. సుబ్బారావు, శ్రీ సీతారామయ్య, శ్రీ స్వామిరావు, శ్రీ జి. సుబ్బారావు, శ్రీమతి కె. లీలావతమ్మ, శ్రీమతి ఇందిరాదేవి, శ్రీ బి. నారాయణ మూర్తి సభ్యులుగా "జన్మ హక్కు, మారిన మనసులు, పల్లె పిల్ల" మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

## ప్రభాత్ అమెచ్యూర్స్ అసోసియేషన్ :

1957లో శ్రీ బి. గోవిందప్ప గారు, మరికొందరు ఔత్సాహికులైన నటులు కలిసి "ప్రభాత్ అమోచ్యూర్స్ అసోసియేషన్" స్థాపించారు. ఈ సమాజంవారు "అనుబంధాలు, పంజరం, నీలి మబ్బులు, ఆత్మాహుతి" మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

## తిరుమల ఆర్టు థియేటరు :

"తిరుమల ఆర్టు థియేటరు" అను నాటక సమాజం 1963లో స్థాపింపబడింది. దీనికి వ్యవస్థాపక అధ్యక్షులు "శ్రీ యన్. అంకమ రావు"గారు. వీరు ఔత్సాహికులైన నటులతో బొబ్బిలి యుద్ధం, కురుక్షేత్రం, గయోపాఖ్యానం, సత్యహరిశ్చంద్ర" మొదలగు నాటకాలను "తిరుమల ఆర్టు థియేటరు" నాటక సమాజం ద్వారా పెక్కు పర్యాయాలు ప్రదర్శించి, ప్రశంసలనందుకున్నారు.

ఈ సమాజంవారు తిరుపతి, కడప మొదలగు పట్టణాలలో జరిగిన రాష్ట్రస్థాయి నాటక పోటీలలో పాల్గొని ప్రేక్షకుల ప్రశంసలతో పాటు ఉత్తమ, ద్వితీయ బహుమతులందుకున్నారు.

శ్రీ పైడి లక్ష్మయ్యగారు రచించిన "వేమారెడ్డి మల్లమ్మ" నాటకాన్ని శ్రీశైలంలోను, దేశ ప్రముఖులైన శ్రీ బాబూరాజేంద్రప్రసాద్ గారు, శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ, పట్టంతాను పిళ్లైగార్ల సమక్షంలో ప్రదర్శించి వారి ప్రశంసల నందుకున్నారు.

## లలిత కళాసంఘం :

ఆ తరువాత 1965లో కర్నూలులో "లలిత కళాసంఘం" స్థాపింపబడింది. ఈ నాటక సమాజంలో శ్రీ ఎ. కోదండరామయ్య, శ్రీ జి. సత్యనారాయణ రావు, శ్రీ బి. నారాయణ మూర్తి, శ్రీ అన్సారి, శ్రీ కె. సుబ్బా రావు, శ్రీ వెంకట స్వామి గౌడ్, శ్రీ రామలింగప్ప, శ్రీమతి కమల కుమారి, శ్రీ లింగరాజు, శ్రీమతి అల్లూరి సుశీల మొదలగు నటీనటులు అనేక నాటక ప్రదర్శనలిచ్చి, రాయలసీమ నటరత్నాల జాబితాలో చేరినారు.

## లలిత కళాసమితి :

కర్నూలు పట్టణం ఎ.బి.సి. క్యాంపులలో నివసించు ఔత్సాహిక కళాకారులు కొందరు చేరి నాటక కళను పోషించాలనే ఉద్దేశంతో 1968లో "లలిత కళాసమితి" అను నాటక సమాజాన్ని స్థాపించారు.

లలితకళలకు సీమలో చిరుదీపం కర్నూలు లలిత కళాసమితి. కళాకారుల అకుంఠిత దీక్ష, కళాపోషకుల స్వార్థరహిత చేయూత, దాతల సహృదయత, అధికారుల అండదండలు కళానిలయంగా రూపుదిద్దుకున్నది. చక్కని సమితి ప్రాంగణము.

కర్నూలు పట్టణంలో "సి" క్యాంపు సెంటర్‌లో అందమైన, అన్ని వసతులు గల లలిత కళాసమితి భవన నిర్మాణానికి సూత్రధారుడు









లలిత కళాసమితి–కర్నూలు, రిజిస్టార్ 35/70

1. డా॥ కె. వి. చలపతి రావు (వ్యవస్థాపక అధ్యక్షులు), 2. శ్రీ జంపాల శివయ్య (ప్రస్తుత ప్రెసిడెంటు), 3. శ్రీ మాదినేని పాపారావు (ప్రస్తుత కోశాధికారి)

డా॥ కె.వి. చలపతి రావు గారు. ఆకారణంగానే ఈ నిర్మాణానికి "లలిత కళా సమితి"వారు "డా॥ కె.వి. చలపతి రావు ఆరుబయలు కళామందిరము"అని నామకరణం చేశారు.

శ్రీ పి. ఆదినారాయణ గారు (ప్రిన్సిపాల్, బి.ఇడి. కళాశాల, కర్నూలు), డా॥ కె.వి. చలపతి రావు గారు (డాక్టరు, కర్నూలు మెడికల్ కాలేజి), శ్రీ దిల్ జిత్ ఆరోరా గారు, ఐ.ఎ.ఎస్. (కలెక్టర్, కర్నూలు జిల్లా)–ఈ ముగ్గురు మూర్తుల రూపకల్పన "కర్నూలు లలిత కళాసమితి భవనం". ఈ లలిత కళాసమితి ప్రాంగణంలో ప్రథమంగ రెండు రూములు (గదులు) ఒక హాలు, రంగస్థలం నిర్మించడం జరిగింది. ఆ తరువాత ప్రహరీగోడ నిర్మాణం జరిగింది. ఈ నిర్మాణాలకు జిల్లా కలెక్టరు శ్రీ టి.ఎన్. రావు గారు, మునిసిపల్ అడ్మినిస్ట్రేటర్ శ్రీ ఎ.వి. సుబ్బారావు గారు, శ్రీ పి.ఎల్. అప్పారావు గారు తదితరులు సహాయ సహకారాలు అందించారు.

సమితికి శాశ్వత ఆర్థిక వనరులు కల్పించడానికి శ్రీ జంపాల శివయ్యగారి అధ్యక్షతన సమితి స్థలంలో షాపింగ్ కాంప్లెక్స్‌ను నిర్మించడం జరిగింది. ఈ నిర్మాణానికి కీ.శే. కూసుపాటి నారాయణ రెడ్డిగారి ధర్మపత్ని శ్రీమతి నాగలక్ష్మమ్మ ఆర్థిక సహాయం అందించడంచేత షాపింగ్ కాంప్లెక్సుకు "కూసుపాటి నారాయణ రెడ్డి గారి షాపింగ్ కాంప్లెక్స్" అని పేరు పెట్టారు. సమితి ప్రాంగణంలో ప్రహరీగోడ లోపలివైపున పచ్చగా, చల్లగా, ఆకర్షణీయంగా ఉండడానికి అశోక మొక్కలను నాటించి, నీటి సౌకర్యార్థం మునిసిపల్ చైర్మన్ శ్రీ కూసుపాటి నాగిరెడ్డి గారు ఉదార స్వభావంతో రెండు మంచినీటి కుళాయిలను సమితి ప్రాంగణంలో అమర్చారు.

షాపింగ్ కాంప్లెక్సుకు వెనుక భాగంలోవున్న సమితి ఖాళీ స్థలంలో కీ.శే. జానకి సందప్ప గారి సోదరుడు శ్రీ పుల్లప్ప గారు అందజేసిన ఆర్థిక సహాయంతో "నృత్యకళామందిరం" నిర్మించి, దానికి "శ్రీ జానకి సందప్ప లలిత కళాసమితి నృత్యకళామందిరం" అని నామకరణం చేశారు.

సమితి రంగ స్థలానికి ఇరుప్రక్కలవున్న ఖాళీ స్థలంలో ఒక రూము సమితి ఖర్చుతో నిర్మించి, దానికి "శ్రీ జంపాల శివయ్య లలిత కళాసమితి కార్యలయ భవనము" అని పేరుపెట్టారు. రెండవ రూమును శ్రీ టి.జి. వెంకటేష్ గారి ఆర్థిక సహాయంతో నిర్మించి, వారి అనుమతితో ఆ గదికి "శ్రీ కోడూరు వెంకట రెడ్డి లలిత కళాసమితి పాలకవర్గ కార్యాలయ భవనము" అని పేరు పెట్టారు.

కర్నూలు లలిత కళాసమితి ఆర్థికాభివృద్ధికొరకు అవిరళ కృషి చేసినవారిలో సర్వశ్రీ "డా॥ కె.వి. చలపతి రావుగారు, ఎ.సుబ్బారావుగారు, కోడూరు వెంకటరెడ్డిగారు, జంపాల శివయ్యగారు, మాదినేని పాపారావుగారు, యన్.దొరస్వామిరెడ్డి గారు, బి.రఘురాముడుగారు, ఐ.లింగన్నగారు, జి. రామసుబ్బయ్యగారు, బి.పుల్లన్నగారు, బి.లంబోదరంగారు" ముఖ్యులు.

శాశ్వత సభ్యులు, కళాకారులు, శాశ్వత సమితిపోషకులు, కళాభిమానుల ఆర్థిక సహాయ సహకారాలతో దినదిన ప్రవర్థమానమై, దాదాపు ఆరులక్షలు విలువచేసే నికర స్థిరాస్తులతో, అన్ని వసతులతో అలరారే ఈ లలిత కళాసమితి కర్నూలు పట్టణానికే యెంతో శోభాయమానంగా ఒప్పుచున్నది.

ఈ సమితి ఆర్థికాభివృద్ధి కొరకు "(1) బొబ్బిలి యుద్ధం, (2) చింతామణి (3) కురుక్షేత్రం (4) శ్రీకృష్ణరాయబారము (5) యమాంజనేయ యుద్ధం(6) శ్రీ రామాంజనేయ యుద్ధం(7) శ్రీకృష్ణాభిమన్యు" మొదలగు పౌరాణిక నాటకాలను కిరాయి నాటకాలుగా పదర్శించి, సుమారు 80వేల రూపాయలు సేకరించి, సమితికి ఆర్థికబలాన్ని చేకూర్చడం జరిగింది.

కర్నూలు లలిత కళాసమితి ఈనాడింత శోభాయమానంగా వెలుగొందుతూ, దినదినాభివృద్ధి చెందడానికి దక్షులైన పాలకులు, కళారాధకులు, సహృదయులైన కర్నూలు పౌరులని చెప్పక తప్పదు. ప్రస్తుతం సమితికి అధక్షులుగావున్న శ్రీ జంపాల శివయ్యగారు, కార్యదర్శిగావున్న శ్రీ బి.పుల్లన్నగారు, దర్శకరత్న శ్రీ మాదినేని పాపారావుగారు సమితి కార్యక్రమాలలో పాల్గొని, నిరంతరం కృషి చేస్తున్నారు. నాటక కళామతల్లి సేవలో వీరి జీవితం పునీతం కాగలదు.

ఈ సమాజంలో మొదట అతి తక్కువమంది సభ్యులుండేవారు. 1970లో లలిత కళాసమితి రిజిస్టరు చేయబడింది. ఈ సమాజ వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ కె.వి. చలపతిరావు, ప్రథమ కార్యదర్శి శ్రీ కె. వెంకటరెడ్డి సభ్యులుగా "శ్రీ యం.పాపారావు, శ్రీ యన్.అంకమరావు,

శ్రీ జంపాల శివయ్య, శ్రీ కె.తిరుపతిరావు, శ్రీ పి.లక్ష్మీనారాయణ రెడ్డి, శ్రీ యం.ఎ.అజీమ్‌ఖాన్, శ్రీ జాన్‌శామ్యూల్, శ్రీ బషీర్ అహ్మద్" మొదలగువారు వుండేవారు. సమాజం యొక్క కార్యక్రమాలు జరుపుకొనుటకు ప్రథమంలో శ్రీ సయ్యద్ అహ్మద్‌గారు తన యింటిని యిచ్చి నాటక సమాజాభివృద్ధికి తోడ్పడినారు.

లలిత కళాసమితి దినదిన ప్రవర్ధమానమై 164మంది సభ్యులుగల బృహత్తర నాటక సమాజంగా ఈనాడు నిలబడడానికి కారకులైనవారు శ్రీ కె.వి.చలపతిరావుగారు. వీరి అవిరళకృషి, జిల్లాకలెక్టర్లు శ్రీ డి. అరోరా, ఐ.ఏ.ఎస్.గారు, శ్రీ టి.యన్.ఆర్.రావు, ఐ.ఏ.ఎస్ గార్ల సహాయ సహకారాలు, దాతల సుహృద్భావం, సభ్యుల తోడ్పాటు "లలిత కళాసమితి" అన్నిహంగులతో ఒక కళాభవనాన్ని సొంతంగా నిర్మించుకొనే అవకాశం కల్పించాయి.

"లలిత కళాసమితి" ఈనాడింత ఉన్నతస్థితికి రావడానికి కారకులు అప్పటి సమితి అధ్యక్షులు డాక్టరు కె.వి. చలపతిరావుగారు. వీరి నిరంతర, నిర్విరామకృషి ఫలితంగా ఎందరో కళాకారులు, కళాభిమానులు సమితి సభ్యులై పౌరాణిక, చారిత్రాత్మక, సాంఘిక నాటకాలను ప్రదర్శించి, నిధిని ప్రోగుచేసి, కళాభవన నిర్మాణం నిర్విఘ్నంగా పూర్తి చేశారు. ఆ కారణంగా లలిత కళాసమితి కళాభవనానికి "డా. కె.వి.చలపతిరావుగారి మినీథియేటర్" అని నామకరణం చేయడం జరిగింది. లలిత కళాసమితిలోగల 164 మంది సభ్యులలో 54 మంది సాధారణ సభ్యులు, 110 మంది శాశ్వత సభ్యులు.

లలిత కళాసమితి సభ్యులు మొదటినుండి అనేక పరిషత్తులలో పాల్గొని, పెక్కు నాటక, నాటికలకు ఉత్తమ, ద్వితీయ బహుమతులను సంపాదించినారు. లలిత కళాసమితివారు ఔత్సాహిక కళాకారులను సన్మానించినారు. అనేక నాటక ప్రదర్శనలిచ్చి, వసూలైన సొమ్మును "నేషనల్ డిఫెన్స్ ఫండ్" (దేశరక్షణ నిధి)కి, వరద బాధితుల నిధికి విరాళంగా పంపినారు.

లలిత కళాసమితి ఆవిర్భవించి ఒక్క దశాబ్దం దాటింది. 9వ వార్షికోత్సవ సందర్భంగా సమితివారు ఏకపాత్రాభినయ, బహుపాత్రాభినయ, నాటక, నాటికల పోటీలు స్థానికంగా నిర్వహించి, విజేతలకు బహుమతి ప్రదానం చేయడం జరిగింది. 10వ వార్షికోత్సవ సందర్భంగా రాయలసీమ ప్రాంతీయస్థాయి నాటక, నాటికల పోటీలను లలిత కళాసమితి సి.క్యాంపు, కర్నూలు వారు, మరియు తెలుగు విశ్వవిద్యాలయంవారు సంయుక్తంగా నిర్వహించారు. 1987 సెప్టెంబరు 11, 12, 13 తేదీలలో నిర్వహింపబడిన నాటక, నాటిక పోటీలలో 6 సాంఘిక నాటకాలు, 5 సాంఘిక నాటికలు ప్రదర్శింపబడ్డాయి.

ప్రదర్శించిన నాటకాలు :

1. "పంచమవేదం" – "రవాణా కళానిలయం – అనంతపురం.
2. "అనగా అనగా ఒకరాజు" – సి.సి.ఐ. కళాసమితి – ఎఱ్ఱగుంట్ల.
3. "మడి–మైల" – రవీంద్ర కళాసమితి – కర్నూలు.
4. "కృష్ణపక్షము" – కోరమండల్ కల్చరల్ అసోసియేషన్ – చిలమకూరు.
5. "ఈ ప్రశ్నకు బదులేది"? – పద్మశ్రీ నాట్యకళామండలి – తిరుపతి
6. "తపస్సు" – సి.సి.ఐ. కళాసమితి – ఎఱ్ఱగుంట్ల.

నాటికలు :

1. "పోస్టుమార్టం" – కళాభారతి – ప్రొద్దుటూరు.
2. "ఈ తీర్పుకు బదులేది"? – నటరాజ కళాసమితి – కర్నూలు
3. "మృగరాజ్యం" – పద్మశ్రీ నాట్యకళామండలి – తిరుపతి
4. "డెవిల్సువర్కుషాపు" – కోహినూరు క్రియేషన్స్ – చిత్తూరు
5. "ఎవ్వనిచే జనించు" – సృజన కళాసమితి – కర్నూలు

ఈ సందర్భంగా "సావనీర్" విడుదలచేయడం జరిగింది.

లలిత కళాసమితి ప్రస్తుత కార్యవర్గ సభ్యులు :

1. గౌరవాధ్యక్షులు : శ్రీ కె.వెంకటరెడ్డి, బి.ఎ.

2. అధ్యక్షులు : శ్రీ జంపాల శివయ్య

3. కార్యదర్శి : శ్రీ జి.పుల్లన్న, బి.ఎ.

4. కోశాధికారి : శ్రీ మాదినేని పాపారావు

సభ్యులు :

శ్రీ పి.ఆదినారాయణ, డా॥ కె.వి.చలపతిరావు, డా॥ పి.వి.ఆర్. భాస్కర రావు, శ్రీ బి.డి.సత్యానందం, శ్రీ సి.రామిరెడ్డి, శ్రీ వై.జాషువా, శ్రీ భీమరాజు, శ్రీ సయ్యద్ అహ్మద్, శ్రీ గోపాలకృష్ణ, శ్రీ శంకరనాయర్, శ్రీ ఏ.వై. సుబ్బారావు, శ్రీ డి. సుమిత్రపాల్, డా॥ శ్యామసుందర్, శ్రీ పి. శ్రీనివాసులునాయుడు, శ్రీ ఎన్. హనుమంతరావు, శ్రీ ఐ.లింగన్న, శ్రీ కె.రామశర్మ, శ్రీ బి.గోవిందప్ప, శ్రీ ఓ. డేనియల్, శ్రీ పి.ప్రభాకర్, శ్రీ కె.తిరుపతిరావు, శ్రీ ఎన్. అంకమరావు, శ్రీ పి.లక్ష్మీనారాయణరెడ్డి, శ్రీ యం.ఎ.అజీమ్‌ఖాన్, శ్రీ జె. సుబ్బారావు, శ్రీ జె.నారాయణరావు, శ్రీ పి.విద్యావతి, శ్రీ యం.పాపారావు, శ్రీ సి.వి.రామస్వామి, శ్రీ బి.రామసుబ్బరాయుడు, శ్రీ జి.రామసుబ్బయ్య, శ్రీ జాన్‌శామ్యూల్, శ్రీ బషీర్ అహ్మద్, శ్రీ ఎస్.రాచయ్య, శ్రీ మజీద్మయ్య, శ్రీ జి.వి.కృష్ణమూర్తి, శ్రీ ఎన్.ఎల్.మనోహరపిళ్ళై, శ్రీ సయ్యద్‌వాలిపీర్," మొదలగువారు సభ్యులుగా వుండి వారి అమూల్యమైన సలహాలను, సహాయ సహకారాలను అందిస్తూ, సమాజపురోభివృద్ధికి తోడ్పడుతున్నారు. దాతలు ప్రముఖ పారిశ్రామిక వేత్త శ్రీ టి.జి.వెంకటేశ్వర్లు, శ్రీమతి కూసుపాటి నాగలక్ష్మమ్మ.

అభిప్రాయం : ఈ గ్రంథరచయిత డా॥ పి.వి.సీతారామయ్య, ఎం.ఎ., బి.ఇడి., పి.హెచ్.డి., గారు విషయసేకరణ సందర్భంగా కర్నూలు వాస్తవ్యులైన కొందరు కళాపోషకులు, కళారాధకులు, కళాకారులను సందర్శించడం జరిగింది. అట్టివారిలో " శ్రీ జంపాల శివయ్య, అధ్యక్షులు, లలిత కళాసమితి, కర్నూలు, సవేరాఆర్ట్స్ నాటక సమాజ (కడప) దర్శకులు, నటులు, బనగానపల్లి మండలం, నందవరం గ్రామం, కర్నూలుజిల్లా, ముఖ్యులు. శ్రీ జి.శివనాగిరెడ్డి తమ అభిప్రాయాన్ని క్రింది విధంగా వ్యక్తంచేశారు. "పౌరాణిక నాటకాలు చాల ఖరీదైనవి. ఒక పౌరాణిక నాటకాన్ని ప్రదర్శించాలంటే కళాకారుడు యెన్నో వ్యయ ప్రయాసలకు గురిఅవుతాడు. ప్రేక్షకుడు నాటకాన్ని చూచి ఆనందిస్తాడు, అభినందిస్తాడేతప్ప, కళాకారుని ఆర్థికపరమైన స్థితిగతులను గూర్చి ఆలోచించడు. కళాకారుడు మాత్రం ఆర్థికంగా కృంగిపోతున్నాడు. దీనిని దృష్టిలో పెట్టుకొని "తిరుమల తిరుపతి దేవస్థానంవారు" ప్రతి సంవత్సరం, నియమితకాలంలో "పౌరాణిక, చారిత్రాత్మక" నాటకాలకు మాత్రమే ఒకపరిషత్తును నిర్వహించి, నాటక సమాజాలకయ్యే ఖర్చును దేవస్థానంవారు భరిస్తే బాగుంటుంది. "పౌరాణిక, చారిత్రాత్మక"నాటకాలకు మాత్రమే ఒక పరిషత్తును నిర్వహించి, నాటక సమాజాలకయ్యే ఖర్చులను దేవస్థానంవారు భరిస్తే బాగుంటుంది. పౌరాణిక, చారిత్రాత్మక నాటకాలు హిందూసంస్కృతి, నాగరికతలకు ప్రతిబింబాలుగా వున్నందున హిందూధర్మరక్షణ సంస్థ ప్రచారకార్యక్రమంలో భాగంగాను, మరుగునపడిపోతున్న పౌరాణిక నాటక కళోద్ధరణ చేసినట్లుగాను ఉభయ తారకమవుతుందని" వారు అభిప్రాయపడ్డారు. ఇది వారి అభిప్రాయమే అయినా ఆలోచిస్తే మంచి సలహాకూడ అనిపిస్తుంది.

విద్యాప్రదాత, కళాపోషకుడు, కలియుగ వైకుంఠవాసుడు అయిన "శ్రీ వేంకటేశ్వరస్వామి"కి "పౌరాణిక నాటక పరిషత్తు" జరిపించడం, నాటక సమాజాలకు ఇతోధిక ఆర్థికసహాయంచేసి, వారిని ప్రోత్సహించడం ఒక సమస్యకాదు. ఎన్నో ఉన్నత పాఠశాలలు, కళాశాలలతో బాటు సంగీత నృత్యకళాశాల, శిల్పపాఠశాల తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆధ్వర్యంలో నడుస్తున్నవి. చివరకు మంగళ వాద్యకళలైన డోలు, నాదస్వరములకుగూడ కళాశాలస్థాయిని కల్పించి, తిరుమల తిరుపతి దేవస్థానం సంగీత నృత్యకళాశాలకు అనుబంధం చేయడం జరిగింది.

లలితకళలలో ఒకటైన "చిత్రలేఖ" నానికి దేవస్థానంవారు తగిన ప్రోత్సాహ మివ్వలేదనిపిస్తుంది. చిత్రలేఖనాన్నికూడా ఒక కళగా గుర్తించి, వారి సంగీత నృత్యకళాశాలలో ప్రవేశపెట్టి, కళాశాలస్థాయిని కల్పించి, ఔత్సాహికులైన చిత్రకారులను తయారుచేసే బాధ్యతను దేవస్థానంవారు స్వీకరిస్తే బాగుంటుందన్న అభిప్రాయం వ్యక్తమైంది.

సకలకళాపోషకుడైన శ్రీ కలియుగ వైకుంఠవాసుని అనుగ్రహంతో "హిందూ ధర్మరక్షణ సంస్థ" (H.D.R.S) అధికారి, తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారి, బోర్డు చేర్మన్, సభ్యులు సమాలోచనచేసి, తగు నిర్ణయం తీసుకుంటే అఖిలభారత స్థాయిలో

### రవీంద్ర ఆర్ట్స్ :

1974లో "రవీంద్ర ఆర్ట్స్" అను నాటక సమాజం స్థాపింపబడింది. దీనికి వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ వేముల కృష్ణమూర్తిగౌడుగారు. ప్రస్తుతం శ్రీ ఇ.సి.సాయినాథ్ గారు అధ్యక్షులుగా వున్నారు. ఈ సమాజం స్థాపించిన తరువాత ఒక్కసారి మాత్రం రాయలసీమ స్థాయిలో నాటక,నాటిక; ఏకపాత్రాభినయ పోటీలు నిర్వహించడం జరిగింది.

ఈ సమాజంవారు "మడి-మైల", దేవుడూ నీకు·దిక్కెవరు? బొబ్బిలియుద్ధం'. మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

### నటరాజ కళాసమితి :

కర్నూలు పట్టణంలో లలిత కళాసమితిని స్థాపించి, నాటక కళపై పురప్రజలు కొంత అభిరుచి, ఆదరణ చూపేటప్పటికి, మరికొన్ని నాటక సమాజాలు ఆవిర్భవించాయి. అటువంటి వాటిలో "నటరాజ కళాసమితి" ఒకటి. ఈ సమాజంలో సర్వశ్రీ డి.సుబ్బారెడ్డి, బి.డి.పాల్, జి.కె.సుభాష్చంద్రబోసు, వి. బలరామ్, యస్.లక్ష్మీనారాయణ, జి.ప్రభాకర్, మాస్టర్‌గోపాల్, శ్రీమతి రమాశ్యాంకుమార్ మొదలగువారు సభ్యులు. వీరు "ఈ తీర్పుకు బదులేది?, పునర్జన్మ, యువతరం, తులసి తీర్థం" మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

### పరమహంస నృత్యనికేతన్ :

1985లో "పరమహంస నృత్యనికేతన్" అను నాటక సమాజం స్థాపింపబడింది. ఈ సమాజవ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ కె.సి.శివారెడ్డి. కార్యదర్శి ప్రముఖ రంగస్థల నటులు శ్రీ లంకాపిచ్చయ్యశాస్త్రి. శ్రీ బుజ్జాసుబ్రహ్మణ్యంగారి ఆధ్వర్యంలో ఈ సమాజం వారు "సత్యహరిశ్చంద్ర, చింతామణి, శ్రీకృష్ణ తులాభారం" మొదలగు నాటకాలను సుమారు 80సార్లు ప్రదర్శించారు.

శ్రీ బి.సి. కృష్ణ, శ్రీ రామకృష్ణారెడ్డి, శ్రీ శేషరెడ్డి, శ్రీ నాగమోహనగౌడ'మొదలగు సుప్రసిద్ధ రంగస్థలనటులు ఈ సమాజంలో సభ్యులుగా వుంటున్నారు.

### చైతన్యనాట్యమండలి :

స్థాపన 1986లో ఈ సమాజ వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ జాన్సన్. కార్యదర్శి శ్రీ బాలరాజు. ఇది క్రైస్తవమత సంబంధి. మొట్టమొదటిసారిగా రాయలసీమలో క్రైస్తవ పౌరాణిక నాటకాన్ని పద్యగద్యాత్మకంగా ప్రదర్శించిన ఘనత చైతన్యనాట్యమండలికే దక్కుతుంది. వీరు "రక్తతర్పణం" అను క్రైస్తవ పౌరాణిక నాటకాన్ని పలు పర్యాయాలు ప్రదర్శించారు.

### రసమాధురి కళానికేతన్ :

శ్రీ పత్తి ఓబులయ్య యం.ఏ.గారు వ్యవస్థాపక అధ్యక్షులుగా 1989లో "రసమాధురి కళానికేతన్" అను నాటక సమాజం స్థాపింపబడింది. కార్యదర్శి "శ్రీ యం.రామలింగమూర్తి, శ్రీ ఉమామహేశ్వరరావు, శ్రీ పి.దస్తగిరి, శ్రీ సుభాష్చంద్రబోసు, శ్రీ వై.నారాయణ నాయుడు, శ్రీ వెల్దుర్తి వెంకటనరుసు నాయుడు" సమాజ సభ్యులుగా వున్నారు. వీరు "సీతారామకళ్యాణం" అను పౌరాణిక నాటకాన్ని ఇప్పటికి 8సార్లు ప్రదర్శించారు.

ఈ సమాజంవారు కళాకారులను సన్మానించడంలో ఒక నూతన పంథాను అనుసరించారు 1989లో' నవరత్నాలు'అను పేర తొమ్మిది కళలలో నిష్ణాతులైన కళాకారులను పిలిపించి, వారికి సన్మానంచేశారు.

### శ్రీ పత్తి ఓబులయ్య :

వీరు "రసమాధురి కళానికేతన్" నాటక సమాజ వ్యవస్థాపకులు. మంచినటులు: యమాంజనేయ యుద్ధంలో "బభ్రువాహన" "శ్రీకృష్ణరాయబారం"లో అర్జునుడు, కర్ణుడు మొదలగు పాత్రలను పోషించారు. శ్రీ ఓబులయ్యగారు "కర్నూలు లలిత కళాసమితి" కార్యదర్శిగాను, కోశాధికారిగాను పనిచేశారు. వీరు కవులు. "నెమలిగుండ్ల రంగనాయక స్వామి" అను కావ్యాన్ని "తెలుగుభోజుడు" అను పేర శ్రీ నందమూరి తారక రామారావుగారి చరిత్రను, ఏసు·శతకమును రచించారు. ప్రస్తుతం వీరు సెయింట్ మేరీస్ జూనియర్ కళాశాలలో తెలుగు విభాగమందు జూనియర్ లెక్చరర్‌గా పనిచేయుచున్నారు. నాటక కళపై ఉత్సాహమున్న యువకులు.

**శ్రీ పి.దస్తగిరి :**

వీరు పౌరాణిక నాటకాలలో "దశరథుడు, హరిశ్చంద్రుడు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు" మొదలగు పాత్రలను పోషించి, మంచి నటులుగా గుర్తింపబడ్డారు. నాటక కళపై అభిరుచిగల యువనటులు. ప్రస్తుతం సెయింట్ మేరీస్ జూనియర్ కళాశాల, కర్నూలులో జూనియర్ లెక్చరర్‌గా పనిచేస్తున్నారు.

**శ్రీ వై. నారాయణ నాయుడు :**

వీరు 30 సంవత్సరాలు నాటకకళకు సేవచేసిన మేటినటులు.

**రవీంద్ర కళాసమితి :**

1987 లో కర్నూలు పట్టణంలో వెలసిన మరియొక నాటక సమాజం "రవీంద్ర కళాసమితి". ఈ సమాజంవారు 1987 సెప్టెంబరు 11, 12, 13 తేదీలలో లలిత కళాసమితి సి.క్యాంపు కర్నూలు, మరియు తెలుగు విశ్వవిద్యాలయము సంయుక్తంగా నిర్వహించిన రాయలసీమ ప్రాంత నాటక, నాటికల పోటీలలో "మడి-మైల" అను నాటకాన్ని ప్రదర్శించి, పురప్రజల మన్నన లందుకున్నారు.

**సృజన కళాసమితి :**

ఔత్సాహిక యువనటులు కొందరుచేరి నాటకకళకు సేవచేయాలన్న కోరికతోను, సృజనాత్మక దృష్టితోను "సృజన కళాసమితి" ని స్థాపించడం జరిగింది.వీరు లలిత కళాసమితి, సి.క్యాంపు కర్నూలు, వారు, తెలుగు విశ్వవిద్యాలయమువారు సంయుక్తంగా నిర్వహించిన రాయలసీమ ప్రాంత స్థాయి నాటక, నాటికల పోటీలలో "ఎవ్వని చే జనించు" అను నాటికను ప్రదర్శించి, ప్రేక్షకుల మెప్పును పొందగలిగారు.

కళాకడలిలో నాటక సమాజాలనబడే కెరటాలు యెన్నో ఆవిర్భవించి మాయమైనట్లే, కర్నూలు పట్టణంలో ఇంకా యెన్నో నాటక సమాజాలు ఆవిర్భవించి మాయమయ్యాయి. ఇవి చరిత్రకు నోచుకోని అల్పాయుష్కనాటక సమాజాలని చెప్పక తప్పదు.

**ఆంధ్రకళాభారతి :**

దేశవిదేశాలలో ఘనకీర్తి నార్జించిన సురభి నాటక సమాజం విడిపోయి, విశాలాంధ్ర దేశంలో వివిధపేర్లతో వృత్తినాటక సమాజాలుగా విస్తరించాయి. అవిభాజ్య హైందవ కుటుంబాలలోని అన్నదమ్ములు విడిపోయేటప్పుడు తాత, తండ్రులు సంపాదించిన ఆస్తులను పంచుకుంటారు. కాని సురభివారు విడిపోతూ నాటకకళను పంచుకున్నారు. శతాబ్దానికి పైగా చరిత్రగల సురభి వంశంవారు కొందరు కర్నూలు జిల్లా, నంద్యాల పట్టణంలో స్థిరపడ్డారు. ఆ విధంగా స్థిరపడినవారిలో ఆర్. భద్రి నారాయణ రావు కుటుంబం ఒకటి. కాలక్రమాన వీరు నంద్యాలను వదలి కర్నూలు పట్టణానికి వచ్చి స్థిరపడ్డారు. కులవృత్తి నాటక కళ అవడంచేత వీరు "ఆంధ్రకళాభారతి" అను నాటక సమాజాన్ని 1965 ప్రాంతంలో స్థాపించి, పౌరాణిక, జానపద నాటకాలను ప్రదర్శిస్తూ, ఇటు భుక్తితో పాటు, అటు కళాసేవ చేస్తున్నారు."ఆంధ్రకళాభారతి" శ్రీ భద్రి నారాయణరావు గారి ఆధ్వర్యంలో స్థాపింపబడింది. ఈ సమాజానికి శ్రీ భద్రి నారాయణరావుగారే అధ్యక్షులు. వీరి అల్లుడు శ్రీ ఎ.నాగరాజు గారు కార్యదర్శిగాను, కుమార్తె శ్రీమతి రజనీ బాయిగారు కోశాధికారిగాను వున్నారు. ఈ సమాజంలో శ్రీ భద్రి నారాయణరావుగారి కుటుంబీకులు, అతని నాశ్రయించివున్న బంధుమిత్రులు సభ్యులుగా వున్నారు.

"ఆంధ్రకళాభారతి" నాటక సమాజం పతాకం క్రింద వీరు "చింతామణి, హరిశ్చంద్ర, శ్రీకృష్ణతులాభారం, బాలనాగమ్మ, లవకుశ, పాండవోద్యోగ విజయాలు" మొదలగు నాటకాలను ప్రదర్శించారు. శ్రీ భద్రి నారాయణరావుగారి కుమార్తె శ్రీమతి రజనీ బాయిగారు ఆంధ్రప్రదేశ్ లో ప్రఖ్యాత రంగస్థలనటులు ."శ్రీ పీసపాటి నరసింహమూర్తి, శ్రీ ఎ.వి.సుబ్బారావు, శ్రీ షణ్ముఖి ఆంజనేయులు, శ్రీ ఎ.వెంకటేశ్వర రావు, శ్రీ వై.వేణుగోపాలరావు, శ్రీ పి.లక్ష్మణరావు, శ్రీ జి.జైరాజ్, శ్రీ డి. వెంకటనర్సు నాయుడు, శ్రీ యం. అల్లాబక్ష్, శ్రీ లంకాపిచ్చయ్య శాస్త్రి" మొదలగువారితో నటించి, ఆంధ్రదేశంలోని నలుగురు ఈనాటి రంగస్థల నటీమణులలో ఒకరుగా కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించుకున్నారు

ఈనాటిఆంధ్రకళాభారతి ఒకనాటి సురభి నాటకాల మహర్దశకు తీపిగుర్తుగా, రాయలసీమలో పౌరాణిక నాటకాలను ప్రదర్శిస్తూ, తనవంతు కళాసేవ చేస్తున్నది.

## లింగాలపల్లి

కర్నూలు జిల్లా, ఆత్మకూరు తాలూకా "లింగాలపల్లి" అను గ్రామంలో "శ్రీ రామాంజనేయ నాటక సమాజం" అను నాటక సంస్థ 1922లో స్థాపింపబడింది. వ్యవస్థాపక అధ్యక్షులు శ్రీ బత్తిని వేంకట రంగయ్యగారు. ఈ సమాజానికి సర్వమూ ఈయనే ఐ సారధ్యం వహించి, దక్షిణాంధ్రదేశంలో అఖండ పేరుప్రఖ్యాతులార్జించారు.

ఈ సమాజంలో సర్వశ్రీ "కడియాల రత్తయ్య, చీరాల బాలకృష్ణమూర్తి, లింగందిన్నె రామయ్య, టి. చిన్నపిచ్చయ్య, టి.చిన్నవెంకటాద్రి, జి.రామకోటి, అరికెపూడి పెరుమాళ్ళు చౌదరి, పి. మల్లికార్జునరావు, పెయింటరు కృష్ణమూర్తి" మొదలగు మహానటులు సభ్యులుగా వుండేవారు. వీరందరూ స్త్రీ, పురుష పాత్రలను బహుచక్కగా పోషించేవారు.

వీరు "శ్రీకృష్ణలీలలు, సతీసావిత్రి, శ్రీకృష్ణ రాయబారము, చింతామణి, భక్తప్రహ్లాద" మొదలగు నాటకాలను విరివిగా ప్రదర్శించారు. 1922 నుండి 1940 వరకు సుమారు 2 దశాబ్దాలపాటు కళాసేవచేసిన ఈ సమాజం నే డంతరించి పోయింది. ఆర్థికంగా చితికిపోయింది. అందుకే ఈ సమాజ స్థాపకులు నేడు హరిదాసులుగా జీవితాన్ని వెళ్ళదీస్తున్నారు.

## నంద్యాల

కళాసౌరభాలతో కళకళలాడింది సంద్యాల పట్టణం ఒకనాడు. సురభివాళ్ళతో సమానంగా నంద్యాలలో నాటక డ్రస్సు కంపెనీ లుండేవంటే ఆనాడు నాటకకళ యెంత ఉచ్ఛదశలో వుండేదో, యెన్ని నాటకసమాజాలు కళామతల్లి సేవచేశాయో సులభగ్రాహ్యం.

1890 ప్రాంతంలోనే నంద్యాలలో నాటక సమాజాలుండినట్లు తెలుస్తుంది. కళావంతుల కులానికి చెందిన "జ్యోతి సుబ్బయ్య కంపెని" అను ప్రసిద్ధి చెందిన సంచార నాటక సమాజం ఒకటి వుండేది. ఆ కాలంలోనే ఈ సమాజంవారు ప్రదర్శించే నాటకాలలో స్త్రీ పాత్రలను స్త్రీలే ధరించేవారట. శ్రీ బళ్ళారి రాఘవకు పూర్వమే నాటక ప్రదర్శనలో స్త్రీ పాత్రలకు స్త్రీలను నిర్ణయించి, వారిచేత తన సంచార నాటక సమాజం ద్వారా రంగస్థలంమీద ప్రదర్శింపజేసిన ఘనత "జ్యోతిసుబ్బయ్య కంపెనీ " కే దక్కుతుంది. ఈ సమాజంలో సురభి గోవిందప్ప మొదలగు నటులు నటించారు. "జ్యోతిసుబ్బయ్య కంపెని" వారు కిరాయి నాటకాలు ప్రదర్శిస్తూండేవారు. ఆ తరువాత నంద్యాలలో పెక్కు ఔత్సాహిక నాటక సమాజాలు ఆవిర్భవించి, నాటక కళకు ఇతోధికమైన సేవచేసినట్లు తెలుస్తుంది.

### బర్డ్ రీడింగ్‌రూమ్ :

1926లో ఆనాటి యువకులందరు కలిసి "బర్డ్ రీడింగ్‌రూమ్" అను సమాజాన్ని నంద్యాలలో స్థాపించారు. మొదట్లో ఈ సమాజం సాహిత్య కార్యక్రమాలను మాత్రమే నిర్వహిస్తూవుండేది. 1966లో సాంస్కృతిక కార్యక్రమాలను ప్రారంభించి, ఈ నాటికీ నిర్వహిస్తూవుంది.

ప్రస్తుతం "బర్డ్ రీడింగ్‌రూమ్" నాటక విభాగానికి శ్రీ పి.జె.ఇక్బన్‌గారు కార్యదర్శిగా వుంటున్నారు. శ్రీ బి. భగవాన్, శ్రీ ఎల్.ఎడ్విన్, శ్రీ ఎన్.మార్టిన్, శ్రీ ఎన్.ఆర్థర్ ముఖ్యసభ్యులుగా నాటక సమాజ నిర్వహణను చూస్తున్నారు. వీరు "చేర్మన్, దొంగ వీరడు, లంకెలబిందెలు, ఒకరూపాయి, ఏక్‌దిన్కాసుల్తాన్, వెంకన్నకాపురం, ఇచ్చటపెళ్ళిళ్ళు చేయబడును, ఎఱ్ఱగులాబీలు, దిష్టిబొమ్మలు, బడిపంతులు" మొదలగు సాంఘిక నాటకాలను ప్రదర్శించారు. అనేక పరిషత్తులలో పాల్గొని, ఉత్తమ, ద్వితీయ బహుమతులను పొందినారు.

### మిత్రకళాసమితి :

1947వ సంవత్సరం శ్రీ ఐ.కృష్ణమూర్తిగారు, శ్రీ ఎస్.వి.శేషయ్యగారు వ్యవస్థాపక సభ్యులుగా "మిత్రకళాసమితి" అను నాటక సమాజం స్థాపింపబడింది. ఈ సమాజానికి శ్రీ వి.పి.చెంగల్రాయుడుగారు అధ్యక్షులుగాను, శ్రీ పువ్వాడ సత్యనారాయణగారు కార్యదర్శిగాను, శ్రీ వి.శేషయ్యగారు దర్శకులుగాను వ్యవహరించేవారు శ్రీ ఎస్.వి. చలపతి, శ్రీ బి.వెంకటసుబ్బయ్య, (ప్రధానోపాధ్యాయులు, రామకృష్ణ ప్రైమరీ విద్యాలయం, సంజీవనగర్, నంద్యాల.), శ్రీ యం.సి. బాలన్న, శ్రీ మృత్యుంజయుడు, శ్రీ మగదల రామచంద్రరావు, శ్రీ వి. శేషయ్య (స్థాపకులు), శ్రీ ఆర్.రామారావు, శ్రీ కె. వీరయ్యాచారి, శ్రీ ఎ. కృష్ణమూర్తి, శ్రీ బి. పుల్లన్న, శ్రీ జె, శ్రీనివాసమూర్తి, శ్రీ యం. యన్. మూర్తి మొదలగువారు సభ్యులుగాను, నటులుగాను వుండేవారు. శ్రీ మగదల రామచంద్రరావుగారు నాటక రచయిత, దర్శకులు, నటులు. ఈ సమాజంవారు "అమరత్యాగి, ప్రత్యూష, రాగరాగిణి, ఆత్మార్పణ, మహారాణా, ఆనాడు, సామ్రాట్ చంద్రగుప్త, పంజరంలో

శారద కళాసమితి :

శ్రీ ఐ. నాగసుబ్బారెడ్డిగారి ఆధ్వర్యంలో "శారద కళాసమితి" అను నాటక సమాజం నంద్యాలలో 1975వ సంవత్సరం స్థాపింపబడింది. శ్రీ నాగసుబ్బారెడ్డి గారు వృత్తిరీత్యా ఉపాధ్యాయులు. నాటక రచయిత, దర్శకులు, ఉత్సాహవంతులైన నటులు. శ్రీ వి.ఈశ్వరయ్య (వ్యవస్థాపకులలో ఒకరు) శ్రీ డి.సి.సత్యం, శ్రీ పి.హుస్సేన్ శెట్టి, శ్రీ బి. శేషేరావు, "శ్రీ ఎ.నారాయణ రెడ్డి"గారు రచించిన "ఆత్మార్పణం, ఆశాజ్యోతి" అను నాటకాలనేగాక "అల్లూరి సీతారామరాజు, ఇదేమిటి, సమర్పణ, బడిపంతులు, వానవెలిసింది, పరిష్కృతి, నేరము-శిక్ష, వెంకన్నకాపురము" మొదలగు నాటకాలను ప్రదర్శించి, ఉత్తమ ద్వితీయ బహుమతులు సంపాదించారు.

జ్యోతి కళామందిర్ ఫైన్‌ఆర్ట్స్ అసోసియేషన్ :

1975 ప్రాంతంలో శ్రీ యం.సి.మధుబాబుగారు వ్యవస్థాపక అధ్యక్షులుగా "జ్యోతికళామందిర్ ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్" అను నాటకసమాజం నంద్యాలలో స్థాపింపబడింది. శ్రీ ఎస్.జి.గంగా మహేశ్వరరావు గారు సమాజ కార్యదర్శిగా వ్యవహరిస్తున్నారు. శ్రీ ఎ.హనుమంతయ్య, శ్రీ ఎ.ఎరకలయ్య, శ్రీ యస్.వి.స్వామి, శ్రీ యం. సాయిబాబా, శ్రీ ఎస్.నరసింహులు మొదలగువారు సభ్యనటులుగా వున్నారు. వీరు "మినిష్టరు మల్లయ్య, మంచుబొమ్మలు, దేవుడా! నిద్రలే, పట్టాలు తప్పినబండి, రాముడు లేని రాజ్యం" మొదలగు నాటకాలను ప్రదర్శించారు. ఈ సమాజంవారు నేటికీ నాటకకళామతల్లికి ఇతోధికమైనసేవ చేస్తూనే వున్నారు.

నటరాజా నాట్యమండలి :

1979లో "నటరాజా నాట్యమండలి" నంద్యాలలో స్థాపింపబడింది. ఇది పౌరాణిక నాటక సమాజం. ఈ సమాజ వ్యవస్థాపకులు శ్రీ బి. వెంకటసుబ్బయ్యగారు. వీరు ఉపాధ్యాయులు. రామకృష్ణ ప్రైమరీ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగా సంజీవనగర్, నంద్యాలలో పనిచేస్తున్నారు. వీరు "నటరాజా నాట్యమండలి"కి అధ్యక్షులు. శ్రీ ఎ. శ్రీరంగం కార్యదర్శి. నూకల వెంకట సుబ్బయ్య, శ్రీ జి.ప్రకాశం, శ్రీ జి.వి.సుబ్బయ్య, శ్రీ సి.పి.వి.రెడ్డి, శ్రీ సి.శేషమరాజు, శ్రీ సుభాశ్చంద్రబోసు" మొదలగువారు సభ్యనటులు.

వీరు "కురుక్షేత్రం, గయోపాఖ్యానం, శ్రీ రామాంజనేయ యుద్ధం, శ్రీ కృష్ణతులాభారం, బాలనాగమ్మ, చింతామణి" మొదలగు పౌరాణిక నాటకాలను పలుప్రాంతాలలో అనేక పర్యాయాలు ప్రదర్శించి, రాయలసీమ నటరత్నాలకోవకు చెందినవారైరి.

శ్రీ బి. వెంకటసుబ్బయ్యగారు ఉత్సాహవంతులైన నటులు. శ్రావ్యమైన కంఠం. కమ్మగా పాడగలరు. వీరు "దుర్యోధనుడు, యయాతిరాజు, మాయలమరాఠి, చాకలితిప్పడు"మొదలగు పాత్రలను పోషించి, పలువురి మన్ననలకు పాత్రులైనారు. వీరు సాంఘిక నాటకలలో కూడ నటించారు. మృదుభాషి, సరళస్వభావులు, స్నేహశీలి. నటనలో మెలకువలు తెలిసినవ్యక్తి. ఇప్పుడుకూడ నాటకకళపైన వ్యామోహం తగ్గలేదు.

ఈ సమాజంలో మరియొక మంచినటులు శ్రీ ఎ. శ్రీరంగంగారు. వీరు "శ్రీ కృష్ణుడు, అర్జునుడు, అశ్వత్థామ, లక్ష్మణుడు, భవాని" మొదలగు పాత్రలను అద్భుతంగా పోషించారు. శ్రావ్యమైన కంఠం.

రైల్వే నాటక సమాజం :

1970లో రైల్వే నాటక సమాజం స్థాపింపబడింది. ఈ సమాజంలో అధికభాగం రైల్వే ఉద్యోగులే వుంటారు. శ్రీ గోపాలరావు, శ్రీ ప్రసాదరావు, శ్రీ లక్ష్మయ్య, శ్రీ సాంబశివరావు మొదలగువారు సభ్యులు, నటులు.

వీరు "గాలివాన, కీర్తిశేషులు, పంజరం పక్షులు, సుడిగుండాలు" మొదలగు నాటకాలను ప్రదర్శించారు.పెక్కు పరిషత్తులలో పాల్గొని, బహుమతులు సంపాదించారు.

సవేరా వృత్తి నాటక కళాకారుల సంఘం :

1988లో శ్రీ వి. శివనాగిరెడ్డిగారు వ్యవస్థాపక అధ్యక్షులుగా "సవేరా వృత్తి నాటక కళాకారుల సంఘం" స్థాపింపబడింది. ఈ సమాజంలో యెక్కువగా స్త్రీలు, వాద్యకళాకారులు వుంటారు. వివిధసమాజాలలో ఈ సమాజపు స్త్రీలు, వాద్య కళాకారులు కిరాయికి పాల్గొంటూ వుంటారు. ఈ సమాజంలోని స్త్రీ, పురుషులు కలిసి కిరాయి నాటకాలు ఆడుతూ వుంటారు. అప్పుడప్పుడు పరిషత్తులలో

పాల్గొంటూ వుంటారు. వీరు నాటకాలను బ్రతుకు తెరువుకు వృత్తిగా స్వీకరించినందువలన వీరి సమాజానికి 'వృత్తి నాటక కళాకారుల సంఘం' అనిపేరు వచ్చింది.

వీరు "చింతామణి, హరిశ్చంద్ర, గయోపాఖ్యానం, శ్రీకృష్ణరాయబారం, రామాంజనేయ యుద్ధం, అతిథి దేవుళ్ళొస్తున్నారు జాగ్రత్త, ప్రేమపూజారులు, పండగొచ్చింది, ప్రేమసంకెళ్ళు, ఎవ్వనిచే జనించు, ఇన్‌స్పెక్టర్ ప్రతాప్" మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

### నవనందినీ కళానికేతన్ :

శ్రీ మంచాలకట్టి శివశంకర్ రెడ్డిగారి ఆధ్వర్యంలో 1989లో "నవనందినీ కళానికేతన్" అను నాటక సమాజం స్థాపింపబడింది. ఈ సమాజంలో స్థిరమైన సభ్యులులేరు. శ్రీ శంకర రెడ్డిగారు అప్పటికప్పుడు ఔత్సాహికులైన యువకులనుచేరదీసి, వారికి నాటకం నేర్పించి, వారిచేత కిరాయి నాటకాలు ప్రదర్శింప జేయిస్తున్నారు. ఈ సమాజ వ్యవస్థాపకులు, దర్శకులు శ్రీ శంకరరెడ్డిగారే కాబట్టి అన్నీ ఆయనే నిర్వహిస్తున్నారు.

### శ్రీ సుబ్బరామిరెడ్డి కల్చరల్ అసోసియేషన్ :

1990వ సంవత్సర ప్రారంభంలో శ్రీ యం.సి. మధుబాబు వ్యవస్థాపకులుగా "శ్రీ సుబ్బరామిరెడ్డి కల్చరల్ అసోసియేషన్" స్థాపింపబడింది. ఈ సమాజానికి అధ్యక్షులు శ్రీ ఎ.వెంకటేశ్వరులు, కార్యదర్శి శ్రీ యం.సి.మధుబాబు. సభ్యులుగా, నటులుగా శ్రీ జి.యస్.ఆర్. ప్రసాదరావు, శ్రీ ఎ. హనుమంతరావు, శ్రీ యం.ఎరకలయ్య మొదలగువారున్నారు. మొదటిసారిగా వీరు "రథ చక్రాలు" అను నాటకాన్ని దిగ్విజయంగా ప్రదర్శించారు.

### శ్రీ సీతారామాంజనేయ నాట్యమండలి (సిమెంటు నగర్) :

నంద్యాలలో భాగంగా అతి సమీపంలోగల సిమెంటు నగర్‌లో ప్రైమరీ పాఠశాల ప్రధానోపాధ్యాయులుగా పనిచేయుచున్న శ్రీ సి. శేషమరాజు వ్యవస్థాపకులుగా "శ్రీ సీతారామాంజనేయ నాట్యమండలి" అను నాటక సమాజం ఆవిర్భవించింది. బుగ్గారెడ్డి, శ్రీ రామిరెడ్డి, శ్రీ జి.సోమసుందర ఆచారి, శ్రీ నరసింహాచారి, శ్రీ వెంకటరెడ్డి మొదలగువారు ఈ సమాజంలో సభ్యులు, నటులు: వీరు "కురుక్షేత్రం, రామాంజనేయ యుద్ధం, చింతామణి, బాలనాగమ్మ, గయోపాఖ్యానం" మొదలగు నాటకాలను (పౌరాణిక, జానపద) ప్రదర్శించారు.

శ్రీ సి. శేషమరాజుగారు గొప్పనటులు. వీరు "రాముడు, ధర్మరాజు, అంగదుడు, కార్యవర్థి, బిల్వమంగళుడు" మొదలగు పాత్రలను ధరించి, పలువురిచేత ప్రశంసింపబడ్డారు. ఈ సమాజం నేటికీ నాటక ప్రదర్శన లిస్తూవుంది.

ఇవిగాక "చైతన్య కళాసమితి, సర్వోదయ కళాసమితి, ప్రజానాట్యమండలి" అను నాటకసమాజాలు ఆవిర్భవించాయి. ప్రజానాట్యమండలి మానేపల్లిలో స్థాపింపబడింది. ఇది కమ్యూనిజం ప్రభావంగల నాటకసమాజం.

## కంబం

1957లో శ్రీ బి.వి.రాజయ్య, శ్రీ యన్.కామేశ్వరమ్ గార్ల ఆధ్వర్యంలో "భారత నాటక కళాసమితి" స్థాపింపబడింది. ఈ సమాజంవారు "దొంగవీరడు, లంకెలబిందెలు, వెంకన్నకాపురం" మొదలగు సాంఘిక నాటకాలను ప్రదర్శించారు.

## మార్కాపురం

మార్కాపురంలో 1943వ సంవత్సరం "ఆంధ్ర అమెచ్యూర్స్ అసోసియేషన్" అను నాటక సమాజం స్థాపింపబడింది. ఈ సమాజంలో శ్రీ అద్దంకి రాఘవరావు, శ్రీ యం. యన్.శాస్త్రి, శ్రీ యస్.వి.నరసింహం మొదలైనవారు ప్రముఖనటులు. వీరు "గయోపాఖ్యానం, రామాంజనేయ యుద్ధం, బాలనాగమ్మ, దొంగవీరడు" ఇత్యాది నాటకాలను ప్రదర్శించి, ప్రజల మెప్పును పొందినారు.

## గిద్దలూరు

శ్రీ జి.కామేశ్వరరావుగారి ఆధ్వర్యంలో "రాఘవ నాటక కళాసమితి". అను నాటక సమాజం స్థాపింపబడింది. ఈ సమాజంలో శ్రీ సుసర గోపాలశర్మ, శ్రీ వెంగయ్య, శ్రీ కన్నయ్య, శ్రీ నరసింహం, శ్రీ జి.కామేశ్వరరావు మొదలగువారు ప్రముఖ నటులు. వీరు

"పత్తికొండ" కర్నూలు జిల్లాలో తాలూకా కేంద్రం. 1955లో పత్తికొండలో "రాఘవ కళాసమితి" స్థాపింపబడింది. శ్రీ వెంకటేశ్వరరావు, శ్రీ యస్.షరీఫ్, శ్రీ వసం శంకర శర్మ మొదలగు ఔత్సాహికులైన నటులు "రంగూన్ రౌడి, దొంగవీరడు, లంకెలబిందెలు, ఏక్ దిన్ కాసుల్తాన్" మొదలగు నాటకాలను ప్రదర్శించారు.

## కోడుమూరు

కర్నూలు జిల్లాలో కోడుమూరు గ్రామం కళాకారులకు జన్మస్థలమని ప్రతీతి. శ్రీ కల్లూరు శేషయ్యగారు కోడుమూరులో "శ్రీ చెన్నకేశవ నాట్యమండలి"ని స్థాపించి నడపుతుండేవారు. ఇదిగాక "శ్రీ వేంకటేశ్వర నాటక సమాజం" కూడ నాటక ప్రదర్శన లిస్తుండేదని తెలుస్తోంది. ఈ సమాజంలో సుప్రసిద్ధ కళావతంసులైన శ్రీ సల్లంచి దుర్గారావుగారు, శ్రీ రామకోటి, శ్రీ అరికెపూడి పెరుమాళ్ళ చౌదరిగారు, బాలనటుడైన శ్రీ డి. వెంకట నర్సునాయుడు గారు నటించేవారు.

వీరు "శ్రీ కృష్ణలీలలు, భక్తప్రహ్లాద, సతీసావిత్రి, ఉద్యోగ విజయము, ఖిల్జీ రాజ్యపతనము" మొదలగు నాటకాలను ఆంధ్రదేశంలో అనేక ప్రాంతాలలో ప్రదర్శించి, ప్రేక్షకుల మన్నన అందుకున్నారు.

## ద్రోణాచలం

కర్నూలు జిల్లాలో ద్రోణాచలం ఒక రైల్వేకూడలిగా పేరుప్రఖ్యాతులున్న పట్టణం. కొన్ని దశాబ్దాలుగా నటులకు, కళాకారులకు నిలయమైనచోటు. రాయలసీమలో నాటకకళ రంగ రంగ వైభోగంగా వర్ధిల్లిన రోజులలో ద్రోణాచలంకూడ నాటకకళామతల్లికి రంగస్థలమైంది. అనేక నాటక సమాజాలు వెలిశాయి. నాటక, నాటిక, ఏకపాత్రాభినయ పోటీలు నిర్వహించే పరిషత్తులు ఆవిర్భవించాయి. రైల్వేవారు, తదితరులు పరిషత్తులు నిర్వహించారు. డ్రామాడ్రస్ కంపెనీలు తలెత్తాయి. ఇంతటి పేరు ప్రఖ్యాతులున్న నాటక సమాజాలలో "శ్రీ రాఘవ కళాసమితి" ఒకటి.

### శ్రీ రాఘవ కళాసమితి :

1987లో ద్రోణాచలం పట్టణమందు "శ్రీ రాఘవ కళాసమితి" అను నాటకసమాజం స్థాపింపబడింది. ఈ సమాజ వ్యవస్థాపకులు కళాహృదయులు, నటులు అయిన శ్రీ ఆర్. రామకృష్ణారెడ్డిగారు. ఈ సమాజంలో వ్యవస్థాపక అధ్యక్షులుగా శ్రీ ఆర్.రామకృష్ణారెడ్డిగారు, కార్యదర్శిగా శ్రీ కె.యస్.జార్జిగారు, కోశాధికారిగా శ్రీ ఎ.పెద్ద ఎల్లయ్యగారు, దర్శకులుగా శ్రీ బి.కేశవరెడ్డిగారు యెన్నుకోబడినారు.

శ్రీ రాఘవ కళాసమితిలో శ్రీ ఆర్.రామకృష్ణారెడ్డి (చిన్నపుల్కాపపురం, డోన్), శ్రీ ఎ. పెద్ద ఎల్లయ్యగారు (డోన్), శ్రీ డి. నారాయణ రెడ్డి (డోన్), శ్రీ యం.రామానాయుడు (డోన్), శ్రీ డి. కుళ్ళాయప్ప (కొచ్చెరువు), శ్రీ వి. వెంకట్రాముడు (కొచ్చెరువు) శ్రీ ఎ.చిన్న ఎల్లయ్య (డోన్), శ్రీ బి.నాగేంద్ర (డోన్), శ్రీ జి.ఆదిశేషులు (రహిమాపురం)మౌలాలి (రాంపల్లి), శ్రీ యం.రంగస్వామి (ఎద్దుపెంట), శ్రీ ఆర్. సోమిరెడ్డి (కర్ణకుంట), శ్రీ పి.వెంకటేశ్వర్లు (డోన్), శ్రీ మల్లారెడ్డి (ఉశినాపురం), శ్రీ యం.చలపతిరావు (డోన్), శ్రీ వి. సుంకులన్న (కొచ్చెరువు), శ్రీ శాంతమూర్తి (డోన్), డా॥ నరసింహుడు (ఎద్దుపెంట), శ్రీ డి.రంగన్న (ఉశినాపురం), శ్రీ వెంకటేశ్వరగౌడ్ (సూదేపల్లి), శ్రీ యం.నారాయణరావు (డోన్), శ్రీ పి. వెంకటేశ్వర రెడ్డి (గోసానిపల్లి), శ్రీ బి. రామచంద్రారెడ్డి (గోసానపల్లి), శ్రీ మద్దిలేటి (రహిమాపురం), శ్రీ బి. రంగనాయకులు నాయుడు (వలసల), శ్రీ చిన్నపెద్దన్న (ఎద్దుపెంట), శ్రీ ఎస్.సత్యన్న (డోన్), శ్రీ కె.రోశన్న (డోన్), శ్రీ బాలమద్దయ్య (కొచ్చెరువు), శ్రీ ఎస్.ఉసేన్‌పీరా (డోన్), శ్రీ యం. నారాయణ (సిద్దనగట్టు), శ్రీ యం. మురళి (అమర్‌తాడు), శ్రీ మహమ్మద్ రఫి (డోన్), శ్రీ మహమ్మద్ షఫి (డోన్), శ్రీ సికిందర్ (డోన్), శ్రీ షేక్ షావలి (డోన్), శ్రీ చిన్నరామిరెడ్డి (యు.కొత్తపల్లి), శ్రీ ఎస్.వలి (యు.కొత్తపల్లి) బి.కేశవరెడ్డి (ఎద్దుపెంట), శ్రీ మనోహర్ బాబు (డోన్), మొదలగువారు నటులుగాను, శ్రీమతి ఆర్. ఆదిలక్ష్మి (వెల్దుర్తి), శ్రీమతి ఆర్. మంజుల (డోన్), శ్రీమతి యం.కమల (ఊటకొండ), శ్రీమతి ఈశ్వరమ్మ (ఉసేనాపురం), కుమారి జయలక్ష్మి (కొచ్చెరువు), కుమారి విజయలక్ష్మి (కొచ్చెరువు), కుమారి యం.వెంకట లక్ష్మి (కొమూరికొట్టాల), కుమారి యం.వరలక్ష్మి (కొచ్చెరువు), కుమారి అనురాధ (డోన్), నటీమణులుగాను పనిచేస్తున్నారు. వీరేగాక ఈ సమాజంలో శ్రీ కె.యఫ్.జార్జి, శ్రీ పి.జి. వెంకటేశ్వరులు (డోన్), శ్రీ బి.కేశవరెడ్డి (ఎద్దుకుంట), శ్రీ పి.జి.వెంకటాద్రి (డోన్), హార్మోనిస్టులుగాను, శ్రీ యం. లక్ష్మీనరసయ్య (డోన్), వయోలినిస్టు, శ్రీ యం.హుసేన్ (డోన్), శ్రీ యం.రాముడు (డోన్) శ్రీ ఎల్లయ్య (గోసానిపల్లె), మొదలగు వారు తబలిస్టులుగాను, శ్రీ మద్దయ్యగౌడ్ బ్యాంజు వాయిద్య కళాకారులుగాను పనిచేస్తున్నారు. ఈ సమాజం

తాలూకా స్థాయిలో రాయలసీమలో గొప్పపేరు పడసిన నాటక సమాజం. శ్రీరాఘవ కళాసమితిలోని కళాకారులనుబట్టి ఇది భారియెత్తున కిరాయి నాటకాలు ప్రదర్శించే సమాజమని తెలుస్తుంది. వీరు కిరాయి నాటక ప్రదర్శనలద్వారా సేకరించిన ధనంతో పేదకళాకారులకు ఆర్థిక సహాయం చేస్తున్నట్లు తెలుస్తుంది.

శ్రీరాఘవ కళాసమితివారు "శ్రీరామాంజనేయయుద్ధం, పాండవోద్యోగ విజయం, శ్రీబ్రహ్మంగారి చరిత్ర, చింతామణి, లవకుశ,"మొదలగు పౌరాణిక నాటకాలనే తరచుగా ప్రదర్శిస్తున్నారు.

ఈ సమాజంవారు యింతవరకు "శ్రీ లలిత కళాసమితి - కర్నూలు, లలిత కళాపరిషత్తు-సంద్యాల, రైల్వేకళాభారతి -గుంతకల్లు, కళాభారతి, డోన్"లలో నిర్వహింపబడిన పరిషత్తులలో పౌరాణిక నాటకపోటీలలో పాల్గొని బహుమతులను స్వీకరించారు.

ఈ సమాజం ఇప్పుడుకూడ పనిచేస్తున్నది. ప్రపంచమంతా సినిమా ప్రభావం పాతుకుపోయిన ఈ రోజులలోకూడ పౌరాణిక నాటకాలను ప్రదర్శించి ప్రజల మన్ననలకు, ప్రేక్షకుల ఆదరాభిమానాలకు పాత్రమైన శ్రీ రాఘవ కళాసమితి ఇటు నాటకకళకు సేవచేస్తూ, అటు పేద కళాకారులకు ఆర్థిక సహాయం చేస్తూ వుందంటే సమాజం యొక్క ఆశయం కొనియాడదగింది.

పై సమాజానికి అనుబంధంగా "సికిందర్ డ్రామా డ్రస్ కంపెనీ"కూడ వున్నదంటే ఇది స్వయంసమృద్ధిగల నాటక సమాజమని చెప్పవచ్చును. ఇటువంటి నాటక సమాజాలు కర్నూలు, సంద్యాలలోకూడ కలవని ఈ సమాజ అధ్యక్షుల వలన తెలియుచున్నది.

## శ్రీవేంకటేశ్వర నాట్యమండలి : ద్రోణాచలం :

శ్రీపి.వెంకటేశ్వర్లు వ్యవస్థాపకులుగా ద్రోణాచలంలో "శ్రీవేంకటేశ్వర నాట్యమండలి" అను నాటక సమాజం 1983లో స్థాపింపబడింది. ఈ సమాజంలో శ్రీ ఎ.పెద్ద ఎల్లయ్యగారు అధ్యక్షులుగాను, శ్రీపి.జి.వెంకటేశ్వర్లు కార్యదర్శిగాను, శ్రీ యం.చలపతిరావుగారు కోశాధికారిగాను, శ్రీపి.జి.వెంకటాద్రిగారు దర్శకులుగాను పనిచేస్తున్నారు.

శ్రీవేంకటేశ్వర నాట్యమండలివారు "శ్రీరామాంజనేయ యుద్ధం, గయోపాఖ్యానం, చింతామణి, సత్యహరిశ్చంద్ర, లవకుశ" మొదలగు పౌరాణిక నాటకాలను కిరాయినాటకాలుగా అనేక పర్యాయాలు ప్రదర్శించారు, నేటికీ ప్రదర్శిస్తున్నారు.

వీరు "శ్రీ రాఘవ కళాపరిషత్తు-బళ్ళారి, లలిత కళాపరిషత్తు-సంద్యాల, కళాభారతి-వెల్దుర్తి" మున్నగు ప్రాంతాలలో నిర్వహించిన పౌరాణిక నాటకపోటీలలో పాల్గొని, అనేక బహుమతులందుకున్నారు.

"శ్రీ ఎ.పెద్ద యల్లయ్య, శ్రీ బి.నాగప్ప, శ్రీ కె.ఫ్రాన్సిస్, శ్రీ యం. చలపతిరావు, శ్రీ యస్.సుందరం, శ్రీ యస్.బాలతిమ్మయ్య, శ్రీ యన్. బాలకృష్ణ, శ్రీ సుంకన్న (రైల్వేస్), శ్రీ రాముడు (R.P.F) శ్రీ కిష్టన్న, శ్రీ నారాయణ, శ్రీ నాగన్న (బండి), శ్రీ రంగనాయకులు, శ్రీ రాధాకృష్ణ, శ్రీ జాలప్ప, శ్రీ యం.సదాశివయ్య, శ్రీ ఆర్. సోమిరెడ్డి, శ్రీ డి. నారాయణరెడ్డి, శ్రీ యస్. మౌలాలి, శ్రీ రంగడు" మొదలగువారు ఈ నాటక సమాజంలో నటులుగా పనిచేస్తున్నారు. వీరందరు ద్రోణాచలం వాస్తవ్యులు.

"శ్రీవేంకటేశ్వర నాట్యమండలి" నాటక సమాజంవారు నూతన నటులను రంగస్థలానికి పరిచయంచేసి, వారిని ఉన్నతస్థాయి నటులనుగా చేయవలెననెడి సత్సంకల్పంతోను, పేదకళాకారులకు తగిన విధంగా ఆర్థిక సహాయ మందించి, నాటక కళాసేవలో వారికి ప్రోత్సాహమివ్వాలన్న సదాశయంతోను, స్వయంకృషితో నాటక ప్రదర్శన లిస్తున్నారు. ఇటువంటి నాటక సమాజాలు "వెల్దుర్తి, ప్యాపలి, ఎమ్మిగనూరు, పత్తికొండ" మొదలగు ప్రాంతాలలో వున్నట్లు తెలుస్తుంది. ఇట్టి కళారాధకులకు ప్రభుత్వపరమైన ప్రోత్సహము, ఆర్థిక సహాయము లభిస్తే రాయలసీమలో నాటకకళ పునర్జీవితం పొందగలదని ఆశించవచ్చును.

## కళాప్రియసమాఖ్య – ఆదోని :

1971లో "కళాప్రియ సమాఖ్య" అనునాటక సమాజం "ఆదోని"లో స్థాపింపబడింది శ్రీ జి.సి.హెచ్. వెంకటరామిరెడ్డి, బి.ఎ.గారు అధ్యక్షులుగాను, శ్రీపి.నక్షత్రరెడ్డి దర్శకులుగాను ఈ సమాజంలో వ్యవహరిస్తున్నారు. ఈ సమాజంలో శ్రీ జి.సి.హెచ్. వెంకట్రామరెడ్డి, శ్రీపి. నక్షత్రరెడ్డి, బి.వి.యస్. నారాయణ, శ్రీపి.డి.గిరి, శ్రీ బి.ఓబుళేసు, శ్రీపి.బసిరెడ్డి, శ్రీ బి.హనుమంతరెడ్డి, శ్రీపి.రహింతుల్లా" మొదలగువారు ముఖ్యనటులు. వీరు ఇప్పటివరకు పౌరాణిక, జానపద నాటకాలనే ప్రదర్శించారు. వీరి జీవితాశయం పేద కళాకారుల సహాయార్థం నాటక ప్రదర్శనలిస్తూ, కళాసేవచేయడమే.

"కళాప్రియ సమాఖ్య" వారు ఇప్పటివరకు "శ్రీకృష్ణరాయబారం, శ్రీకృష్ణతులాభారం, గయోపాఖ్యానం, శ్రీరామాంజనేయ

యుద్ధం, బాలనాగమ్మ, చింతామణి," అను నాటకాలను సుమారు మూడువందల ప్రదర్శనలిచ్చినట్లు తెలుస్తుంది. రాయలసీమలో ఈ నాటకసమాజం ఈనాడొక ఉత్తమ నాటక సంస్థగా పేరుగాంచినది. పేదకళాకారుల పెన్నిధిగా ప్రసిద్ధిగాంచినది. ప్రతి సంవత్సరం "కళాప్రియ సమాఖ్య" కళాప్రియులైన ఉత్తమ రంగస్థల కళాకారులకు, భాగవతాదులకు, కవులకు, గాయకులకు ఘనంగా సన్మానాలు జరుపుతూ, కళాకారుల ఉనికిని సభ్య సమాజానికి తెలియజేయుచున్నది.

### ఉమామహేశ్వర నాట్య కళామండలి : నందికొట్కూరు :

కర్నూలుజిల్లా, నందికొట్కూరు గ్రామంలో 1990వ సంవత్సరం "శ్రీఉమామహేశ్వర నాట్యకళామండలి" అను నాటక సమాజం స్థాపింపబడింది. ఈ సమాజంలో శ్రీపోరెడ్డి నాగిరెడ్డి గారు అధ్యక్షులుగాను, శ్రీ బి. సాయిశివరావుగారు కార్యదర్శిగాను, దర్శకులుగాను నియమితులయ్యారు.

"శ్రీ ఉమామహేశ్వరరెడ్డి, శ్రీపరవస్తు పుల్లయ్య, శ్రీ బి.సాంబశివరావు, శ్రీపులిపాటి రామకృష్ణయ్య, శ్రీ నిమ్మలి కొండయ్య, శ్రీ బండారు బలరాంగారు, శ్రీ పెద్దస్వామిరావు, శ్రీ జి. శంకరయ్య, శ్రీ సాయి బాబాగౌడు, శ్రీ రవీంద్రగౌడు, శ్రీ పి.నారాయణ, శ్రీ పి. పుల్లయ్య, శ్రీ టి.నారాయణ" మొదలగువారు నటులుగా పెక్కు నాటకాలను ప్రదర్శించారు. వీరు "శ్రీ కృష్ణరాయబారము, భక్తమాధవదాసు, లంకెలబిందెలు, తులసీతీర్థం, ఆనాడు" మొదలగు నాటకాలను ప్రదర్శించారు. వీరు "శారదాలలిత కళాపరిషత్తు"లో తులసీతీర్థం నాటకాన్ని ప్రదర్శించి, ప్రదర్శనకు ప్రథమ బహుమతిని అందుకున్నారు. హైదరాబాదు దిల్ షుక్ నగర్ లోని శ్రీ సరస్వతి నాటక సమాజంవారు నిర్వహించిన నాటకపోటీలలో శ్రీపులిపాటి రామకృష్ణయ్య ఉత్తమనటుడుగా యెన్నికయ్యి, నటరాజ విగ్రహాన్ని ప్రథమ బహుమతిగా స్వీకరించారు. తిరుపతి శ్రీ వేంకటేశ్వర నాట్యకళాపరిషత్తులో "ఆనాడు" నాటకం ప్రదర్శించినపుడు ద్వితీయ బహుమతి లభించింది. ఈ సమాజానికి పోషణకర్త శ్రీ పోరెడ్డి నాగిరెడ్డిగారు. ఈ సమాజం ఔత్సాహికులైన యువకళాకారులతో ముందు ముందు పెక్కు నాటకాలను ప్రదర్శించగలదని ఊహింపవచ్చు.

### ఆంధ్రనాటక కళాసమితి – లొద్దిపల్లె :

1953లో శ్రీ యం. అల్లాబక్ష్‌గారు వ్యవస్థాపక అధ్యక్షులుగా కర్నూలు జిల్లా, లొద్దిపల్లె గ్రామంలో "ఆంధ్రనాటక కళాసమితి" అను నాటక సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజానికి స్థాపకులు, పోషకులు శ్రీ అల్లాబక్ష్‌గారే. శ్రీ అల్లాబక్ష్‌గారు ఈ సమాజం పతాకంక్రింద యెన్నో నాటకాలను ప్రదర్శించారు. "పాండవోద్యోగ విజయము, కురుక్షేత్రము, గయోపాఖ్యానం, చింతామణి, శ్రీ కృష్ణతులాభారం, రామాంజనేయ యుద్ధం, సత్యహరిశ్చంద్ర," మొదలగు నాటకాలను రాయలసీమ, తెలంగాణా, సాగరాంధ్ర ప్రాంతాలలోనేగాక, బెంగళూరులో కూడ పెక్కుసార్లు ప్రదర్శించారు.

ఈ సమాజం తరపున శ్రీ అల్లాబక్ష్‌గారు "సత్యహరిశ్చంద్ర" నాటకాన్ని ఆంధ్రదేశం పలుప్రాంతాలలో వెయ్యి (1000) సార్లు ప్రదర్శించి, రాష్ట్రస్థాయిలో "హరిశ్చంద్ర" పాత్రకు తనదైన ఒక ఒరవడిని దిద్దుకొన్న నటకావతంసుడు.

ఈ సమాజం నేటికీ పనిచేస్తున్నది. ఈ నాటక సమాజం "తిరుపతి–శ్రీ వేంకటేశ్వర నాట్య కళాపరిషత్తు, అనంతపురం, లలితకళాపరిషత్తు, ప్రొద్దుటూరు–రాయల నాటక కళాపరిషత్తు" మొదలగు పరిషత్తులు నిర్వహించిన నాటక పోటీలలో పాల్గొని, అనేకప్రదర్శనలకు ప్రథమ బహుమతులు, ఉత్తమనటనకు మొదటి బహుమతులు అందుకున్నది. ఆంధ్రదేశంలోని సుప్రసిద్ధ సమాజాలలో "ఆంధ్రనాటక కళాసమితి" ఒకటి.

పైన పేర్కొనబడిన నాటక సమాజాలేగాక మరికొన్ని నాటక సమాజాలు కర్నూలు జిల్లా అంతటా నాటక కళకు సేవచేసినట్లు తెలుస్తుంది. శ్రీ రాజంరెడ్డి రామిరెడ్డిగారు "లక్ష్మీ జనార్దన నాట్యమండలి" అను నాటక సమాజాన్ని స్థాపించి, రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో పౌరాణిక నాటకాలను విరివిగా ప్రదర్శించినట్లు తెలుస్తుంది.

కర్నూలులో శ్రీ బత్తిన వెంకటరంగయ్య గారు "శ్రీ రామాంజనేయ నాటక సమాజం" అను సంస్థను స్థాపించి, పెక్కు పౌరాణిక నాటకాలను కిరాయి నాటకాలుగా ప్రదర్శించినట్లు స్థానికులు చెబుతారు. ఇదిగాక "కర్నూలు సహోదయ నాట్యమండలి" స్థాపింపబడింది.

"శ్రీ వేంకటేశ్వర నాటక సమాజం–కోడుమూరు, బాలాజీ నాట్య కళామండలి – భీమవరం, లలిత కళాసమితి – పామిడి, సి.సి.ఐ. కళాసమితి – ఎఱ్ఱగుంట్ల, కోరమాండల్ కల్చరల్ అసోసియేషన్ – చిలమకూరు, కళాభారతి – వెల్దుర్తి" మొదలగు యెన్నో నాటక సమాజాలు కర్నూలు జిల్లావ్యాప్తంగా స్థాపింపబడి, నాటక కళకు సేవచేసినట్లు ఈనాటి వయోవృద్ధుల వలన తెలిసిన విషయం. పల్లెపట్టులలో,

మారుమూల గ్రామాలలో ఇంకా యెన్నో నాటక సమాజాలు చరిత్రకెక్కకుండ అజ్ఞాతంగా మిగిలిపోయి, నాటకకళకు తమ అమూల్యసేవలను అందిస్తున్నాయనడంలో సందేహంలేదు.

### శ్రీ రాజంరెడ్డి రామిరెడ్డి :

శ్రీ రాజంరెడ్డి రామిరెడ్డిగారు 1899లో కర్నూలు జిల్లా, నంద్యాల తాలూకా, బండిఆత్మకూరు గ్రామంలో జన్మించారు. వీరికి చిన్నతనంనుండి నాటకరంగంమీద శ్రద్ధాసక్తు లెక్కువ. వీరు యువకులుగా ఉన్నప్పుడే "లక్ష్మీజనార్ధన నాట్యమండలి" అను నాటక సమాజాన్ని స్థాపించి, జిల్లాలో పలుచోట్ల పౌరాణిక నాటకాలను ప్రదర్శించి, గొప్ప పేరుప్రఖ్యాతులు సంపాదించారు. వీరు మధురగాయకులు. పౌరాణిక నాటకాలలో అనేక వైవిధ్యంగల పాత్రలను పోషించి, గొప్పనటులుగా గుర్తింపబడ్డారు. వీరు నాటక రంగమందేగాక చలన చిత్రరంగంలోకూడ అభినివేశమున్న సినీనటులు. 1936లో "వేల్‌పిక్చర్స్" వారి "మాయాబజార్" లో ఘటోత్కచుడుగా, "కచదేవయాని" లో రాక్షసరాజు "వృషపర్వుడు"గా "మైరావణ"లో అహిరావణుడుగా, "యోగివేమన"లో "అనవేమారెడ్డి"గా, "మదాలస"లో "పాతాళకేతుడు"గా విభిన్న పాత్రలను పోషించారు.నాటక కళకు నటులను పోషించే తాహతు తక్కువ కాబట్టి రంగస్థలనటులైనవారు జీవనోపాధికోసం వేరొకవృత్తిని ఆశ్రయించక తప్పడంలేదు.



శ్రీ రాజంరెడ్డి రామిరెడ్డిగారు రంగస్థలనటులుగా జీవితం గడపలేకనో, చలనచిత్ర రంగంలో పోటీకి నిలువలేకనో, లేక హరికథమీదనున్న అభిమానంచేతనో, చలనచిత్ర రంగానికి వీడ్కోలిచ్చి రంగుపూసుకోవడం మాని నటనవదలలేక రంగులేని హరిదాసుగా నటించి రాణించారు. అనేకచోట్ల హరికథలు చెప్పి, బంగారు పతకాలను, హస్తకంకణాలను సగౌరవంగా స్వీకరించారు. ఈయన గొప్పదేశభక్తి కలవారు. స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొని దేశంకోసం మూడుపర్యాయాలు కఠినకారాగార శిక్షనుభవించారు. స్థానిక రాజకీయాలలో ప్రవేశించి, పంచాయితి బోర్డు ప్రెసిడెంటుగాను, తాలూకాబోర్డు మెంబరుగాను, జిల్లాబోర్డు మెంబరుగాను పలుమార్లు యెన్నికయ్యె ప్రజాసేవచేశారు. వీరి ఛాయాచిత్రమే వీరి ప్రతిభను తెలియజేస్తుంది.

శ్రీ రాజంరెడ్డి రామిరెడ్డిగారు గొప్పనటులు, శ్రావ్యంగా పాడగలరు. పేరెన్నికగన్న హరికథకులు. స్వార్థచింతన లేని దేశాభిమాని. ప్రజాసేవకులు. కళారాధకులు. ఆంధ్రదేశంలోని నటుల సరసన రాయలసీమరత్నంగా రాణించినవారు. వీరు రాయలసీమ నటరత్నం.

### శ్రీ రంగా వీరరాజు :

శ్రీ రంగా వీరరాజు గారు 1910లో కర్నూలు జిల్లా, నందికొట్కూరు గ్రామంలో శ్రీ రంగా సుబ్బారావు, శ్రీమతి భద్రకేళి అనుపుణ్యదంపతులకు జన్మించారు. వీరు వృత్తి కళాకారులవడంచేత తన 15వ యేట (1925వ సంవత్సరం నుండి) నాటకాలలో స్త్రీ పాత్రలు ధరిస్తూ పేరుప్రఖ్యాతు లార్జించుకొన్నారు. వీరు ప్రప్రథమంగా "కాకినాడ యంగ్‌మెన్స్‌క్లబ్" అను నాటకసమాజంద్వారా "చింతామణి" నాటకంలో రాధ పాత్రతో రంగస్థల ప్రవేశం చేశారు. స్త్రీ వేషధారణకు అనువైన, అందమైన విగ్రహం అమరింది. మృదుమధురమైన కంఠం కుదిరింది. నాజూకైన నడక, నాణ్యమైన అవయవపొందిక, సాటివారిలో మేటి అనిపించుకోగల నటన దైవానుగ్రహంగా సంక్రమించినవి. వీరు "పారుపల్లి సుబ్బారావుగారి నాట్యమండలి, తురిమెళ్ళ కంపెనీ" మొదలగు అనేక నాటక సమాజాలలో విభిన్నమైన స్త్రీ పాత్రలను పోషించి, ప్రజామన్ననలకు పాత్రులైనారు. వీరు "చింతామణి, సక్కుబాయి, రాధాకృష్ణ, తులాభారం, ప్రభావతీ ప్రద్యుమ్న" వంటి అనేక పౌరాణిక నాటకాలలో నటించారు. "శ్రీహరి, సక్కుబాయి, సత్యభామ, ప్రభావతి," పాత్రలు వీరి నటనా వైదుష్యానికి మచ్చుతునకలు. శ్రీహరిపాత్ర వీరికెంతో నచ్చినది. ప్రజల మెప్పును పొందిన పాత్రలలో అత్యుత్తమమైనది.





శ్రీ రంగా వీరరాజుగారు కర్నూలు, నందికొట్కూరులలోనేగాక, పలుచోట్ల ప్రజల ప్రశంసలతోబాటు పెక్కు సన్మానములందుకున్నారు.

వీరు "కళ పూర్వజన్మ సుకృతంతో, పుట్టుకతో లభించేవరం" అంటారు. వీరు ఆనాటి సర్కారు జిల్లాలలోని, రాయలసీమ జిల్లాలలోని అన్ని నాటక సమాజాలలో స్త్రీ పాత్రలను నటించారు. సుందరమైన విగ్రహం, సహజమైన నటన, శ్రావ్యమైన గాత్రం, ముచ్చట గొలిపే సంభాషణలు వీరిని కోరి వరించాయి.

శ్రీ రంగా వీరరాజుగారు ఆజన్మ నటులు. 79 ఏండ్ల వయోవృద్ధులైనప్పటికీ నీరు ఈనాడు కూడ శ్రావ్యంగా పాడగలుగుతున్నారు. వీరు ఉత్తమనటులు, మరొక ఉత్తమ నటీమణికి జన్మనిచ్చిన తండ్రి. మధుర గాయకులు. రాయలసీమ కళామతల్లి కంఠహారంలో నిలువైన నటరత్నం.

## ఆత్మకూరు సుబ్బరత్నమ్మ :

శ్రీమతి ఆత్మకూరు సుబ్బరత్నమ్మగారు 1912లో కర్నూలు జిల్లా ఆత్మకూరులో జన్మించారు. వీరి మధురమైన గాత్రం, సుందరమైన విగ్రహం చూచి రంగస్థలం వీరిని తమవైపుకు ఆకర్షించింది. శ్రీమతి సుబ్బరత్నమ్మగారు రంగస్థలప్రవేశం చేసిన నాటినుండి సుదీర్ఘమైన నాలుగు దశాబ్దముల కాలం నిర్విరామంగా కళామతల్లికి సేవ చేశారు. స్త్రీ పాత్రలను కూడా పురుషులే ధరించే ఆరోజులలో వీరు స్త్రీ, పురుష పాత్రలను ధరించిన, ఆతరానికి చెందిన మహానటులు. "శ్రీ స్థానం నరసింహారావుగారు, శ్రీ సూరిబాబు గారు, శ్రీ ఈలపాట రఘురామయ్య గారు, శ్రీ పులిపాటి వెంకటేశ్వర్లు గారు, శ్రీ బందా కనకలింగేశ్వర రావు గారు, శ్రీ పులిపాక వెంకటప్పయ్య గారు, శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి గారు, శ్రీ అబ్బూరి వరప్రసాద రావు గారు, శ్రీ మాధవ పెద్ది వెంకట్రామయ్య గారు మొదలగు వారి సరసన నటించి, ఆనాటి మేటి రంగస్థల నటీమణులలో ఒకరుగా కీర్తి ప్రతిష్టలనార్జించుకున్నారు. వీరు తననటనా వైదుష్యంతోను, గాన మాధుర్యంతోను అశేష ఆంధ్ర ప్రజానీకాన్ని ఆకట్టుకున్నారు. వీరి హావ, భావ ప్రకటన ప్రశంసనీయము. వీరి అకుంఠితకళాసేవ, నిరంతర కృషి అమోఘము.



శ్రీమతి సుబ్బరత్నమ్మ గారు "శ్రీకృష్ణ తులాభారం" అను పౌరాణిక నాటకంలో "సత్యభామ, నారదుడు, రుక్మిణి" పాత్రలను అత్యద్భుతంగా పోషించారు. స్త్రీ సహజమైన హొయలు, సోయగాలతో "సత్యభామ" పాత్రలో జీవించారు. "చింతామణి" నాటకంలో చింతామణి గాను, రాధ గాను, యెంతో వైవిధ్యంతో నటించారు. "సక్కుబాయి" నాటకంలో సక్కుబాయి పాత్రను, "సావిత్రి" నాటకంలో సావిత్రి పాత్రను, "శ్రీ రామాంజనేయ యుద్ధంలో" శాంతిమతి పాత్రను, "శ్రీ కృష్ణ రాయబారం"లో ద్రౌపది, శ్రీ కృష్ణుడు పాత్రలను "గయోపాఖ్యానం"లో సుభద్ర పాత్రను, "శశిరేఖ పరిణయం"లో శశిరేఖ పాత్రను "లవకుశ"నాటకంలో సీత పాత్రను "తారాశశాంకం" నాటకంలో తార పాత్రను, మరియు చిత్రలేఖ పాత్రను మొదలగు విభిన్న మనస్తత్వాలు గల బహు పాత్రలను యెంతో నైపుణ్యంతో పోషించి, రాయలసీమలోనే గాక అఖిలాంధ్ర దేశంలోనే ఒక గొప్ప రంగస్థల నటిగా లబ్ధప్రతిష్టులైనారు. వీరి ప్రతిభను విన్న ప్రముఖ సినీనటి, ఆంధ్రసంగీత నాటక అకాడమీ అధ్యక్షురాలు శ్రీమతి జమునా రమణారావుగారు అప్పటి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం తరపున శ్రీమతి ఆత్మకూరు సుబ్బరత్నమ్మగారికి రూ. 116/– బహూకరించి, దుశ్శాలువతో సన్మానించారు. గద్వాల రాజావారు, వారి పట్టాభిషేకం సందర్భంగా శ్రీమతి సుబ్బరత్నమ్మ గారిని ప్రముఖ రంగస్థలి నటిగా గుర్తించి, వెండికప్పును బహూకరించారు.

కళాకారులకు శాపమో లేక పాపమోగాని ఒకప్పుడు రంగస్థలాన్ని యేలిన మహానటులు, నటీమణులు అవసానదశలో అతిదీనాతిదీనమైన జీవితాన్ని వెళ్ళబుచ్చినట్లు వారి చరిత్రలు చెబుతున్నాయి.

ఒకనాడు ప్రముఖ రంగస్థలనటిగా వెలిగిన శ్రీమతి ఆత్మకూరు సుబ్బరత్నమ్మ గారు ఈనాడు 'నా' అన్నవారెవరూ లేని అనాథయై జవసత్వాలుడిగి, చూపు మందగించి, భుక్తి గడవక కర్నూలు పురవీధులలో ఇంటింట భిక్షమెత్తుకొని శేషజీవితాన్ని ఈడ్చుకొస్తూవుంది. పూలమ్మినచోట కట్టెలమ్మలేక గతాన్ని తలచుకుంటూ చావలేక బ్రతుకుతున్న సుబ్బరత్నమ్మవంటి వృద్ధకళాకారులెందరో చరిత్రకందక, కాలంపొరల మరుగునపడి నిష్క్రమిస్తున్నారు.

ఉత్తమకళలను ఆస్వాదించడమే తప్ప, కళాకారులైన సాటి మానవులను ఆదరించి, ఆదుకునే సహృదయత సభ్యసమాజానికి లేదు. కాని ప్రభుత్వమైనా దీన, హీన అనాధవృద్ధకళాకారుల కోసం ఆంధ్రప్రదేశ్ మూడుప్రాంతాలలో మూడు ఆశ్రమాలను స్థాపించి వారికి తిండి, బట్టను ప్రసాదిస్తూ కళలో వారి జీవితానుభవాలను, అమూల్యమైన సలహాలను స్వీకరించి, భావితరాల ఔత్సాహికనటులకు, కళాకారులకు

నాటకాలలో నటుడుగా పరిచయమై, స్వయం కృషితో సంగీతం నేర్చుకొని, హార్మోనియం, తబలా వాయిస్తూ, పౌరాణిక నాటకాలకు సంగీత దర్శకత్వం నిర్వహిస్తూ నటులకు దర్శకత్వం వహిస్తూ సుప్రసిద్ధ కళాకారుడుగా కీర్తి ప్రతిష్టలనార్జించినవారు నటశేఖర శ్రీ పి.జి .సత్యనారాయణ గారు.



వీరు కర్నూలు జిల్లా డోన్ (ద్రోణాచలం) తాలూకా "పులగుమ్మి"గ్రామంలో 1916వ సంవత్సరం రామయ్య, గోవిందమ్మ అను పుణ్యదంపతులకు జన్మించారు. అచిరకాలంలోనే స్వగ్రామం వదలి కర్నూలు పట్టణంలో స్థిరపడ్డారు. కర్నూలు పట్టణ కరణంగా శ్రీ నారాయణగారు చాలకాలం పని చేశారు.

శ్రీ సత్యనారాయణ గారు చిన్నతనంలోనే వీధినాటకాలచే అమితంగా ఆకర్షింపబడ్డారు. బంధుమిత్రులనుండి తగిన ప్రోద్బలం లభించడంతో మిత్రబృందాన్ని ఒక సమాజంగా యేర్పరచి మొట్టమొదటిసారిగా "సావిత్రి" నాటకం నేర్చుకొని ప్రదర్శించారు. ఈ నాటకంలో శ్రీ సత్యనారాయణ గారు సావిత్రి పాత్రను పోషించి ప్రేక్షకుల మన్ననలకు పాత్రులైనారు. అప్పటినుండి ఔత్సాహికులైన యువకులకు నాటకాలు నేర్పుతూ నాటక కళకు సేవ చేశారు. వీరు "శ్రీ కృష్ణ తులాభారం"లో కృష్ణుడుగా, "సతీ సావిత్రి"లో యముడుగా నటించారు. "గయోపాఖ్యానం, లవకుశ, తులసీజలంధర, భక్త ప్రహ్లాద" మొదలగు నాటకాలలో నటించి, తన నటనా ప్రతిభతో ప్రేక్షకుల హృదయాలను చూరగొన్నారు. తులాభారం, సావిత్రి మొదలగు నాటకాలకు సంగీతం సమకూర్చి దర్శకత్వం వహించారు.

1949లో ఉస్మానియా కళాశాల వైస్ ప్రిన్సిపాలుగా పనిచేస్తుండిన శ్రీ ఘాలి నారాయణ రావుగారి సహాయ సహకారాలతో "కర్నూలు మండల లలిత కళాపరిషత్తు" అను నాటక సమాజాన్ని స్థాపించి, దానికి ప్రధాన కార్యదర్శి పదవిని, నాటక విభాగానికి దర్శకత్వ పదవిని చేపట్టి, మిక్కిలి సమర్థతతో నిర్వహించి సమాజాభివృద్ధికి యెంతగానో కృషిచేశారు. కళాప్రపూర్ణ శ్రీ బళ్ళారి రాఘవగారితో కలిసి నాటక ప్రదర్శనలిచ్చారు. ప్రముఖ న్యాయవాదులు శ్రీ బి. నారాయణ మూర్తిగారి పర్యవేక్షణలో "ఆంధ్రజ్యోతి, రేవతి, ఛత్రపతి శివాజి, ఖిల్జీ రాజ్య పతనము, మహారాణి రుద్రమ, పల్లె పిల్ల" మొదలగు నాటకాలు ప్రదర్శించి, అశేష ఆంధ్ర ప్రజానీకపు హృదయాలలో గొప్ప నటులుగా సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్న ధన్యజీవి శ్రీ సత్యనారాయణ గారు. వీరు కృష్ణపాత్రను ధరించి, ఆనాటి గొప్పనటులలో ఒకరైన "శ్రీ కొండపేట కమాల్" గారిచే ప్రశంసలనందుకున్నారు. వీరు కర్నూలు, కడప, అనంతపురం, మహబూబ్ నగర్ జిల్లాలలో నాటకాలు ప్రదర్శించి, బహుమతులను, ప్రశంసా పత్రాలను అందుకున్నారు.

1957వ సంవత్సరం జనవరి 26వ తేదీన పత్తికొండ రాఘవ కళాసమితి వారు 'నటశేఖర' బిరుదు నిచ్చి శ్రీ సత్యనారాయణ గారిని ఘనంగా సన్మానించారు. 1960 ఆగస్టు 4వ తేదీన అప్పటి మంత్రి శ్రీ యం.ఆర్. అప్పారావు గారి ఉత్తర్వు మేరకు కర్నూలు జిల్లా విద్యాశాఖాధికారిచే సన్మానింపబడినారు. ఇటువంటి సన్మానాలు లెక్కకు మిక్కిలి జరిగాయి. కర్నూలు పట్టణంలో వివిధ సంస్థలు నిర్వహించే నాటక, నాటిక, ఏకపాత్రాభినయ, లలిత సంగీత, నాట్య పోటీలకు న్యాయ నిర్ణేతలుగాను, ముఖ్య అతిథిగాను, ఉపన్యాసకులుగాను, ఆహ్వానింపబడుతుండేవారు. వీరు శిక్షకులుగా యెంతోమంది యువకులను నాటక కళకు పరిచయం చేశారు. వీరు నాటక, సంగీత, సాహిత్య, రాజకీయ, సాంఘిక, ఆధ్యాత్మిక రంగాలలో ప్రతిభావంతులైనప్పటికీ, నిగర్విగా, నిరాడంబరంగా జీవితాన్ని గడిపారు. వీరు వైవిధ్యంగల పాత్రలను పోషించారు. స్వార్థరహితులై, నిర్మల హృదయంతో నిష్కళంకంగా వీరుచేసిన కళాసేవ కొనియాడదగినది. రాయలసీమ నటరత్నాలలో అగ్రగణ్యులుగా యెన్నదగినవారు.

## శ్రీ బత్తిని గురుమూర్తి భాగవతార్ :

శ్రీ బత్తిని గురుమూర్తి గారు 1917 లో కర్నూలు జిల్లా, ఆత్మకూరు తాలూకా, లింగాల గ్రామంలో జన్మించారు. వీరి తండ్రిగారు కీ.శే. బత్తిని వేంకట రంగయ్య గారు. శ్రీ వేంకట రంగయ్యగారు 1922లో "శ్రీ రామాంజనేయ నాటక సమాజం" అను సంస్థను స్థాపించి 1940 వరకు సుమారు రెండు దశాబ్దాలు ఆ నాటక సమాజానికి సారధ్యం వహించి, దక్షిణాంధ్ర దేశంలో అఖండ కీర్తి ప్రతిష్టల నార్జించారు. స్థాపించిన సమాజం ప్రదర్శించు ప్రతి నాటకంలో వీరే ప్రధాన పాత్రలు పోషిస్తూ, నాటక కళారంగానికి బహుముఖ సేవచేసిన కళారాధకులు.



అటువంటి తండ్రికి జన్మించిన శ్రీ గురుమూర్తి గారు 8సంవత్సరాల బాల్యంనుండే తండ్రి ప్రోత్సాహంతో రంగస్థల ప్రవేశం చేశారు. వారి నాటక సమాజంలో "శ్రీ కృష్ణ లీలలు" నాటకంలో శ్రీ కృష్ణుడుగా, "భక్త ప్రహ్లాద"లో ప్రహ్లాదుడుగా, "సావిత్రి"లో శారద్వతుడుగా నటించి, పెద్దల ఆశీర్వాదాలు, ప్రశంసలు అందుకున్నారు. యుక్తవయస్సులో "నారదుడు, భవాని, దామోదరుడు, ధర్మరాజు, సత్యవంతుడు" మొదలగు పాత్రలను పోషించి ప్రేక్షకుల మెప్పుపొందిన నటరత్నం.

వీరు కళారంగంలో ఆనాడు ఉత్తమకళారాధకులుగా పేరుగాంచిన "శ్రీ స్థానం నరసింహారావు, పారుపల్లి సత్యనారాయణ, కంచి నరసింహారావు, శ్రీమతి రాజేశ్వరి" మొదలగు సుప్రసిద్ధ కళాకారుల సరసన నటించి, వారి ప్రశంసలనందుకున్నారు.

1970లో హైదరాబాదు ఆకాశవాణి కేంద్రంనుండి ప్రసారమైన కర్నూలు నవోదయ నాట్యమండలి వారి "శ్రీ కృష్ణ రాయబారం" నాటకంలో ధర్మరాజు పాత్రను పోషించారు.

శ్రీ బత్తిన గురుమూర్తిగారు దీక్షతో నాటక కళారాధన చేసిన ఉత్తమనటులు. ప్రస్తుతం వీరు హార్మోనిస్టుగా, హరిదాసుగా జీవన యాత్రను సాగిస్తూ అవకాశం లభించినప్పుడల్లా గ్రామ ప్రాంతాలలో ఔత్సాహికులకు నాటకాలు నేర్పుతున్నారు. రాయలసీమ నటరత్నాలలో యెన్నదగినవారు.

## శ్రీ యస్. బషీర్ అహ్మద్ గారు



శ్రీ యస్. బషీర్ అహ్మద్ గారు 1925వ సంవత్సరం నంద్యాలలో జన్మించారు. వీరు స్కూల్‌ఫైనల్ పూర్తిచేసి, కొంతకాలం దేశ రక్షణదళంలో పనిచేశారు. ఆ తరువాత రెవెన్యూ డిపార్టుమెంట్‌లో చేరి డిప్యూటీ తహశీల్దారు వరకు యెదిగారు. చిన్ననాటినుండి వీరికి నాటకకళపైన మక్కువ ఎక్కువ. చిన్నతనంనుండి సాంఘిక, చారిత్రక, పౌరాణిక నాటకాలలో వివిధ పాత్రలను పోషించి, ప్రజామన్ననలందుకున్నారు. "బొబ్బిలి యుద్ధం"లో హైదర్ జంగ్, "సత్య హరిశ్చంద్ర"లో వీర బాహుడు పాత్రలను అత్యద్భుతంగా పోషించి, వీరికి వీరేసాటి అనిపించుకున్నారు. వీరి చిరకాల వాంఛ "జూలియస్ సీజర్" లో సీజర్ పాత్రను నటించాలన్నది. "జూలియస్ సీజర్" నాటకాన్ని ప్రారంభించి, కొన్నికారణాలవల్ల ఆ నాటకాన్ని ప్రదర్శించలేకపోయారు. వీరు యెంత కళాభిమాని అంటే, వీరు అనారోగ్యకారణంగా ఆస్పత్రిలో చేరి చికిత్స పొందుతున్నకాలంలో ఆయన అన్నమాటలివి. "నా ఆరోగ్యం బాగుపడ్డ తరువాత అంగవైకల్యమైనా డ్రామాలో నటిస్తాను" అని. ఇంతటి దీక్షాపరతంత్రుడు, నాటకకళాభిమాని నేడు అమరుడు.

## శ్రీ ఐ. లింగన్నగారు :



శ్రీ ఐ. లింగన్నగారు 1926లో కర్నూలు జిల్లా, నందికొట్కూరు తాలూకా, మాడుగుల గ్రామంలో జన్మించారు. వీరికి విద్యార్థి దశనుండి నాటక కళపైన అభిరుచి యెక్కువ. రెవెన్యూ డిపార్టుమెంటులో ఉద్యోగం చేస్తూ 1946 నుండి నటజీవితాన్ని ప్రారంభించారు. శ్రీ పి.జి సత్యనారాయణ గారు స్థాపించిన "కర్నూలు మండల లలిత కళాపరిషత్తు" నాటక సమాజంలో చేరి "ఆంధ్ర జ్యోతి, పల్లె పిల్ల, ఖిల్జీ రాజ్య పతనము, మహారాణి రుద్రమ, రేవతి, సతీ సక్కుబాయి, ఛత్రపతి శివాజీ" మొదలైన నాటకాలలో వివిధ పాత్రలను పోషించి పెక్కు బహుమతులందుకున్నారు.

రెవెన్యూక్లబ్ కార్యదర్శిగా కలెక్టర్ ఆఫీసులో అస్పృశ్యతా నివారణ చట్టం క్రింద "సమాజము, ఒకే కుటుంబము, పరివర్తన, మారిన మనుషులు, అనాధ, బలిదానం" మొదలగు సాంఘిక నాటకాలకు దర్శకత్వం వహించి, నటులు గాను, ఉత్తమ దర్శకులుగాను రెవెన్యూ అధికారులచేత, ప్రేక్షకులచేత ప్రశంసింపబడినారు. అనేక బహుమతులను, సన్మానాలను పొందియున్నారు.

అభ్యుదయ కళా సమితి ఆధ్వర్యంలో "జన్మహక్కు" అను నాటకాన్ని రాష్ట్రస్థాయి నాటక పోటీలలో పాల్గొని "ప్రొద్దుటూరు,

గుడివాడ, విజయనగరం, విశాఖ పట్టణం, రాజమండ్రి" పట్టణాలలో ఉత్తమ ప్రదర్శన ,ఉత్తమ నాయక, ఉత్తమ నాయకి, ఉత్తమ సహాయ నటులకు బహుమతులందుకున్నారు. "జన్మ హక్కు" నాటకంలో శ్రీ లింగన్నగారు 'గోకర్ణ'పాత్రను పోషించి ప్రేక్షకుల ప్రశంసలతోబాటు, అనేక బహుమతులనందుకున్నారు. రాజమండ్రి లలిత కళానికేతన్ వారు.వీరిని ఉత్తమ హాస్యనటులుగా యెన్నుకున్నారు. రాష్ట్రస్థాయిలో నాటక పోటీలలో పాల్గొని ఉత్తమ ప్రదర్శనకు, ఉత్తమ నటనకు, ఉత్తమ నటికి, ఉత్తమ సహాయనటునికి, ఉత్తమ హాస్య నటునికి బహుమతులు పొంది, తిరిగి కర్నూలుకు వచ్చినప్పుడు కళాభిమానులు, మిత్రులు, పురప్రముఖులు నాటకంలోని నటులకు పౌరసన్మానం జరిపి గౌరవించారు.

కర్నూలు నాటక కళాపరిషత్తు ఆధ్వర్యంలో కళాప్రపూర్ణ, కవి చకోర చంద్రోదయ "శ్రీ పైడిలక్ష్మయ్య"గారు రచించిన "మార్కండేయ విజయము, సాయిలీలలు, హేమా రెడ్డి మల్లమ్మ" అను నాటకాలను ప్రదర్శించారు. "మార్కండేయ విజయాన్ని రాష్ట్రపతి బాబూ రాజేంద్ర ప్రసాద్ గారి సమక్షంలో ప్రదర్శించినప్పుడు, నాటకం పూర్తి అయిన తరువాత వీరిని రాజేంద్ర ప్రసాద్ గారు రంగస్థలం పైకి పిలిపించి, 'నీలో ఆ శ్రీశైల మల్లికార్జునుని చూడగలిగితిని, అని కౌగలించుకొని, కరచాలనం చేసి పాత్రను చక్కగా పోషించావని మనస్ఫూర్తిగా ఆశీర్వదించారు. హేమారెడ్డి మల్లమ్మ నాటకాన్ని డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ (రాష్ట్రపతి), సమక్షంలో ప్రదర్శించినప్పుడు ఆయన రంగస్థలం పైకి వచ్చి, శ్రీ లింగన్నగారు ధరించిన బరమారెడ్డి పాత్రను పిలిచి 'చక్కని నటుడ'వని ఆశీర్వదించారు. ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి గారు (మాజీ ముఖ్యమంత్రి, మాజీ రాష్ట్రపతి) బరమరెడ్డి పాత్రకు బంగారు పతకాన్ని బహూకరించి, ప్రశంసావాక్యాలతో ఆశీర్వదించారు. వీరు "ఖిల్జీ రాజ్య పతనం, సతీ సక్కుబాయి, పల్లె పిల్ల" మొదలగు నాటకాలలో నటించారు. వీరు సాయిలీలలు నాటకంలో "షిర్డీ సాయిబాబా" పాత్ర ధరించి, శ్రీ పైడి లక్ష్మయ్య గారిచే ప్రథమ బహుమతిని, వారి ఆశీర్వాదాలను అందుకున్నారు. శ్రీశైల క్షేత్రంలో "హేమా రెడ్డి మల్లమ్మ" నాటకాన్ని అప్పటి ముఖ్యమంత్రి దామోదరం సంజీవయ్య గారు, ప్రధాన మంత్రి శ్రీ పండిత జవహర్ లాల్ నెహ్రూ గారు, ఇందిరా గాంధీ వచ్చినప్పుడు వారి సమక్షంలో ప్రదర్శించి, ఉత్తమ నటులుగా ప్రశంసింపబడ్డారు. ఈ నాటకాన్ని "కాసు బ్రహ్మానంద రెడ్డి గారు, గవర్నరు భీమసేన్ సచార్, కుప్పుస్వామి అయ్యంగార్, జనరల్ నగేష్" మున్నగు పెద్దల సమక్షంలోనే గాక "విజయవాడ, పెద్దకాకాని, పొన్నూరు, గుంటూరు" మొదలగు ప్రదేశాలలో ప్రదర్శించినప్పుడు వీరు ధరించిన బరమా రెడ్డిపాత్రకు బహుమతులొసగి, సన్మానించారు. వీరు ధర్మవరం గోపాలాచారి గారిచే రచింపబడిన "ద్రౌపది మానసంరక్షణము" అను నాటకాన్ని "దుర్యోధన మయసభ సందర్శనం, సంతాపము" అను రెండు భాగాలుగా పలు ప్రాంతాలలో ఏక పాత్రాభినయముగా ప్రదర్శించి, బహుమతులు, సన్మానాలు గైకొన్నారు. కర్నూలు సిల్వర్ జూబ్లీ కళాశాలలో "దుర్యోధన" ఏకపాత్రాభినయమును ప్రదర్శించినప్పుడు జిల్లా మునసబుగారు ఆనందపరవశముతో వీరఖడ్గాన్ని బహూకరించి, ప్రశంసా పూర్వకంగా ఆశీర్వదించారు. శ్రీ లింగన్నగారు కర్నూలు వైద్యకళాశాల వైద్యవిద్యార్థులకు దర్శకత్వం నెరపి, ఉత్తమ దర్శకులుగా మొమెంటోలు, దుశ్శాలువతో కూడిన ఘనసన్మానాలను పొందియున్నారు.

1970 నుండి కర్నూలు లలిత కళాసమితిలో సభ్యులుగా వుంటూ, "ఫలితం, శ్రీ కృష్ణ రాయబారం, బొబ్బిలి యుద్ధం, చేర్మన్, సమాజం" మొదలగు నాటకాలలో విభిన్న పాత్రలను పోషించి, ప్రేక్షకుల మన్ననలకు పాత్రులైనారు. అనేక ప్రథమ ద్వితీయ బహుమతులను పొందగలిగారు. వీరు కర్నూలు లలిత కళాసమితి సభ్యులుగా వున్నప్పుడు సమితికి స్వంత భవనం, ప్రదర్శనశాల నిర్మాణం, ఒక నృత్యకళామందిరం, శాశ్వత ఆర్థిక వనరులకు, కనీస వసతులకు కృషిచేసి, భూరి విరాళాలు సేకరించి కృతకృత్యులైనారు. శ్రీ డి. రంగముని అను హార్మోనిస్టును లలిత కళాసమితిలో హార్మోనిస్టు గా నియమించారు. "యమాంజనేయ యుద్ధం" అను నాటకాన్ని ప్రాంతీయ స్థాయిలో రాజంపేటలో ప్రదర్శించి ఉత్తమ బహుమతిని పొందినారు. ఇదే నాటకాన్ని రాష్ట్ర స్థాయి నాటకపోటీలలో హైదరాబాదు రవీంద్ర భారతిలో ప్రదర్శింపజేసి, ప్రేక్షకుల ప్రశంసల నందుకున్నారు.

1983లో ఉద్యోగ విరమణ చేసిన తరువాత 1984 నుండి 1987 వరకు లలిత కళాసమితి -కర్నూలు, కార్యదర్శిగా యెన్నుకోబడి సమితి పురోభివృద్ధికి అహర్నిశలు కృషిచేశారు.

1989లో రసమాధురి కళానికేతన్ వారి నిర్వహణలో నవరత్నాలకు సన్మానం చేసినప్పుడు వీరిని నటులుగా గుర్తించి, అప్పటి కరువు శాఖామాత్యులైన శ్రీ బుడ్డా వెంగళ రెడ్డి గారిచే దుశ్శాలువ కప్పించి, పంచరత్నాలతో ఘనంగా సన్మానంచేసి సత్కరించారు. ఇదే సంవత్సరంలో కర్నూలు లలితకళా సమితి అధ్యక్షులు శ్రీ జంపాల శివయ్యగారు, కార్యవర్గ సభ్యులు కలిసి కళాకారులను గుర్తుంచుకోవడం కొరకు శ్రీ లింగన్నగారి ఛాయా చిత్రపటాన్ని లలితకళా సమితి ప్రాంగణంలో ఆవిష్కరింపజేసి, ప్రముఖ పారిశ్రామికవేత్త, కళాభిమాని అయిన శ్రీ టి.జి. వెంకటేశ్ గారిచే దుశ్శాలువ కప్పించి

శ్రీ లింగన్నగారు ప్రస్తుతం "డిప్యూటీ తహసీల్దారు"గా ఉద్యోగ విరమణ చేసి, లలితకళాసమితి కర్నూలు సభ్యులుగా కొనసాగుతున్నారు.

వీరు పౌరాణిక, చారిత్రాత్మక, సాంఘిక నాటకాలలో విభిన్న పాత్రలను యెంతో వైవిధ్యంతో పోషించి, గొప్పనటులుగా గుర్తింపు పొందారు. వీరు రాయలసీమ రత్నంగా ఆంధ్ర నటరత్నాల సరసన చేర్చదగిన మంచి నటులు. నాటక కళామతల్లి ముద్దుబిడ్డ.

## డి. వెంకట నర్సు నాయుడు :

శ్రీ డి. వెంకట నర్సునాయుడు గారు 1926లో కర్నూలుజిల్లా, కోడుమూరు గ్రామంలో జన్మించారు. తండ్రి మాధవయ్య, తల్లి నారాయణమ్మ. చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకొని మాతాపితల ప్రేమకు దూరమయ్యారు. వీరు పెద్దగా చదువ లేదు. తెలుగు మాత్రం చదువను, వ్రాయను నేర్చుకున్నారు. వీరికి సంగీతం, నటనలపై గల అభిమానం, అభిరుచి చదువుపైన లేకపోయింది. అనాథయైన వెంకట నర్సు నాయుడుగారిని కళామతల్లి తన అక్కున చేర్చుకొని ఆదరించింది. వీరికి వంశానుగతమైన సంగీతం, నాటకకళ పుట్టుకతోనే అబ్బినవి. వీరి చిన్నతనంలో కోడుమూరులో హరికథలు, వీధినాటకాలు, తోలుబొమ్మలాటలు విరివిగా ప్రదర్శింపబడుతుండేవి. శ్రీ వెంకట నర్సు నాయుడు అమితోత్సాహంతో వాటిని చూచి, నేర్చుకోవాలన్న తపనతో వాటిని అనుకరించేవారు. శ్రీ వెంకట నర్సుకు మధురమైన కంఠాన్నిచ్చాడు భగవంతుడు. చిన్నప్పుడే పాటలు, పద్యాలను శ్రీ వెంకట నర్సుగారు హరిదాసులు, వీధి భాగవతులను అనుకరించి పాడుతుంటే ఆ పాట మధురంగా వుండేవి.



వీరి గ్రామంలో నాటకాభిరుచి గలవారు సొంత ఖర్చులతో యేదో ఒక నాటకాన్ని నేర్చుకొని తరచూ ప్రదర్శిస్తూ వుండేవారు. శ్రీ నర్సుగారికి నాటకంలో నటించాలన్న కోర్కెకైతే వుందికాని సొంత ఖర్చులు భరించే స్థోమతలేదు. గ్రామస్తులు శ్రీ నర్సుగారిని తమ గ్రూప్‌లో చేర్చుకొని అతని ఖర్చులుకూడా వారే భరించి, వారికి నాటకం నేర్పించి ప్రదర్శించేవారు. ఆ విధంగా శ్రీ వెంకట నర్సు గారికి నాటక ప్రదర్శనలలో పాల్గొనే అవకాశం లభించింది. అందుకు కారణం వారి మధురమైన గాత్రమని చెప్పక తప్పదు. వీరు మొట్టమొదటిసారిగా "ఉద్యోగవిజయం" అను పౌరాణిక నాటకంలో వికర్ణుడుగాను, అభిమన్యుడుగాను రెండు పాత్రలను పోషించి, తన మధురమైన గాత్రంతోను, అభినయ చాతుర్యంతోను ప్రేక్షకుల ఆదరాభిమానాలకు పాత్రులైనారు. ఆ నాటకమే వీరి భవిష్యత్తుకు పునాది వేసింది. ఆ నాటకాన్ని దర్శించినపెద్దలలో పూజ్యులు శ్రీ కల్లూరు శేషయ్య గారు వీరిని ప్రేమాదరాభిమానాలతో చేరదీసి, వారు స్థాపించిన "శ్రీ చెన్నకేశవ నాట్యమండలి"లో చేర్చుకున్నారు.

శ్రీ వెంకట నర్సు గారికి చిన్నతనంలోనే శ్రీ నల్లంచి దుర్గారావు, శ్రీ రాముకోటి, శ్రీ అరెకపూడి పెరుమాళ్ల చౌదరి వంటి సుప్రసిద్ధ నటుల గురుత్వంలో వారి సరసన నటించే భాగ్యం లభించింది. పదహారేండ్ల వయసులో నాటకరంగం ప్రవేశించిన శ్రీ వెంకట నర్సుగారు వైవిధ్యంగల విభిన్న పాత్రలను పోషించి, అనతి కాలంలోనే యెనలేని కీర్తి ప్రతిష్టలార్జించుకొని కళామతల్లికి ముద్దుబిడ్డలైనారు. అటు గురువులకు, ఇటు సంస్థానాధినేతల ప్రేమాభిమానాలకు పాత్రులై, తనకాశ్రయమిచ్చిన మాతృ సంస్థలో ద్వితీయాధినేతయై, దాని పురోభివృద్ధికి అహర్నిశలు కృషిచేసిన కళారాధకుడు, బహుముఖ ప్రజ్ఞాశాలి శ్రీ వెంకట నర్సు నాయుడుగారు. వీరు పెద్దవారైన తరువాత కొంతకాలం హార్మోనిస్టుల సంగీత శిక్షణ పొందినారు.

1945లో ఉండవెల్లి నాటక పోటీ ప్రదర్శనలో పాల్గొని ఉత్తమనటులుగా యెన్నిక అయినారు. ఆ సమయంలోనే శ్రీ వెంకట నర్సుగారిని "రాయలసీమ నటరత్న" బిరుదము వరించింది. ఆ తరువాత వీరు వృత్తి కళాకారుల జాబితాలో చేరి కళాసేవ చేశారు. వీరు ప్రముఖ రంగస్థల నటులు "శ్రీ పీసపాటి నరసింహ మూర్తి, శ్రీ ఏ.వి. సుబ్బారావు, శ్రీ షణ్ముఖి ఆంజనేయ రాజు, శ్రీ సంపత్‌నగరు లక్ష్మణ రావు, అమరపు సత్యనారాయణ గుప్త" మొదలగువారి సరసన, వారికి సమానంగా నటించి పెద్దలైన వారి ప్రశంసలు, దీవనలు అందుకున్నారు. వీరు "శ్రీకృష్ణరాయబారం, కురుక్షేత్రం, గయోపాఖ్యానం" నాటకాలలో అర్జున పాత్రను అమోఘంగా ప్రదర్శించి, వెండి గాండీవమును బహుమతిగా అందుకున్నారు. శ్రీ కృష్ణపాత్రకు ప్రత్యేక వొరవడి దిద్దిన ఘనత శ్రీ వెంకట నర్సుగారికే దక్కుతుంది. ఇక చింతామణి నాటకంలో 'భవాని' పాత్రను తనదైన ప్రత్యేక శైలిలో నటించి, స్వంతం చేసుకున్నారు. "రామాంజనేయ యుద్ధం" నాటకంలో శ్రీ రామ పాత్రను ధరించి, ప్రజారంజకంగా అనేక ప్రదర్శనలిచ్చి, వారి ఆదరాభిమానాలను చూరగొన్నారు. వీరు సుమారు రెండువేల

1960 శ్రీ నాయుడుగారు "శ్రీ వెంకటేశ్వర నాటక సమాజము"ను స్థాపించి, "శ్రీకృష్ణ లీలలు, శ్రీ కృష్ణ తులాభారము, శ్రీ కృష్ణ రాయబారము, గయోపాఖ్యానము, లవకుశ, బాలనాగమ్మ, కురుక్షేత్రం, సత్యహరిశ్చంద్ర, సతీ సావిత్రి, ఖిల్జీ రాజ్యపతనము" వంటి ఆనాటి ప్రౌఢ నాటకాలను రాయలసీమ నలుమూలలా ప్రదర్శించి, కళాభిమానులచేత సన్మానములందుకున్నారు. బహుమతులుగాను "ద్విహస్త కంకణాలు, పతకాలు, గాండీవము, చక్రము, మురళి, కొరడా" మొదలగువానిని స్వీకరించిన మేటినటులు.

1975లో "ఏలూరు తెలుగు దర్బారు"వారు, 1978లో "రవీంద్ర ఆర్ట్స్-కర్నూలు" వారు, 1980లో "బాలాజీ నాట్యమండలి-భీమవరం"వారు శ్రీ వెంకట నర్సు నాయుడుగారికి ఘనంగా సన్మానాలు చేశారు. రెండవపర్యాయం భీమవరం బాలాజీ నాట్యమండలి వారు "ఆంధ్రనాటక కళాసుధాకర" అను రెండవ బిరుదమునిచ్చి, శ్రీ నాయుడుగారిని ఘనంగా సత్కరించారు. ఏలూరు తెలుగు దర్బారులో వీరికి కనకాభిషేకము జరిపి, యెంతో ఘనంగా సన్మానించారు. సంగీతంలోను, నటనలోను శ్రీ వెంకట నర్సు నాయుడుగారు తనదంటూ ఒక ప్రత్యేక బాణిని సృష్టించుకున్న ఘనులు. నాటకకళే వీరికి ఊపిరి. వీరి జీవితమే ఒక నాటక వ్యవస్థ. ఇంతటి కళాతపస్విని కన్నందుకు రాయలసీమ ధన్యమైందని చెప్పకతప్పదు. వీరు 1988లో తమ స్వంత గ్రామంలో కళామతల్లి ఒడిలో కన్నుమూశారు.

### బియ్యాల రఘురాముడు :



శ్రీ బియ్యాల రఘురాముడు గారు 1928లో శ్రీమతి నాగమ్మ, శ్రీ అంబన్న అను పుణ్యదంపతులకు కర్నూలు జిల్లా, ఆత్మకూరు గ్రామంలో జన్మించారు. ఇంటరు వరకు చదువుకున్నారు. జిల్లాపరిషత్ ఆఫీసులో గుమస్తాగాచేరి, అంచెలంచెలుగా యెదిగి, బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరుగా పదవీ విరమణ చేసినారు.

వీరు విద్యార్థిదశనుండే నాటక కళపైన అభిరుచి పెంచుకున్నారు. విద్యార్థిగా వీరు సాంఘిక నాటకాలు ప్రదర్శించారు. కొత్త నాటకసమాజాల స్థాపనకు కారకులైనారు. ఆత్మకూరు, నంద్యాల, గిద్దలూరు, కంభం, కర్నూలు మొదలగు పట్టణాలలో అనేక ప్రదర్శనలిచ్చి ప్రేక్షకుల మన్ననలకు పాత్రులైనారు. వీరికి పేరు ప్రతిష్ట లార్జించి పెట్టినది 'చింతామణి' నాటకంలోని "సుబ్బిశెట్టి" పాత్ర. సుతి మెత్తని హాస్యంతో శ్రీ రఘురామ్‌గారు ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించేవారు. వీరు సినీనటులు శ్రీ సింగీతం శ్రీనివాసరావు గారి దర్శకత్వంలో తయారైన "నీతి-నిజాయితీ" అను సినిమాలో శ్రీకృష్ణమరాజు, నాగభూషణం గార్ల సరసన నటించి అశేష ఆంధ్రప్రేక్షకుల ఆదరాభిమానాలకు పాత్రులైనారు.

శ్రీ బియ్యాల రఘురాముడుగారికి సంజామల, కోయిలకుంట్ల, కోడుమూరు, కర్నూలు మొదలగు పట్టణాలలో ఘనమైన సన్మానాలు జరిగాయి. శ్రీ రఘురాముడుగారు సంఘసేవా కార్యక్రమాలలో కూడ పాల్గొంటూ ఆర్థిక సహాయం అందించేవారు. కర్నూలు డ్రస్ కంపెనీ రంగనాయకులకు, నంది కొట్కూరు రంగన్నకు, కె.సి. శివారెడ్డిగారికి అనేకసార్లు ఆర్థిక సహాయం అందించారు. వీరికి 60 సంవత్సరాలు పైబడినా నేటికీ నాటక కళకోసం కృషిచేస్తూ, నాటకాలలో పాత్రలు పోషిస్తూ, ధర్మకార్యక్రమాలలో పాల్గొంటున్నారు. ఈనాడు కర్నూలు లలిత కళాసమితి ఇంత శోభాయమానంగా ప్రవర్ధమానం కావడానికి, రాయలసీమలోనే గర్వకారణం స్వంతభవనం కలిగి విరాజిల్లుతూ వుండడానికి నిరంతరం కృషిచేసినవారిలో శ్రీ రఘురాముడుగారుకూడ ఒకరు. లలిత కళాసమితి స్థాపించినినాటినుండి సమితిలో సభ్యులుగా వుంటూ అనేక వున్నత పదవులు అలంకరించి, ప్రస్తుతం సమితి గౌరవ సలహాదారుగా వుంటున్నారు. ఇటీవల కర్నూలు పట్టణంలో ఠాగూరు నగరులో నిర్మించిన "సుంకులమ్మ" దేవాలయ నిర్మాణానికి ధనసేకరణ నిమిత్తం విశేషంగా కృషిచేశారు.

శ్రీ రఘురాముడుగారు మంచి నటులు, నిస్వార్థ సేవకులు, దయార్ద్ర హృదయులు.

### లంకా పిచ్చయ్య శాస్త్రి :

శ్రీ లంకా పిచ్చయ్య శాస్త్రిగారు 1930వ సంవత్సరం, కర్నూలు జిల్లా, మార్కాపురం తాలూకా-వెంకటాపురం అగ్రహారంలో శ్రీమతి ఆదిలక్ష్మి, శ్రీ సీతారామ శాస్త్రిగారు అను పుణ్యదంపతులకు జన్మించారు. శ్రీ సీతారామ శాస్త్రిగారు ఆంధ్రదేశంలో సుప్రసిద్ధ హరికథా భాగవతార్లుగా ప్రఖ్యాతిగాంచిన ఆదిభట్ల నారాయణదాసుగారి ప్రియశిష్యులు, గొప్ప సంగీత విద్వాంసులు, భాగవతారులు. శ్రీ సీతారామ శాస్త్రిగారు కుమారునికి 12వ యేటనే కర్ణాటక సంగీతాన్ని అభ్యసింప జేశారు. శ్రీ లంకా పిచ్చయ్య శాస్త్రిగారు గాత్రసంగీతంలో కొంత అభినివేశం సంపాదించారు. అంత చిన్నవయసులోనే నాటక కళామతల్లి శ్రీపిచ్చయ్య శాస్త్రిగారిని ఆహ్వానించింది. పౌరాణిక నాటకంలో ఒక చిన్న వేషంతో శ్రీ శాస్త్రిగారి రంగప్రవేశం జరిగింది.



1950లో శ్రీ శాస్త్రిగారు ఉద్యోగ రీత్యా గుంటూరులోని వెంకట్రామా అండ్ కో లో పనిచేస్తూ "జ్యోతి ఆర్టు థియేటర్స్" అను నాటక సమాజాన్ని స్థాపించి, 10 సంవత్సరాలు 15 మంది కళాకారులకు తన స్వంతఖర్చులతో వివిధ పౌరాణిక నాటకాలలో శిక్షణ యిచ్చారు. వీరితో శ్రీ శాస్త్రిగారు శ్రీ కృష్ణుడుగా, కర్ణుడుగా, బిల్వమంగళుడుగా పాత్రలను పోషిస్తూ, అనేక నాటక ప్రదర్శనలిచ్చి, పలువురి ప్రశంసలకు పాత్రులైనారు.

ప్రతి సంవత్సరం సమాజ వార్షికోత్సవ సందర్భంగా ప్రఖ్యాత రంగస్థల నటులు "శ్రీ పీసపాటి నరసింహ మూర్తి, శ్రీ ఏ.వి. సుబ్బారావు, శ్రీ బందా కనకలింగేశ్వరరావు, శ్రీ స్థానం నరసింహారావు, శ్రీ అద్దంకి శ్రీరాములు, శ్రీ పులిపాటి వెంకటేశ్వరులు, శ్రీ మాధవపెద్ది సత్యం" మొదలగువారికి శ్రీ శాస్త్రిగారు ఘనంగా సన్మానాలు చేశారు.

శ్రీ శాస్త్రిగారు కార్యదర్శిగా 1955లో ఆంధ్రరాష్ట్రస్థాయిలో "రంగూన్ రౌడీ" నాటకాన్ని, 1960లో 'కురుక్షేత్రం' అను నాటకాన్ని నాటక పోటీలుగా నిర్వహించారు. ఈ సందర్భంగానే ప్రముఖ రంగస్థల నటులైన "శ్రీ బుజ్జా సుబ్రమణ్య శాస్త్రి, శ్రీ ఏ.వి. సుబ్బారావు, శ్రీ కందుకూరి చిరంజీవి రావు" మొదలగువారిని రంగస్థలానికి పరిచయం చేసిన ఘనత పిచ్చయ్య శాస్త్రిగారిది.

శ్రీ శాస్త్రిగారు ఉద్యోగరీత్యా 1960లో కర్నూలుకు వచ్చి స్థిరపడ్డారు. శారీరక రుగ్మతకారణంగా చిక్కిశల్యమైన శ్రీ శాస్త్రిగారు నటుని ఆకారాన్ని దృష్టిలోవుంచుకొని, వేషాలు ధరించడం విరమించుకున్నారు. కాని వీరు కళాసేవమాత్రం మానుకోలేదు. ప్రఖ్యాత రంగస్థల నటులచేత అనేక నాటక ప్రదర్శనలను ఏర్పాటుచేసి, కళాభిమానులకు, కళారాధకులకు మంచి నాటకాలను తిలకించే మహద్భాగ్యాన్ని కలిగించారు.

1985లో "శ్రీ పరమహంస నాటక కళాసమితి"కి కార్యదర్శిగా వుంటూ, ఆ సమాజంచేత అనేక నాటక ప్రదర్శన లిప్పించారు. 60 సంవత్సరాలు పైబడినా శ్రీ శాస్త్రిగారు తన జీవితాన్ని నాటకకళకే అంకితంచేసి, విరామసమయాలలో ఇప్పుడుకూడ కొంతమంది ఔత్సాహిక నటులకు శిక్షణనిస్తున్నారు.

శ్రీ శాస్త్రిగారు పెక్కు సన్మానాలను అందుకున్నారు.

రాయలసీమ నాటక కళాపరిషత్, "లొద్దిపల్లె"వారు నిర్వహించిన 1000వ నాటక ప్రదర్శన సందర్భంగా శ్రీ లంకా పిచ్చయ్య శాస్త్రిగారిని ఘనంగా సన్మానించారు.

కర్నూలు జిల్లా సాంస్కృతిక శాఖ వారిచే ఘనమైన సత్కార, సన్మానాలందుకున్నారు.

అకాడమీ అధ్యక్షురాలు శ్రీమతి జమునా రమణా రావుగారు శ్రీ శాస్త్రిగారి కళాసేవకు ముగ్ధురాలై వీరిని యెంతగానో ప్రశంసించి, వీరికి సన్మానం చేశారు.

"సవేరా ఆర్ట్స్-కడప"వారు "శ్రీ రామపాదుకలు" నాటక ప్రదర్శన సందర్భంగా శ్రీ శాస్త్రిగారికి గొప్పగా సన్మానం చేశారు.

శ్రీ లంకా పిచ్చయ్య శాస్త్రిగారు "ముదిమి" మీదపడుతున్నా అంకితభావంతో కళారాధనే జీవిత ధ్యేయంగా కళాసేవ చేస్తున్న నిజమైన కళాకారులు.

నటులుగా, గాయకులుగా, ప్రయోక్తగా, ప్రవోక్తగా, సరళ స్వభావులుగ, సౌజన్యమూర్తిగా రాయలసీమకు వన్నెతెచ్చిన నటరత్నం శ్రీ లంకా పిచ్చయ్య శాస్త్రిగారు.

**దొంతి వెంకట స్వామి :**

శ్రీ దొంతి వెంకటస్వామిగారు 1930వ సంవత్సరం కర్నూలు జిల్లా, కోయిలకుంట్ల తాలూకా, సంజాముల మండలం, ఆర్. లింగముదిన్నె గ్రామంలో జన్మించారు. తల్లి శ్రీమతి సాలమ్మ, తండ్రి శ్రీ కొండయ్య. వీరు 1945వరకు లండన్ మిషన్ స్కూలులో 5వ తరగతి వరకు చదువుకున్నారు. అదే సమయంలో శ్రీ కృష్ణ రాయబారం నాటకంలో ప్రప్రథమంగా నారదునిపాత్ర ధరించడం జరిగింది.



పలుపర్యాయములు ఈ నాటకాన్ని ప్రదర్శించారు. "బొబ్బిలి యుద్ధం" నాటకంలో వెంగళరాయుని పాత్రధరించి, పోటీనాటకాలలో విజయం సాధించారు. శ్రీ బెజవాడ గోపాల రెడ్డిగారు ముఖ్యమంత్రిగా వున్న సమయంలో సంజాములలో జరిగిన నాటక పరిషత్తు (మేలా) కార్యక్రమాలలో "వెంగళరాయుని" పాత్రధరించి మెప్పించినందులకు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ప్రశంసాపత్రంతో సత్కరించారు. వీరు "తారాశశాంకం, కురుక్షేత్రం, గయోపాఖ్యానం" మొదలగు నాటకాలు ప్రదర్శించి ప్రేక్షకుల మన్ననలకు పాత్రులైనారు. వీరు పైనాటకాలలో శ్రీ కృష్ణపాత్రను మిక్కిలి సమర్థవంతంగాను, ప్రజారంజకంగాను పోషించారు. "రామాంజనేయ యుద్ధం"లో ఆంజనేయుని పాత్రకు రూ.1116/- పందెము పెట్టి, పెక్కురంగస్థలములలో గెలుపొంది, ఆంజనేయుని పాత్రలో సమకాలీన నటులలో తనకు తానే సాటి అనిపించుకున్న ఘనులు.

శ్రీ వెంకటస్వామిగారు రేపల్లె శ్రీ బేతా వెంకట్రావుగారి ఎదుట ఆంజనేయుని పద్యాలు పాడి, వారిని మెప్పించినారు. ఆ రోజులలో శ్రీ బేతా వెంకట్రావుగారు ఆంజనేయునిపాత్రను అద్భుతంగా పోషించేవారు. అంతటివారు శ్రీ వెంకటస్వామిగారిని తనతో సమానంగా పాడినావని ప్రశంసించినారు. చిన్నకానాల సుంకులమ్మ తిరునాళ్ళలో తెనాలి నటులతో సమానంగా నటించినందులకు శ్రీ రామాంజనేయ యుద్ధము నాటకమును ప్రదర్శించువారు, వారి సమాజం తరఫున రూ.116/-లు బహుమతిని యిచ్చారు. ఆనాటినుండి ఈనాటివరకు పౌరాణిక నాటకాలలో వేషాలు ధరిస్తూ, సంగీతంలో అభినివేశం సంపాదించారు. మధురమైన గాత్రంతో ప్రేక్షకులను సమ్మోహితులను చేసే గానంతో పాడగలిగిన పాతనటులలో శ్రీ వెంకటస్వామిగారొకరు. శ్రీ బేతా వెంకట్రావుగారిచేత "రాయలసీమ రత్నం" అనిపించుకున్న గొప్పనటులు. అందుకే వీరిని రాయలసీమ నటరత్నాలలో ప్రముఖులుగా పేర్కొనవచ్చును.

### ఎమ్. అల్లాబక్ష్ :



శ్రీ యం. అల్లాబక్ష్ గారు 1931లో కర్నూలు జిల్లా లొద్దిపల్లె గ్రామంలో శ్రీ మహబూబ్ సాహెబ్, శ్రీమతి జమాల్‌బీ అను పుణ్యదంపతులకు జన్మించారు. వీరు జన్మించినపుడు వీరి తల్లిదండ్రులు తమకుమారుడు గొప్ప రంగస్థల నటుడు కావాలనిగాని, అవుతాడనిగాని ఊహించి వుండకపోవచ్చును. అల్లాబక్ష్‌గారు బాల్యంలో మాతామహుల ఇంట పెరిగారు. వీరి మాతామహులనుండి వారసత్వ కళగా జానపద కళారూపమైన వీధినాటకం అబ్బింది. వీరి తాతగారు బెడుదూరి వారి "హరిశ్చంద్ర" మొదలగు వీధినాటకాలను నేర్చుకొని ప్రదర్శిస్తూ, ఇతరులకు నేర్పిస్తూ వుండేవారు. శ్రీ అల్లాబక్ష్‌గారు చిన్నతనంనుండి వీధినాటకాలను అనుకరిస్తూ, భగవంతుడిచ్చిన మధురమైన కంఠంతో పాటలు, పద్యాలు శ్రావ్యంగా పాడుతుండేవారు. అప్పుడప్పుడూ వీధినాటకాలలో వేషాలు వేస్తుండేవారు. ఆ రోజులలో అబ్బూరి సోదరులు అధునాతన పద్ధతులలో రాయలసీమ అంతటా నాటకాలను ప్రదర్శిస్తుండేవారు. వారి రాగాలాపనకు అలవాటుపడ్డారు రాయలసీమ వాసులు. శ్రీ అల్లాబక్ష్‌గారి గాత్ర మాధుర్యాన్ని చవిచూచిన కర్నూలు వాస్తవ్యులు అబ్బూరి సోదరుల పద్ధతిలో నాటక ప్రదర్శనలిమ్మని శ్రీ అల్లాబక్ష్‌గారిని ప్రోత్సహించారు. ఆకర్షణీయమైన ముఖవర్చస్సు, నిండైన విగ్రహం, మధురమైనగాత్రం, స్పష్టమైన వాచకం, శ్రీ అల్లాబక్ష్‌గారిని మహానటునిగా చేశాయి.



శ్రీ అల్లాబక్ష్‌గారు 1953లో "మడివేముల గ్రామం"లో ఉద్యోగం చేస్తూ "పాండవోద్యోగ విజయము" అను పౌరాణిక నాటకం నేర్చుకొని అందులో శ్రీ కృష్ణ పాత్రను ధరించి మొట్ట మొదటిసారిగా మహాద్భుతంగా నటించారు. ప్రథమ ప్రదర్శనలోనే మన్నన లందుకున్న అల్లాబక్ష్‌గారికి నాటక కళపైన అభిరుచి, ఉత్సాహం కలిగింది. అప్పటినుండి "కురుక్షేత్రం, పాండవోద్యోగ విజయము, హరిశ్చంద్ర, గయోపాఖ్యానం, చింతామణి, శ్రీకృష్ణ తులాభారం, రామాంజనేయ యుద్ధం" మొదలగు నాటకాలలో శ్రీ కృష్ణుడు, శ్రీరాముడు, హరిశ్చంద్రుడు, బిల్వమంగళుడు, ఆంజనేయుడు, భవానీశంకరుడు మొదలగు పాత్రలను సమర్థవంతంగా పోషించి ప్రేక్షకులచేత ప్రశంసింపబడ్డారు.

ఆనాడు ఆంధ్రదేశంలో సుప్రసిద్ధ రంగస్థల నటులుగా పేరుగాంచిన "శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి, శ్రీ పులిపాటి వెంకటేశ్వర్లు,

ప్రాంతాలలోగూడ నాటకాలు ప్రదర్శించి ప్రేక్షకుల మన్ననలందుకున్నారు.

ఎన్ని నాటకాలలో యెన్ని విభిన్న పాత్రలను యెంత వైవిధ్యంతోపోషించినా శ్రీ అల్లాబక్ష్ గారికి తృప్తినిచ్చింది, మహానటులుగా గుర్తింపు తెచ్చింది మాత్రం "హరిశ్చంద్ర" పాత్రే.

శ్రీ అల్లాబక్ష్ గారు 1953లో స్వగ్రామమందు "ఆంధ్రనాటక కళాసమితి" అను నాటక సమాజాన్ని స్థాపించి, ఆ సమాజం తరపున "హరిశ్చంద్ర" నాటకాన్ని వెయ్యి (1000) సార్లు ప్రదర్శించి, రాష్ట్రస్థాయిలో హరిశ్చంద్ర పాత్రకు తసదంటూ ఒక ఒరవడిని దిద్దుకున్న నటకావతంసుడు. అల్లాబక్ష్ అంటే "హరిశ్చంద్ర అల్లాబక్ష్" అని ప్రజలలో స్థిరపడ్డారు.

ఒకనటుడు ఒకే నాటకంలో నాయకపాత్రను రంగస్థలంపై వెయ్యిసార్లు ప్రదర్శించడం అన్నది రంగస్థల చరిత్రలోనే చాల అరుదైనది, అపూర్వమైనది. అతి తక్కువమంది నటులు మాత్రమే ఒకేనాటకాన్ని వెయ్యిసార్లకు పైగా ప్రదర్శించగలిగారు. అట్టి అరుదైన నటులలో శ్రీ అల్లాబక్ష్ గారు ఒకరు. హరిశ్చంద్ర పాత్రలో జీవించి ప్రేక్షకులకు కంటతడి పెట్టించేవారు. కొన్ని సందర్భాలలో ప్రేక్షకులకు కంట తడిపెట్టే ఓపికలేక నాటకాన్ని మధ్యలో నిలిపివేసి, ఇక ఏడిపించవద్దు అని రంగస్థలంపైననే ప్రార్థించిన సంఘటనలనేకం జరిగాయి. జన్మతః ముస్లిం అయినప్పటికి, హిందూపౌరాణిక నాటకాన్ని గ్రహించి, హిందువుకన్నా మిన్నగా నటించి కళకు కులమతభేదాలు అడ్డురావని నిరూపించిన ఉత్తమ కళాకారుడు శ్రీ అల్లాబక్ష్ గారు.

1963లో ఆంధ్రనాటక కళాపరిషత్తువారు హైదరాబాదులో నిర్వహించిన 'హరిశ్చంద్ర ఏక పాత్రాభినయం పోటీ'లలో ప్రథమ బహుమతినందుకున్నారు.

1964లో తిరుపతి శ్రీ వేంకటేశ్వర నాట్యకళాపరిషత్తులో ప్రదర్శించిన హరిశ్చంద్ర నాటకానికి ప్రథమ బహుమతి, హరిశ్చంద్ర పాత్రకు ఉత్తమనటుని బహుమతి లభించాయి. ఆ సందర్భంగా ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు బహుమతి ప్రదానం చేస్తూ, హరిశ్చంద్ర పాత్రధారి శ్రీ అల్లాబక్ష్ గారి నటనను గొప్పగా ప్రశంసించారు. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని అనంతపురం పౌరులు వీరిని మేళతాళాలతో ఊరేగించి, సన్మానంచేసి, ఘనంగా సత్కరించారు.మహబూబ్ నగర్ జిల్లా, కొల్లాపురంవారు వీరికి సీతారామలక్ష్మణ ఆంజనేయ రజతపతకాన్ని బహూకరించి, సత్కరించారు. పెసరవాయి సిద్ధాంతిగారు పద్య పంచరత్నాలతో సన్మానించారు. కర్నూలు జిల్లా, నంద్యాల తాలూకా, పెసరవాయి గ్రామంలోను, కడప జిల్లా, జమ్మలమడుగు లోను, టంగుటూరులోను అనేక సన్మానాలందుకున్నారు. పుట్టపర్తి సాయిబాబా జన్మదిన సందర్భంగా సత్యహరిశ్చంద్ర నాటకాన్ని ప్రదర్శించి బాబా ఆశీస్సులందుకున్న ఏకైక నటులు శ్రీ అల్లాబక్ష్ గారు. బెంగుళూరులో హరిశ్చంద్ర నాటకాన్ని చూచి ప్రముఖ కన్నడ నటులు శ్రీ ఉదయకుమార్ శ్రీ అల్లాబక్ష్ గారి నటనను ప్రశంసించారు. వీరికి "ఎమ్మిగనూరు"లో "నటసార్వభౌమ' బిరుదు ప్రదానం, ఘనమైన సన్మానము జరిగినవి.

1985లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు వీరి ప్రతిభను గుర్తించింది. రాష్ట్రావతరణ సందర్భంగా అప్పటి ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావుగారు రవీంద్ర భారతిలో రూ. 1116/-లు, దుశ్శాలువతో వీరిని ఘనంగా సన్మానించారు. 1981నుండి కొంతకాలం వీరు ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీ సభ్యులుగా పనిచేశారు. అనేక పౌరాణిక నాటకపోటీలలో న్యాయనిర్ణేతగా వ్యవహరించారు.

శ్రీ అల్లాబక్ష్ గారు చలనచిత్ర నటులుకూడ. వీరు విఠలాచార్యగారి "నవగ్రహ పూజామహిమ"లో మహేశ్వరుని పాత్ర ధరించారు.

1985లో శ్రీ అల్లాబక్ష్ గారు హరిశ్చంద్ర నాటకంలో వెయ్యిసార్లు నటించిన సందర్భాన్ని పురస్కరించుకొని కర్నూలులో వీరిని ఘనంగా సన్మానించారు.

శ్రీ అల్లాబక్ష్ గారు నాటకరంగానికి విశిష్టసేవ చేశారు. వీరి కళాసేవను గుర్తించి కర్నూలు లలిత కళాసమితి తన ద్వాదశాబ్ది ఉత్సవాల సందర్భంగా 1991వ సంవత్సరం ఫిబ్రవరి 27వ తేదీన ఘనంగా సన్మానించారు. కరుణరసపోషణలో ఆయనకు ఆయనేసాటి. నాటక లోకంలో, కరుణరసపోషణలో కీర్తి శిఖరాలనధిరోహించిన శ్రీ అల్లాబక్ష్ గారి జీవిత చరిత్ర వర్ధమాన నటులకు మార్గదర్శకం కాగలదు. పెక్కు పౌరాణిక పాత్రలను పోషించి ప్రత్యేకించి "సత్యహరిశ్చంద్రుడు"గా వెయ్యిసార్లు నటించి, మతసామరస్యానికి ప్రతీకగా నిలిచిన అల్లాబక్ష్ గారి ఆదర్శజీవితం భావితరాలకు కనువిప్పు కాగలదు.

శ్రీ అల్లాబక్ష్ గారు మహానటులు, ఉత్తమదర్శకులు, నిశితపరిశీలనా దృష్టిగల న్యాయనిర్ణేత. మీదు మిక్కిలి ఆదర్శ ఉపాధ్యాయులు. రాయలసీమ రత్నాలగనిలో లభించిన వెలలేని అపూర్వమైన రత్నం.

**జంపాల శివయ్య :**



లలితకళలు యెప్పుడూ స్వయం ప్రకాశకాలు కావు. స్త్రీకి పురుషుడు, లతకు పందిరి లేక వృక్షం యొక్క ఆధారం అవసరమైనట్లే, కళకు ఒక ఆధారం, పోషణ, ఆలంబన అవసరం.

పూర్వం రాజులపోషణలో లలిత కళలు ఉచ్ఛదశనందుకున్నాయి. కాకతీయ చక్రవర్తులు, విజయనగర సామ్రాట్టుల కాలంలో కళలు కళకళలాడాయి. మూరురాయరగండ, లలితకళాసమరాంగణ సార్వభౌముడుగా జగద్విఖ్యాతి గాంచిన శ్రీకృష్ణదేవరాయలకాలంలో లలితకళలు మహోన్నత స్థాయినందుకున్నాయి. విజయనగర లలిత కళోద్యానవనంలో, సాహిత్యం ప్రబంధపుష్పాలు పూయించింది. సంగీతం సౌరభాలను వెదజల్లే సుగంధ సుమాలను వికసింప జేసింది. నాట్యం మురిపించే మువ్వల రవళిలో అమరావతిలోని అప్సరసల నృత్యవిన్యాసాలను భువనవిజయంలో ప్రతిబింబించింది. శిల్పం అందాల భామల అపురూప సౌందర్యాన్ని, నాట్యభంగిమలను కఠినపాషాణాలలో కమనీయంగా, కనువిందుగా ప్రతిసృష్టి చేసింది. చిత్రలేఖనం ప్రకృతి అందచందాలకు కుంచెకొసలతో తుదిమెరుగులు దిద్దింది. ఆనాడు కళలకు కాణాచి విజయనగరం, రాయలసీమకు తలమానికం.

నేడా ప్రాభవానికి నోచుకోలేదు కళలు. ఈనాటి ప్రజాపాలనలో ప్రజలే కళాపోషకులు. అటువంటి కళాపోషకులలో శ్రీ జంపాల శివయ్యగారొకరు. వీరు కళారాధన, కళాపోషణలకై నిర్మించదలచుకున్న కళాభవనానికి "శ్రీ జానకి నందప్ప లలిత కళాసమితి నృత్య కళామందిరం" అని పేరు పెట్టారు.

లలిత కళాసమితి ప్రాంగణంలో రూ.25,000/- లు ఖర్చుపెట్టి, కనీస సదుపాయాలు కల్పించడం జరిగింది. అధ్యక్షులు శ్రీ జంపాల శివయ్య గారి కృషితో శ్రీ కూసుపాటి నారాయణరెడ్డి జ్ఞాపకార్థం శ్రీమతి కూసుపాటి నాగ లక్ష్మమ్మగారు రూ. 25,000/ భూరివిరాళాన్ని ఇచ్చారు. ప్రముఖ పారిశ్రామిక వేత్త శ్రీ టి.జి.వెంకటేశన్ గారి వద్దనుండి రూ.15,000/- లు విరాళాన్ని సేకరించి, లలిత కళాసమితి భవనానికి సంబంధించిన గదుల నిర్మాణం పూర్తిచేయడం జరిగింది.

1987లో కర్నూలు లలిత కళాసమితి, హైదరాబాదు తెలుగు విశ్వవిద్యాలయంవారు సంయుక్తంగా సమితిలో రాయలసీమ ప్రాంతీయ స్థాయి సాంఘిక నాటక, నాటికలపోటీలు నిర్వహించడం జరిగింది. తెలుగు విశ్వవిద్యాలయ కులపతి శ్రీ తూమాటి దొణప్పగారు పై కార్యక్రమాలను వీక్షించి, శ్రీ జంపాల శివయ్యగారి కార్యదక్షతకు ముగ్ధులై, వారిసేవలకు తగినవిధంగా అప్పటి ఆంధ్రప్రదేశ్ భారీ నీటిపారుదల శాఖామాత్యులు శ్రీ కె.ఇ.కృష్ణమూర్తిగారిచే శ్రీ శివయ్యగారికి ఘనంగా సన్మానంచేయించి, తెలుగు విశ్వవిద్యాలయ జ్ఞాపికను బహూకరించారు.

అధ్యక్షులు శ్రీ జంపాలశివయ్యగారి ప్రోత్సాహ, పోద్బలముల కారణంగానే శ్రీ లలిత కళాసమితి యెక్కువ నాటక ప్రదర్శనలు, సాంస్కృతిక కార్యక్రమాలు నిర్విరామంగా జరుగుతున్నవి. వీరు నటులుకాకపోయినా, నాటక కళామతల్లికి శక్తివంచన లేకుండా నిత్యసేవలో నిమగ్నమైన కళారాధకులు.

శ్రీ శివయ్యగారు 1932లో శ్రీ జంపాల వీరన్న, శ్రీమతి సీతమ్మ అను పుణ్యదంపతులకు కర్నూలు పట్టణంలో జన్మించారు. స్వతంత్రభావాలుగల వ్యక్తి అవడంచేత ఇంటరు వరకు చదివి, వ్యవసాయవృత్తిని చేపట్టారు. వీరికి చిన్నతనంనుండి లలిత కళలంటే అమితాసక్తి. కర్నూలు పట్టణంలో డాక్టరు శ్రీ కె.వి. చలపతిగారి ఆధ్వర్యంలో 1968లో లలిత కళాసమితి స్థాపింపబడింది. శ్రీ చలపతిరావుగారి ప్రోద్బలంతో శ్రీ జంపాల శివయ్యగారు 1972లో లలిత కళాసమితిలో కార్యవర్గసభ్యులుగా చేరినారు. 1972 నుండి 1975వరకు సమితి కార్యవర్గసభ్యులుగాను, 1975 నుండి 1977 వరకు సంయుక్త కార్యదర్శిగాను, 1975 నుండి 1977 వరకు ఉపాధ్యక్షులుగాను వివిధ పదవులను సమర్థవంతంగా నిర్వహించారు. 1982లో శ్రీ జంపాల శివయ్యగారు "లలిత కళాసమితి"కి అధ్యక్షులుగా యెన్నికై ఇప్పటికీ ఆ పదవిలో కొనసాగుతున్నారు.

వీరు అధ్యక్షులైన తరువాత సమితికి శాశ్వత ఆర్థికవనరులు సమకూర్చు నిమిత్తం "శ్రీ కృష్ణరాయబారం" అను పౌరాణిక నాటకాన్ని సమితి సభ్యులచేత ప్రదర్శింపజేసి, తద్వారా వసూలైన రూ.50,000/- లు విరాళాలతో సమితికి సంబంధించిన ఖాళీ స్థలంలో రెండుషాపులు నిర్మింపజేశారు.

'లలిత కళాసమితి'కి శాశ్వతమైన నృత్యప్రదర్శనశాల, ఒకహాలు అవసరమని గుర్తించి, శ్రీ జానకినందప్పగారి సోదరుడు శ్రీ పుల్లప్పగారు ఇచ్చిన రూ.10,000/-లు భూరి విరాళానికితోడు సమితి సభ్యులచే "బొబ్బిలియుద్ధం" అను నాటకాన్ని ప్రదర్శింపజేసి, తద్వారా వచ్చిన రూ.50,000/-లతో నిర్మాణం పూర్తిచేయడం జరిగింది. "తిరుపతి, రాజంపేట, హైదరాబాదు, రవీంద్రభారతి" మొదలగు ప్రాంతాలలో జరిగిన నాటకపోటీలలో సమితి తరఫున "యమాంజనేయ యుద్ధం"ప్రదర్శించడం జరిగింది. ఈ నాటకానికి రాజంపేటలో ద్వితీయ ఉత్తమ ప్రదర్శన బహుమతి లభించింది.

ఈనాడు కర్నూలు పట్టణం ఒకసుందరమైన, శాశ్వతమైన లలిత కళాభవనాన్ని పొందగలిగి వున్నదంటే దానికి మూలపురుషుడు డా॥ శ్రీ కె.వి.చలపతిరావుగారు. లలిత కళాసమితి పురోభివృద్ధికి అవిరళకృషిచేసినవారు శ్రీ జంపాల శివయ్యగారు, వారి మిత్రులు, సమితి సభ్యులు, కర్నూలు పట్టణంలోని ఔత్సాహిక నటులు, కళాభిమానులైన పురప్రముఖులు కారకులని చెప్పవచ్చును.

శ్రీ జంపాల శివయ్యగారు సహృదయులు, కళాభిమానంగల కళారాధకులు. స్నేహశీలి. అనుకున్నకార్యాన్ని యెన్ని అవరోధాలు యెదురైనా సడలని పట్టుదలతో సాధించగలదిట్ట. లలిత కళాసమితి ఈనాడంత శోభాయమానంగా దినదినాభివృద్ధి చెందుతూ, ముందుకు సాగిపోతున్నదంటే అందుకు కారణం లలిత కళాసమితి అధ్యక్షులైన శ్రీ జంపాల శివయ్యగారి నిస్వార్ధసేవ, అకుంఠితదీక్ష, నిర్విరామకృషి, కలుపుగోలుతనం అని చెప్పకతప్పదు.

## శ్రీ మాదినేని పాపారావు :



శ్రీ మాదినేని పాపారావుగారు సర్కారు జిల్లాలో జన్మించి, రాయలసీమలో రాణించిన మేటి రంగస్థలనటులు. శ్రీ మాదినేని పాపారావుగారు గుంటూరు జిల్లా, అమరావతి మండలంలో అత్తలూరు గ్రామంలో1934వ సంవత్సరం శ్రీ మాదినేని చంద్రయ్య చౌదరి, శ్రీమతి బూశమ్మగార్లకు జన్మించారు. మొదటి ఫారంనుండి ఇంటరువరకు పశ్చిమ గోదావరి జిల్లా, ఏలూరులో చదువుకున్నారు.ప్రముఖ కూచిపూడి నాట్యాచార్యులు కోరాడ నరసింహారావుగారు ఇంటరువరకు సహవిద్యార్థి. వీరు విద్యార్థి దశలోనే నాటక రంగ ప్రవేశం చేశారు. ఈ దశలోనే శ్రీ పాపారావుగారు పౌరాణిక నాటకాలలో అనేక పాత్రలు ధరించి, వాటిని సమర్ధవంతంగా పోషించి, ప్రేక్షకుల ప్రశంసలందుకున్నారు.

శ్రీ మాదినేని పాపారావుగారు "బొబ్బిలియుద్ధం, శ్రీ కృష్ణరాయబారము, కురుక్షేత్రము, సత్యహరిశ్చంద్ర, శ్రీ రామాంజనేయ యుద్ధం, శ్రీ యమాంజనేయ యుద్ధం," అను నాటకాలలో "వెంగళరాయుడు, ధర్మారాయుడు, అర్జునుడు, అశ్వత్థామ, కర్ణుడు, హరిశ్చంద్రలో వీరబాహు, లక్ష్మణుడు" మొదలగు పాత్రలను పోషించడమేగాక, ఈ నాటకాలకు సమర్ధవంతంగా దర్శకత్వం నిర్వహించారు. వీరికి పేరు ప్రతిష్టలు సంతరించి పెట్టిన పాత్రలు "వెంగళరాయుడు, అర్జునుడు, కర్ణుడు, లక్ష్మణుడు".

1970లో కర్నూలు లలిత కళాసమితిలో సభ్యులుగా చేరి, నాటినుండి నేటివరకు బృందనాయకులుగా, సంయుక్త కార్యదర్శిగా, కోశాధికారిగా, ఉపాధ్యక్షులుగా అనేక పర్యాయాలు యెన్నికై, సమితి ఆర్ధికాభివృద్ధికి అవిరళకృషి చేస్తున్నారు. లలిత కళాసమితి వ్యవస్థాపకులలో ఒకరైన శ్రీ పాపారావుగారు ఈ సమితి ఒక ప్రముఖ కళాసంస్థగా రాణించడానికి వారి కళారాధన, నిస్వార్థసేవ, అకుంఠితదీక్ష యెంతగానో దోహదం చేశాయి.

1960 సంవత్సరంనుండి రాయలసీమ, కర్నూలులో స్థిరపడిన శ్రీ పాపారావుగారు తమ నాటక కార్యకలాపాలకు కర్నూలును కేంద్రంగా చేసుకున్నారు.

కర్నూలు అబ్కారి డిపార్టుమెంటువారు, కర్నూలు తుంగభద్రా ఇండస్ట్రీస్‌వారు, కర్నూలు లలిత కళాసమితివారు వీరి నటనా వైదుష్యానికి ముగ్ధులై ఘనంగా సన్మానించి, మొమెంటోలనందించారు.

ప్రస్తుతం వీరు కర్నూలు బిర్లా కంపెనీలో సెక్షన్ అసిస్టెంటుగా ఉద్యోగం నిర్వహిస్తున్నారు.

శ్రీ మాదినేని పాపారావుగారు గొప్పనటులు, దర్శకులు, నిస్వార్థసేవకులు, నిరాడంబర కళాకారులు. ఆంధ్రకళోద్యానంలో నాటక కళామతల్లి సేవకొరకు పుష్పించిన సుగంధ సుందర కుసుమం, దర్శకరత్నం. రాయలసీమలో రాణించిన మరో నటరత్నం.

గొల్లాపిన్ని ప్రభాకర్ :



శ్రీ గొల్లాపిన్ని ప్రభాకర్ గారు 1935 వ సంవత్సరం, కర్నూలు పట్టణంలో శ్రీమతి గొల్లాపిన్ని చల్లమ్మ, శ్రీ గొల్లాపిన్ని బిందు మాధవశాస్త్రిగార్లకు జన్మించారు. వీరు ఔత్సాహికనటులు. 1958 నుండి నాటకరంగంలో ప్రవేశించారు. వీరు హాస్యప్రియులు. నాటకాలలో హాస్యపాత్రలే పోషించేవారు. వీరిని ప్రప్రథమంగా రంగస్థలానికి పరిచయం చేసినవారు వీరి గురువులైన శ్రీ కోదండరామయ్యగారు. తరువాత వీరిని హాస్యనటులుగా తీర్చిదిద్దినవారు "శ్రీ సిద్దేష్" గారు.

శ్రీ ప్రభాకర్ గారు 1972లో కర్నూలు శ్రీ లలిత కళాసమితి సభ్యులుగా చేరి "బొబ్బిలియుద్ధం, హసన్ ఆలీఖాన్" వంటి చారిత్రక నాటకాలలోను, "హరిశ్చంద్ర, యమాంజనేయ యుద్ధం" వంటి పౌరాణిక నాటకాలలోను, అనేక సాంఘిక నాటకాలలోను హాస్యపాత్రలను పోషించి, ప్రజల మన్ననలకు పాత్రులైనారు.

1972లో హిందూపురంలో జరిగిన నాటక పరిషత్తులో శ్రీ ప్రభాకర్ గారికి ప్రథమ బహుమతి లభించింది. 1978లో కడపవారు నిర్వహించిన నాటక పరిషత్తులో ద్వితీయ బహుమతి లభించింది. ఈ పరిషత్తులో ద్వితీయ హాస్యనటుడుగా, ఉత్తమ ప్రతినాయకుడుగా వీరికి బహుమతులు లభించాయి. హైదరాబాదు"కళారాజ్యం" వారు 1981లో నిర్వహించిన నాటకపోటీలలో ఉత్తమ హాస్యనటుడుగా బహుమతిని అందుకున్నారు. 1988లో ఎమ్మిగనూరులో నిర్వహించిన నాటికల పోటీలలో ఉత్తమ హాస్యనటుడుగా బహుమతిని స్వీకరించారు.

హాస్యం మానవుని జీవితానికి యెంతైనా అవసరం. "సంతోషమే సగం బలం" అన్నారు. మనిషి సంతోషంగా వుంటేనే వాని ముఖంపై హాస్యం లాస్యం చేస్తుంది. మానవుని ఆరోగ్యానికి హాస్యం బలమైన "టానిక్" వంటిది. అటువంటి హాస్యాన్ని అభిమానించే శ్రీ ప్రభాకర్ గారు హాస్యనటులుగా రాణించారంటే అతిశయోక్తి కానేరదు. హాస్యపాత్రలు పోషించడం అందరి నటులకు సాధ్యంకారు. "తను నవ్వకుండా ఇతరులను నవ్వించడమే" హాస్య మనిపించుకుంటుందని ఒకసారి ప్రముఖ సినీనటులు, హాస్యనటచక్రవర్తి శ్రీ రేలంగి వెంకట్రామయ్యగారు తెలియజేశారు. అటువంటి హాస్యాన్ని పోషించే శ్రీ గొల్లాపిన్ని ప్రభాకర్ గారు ధన్యులు. రాయలసీమలోని అరుదైన హాస్యనటులలో ఒకరు. నాటకకళామతల్లి కంఠహారంలో వెలలేని హాస్యనటరత్నం.

రాచమాని శ్రీ రాములు :



శ్రీ రాచమాని శ్రీ రాములుగారు 1935 ప్రాంతంలో కర్నూలుజిల్లా, ఉయ్యాలవాడ గ్రామంలో జన్మించారు. తండ్రి శ్రీ వెంకటస్వామి, తల్లి శ్రీమతి లక్ష్మమ్మ. వీరి కుటుంబంలో అన్నగారు, చిన్నాన్నగారు పౌరాణిక నాటకాలలో పాత్రలు ధరిస్తూ, నటులుగా పేరు ప్రఖ్యాతు లార్జించారు. శ్రీ రాములుగారి చిన్నవయసులో వీరి చిన్నాన్నగారు, అన్నగారు "జయంత జయపాల, భక్తప్రహ్లాద, సత్యహరిశ్చంద్ర" నాటకాలను ప్రదర్శిస్తుండగా చూచి వారిని అనుకరిస్తూ పద్యాలు, పాటలుపాడడం, అభినయించడం అలవాటు చేసుకున్నారు. విద్యాభ్యాసకాలంలో ప్రార్థనాగీతాలు, భక్తిగీతాలు, జాతీయగీతాలు శ్రావ్యమైన కంఠంతోపాడుతూ, పెద్దల ఆశీస్సులను అందుకున్నారు. క్రమక్రమంగా సాంస్కృతిక, కళారంగాలలో పాల్గొన నారంభించారు.

1952లో కర్నూలు ప్రభుత్వ బేసిక్ టీచర్ ట్రైనింగ్ స్కూలులో శిక్షణ పొందుతున్న సమయంలో పాఠశాల వార్షికోత్సవ సందర్భంగా "శ్రీకృష్ణరాయబారము" నాటకములో అర్జున పాత్రను ధరించి ప్రధానోపాధ్యాయుల నుండి బహుమతిని స్వీకరించారు. సాంఘిక నాటకంలో రైతుభార్యగా నటించి పలువురి మన్ననలందుకున్నారు. శ్రీ శ్రీ రాములుగారి నాటకరంగ ప్రవేశానికి వీరి చిన్నాన్నగారు, అన్నగారు ప్రేరణకాగా, తోటి విద్యార్థులమెప్పులు, ఉపాధ్యాయుల ప్రోత్సాహం నాందిపలికాయని చెప్పవచ్చును.

1954లో శ్రీ రాములుగారు "శ్రీ చెన్నకేశవ నాటకమండలి" ని స్థాపించి "కురుక్షేత్రం" నాటకాన్ని పలుసార్లు ప్రదర్శించారు. ఈ నాటకంలో వీరు శ్రీకృష్ణపాత్రను సమర్థవంతంగా పోషించారు. ఆ తరువాత "శ్రీ రామాంజనేయ యుద్ధం, శ్రీకృష్ణార్జున యుద్ధం,

1962లో "శ్రీనవోదయ నాటక కళాసమితి"ని స్థాపించి, "శ్రీకృష్ణరాయబారము" నాటకాన్ని అఖిలభారత ఆకాశవాణి కేంద్రంనుం ప్రసారం చేశారు.

ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీ ఆధ్వర్యంలో "పాదుక" అను నాటకాన్ని దిగ్విజయంగా ప్రదర్శించారు. వీరు అర్జునుడు శ్రీరాముడు, నక్షత్రకుడు, దశరథుడు" మున్నగు పాత్రలను యెంతో నేర్పుతో పోషించిన మంచినటులు.

వీరికి విద్యార్థిదశలో 1953లో అర్జునపాత్రకు ప్రప్రథమంగా బహుమతి లభించింది. 1959లో విద్యార్థులకు "పాండవోద్యోగము నాటకాన్ని నేర్పించి, కర్నూలు జిల్లా పరిషత్తులో ప్రదర్శించినప్పుడు అప్పటి ముఖ్యమంత్రి శ్రీనీలం సంజీవరెడ్డిగారుచూచి వీరి ప్రశంసించి, బహుమతి నొసంగినారు.

1980లో భగవాన్ శ్రీసత్యసాయిబాబా (పుట్టపర్తి)వారి జన్మదిన సందర్భంగా ప్రశాంత నిలయంలో ప్రదర్శించిన హరిశ్చంద్ర నాటకంలో "నక్షత్రక" పాత్రను అద్భుతంగా పోషించి శ్రీసాయిబాబావారిచే సన్మానములందుకున్నారు.

1981లో కర్నూలు నాటకసభవారు ఏర్పాటుచేసిన సన్మాన సభలో ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీ అధ్యక్షురాలు ప్రముఖ సినీన శ్రీమతి జమునా రమణరావుగారిచే సన్మానింపబడినారు.

1982 వ సంవత్సరం ఆంధ్రప్రదేశ్ నాటక అకాడమీవారు రవీంద్రభారతిలో నిర్వహించిన నాటకోత్సవాల కార్యక్రమంల "పట్టభంగరాఘవము" నాటకంలో దశరథపాత్రను పోషించి, తన నటనావైదుష్యాన్ని ప్రదర్శించినందులకు అకాడమీ అధ్యక్షురాలు శ్రీమ జమునగారు వీరిని ఘనంగా సన్మానించారు.

1988లో ఉగాది పండుగ సందర్భంగా తెలుగు విశ్వవిద్యాలయంవారు రవీంద్ర భారతిలో ఏర్పాటుచేసిన సన్మానసభలో ఆనాట ముఖ్యమంత్రి శ్రీయన్.టి.రామారావుగారిచే సన్మానము అందుకున్నారు.

వృత్తిపరంగా ఆదర్శప్రాయమైన ఉపాధ్యాయులు, ప్రవృత్తిపరంగా సంగీతజ్ఞానంగల పౌరాణిక పాత్రలను పోషించే ఉత్తమనటులు మంచిదర్శకులు. ఎందరో విద్యార్థులను నటులనుగా తీర్చిదిద్దిన కళాహృదయులు. విద్యార్థిదశనుండి పిల్లలలో నాటకకళపైన అభిరు కలిగించిన కళాభిమాని. ఎక్కడ సాంస్కృతిక కార్యక్రమాలు జరిగినా శ్రీశ్రీరాములుగారు అక్కడికివెళ్ళి వారి కార్యక్రమాలల పాలుపంచుకొని, కార్యక్రమాలు జయప్రదంకావడానికి నిస్వార్థమైన కృషిచేసే కళాప్రియులు. కళలేని జీవితం కళతప్పిన జీవితమై నిస్సారమవుతుందనినమ్మి, కళామయజీవితానికి అలవాటుపడిన కళాజీవి. ఈనాటికీ నాటకాలలో నటిస్తూ, సమాజాలకు దర్శకత్వ నిర్వహిస్తూ, కళామతల్లిసేవలో శేషజీవితాన్ని గడపాలని నిశ్చయించుకొన్న నిజమైన కళారాధకులు, రాయలసీమ నటరత్నం.

## శ్రీయన్. అంకమరావు, బి.ఏ., (యల్.యల్.బి.) :



శ్రీయన్. అంకమరావుగారు గుంటూరుజిల్లా, యేటుకూరు గ్రామంలో 1936లో శ్రీరుద్రయ్య, శ్రీమతి దుర్గమ్మగార్లకు జన్మించారు. ఉద్యోగరీత్యా కర్నూలు ప్రభుత్వవైద్యకళాశాలలో టెక్నీషియన్‌గా పనిచేస్తూ స్వయంకృషితో బి.ఏ., (యల్.యల్.బి.,) వరకు చదువుకున్నారు.

వీరు జన్మించింది సర్కారుజిల్లా అయినా 1958 నుండి కర్నూలులో స్థిరపడ్డారు. వీరికి చిన్ననాటినుండి నాటక కళపైన ఆసక్తి మెండు. కర్నూలు పట్టణంలో "తిరుమల ఆర్ట్సు థియేటరు" అను నాటక సమాజాన్ని స్థాపించి, వ్యవస్థాపక అధ్యక్షులుగా వున్నారు. ఆ సంస్థ ఆధ్వర్యంలో "బొబ్బిలియుద్ధం" అను నాటకాన్ని విశేషంగా ప్రదర్శించి, ప్రేక్షకుల మన్ననలందుకున్నారు. బొబ్బిలియుద్ధం నాటకంలో "బుస్సీదొర, పాపారాయుడు, రంగారాయుడు, హైదర్" పాత్రలను ప్రశంసనీయంగా పోషించారు.

శ్రీఅంకమరావుగారు "కురుక్షేత్రనాటకం"లో దుర్యోధన, భీముని పాత్రలు, "గయోపాఖ్యానం"లో గయునిపాత్ర, "సత్యహరిశ్చంద్ర"లో విశ్వామిత్ర, వీరబాహు పాత్రలు, "చింతామణి" నాటకంలో సుబ్బిశెట్టి పాత్ర తనకు అభిమా పాత్రలుగా చెప్పుకుంటారు.

శ్రీఅంకమరావుగారు ఆంధ్రదేశంలోని ప్రముఖనటులతో కలిసి,రాష్ట్రవ్యాప్తంగా వివిధ పాత్రలను పోషించి, కీర్తిగడించారు. వీ

"దుర్యోధన" ఏకపాత్రాభినయమునకు నెల్లూరు, తిరుపతి – శ్రీ వేంకటేశ్వర నాట్యకళా పరిషత్తులలో ద్వితీయ బహుమతి, కర్నూలు గ్రంథాలయ వార్షికోత్సవాల సందర్భంగా ప్రథమ బహుమతి లభించింది. కడప పట్టణంలో జరిగిన రాష్ట్రస్థాయి పౌరాణిక నాటక పోటీలలో "భీముని" ఏకపాత్రాభినయానికి తృతీయ బహుమతి, తిరుపతి పట్టణంలో 1990 లో జరిగిన అఖిలాంధ్ర పౌరాణిక నాటక పోటీలలో "శ్రీకృష్ణాభిమన్యు" నాటకంలో "చిట్టెయ్య" పాత్రకు ఉత్తమ హాస్యనటులుగా బహుమతి లభించింది. వీరు కర్నూలు లలిత కళాసమితి కార్యదర్శిగా మూడు సంవత్సరాలు పనిచేశారు.

శ్రీ అంకమరావుగారు "రౌద్ర, కరుణ, హాస్య" రస పాత్రలను పోషించి, "ఉభయ నటనా ధురీణ"బిరుదును పొందినారు.

లలిత కళాపరిషత్తు- కర్నూలు వారి పతాకం క్రింద శ్రీ పైడి లక్ష్మయ్యగారిచే రచింపబడిన పలు నాటకాలలో విభిన్న పాత్రలను పోషించి, సన్మానింపబడినారు.

శ్రీ పైడి లక్ష్మయ్యగారు రచించిన "హేమారెడ్డి మల్లమ్మ" నాటకంలో పలుపాత్రలు ధరించి, ఆనాటి ప్రముఖులు, రాష్ట్రపతులు శ్రీ బాబూ రాజేంద్రప్రసాద్, శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ, గవర్నరు శ్రీ పట్టంతాను పిళ్ళై గారలనుండి ప్రశంసా పత్రాలను స్వీకరించారు.

శ్రీ అంకమరావుగారికి కర్ణాటక మాజీ గవర్నరు శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్యగారు, కర్నూలు లలిత కళాసమితివారు, కర్నూలు రాయలసీమ ప్రాంతీయ నాటకోత్సవాలలో శ్రీమతి జమునగారు, కర్నూలు అఖిలాంధ్ర నాటక కళాకారుల సమాఖ్యవారు, కర్నూలు రసమాధురి సంస్థవారు, ఇంకా అనేక సంస్థలవారు యెన్నో ఘనమైన సన్మానాలుచేసి, దుశ్శాలువలతో, పంచరత్నాలతో, ప్రశంసాపత్రాలతో సత్కరించారు.

శ్రీ అంకమరావుగారు పాత్రౌచిత్యం తెలిసి నటించే గొప్పనటులు. ఆంధ్ర నటరత్నాలలో విలువైన ఒకరత్నం. తెలుగు నాటక రంగ వినీలాకాశంలో మిలమిలా ప్రకాశించే మహోజ్జ్వల రంగస్థల నటతార.

## శ్రీ యస్. బాబూసాహెబ్‌గారు :



శ్రీ యస్. బాబూసాహెబ్ గారు 1937 లో కర్నూలు జిల్లా, బనగాన పల్లె తాలూకా, చెరువు పల్లె గ్రామంలో శ్రీ షేక్ కతాల్ సాహెబ్ గారికి జన్మించిన ఒక్కగానొక్క కుమారుడు. చిన్ననాటినుండి నాటక కళపై అభిమానమెక్కువ. శ్రావ్యమైన కంఠం. నోరువిప్పి పాడితే ప్రేక్షకులు ఆనందపరవశులయ్యేవారు. వీరు శ్రీ వీరయ్యాచారి గారి దర్శకత్వంలో శ్రీ పైడి లక్ష్మయ్యగారు రచించిన "వేమారెడ్డి మల్లమ్మ" నాటకంలో వేమారెడ్డి భార్య "పద్మమ్మ" గా నటించి, గొప్పవారి ప్రశంసలనందుకున్నారు. శ్రీ బాబూ రాజేంద్రప్రసాద్‌గారు, శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణగార్ల సమక్షంలో పై నాటకాన్ని పలుమార్లు ప్రదర్శించి, వారి మన్ననలందుకున్నారు.

శ్రీ బాబూసాహెబ్‌గారు "శ్రీకృష్ణరాయబారం"లో శ్రీకృష్ణుడుగాను, కర్ణుడుగాను, బొబ్బిలి యుద్ధంలో "రంగారాయుడు"గాను, "సత్యహరిశ్చంద్ర"లో "నక్షత్రకుడు"గాను వివిధ పాత్రలు పోషించి, ప్రేక్షకులను ఉఱ్ఱూతలూగించేవారు.వీరు స్త్రీ పాత్రలనుగూడ ధరించేవారు.

1975లో "బొబ్బిలియుద్ధం"లో రంగారాయపాత్రను ధరించి, నాటక ప్రదర్శన పూర్తయిన వెంటనే తన బంధుమిత్రులను ఈ లోకంలో వదలి అమరలోకాలకు తరలివెళ్లారు. బ్రతికి వున్నంతకాలం నాటకకళకు సేవచేసిన కళారాధకులు శ్రీ బాబూసాహెబ్‌గారు. రాయలసీమలో ప్రకాశించిన విలువైన నటరత్నం.

## గుద్దేటి శివనాగిరెడ్డి – కర్నూలు జిల్లా :

శ్రీ గుద్దేటి శివనాగిరెడ్డి గారు 1938వ సంవత్సరం కర్నూలు జిల్లా, నందవరం గ్రామంలో శ్రీ గుద్దేటి చంటి సుబ్బారెడ్డి, శ్రీమతి నారమ్మగార్లకు జన్మించినారు. వీరు స్కూలు ఫైనల్ వరకు చదువుకున్నారు. వీరి అన్నగారైన శ్రీ గుద్దేటి ఈశ్వరరెడ్డిగారు పట్టభద్రులు. వీరు పౌరాణిక, జానపద నాటకాలలో ప్రముఖపాత్రలను పోషించేవారు. వీరు "నాగమ్మ, మైరావణ, పాండవోద్యోగ విజయం" మొదలగు నాటకాలలో "మైరావణుడు, మాయల పకీరు, భీముడు" మొదలగు పాత్రలను యెంతో వైవిధ్యంతో పోషించేవారు. చిన్నవాడైన



"లవుడు"గా శ్రీ శివనాగిరెడ్డిగారు రంగస్థల ప్రవేశం చేశారు. ఆ నాటకానికి మంచి పేరు వచ్చింది. "పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది" అన్నట్లుగా శ్రీ శివనాగిరెడ్డి గారికి 'లవుని' పాత్ర ప్రేక్షక లోకంనుండి ప్రశంసల నందించింది. ఆనాటినుండి శ్రీ శివనాగిరెడ్డిగారికి నాటక కళపైన యెనలేని గౌరవప్రతిపత్తు లేర్పడినవి. కళాతృష్ణ చిగురించింది. గొప్పనటుడు కావాలన్న తపన శ్రీ శివనాగిరెడ్డిగారిని ప్రేరేపించింది. ఆ ప్రేరణతో శ్రీ శివనాగిరెడ్డిగారు వెళ్ళి "సూరిబాబు"గారి నాటక సమాజంలో చేరి, "భూకైలాస్, తారాశశాంకం" వంటి యెన్నో నాటకాలను ప్రదర్శించారు. ఒక సందర్భంగా శ్రీ ధూళిపాళ సీతారామ శాస్త్రిగారి దుర్యోధన పాత్రను సందర్శించడం జరిగింది. ఆ పాత్రపైగల అభిమానంతో "దుర్యోధన మయసభ" ఏకపాత్రాభినయం నేర్చుకొని, విజయవాడలో అబ్బూరి "నాటక కళాపరిషత్తు"వారు నిర్వహించిన ఏకపాత్రాభినయ పోటీలలో పాల్గొన్నారు. "కృషితో నాస్తి దుర్భిక్షం" అంటారు. పట్టుదలతో అహర్నిశలు కృషిచేసిన శ్రీ శివనాగిరెడ్డిగారిని పదహారుమంది దుర్యోధనులలో ప్రథమ బహుమతి వరించింది. అదే శ్రీ శివనాగిరెడ్డిగారి జీవితంలో తొలిమలిగెలుపు. ఆనాడు న్యాయనిర్ణేతలుగా శ్రీయుతులు కోడూరుపాటి రామారావుగారు, మల్లాది సూర్యనారాయణగారు, మధుసూదనరావుగారు వ్యవహరించారు. వీరు ముగ్గురు ఆరోజు శ్రీ శివనాగిరెడ్డిగారిని రంగస్థల నటుడుగా పైకిపస్తావని మనసారా ఆశీర్వదించారు. అదిమొదలు శ్రీ శివనాగిరెడ్డిగారు పదకొండు పరిషత్తులలో పాల్గొని దుర్యోధన ఏకపాత్రాభినయమునకు ప్రథమ బహుమతులను అందుకొని, ఒక సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నారు.

ఆ తరువాత మధ్యసీసులో కర్ణుడుగా అనేక నాటకాలలో పాల్గొన్నారు. "శ్రీ కృష్ణరాయబారం" నాటకంలో దుర్యోధనుడుగా, కర్ణుడుగా అనేకసార్లు నటించారు. శ్రీ శివనాగిరెడ్డి గారికి సంగీత స్వర జ్ఞానం కలిగించిన గురువులెవరూ లేరు. నాటకాలలో పద్యాలు పాడడం వీరికి వినికిడివలన లభించిన స్వల్పజ్ఞానమే. శ్రీ శివనాగి రెడ్డిగారు శ్రీ సందుల ఆంజనేయులుగారిని నాటకాల గురువుగా చెప్పుకుంటారు. ఈ గురువుగారు పద్యాలు పాడడంలో కొన్ని మెలకువలు నేర్పారు.

శ్రీ శివనాగిరెడ్డి గారు నాటకరంగంలో ఉన్నత స్థాయి నందుకోవడానికి మూలపురుషులు కడప నివాసి, "కడప సవేరా ఆర్ట్స్" అను నాటక సమాజ అధినేత అయిన శ్రీ ఆళ్ళూరి వెంకటయ్యగారు. శ్రీ శివనాగి రెడ్డిగారు ప్రదర్శించిన దుర్యోధన పాత్రనుచూచి, ముగ్ధులై వారి రామాయణ నాటకాలలో రావణపాత్ర వేయమని కోరినారు.సవేరా ఆర్ట్స్ కిరాయి నాటకాలుగూడ ప్రదర్శిస్తుండేది. ప్రదర్శనకు కొంతపైకం కూడ శివనాగిరెడ్డిగారికి యిస్తామని వారు చెప్పినారు. కాని శివనాగిరెడ్డిగారి మనస్సు ఒప్పుకోలేదు. కళ దైవదత్తమైనది. 'జన్మసంస్కారాన్ని బట్టి లభ్యమయ్యేది కళ' అని నమ్మిన శ్రీ శివనాగిరెడ్డిగారు "కాసులకు అమ్ముడు పోయేది కాదుకళ" అని నిశ్చయించుకొని, శ్రీ ఆళ్ళూరి వెంకటయ్యగారినుండి యెటువంటి ప్రతిఫలం కోరకుండానే రామాయణ నాటకాలలో రావణపాత్రను పోషించడానికి అంగీకరించారు. "ధనంమూలం ఇదం జగత్తు" అని అనుకొనే ఈ రోజులలో ధనాన్ని ఆశించకుండా కళాసేవ చేయడానికి కృతనిశ్చయులైన శ్రీ శివనాగిరెడ్డిగారు నిజమైన కళారాధకులని చెప్పక తప్పదు. 1980లో ఈ అంగీకారం కుదిరింది. ఆనాటినుండి ఈనాటివరకు శ్రీ రెడ్డిగారు "సతీ అహల్య, శ్రీ రామపాదుకలు, శ్రీ రామవనవాసము, శ్రీ రామపట్టాభిషేకము, శ్రీ వాసవీకన్యక" మొదలగు నాటకాలను రాష్ట్రవ్యాప్తంగా వందలాది ప్రదర్శనలిచ్చారు. రావణాసురుడుగా, దేవేంద్రుడుగా తన నటనాప్రతిభను ప్రదర్శించారు.

శ్రీ వేంకటేశ్వర నాట్య కళాపరిషత్తు - తిరుపతి వారు నిర్వహించిన పౌరాణిక నాటకాలలో పాల్గొని, మూడు సంవత్సరాలు వరుసగా ఉత్తమ ప్రతినాయకుడుగా ఈనాటి ప్రముఖ సినీనటుడు శ్రీ చిరంజీవి, ప్రముఖ దర్శక నిర్మాత యం.యస్.రెడ్డి, పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షురాలు శ్రీమతి వనజా అయ్యంగార్లనుండి బహుమతులను స్వీకరించారు. తెలుగు విశ్వవిద్యాలయంవారు నిర్వహించిన రాష్ట్రస్థాయి పౌరాణిక నాటక పోటీలలో రెండు సంవత్సరాలు వరుసగా శ్రీ శివనాగిరెడ్డిగారు నటించిన నాటకాలకు ఉత్తమ ద్వితీయ బహుమతులు లభించాయి. 1989లో తెలుగు విశ్వవిద్యాలయం వారు నిర్వహించిన పోటీలలో కీ.శే. "కళాప్రపూర్ణ పైడి లక్ష్మయ్య"గారి అవార్డును అందుకొని తెలుగు విశ్వ విద్యాలయంవారిచే శుక్ల నామ సంవత్సర ఉగాది సందర్భంగా అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి పద్మశ్రీ, నటరత్న శ్రీ యన్.టి. రామారావుగారిచే సన్మానింపబడినారు.

శ్రీ రెడ్డిగారిని సన్మానించారు. ఆనాటి జిల్లా కలెక్టర్ అశోక్ కుమార్ తిరిగి వీరికి సన్మానం చేశారు. తెలుగు విశ్వవిద్యాలయంవారు వీరిని ఉత్తమ నటుడుగా యెన్నుకున్న సందర్భాన్ని పురస్కరించుకొని నంద్యాల వాస్తవ్యులు ప్రముఖ పారిశ్రామిక వేత్త శ్రీ ఎస్.బి.వై. రెడ్డిగారు వీరి రావణ పాత్రకు ముగ్ధులై ఒక తులం బంగారు ఉంగరం బహూకరించి సన్మానించారు. ఆరోజే ప్రముఖ రంగస్థల నటులు శ్రీ బుర్రా సుబ్రమణ్య శాస్త్రిగారు శ్రీ రెడ్డిగారికి దుశ్శాలువకప్పి, పంచరత్నాలతో (పద్యాలు) సత్కరించి, సన్మానించారు. "అరుణభారతి సాంస్కృతిక సంస్థ", "మద్రాసు కళాసాగర్," "బెంగుళూరు మేలుకలయిక," వారు ఒరిస్సా రాష్ట్రంలో "బర్హంపూర్ తెలుగుసమితి" ఇత్యాది రాష్ట్ర, రాష్ట్రేతర ప్రముఖ సాంస్కృతిక సంస్థలచేత సన్మానాలందుకున్నారు. ఇటీవలికాలంలో జరిగిన తెలుగు మహాసభలలో పాల్గొన్నప్పుడు సుప్రసిద్ధకవి ఆచార్య శ్రీ సి.నారాయణ రెడ్డిగారి ఆశీస్సు లందుకున్నారు.

శ్రీ శివనాగిరెడ్డిగారు ఇప్పటివరకు రెండువందల నాటక ప్రదర్శనలలో పాల్గొన్నారు. వీరు "దుర్యోధన, రావణ, కర్ణ, విశ్వామిత్ర, దేవేంద్రుడు, అశ్వత్థామ, బభ్రువాహన, దామోదరుడు, గయుడు, నీలకంఠశాస్త్రి, యయాతి, శకుని" మొదలగు పాత్రలను యెంతో వైవిధ్యంతో పోషించి, ప్రేక్షకుల మన్నన లందుకున్నారు. "అహల్య" లో దేవేంద్రుడు పాత్రకు పెక్కు బహుమతులందుకున్నారు.

శ్రీ శివనాగిరెడ్డిగారు ప్రముఖ రంగస్థల నటులైన శ్రీయుతులు "షణ్ముఖి ఆంజనేయరాజు, వెంకటసర్సు నాయుడు, ధూళిపాళ సీతారామ శాస్త్రి, పీసపాటి, డి.వి.సుబ్బారావు" మొదలగువారి సరసన నటించారు. సూరిబాబు నాటకట్రూపులోను, డి.వి.సుబ్బారావుట్రూపులోను నటించారు.

వీరు ఆకాశవాణి కళాకారులు. ఆకాశవాణి కడప కేంద్రంనుండి పెక్కు సాంఘిక, పౌరాణిక, చారిత్రక నాటకాలను ప్రసారం చేశారు. కర్నూలు జిల్లానుండి బి.హై. ఆర్టిస్టుగా కడప రేడియో నాటకాలలో ఈ నాటికీ పాల్గొంటున్నారు.

శ్రీ శివనాగిరెడ్డిగారు ఒక సినిమాలోకూడ నటించారు. వీరి నటనకు ముగ్ధులై ప్రముఖ సినీ నిర్మాత శ్రీ యం.ఎస్.రెడ్డిగారు "ఓ ప్రేమ కథ" సినిమా తీస్తూ ఒక చిన్నపాత్ర నిచ్చారు. ఈ సినిమా ఆర్థికంగా దెబ్బతిన్నది.

శ్రీ శివనాగిరెడ్డిగారు "ఢిల్లీ, ఒరిస్సా, మద్రాసు, గుల్బర్గా, బెంగుళూరు" మొదలగు ఇతర రాష్ట్రాలలోను, స్వరాష్ట్రంలో "హైదరాబాదు, విజయవాడ, రాజమండ్రి, అన్నవరం, వరంగల్లు, విశాఖ పట్టణం, కర్నూలు, అనంతపురం, తిరుపతి" మొదలగు అనేక ప్రాంతాలలో పలుప్రదర్శనలిచ్చి, ప్రేక్షకుల మన్ననలతోబాటు, పెక్కు బహుమతులను అందుకున్నారు.

శ్రీ శివనాగిరెడ్డిగారి వలె వీరి అర్ధాంగి కళావతిగారుకూడ ఒక కళాకారిణి. వీరు మధురమైన గాత్రంతో చక్కగా పాడగలరు. వీరి ప్రోత్సాహం శ్రీ శివనాగిరెడ్డిగారికి కొండంత అండ.

శ్రీ శివనాగిరెడ్డిగారికి చక్కటి విగ్రహం, మధురమైన గాత్రం, స్పష్టమైన వాచకం, సమయస్ఫూర్తి, అకుంఠితదీక్ష, అవిరళకృషి, భగవంతుడిచ్చిన వరాలు. సంభాషణలు విరిచి భావగంభీరంగా చెప్పడం ఆయన ప్రత్యేకత. వీరి నటనలో ఒక విలక్షణత గోచరిస్తుంది.నాటక రంగానికి వీరి జీవితాన్నంతా ధారపోయాలన్నది వీరి జీవితాశయంగా చెబుతారు. వీరు చిన్నతనంలో 16 సంవత్సరాలు గ్రామ మునసబుగా పనిచేశారు. ఇటీవలి కాలంలో రాజకీయాలలో చేరి మండల ప్రెసిడెంటుగా కూడా యెన్నికైనారు. విషయ సేకరణ సందర్భంగా ఒకసారి వీరిని కర్నూలులో కలిసినప్పుడు వీరు తమ అభిప్రాయంగా అనినమాటలివి. "ఉన్నత పదవులను అలంకరించినా నాటకంలో వేషం ధరించి, పద్యాలు పాడడంలో వున్నంత తృప్తి, ఏపదవిలోను నాకు కలగలేదు" అని అన్నారు. ఆయన విషయంలో అది నిజమేనేమో ననిపిస్తుంది. ఇంతటి కళారాధకులు ఆధునిక నటులలో అరుదుగా కనిపిస్తుంటారు.

శ్రీ శివనాగిరెడ్డిగారు గొప్పనటులు. "కళ కాసుల కోసం కాదు. కళ కళ కోసం సమాజం కోసం" అని నమ్మిన కళోపాసకులు. మంచి దర్శకులు. ఔదార్యం వీరి సొమ్ము. దయాదాక్షిణ్యాలు గల మానవతావాది. స్నేహపాత్రులు. మంచిమనిషి.

**కప్పగంతుల రామశర్మ :**

శ్రీ కప్పగంతుల రామశర్మగారు 1938వ సంవత్సరం, అనంతపురం జిల్లా, గుంతకల్లు గ్రామంలో శ్రీమతి పద్మావతమ్మ, శ్రీ వెంకట సుబ్బయ్య అను పుణ్యదంపతులకు జన్మించారు. వీరు 1966లో నాటక రంగ ప్రవేశం చేశారు. ప్రారంభదశలో శ్రీ రామశర్మగారు సాంఘిక నాటకాలైన "పెళ్ళిచూపులు, పెండింగ్‌ఫైలు, చేర్మన్, సి.ఐ.డి." మొదలగు నాటకాలలో తగిన పాత్రలను పోషించారు. వృత్తి రీత్యా వీరు కర్నూలులో స్థిరపడ్డారు.

ఆ తరువాత కర్నూలులోని శ్రీ లలిత కళాసమితిలో సభ్యులుగా చేరి, దర్శకరత్న శ్రీ మాదినేని పాపారావుగారి దర్శకత్వంలో



"బొబ్బిలియుద్ధం, శ్రీకృష్ణరాయబారము, శ్రీయమాంజనేయ యుద్ధము," మొదలగు నాటకాలలో "తాండ్రపాపారాయుడు, ధర్మారాయుడు, హైదరుజంగ్, భీముడు, కర్ణుడు, అశ్వత్థామ, యమధర్మరాజు" పాత్రలను సమర్థవంతంగా పోషించి, ప్రజల ప్రశంసలను అందుకున్నారు.

తరువాత లలిత కళాసమితివారు నిర్వహించిన "శ్రీకృష్ణాంజనేయయుద్ధం" లో గరుత్మంతునిపాత్రను, "శ్రీకృష్ణాభిమన్యు" నాటకంలో భీముని పాత్రను పోషించి సాంఘిక నాటకాలలోనే గాక పౌరాణిక, చారిత్రాత్మక నాటకాలలోకూడ వైవిధ్యంగల పాత్రలను పోషించి, ఉత్తమ కళాకారులుగా గుర్తింపు పొందారు.

దర్శకరత్న శ్రీమాదినేని పాపారావుగారి ప్రోత్సాహ, ప్రోద్బలాలతో పౌరాణిక నాటకాలలో ప్రవేశించి, వారి శిక్షణలో నటులుగా తీర్చిదిద్దబడిన శ్రీకప్పగంతుల రామశర్మగారు శ్రీపాపారావుగారిని ప్రథమగురువుగా సగర్వంగా చెప్పుకుంటారు.

వీరు చదువుకున్నది తక్కువే అయినా న్యాయవ్యవస్థ ఉద్యోగంలోచేరి, 27 సంవత్సరాలు మచ్చలేని మనిషిగా ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తించి, ఐచ్ఛికంగా పదవీ విరమణ చేశారు.

శ్రీకప్పగంతుల రామశర్మగారు పాత్రకు తగిన ఆకారం, శ్రావ్యమైన కంఠం గలవారు. శ్రీవేంకటేశ్వర నాట్య కళాపరిషత్తు - తిరుపతి వారు నిర్వహించిన పౌరాణిక నాటక పోటీలలో శ్రీకృష్ణాభిమన్యు నాటకంలో భీముని పాత్రను పోషించి, ప్రేక్షకుల మన్ననలకు పాత్రులైనారు. రాయలసీమ నటరత్నాలలో చేర్చతగినవారు.

## శ్రీపాండురంగయ్య : పెద్దపాడు గ్రామం :

శ్రీపాండురంగయ్యగారు 1938లో కర్నూలు జిల్లా, పెద్దపాడు గ్రామంలో జన్మించారు. వీరి తండ్రి శ్రీ మాధవస్వామిగారు, తల్లి శ్రీమతి అలివేలు మంగమాంబ. వీరి 5 వ యేటనే తండ్రి శ్రీమాధవస్వామిగారు మరణించడంతో వీరి కుటుంబం అష్టకష్టాలకు గురైంది. పేద కుటుంబంలో పుట్టిన శ్రీపాండురంగయ్యగారు పెద్దచదువులు చదువలేకపోయారు. 9వ తరగతికి మించి చదువు సాగలేదు. గత్యంతరంలేక తన 15వ యేట 1953లో ప్రప్రథమంగా సహచరులతో కలిసి, శ్రీబోయ భీమన్న రచించిన "ధన్యజీవి" (కూలిరాజు) అను నాటకంలో "పరంజ్యోతి" అను స్త్రీ పాత్రతో రంగస్థల ప్రవేశం చేశారు. పరంజ్యోతి పాత్ర ప్రజామన్ననలకు పాత్రమైంది. పాఠశాల చదువుకు స్వస్తిచెప్పి, మేనమామగారైన అష్టావధాని శ్రీరామాపురం వెంకటకవి నాశ్రయించి, సంస్కృతాంధ్రభాషలను చదువుకున్నారు. చక్కటి వాచకం, మధురమైన గాత్రం శ్రీపాండురంగయ్యగారిని నాటక కళవైపు ఆకర్షితునిగా జేశాయి. కళాతృష్ణగల వీరికి సర్వశ్రీ ఆర్. లక్ష్మిరెడ్డి, పి. తిరుమలరావు, బోయ ఎల్లప్ప, జి.రామిరెడ్డి, కె. చిన్నమద్దయ్య మొదలగు గ్రామపెద్దల ప్రోత్సాహం లభించింది. 16 సంవత్సరాల వయసులో "కురుక్షేత్రం" అను పౌరాణిక నాటకంలో శ్రీకృష్ణపాత్రను పోషించి, నటజీవితంలో అడుగుపెట్టారు. ఆ తరువాత "సత్య హరిశ్చంద్ర" నాటకంలో హరిశ్చంద్రుడుగా, "శ్రీకృష్ణతులాభారం"లో శ్రీకృష్ణుడుగా స్వంత సమాజంద్వారా పలుచోట్ల అనేక ప్రదర్శనలిచ్చి ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు.



శ్రీపాండురంగయ్యగారు నాటక కళారంగంలో ప్రవేశించిన తరువాత వీరి బాల్య స్నేహితులు శ్రీ ఆర్.ఎల్లారెడ్డిగారు వీరిని అనేక విధాలుగా ఆదుకొని, నాటక కళామతల్లికి సేవచేయమని ప్రోత్సహించినారు. తరువాత వీరి బంధువు శ్రీకల్లూరు శేషయ్యగారు శ్రీపాండు రంగయ్యగారిని కల్లూరికి పిలిపించి శ్రీ దుర్గారావుగారి శిక్షణలో పాత్ర పోషణలో మెలకువలను, సంభాషణలో పటిష్టతను, పద్యాల పొందికను, గానంలో గమకాన్ని నటనలో నైపుణ్యాన్ని నేర్చుకున్నారు. శ్రీకల్లూరు శేషయ్యగారు ఉత్తమ కళాకారులు, కళాపోషకులు, పెక్కుమంది కళాకారులను పోషించారు. శ్రీపాండు రంగయ్యగారికి రంగస్థలంలో శిక్షణ నిప్పించడం కొరకు విజయవాడనుండి దుర్గారావను గురువును పిలిపించి, వారిచేత శిక్షణ నిప్పించారు.వీరి శిక్షణ, వీరికి చేసిన శుశ్రూష వృధాకాలేదు. వీరు నాటక కళను కాలక్షేపానికి కాకుండ, భుక్తి కొరకు, రక్తికొరకు స్వీకరించడంచేత, వీరు ప్రదర్శించిన అన్నిపాత్రలు వీరి నటనావైదుష్యానికి ప్రతీకలుగా నిలిచిపోయాయి. జీవితం కొరకు యెన్నుకున్న 'నటన'లో వీరు జీవించారు.

శ్రీపాండు రంగయ్యగారు "కురుక్షేత్రం" లో శ్రీకృష్ణుడుగా, శ్రీకృష్ణతులాభారంలో శ్రీకృష్ణుడుగా, గయోపాఖ్యానంలో

శ్రీకృష్ణుడుగా, అర్జునుడుగా, హరిశ్చంద్రలో హరిశ్చంద్రుడుగా, చింతామణిలో భవాని శంకరుడుగా బిల్వమంగళుడుగా, కృష్ణ జాంబవంతయుద్ధంలో శ్రీకృష్ణుడుగా రాయలసీమ, తెలంగాణ ప్రాంతాలలో కొన్ని వందల ప్రదర్శన లిచ్చారు. వీరు సుప్రసిద్ధ రంగస్థల నటీనటుల సరసన నటించారు. శ్రీ పాండు రంగయ్యగారు "సర్వశ్రీ ఈలపాట కె.రఘురామయ్య, అబ్బూరి వరప్రసాదరావు, పి.సూరిబాబు, వేమూరు రామయ్య, ఏ.వి. సుబ్బారావు, డి.వెంకటనర్సు నాయుడు, యం. అల్లా బక్ష్, శ్రీమతి టి. కనకం, శ్రీమతి అబ్బూరి కమలాదేవి" మొదలగువారితో కలిసి శ్రీకృష్ణుడుగా నటించారు. సర్వశ్రీ మల్లాది సూర్యనారాయణ, అబ్బూరి వరప్రసాదరావు, యం. అల్లాబక్ష్‌లతో కలిసి హరిశ్చంద్ర పాత్రను అద్భుతంగా పోషించారు. శ్రీపి. లక్ష్మణరావు, శ్రీవై. వేణుగోపాలరావు గార్లతో కలిసి హరిశ్చంద్ర, శ్రీ రామపాత్రలను నటించారు. శ్రీ ధర్మవరపు కందుకూరి చిరంజీవిరావు, శ్రీ గుడిమెట్ల సుబ్బారావు, శ్రీ పెళ్ళూరి శేషగిరిరావు, ఆచంట వెంకటరత్నం నాయుడు, శ్రీ తుర్లపాటి కుటుంబరావు, శ్రీ కొచ్చెర్లకోట సత్యనారాయణ, శ్రీ బి.వి. బ్రహ్మయ్యగార్ల సరసన శ్రీకృష్ణుడుగా నటించారు. శ్రీ పాండురంగయ్యగారి సరసన చంద్రమతి, సత్యభామ, చింతామణి పాత్రలను ప్రఖ్యాత రంగస్థల నటీమణులు "శ్రీమతి పి.రాజ్యం, శ్రీమతి జె.నాగమణి, శ్రీమతి టి.కనకం, శ్రీమతి కోటేశ్వరీదేవి. శ్రీమతి నెల్లూరు సరోజ, శ్రీమతి గూడూరు సావిత్రి, శ్రీమతి రేబాల రమణ, శ్రీమతి రామకుమారి, శ్రీమతి నీరజ, శ్రీమతి జి.రమాదేవి, శ్రీమతి రోజారమణి" మొదలగువారు నటించారు.

శ్రీ పాండురంగయ్యగారు మధుర గాయకులు. వీరి గంభీర సంభాషణా పటిమ, నటనా ప్రతిభను గుర్తించి మాజీముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య వీరికి "మధురమనోజ్ఞ గాన గంధర్వ" బిరుదము ప్రసాదించి, బంగారు పతకమునిచ్చి సత్కరించారు. 1960లో ఆనాటి చతుర్విధకవి అష్టావధాని శ్రీ జి.గోవిందప్పగారు "సరససంగీత సాహిత్య నాటక కళావిశారద" అను బిరుదు ప్రదానంచేసి సత్కరించారు. 1970లో అనంతపురం లలిత కళాపరిషత్తు నాటక పోటీలలో పాల్గొని ఉత్తమనటుడుగా యెన్నికై, ఆనాటి కలెక్టరు శ్రీ సుబ్బయ్యగారిచే సన్మానింపబడ్డారు. వీరు అనేకమంది పండితులచేత సన్మానింపబడ్డారు. 25 తులముల వెండి సరస్వతి విగ్రహాన్ని, సంగీత సరస్వతి బిరుదమును స్వీకరించారు. 1979లో కర్నూలు స్వర్ణకారుల సంఘంవారు 3 తులాల స్వర్ణహస్తకంకణం బహుమతిగాను, శ్రీ కె.సి.శివారెడ్డి గారిచే సన్మానింపజేశారు. కడప వాస్తవ్యులు, పండితులు, కవితావతంసభోగ శ్రీ చెన్నారెడ్డిగారిచే "కళాసాగర" బిరుదును అందుకున్నారు. గద్వాల సంస్థాన ఆస్థానకవులలో ఒకరు, అష్టావధాని, పండితులు అయిన శ్రీ నరసింహారెడ్డిగారు శ్రీ పాండు రంగయ్యగారిని "నటకిశోరం" అని కీర్తించారు. ఎన్నో వెండిషీల్డులు, మరెన్నో బంగారు పతకాలు, పలు రంగస్థలములందు సన్మానాలు స్వీకరించారు. వీరు ప్రతిష్టాకరమైన "రాయలసీమ నటరత్న" బిరుదమును అందుకున్నారు. వీరు మహానటులు. తన 36 సంవత్సరాల నటజీవితంలో "శ్రీ సి.హెచ్. చంద్రం, శ్రీ ఆర్. మీరా, శ్రీ జి.రంగనాథం" మొదలగు వారికి విద్యాదానం చేశారు. మంచినటులనుగా తీర్చదిద్దినారు.

శ్రీ పాండురంగయ్యగారు సంస్కృతాంధ్రభాషలలో డొక్కశుద్ధి గలవారవడంచేత, స్పష్టమైన వాచకం, సంభాషణాపటిమ, గంధర్వగానం, కవిహృదయాని కనుగుణమైన ఆంగికాభినయం, ప్రేక్షకుల హృదయాలను స్పందింపజేసే నటన, అవయవపుష్టి వీరికి స్వంతమైనాయి. అర్థులకు విద్యాగంధం ప్రసాదించగల సహృదయత వీరిలో చోటు చేసుకున్నది. మృదుభాషి, మంచిమనిషి, మానవతావాది. అన్నిటికీ మించి మహోన్నత వ్యక్తిత్వంగల మేరునగధీరులు. ఇంతటి మహానటుని ప్రేక్షకలోకం గుర్తించి, ప్రశంసలతో, బహుమతులతో, సన్మానాలతో, బిరుదప్రదానములతో నీరాజనంపట్టినా, ప్రభుత్వంమాత్రం తనకు పట్టనట్లు వీరిప్రతిభను గుర్తించకపోవడం దురదృష్టం.

## గద్దేటి చిన్నవెంకట రామిరెడ్డి :

శ్రీ గద్దేటి చిన్న వెంకటరామిరెడ్డిగారు 1939లో జన్మించారు. వీరు కర్నూలు జిల్లాలోని ఆదోని వాస్తవ్యులు. బి.ఏ., జె.డి.సి. చదువుకున్న వీరు కర్నూలు జిల్లా సహకార కేంద్రబ్యాంకు "లి", కర్నూలు బ్రాంచి, ఆదోనిలో మేనేజరుగా పనిచేస్తున్నారు. శ్రీ చిన్న వెంకటరామిరెడ్డిగారు చిన్ననాటి నుండి నాటక కళపైన మక్కువ గలవారు. ఔత్సాహిక కళాకారులు. వీరు "చింతామణి" నాటకంతో ప్రారంభించి "శ్రీకృష్ణతులాభారం, శ్రీకృష్ణరాయబారము , కురుక్షేత్రము, గయోపాఖ్యానము, శ్రీ రామాంజనేయయుద్ధం, బాలనాగమ్మ" మొదలగు పౌరాణిక, జానపద నాటకాలను పెక్కుసార్లు ప్రదర్శించి, ప్రజల మన్ననలకు పాత్రులైనారు. వీరు "దుర్యోధనుడు, కర్ణుడు, గయుడు, యముడు, బిల్వమంగళుడు, భవాని, మరాటి, శ్రీకృష్ణుడు" మొదలగు పాత్రలను అద్భుతంగా పోషించారు. వీరికి నచ్చిన, ప్రజలు మెచ్చిన పాత్రలు దుర్యోధనుడు, బిల్వమంగళుడు, శ్రీకృష్ణుడు. పద్యాలు చక్కగా పాడగలరు. వీరినటనా వైదుష్యానికి మెచ్చిన ప్రజలు ప్రశంసించారు. ఘనమైన సన్మానాలతో సత్కరించారు. శ్రీ చిన్న వెంకటరామిరెడ్డిగారు పౌరాణిక నాటకాలకు దర్శకత్వం కూడ నిర్వహించారు.



శ్రీ రెడ్డిగారు కళాప్రియులగుట కరుణా స్వభావులు. కళ నిపుణుల్ని, నాటక కళాకారులను సగౌరవంగా ఆదరించే నిర్మల హృదయులు. వీరు పేదకళాకారుల నిమిత్తం సుమారు రెండువందల ఉచిత నాటక ప్రదర్శనలిచ్చి, వారిని ఆర్థికంగా ఆదుకున్న దయార్ద్ర హృదయులు.

వీరు "కళాప్రియ సమాఖ్య" వ్యవస్థాపక అధ్యక్షులు. "అఖిలాంధ్ర కళాకారుల సాంస్కృతిక సంక్షేమ సంఘము" నకు రాష్ట్ర స్థాయి ఉపాధ్యక్షులు.

శ్రీ చిన్న వెంకటరామిరెడ్డిగారు కళ స్వార్థంకోసంగాక, సమాజరక్షికోసం, కళాకారుల సంక్షేమంకోసం అని నమ్మిన కళారాధకులు. నాటక కళామతల్లిసేవలో 25 సంవత్సరాలుగా నిమగ్నమై యున్న కళాపిపాసి. మానవత్వమున్న మంచి మనిషి. రాయలసీమ నటరత్నం.

## మరాటీ లక్ష్మీదేవి :



శ్రీమతి మరాటి లక్ష్మీదేవి గారు 1941వ సంవత్సరము ద్రోణాచలం పట్టణంలో శ్రీమల్లమ్మ, శ్రీ శిఖామణి రావులకు జన్మించారు. శ్రీమతి లక్ష్మీదేవి వృత్తి కళాకారిణి. సుమారు 25 సంవత్సరాలుగా నాటక ప్రదర్శనలిస్తున్నారు. 'శాంతిమతి' పాత్రతో వీరి నటజీవితం ప్రారంభమైంది. వీరు "ముందడుగు, మేనరికం" మొదలగు సాంఘిక నాటకాలలోను, "శ్రీ కృష్ణ రాయబారం, గయోపాఖ్యానం, రామాంజనేయయుద్ధం, చింతామణి, శ్రీకృష్ణ తులాభారం, సతీ సక్కుబాయి, సత్య హరిశ్చంద్ర, బాలనాగమ్మ" మొదలగు పౌరాణిక నాటకాలలోను అనేక పర్యాయాలు నటించారు.

శ్రీమతి లక్ష్మీదేవిగారు "శ్రీరాముడు, శ్రీ కృష్ణుడు, ద్రౌపది, శాంతిమతి, చిత్ర, సుభద్ర" మొదలగు పాత్రలను పోషించి, ప్రజలమన్ననలకు పాత్రులైనారు. వీరిని "శ్రీ రాముడు, శ్రీ కృష్ణుడు'పాత్రలు బాగా ఆకర్షించాయి. ఈ పాత్రలీమెకు ప్రజలలో కీర్తి ప్రతిష్టలను తెచ్చిపెట్టాయి. వీరి నటనను గుర్తించి జోళాపురం వాస్తవ్యులు ఘనంగా సన్మానించారు. శ్రీమతి జమునగారు పారితోషికం ప్రదానంచేసి సన్మానించారు.

శ్రీమతి లక్ష్మీదేవిగారు సంగీతం తెలిసిన కళాకారిణి. శ్రావ్యమైన కంఠంతో చక్కగా పాడగలరు. మంచి హార్మోనిస్టు. దర్శకులుగా కొన్ని నాటకాలకు దర్శకత్వం వహించారు. రాయలసీమ నటరత్నం.

## సయ్యద్ అహమద్, బి.ఏ., బి.ఇడి. :



శ్రీ సయ్యద్ అహమద్‌గారు 1942లో శ్రీమతి బీబీ, శ్రీ సయ్యద్ సాహెబ్ గార్లకు కర్నూలు పట్టణంలో జన్మించారు. వీరు బి.ఏ., బి.ఇడి., వరకు చదువుకొని ఆదర్శ ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించినారు. (ప్రస్తుతం) వీరు ప్రభుత్వ ఆదర్శ ఉన్నత బాలుర పాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేస్తున్నారు. వీరికి చిన్నతనంనుండి నాటకకళపైన యెనలేని అభిమానం వుండేది. పాఠశాలలో చదువుతున్న రోజులలోను, బేసిక్ ఉపాధ్యాయ శిక్షణ పొందుతున్న కాలంలోను వీరు "కన్నబిడ్డ, పునర్జన్మ, వెంకన్న కాపురం, బాలనాగమ్మ, హిందీ లవకుశ" మొదలగు పౌరాణిక, సాంఘిక నాటక, నాటికలను ప్రదర్శించి ప్రజల మన్ననలకు పాత్రులైనారు:

1968లో "లలితకళా సమితి"ని కర్నూలులో స్థాపించుటకు కారకులైన ముఖ్యులలో వీరొకరు. అప్పటినుండి శ్రీ సయ్యద్ అహమద్ గారు లలితకళా సమితి తరపున "కీర్తిశేషులు, చైర్మన్, సమాధానం కావాలి, సంఘం చెక్కిన శిల్పం, సిద్ధార్థ, పట్టాలు తప్పిన బండి, కీర్తి శిఖరాలు, నటనాలయం, మరో మొహంజోదారో, కురుక్షేత్రం" మొదలగు సాంఘిక, పౌరాణిక నాటకాలను "నీలి మబ్బులు, చీకటి, దంత వేదాంతం, వెంకన్న కాపురం, భజంత్రీలు, రాజీనామా,అంతంకాదిది ఆరంభం, కళ్ళు, యువతరం, సమాజం మారాలి, కోహినూర్, శవాలపై జీవాలు" మొదలగు నాటికలను పలుసార్లు ప్రదర్శించారు.

శ్రీ అహమద్‌గారు "నటనాలయం'లో రాజారావు, "చేర్మన్"లో మూర్తి, స్వామి, నౌకరు, "కీర్తిశేషులు"లో మురారి, "సమాధానం కావాలి"లో నాస్తికుడు, "వెంకన్న కాపురం"లో వెంకన్న, తమ్ముడు"మొదలగు పాత్రలను అత్యద్భుతంగా పోషించి, ప్రేక్షకుల ప్రశంసలనందుకున్నారు. వీరనేక పరిషత్తు నాటక, నాటికల పోటీలలో పాల్గొని, పెక్కు బహుమతులను స్వీకరించారు. నటనాలయంలో ఉత్తమనటుడు, చేర్మన్‌లో ఉత్తమ ప్రతినాయకుడు (విలన్), కీర్తిశేషులులో ఉత్తమ నటుడుగా యెన్నికై బహుమతులు పొందినారు.

వీరు నటులేగాక ఉత్తమ దర్శకులుకూడా. వీరు ప్రదర్శించిన నాటక, నాటికలకు వీరే దర్శకత్వం వహించారు. "చైర్మన్, సమాధానం కావాలి, రాజీనామా, కోహినూర్" నాటకాలకు దర్శకత్వం వహించినందులకు ఉత్తమ దర్శకుడుగా యెన్నికై, ప్రథమ బహుమతులను స్వీకరించారు. వీరు సాంఘిక ప్రయోగాత్మక, సందేశాత్మక నాటిక, నాటకాలనే గాక, "బొబ్బిలి యుద్ధం" అను చారిత్రాత్మక నాటకంలో "ధర్మారాయుడు, నరసారాయుడు"గా తెలంగాణాలో అనేకచోట్ల "కర్నూలు లలితకళా సమితి" ఆర్థిక సహాయంకొరకు ప్రదర్శనలిచ్చి, ప్రముఖుల ప్రశంసలనందుకున్నారు.

శ్రీ అహమద్‌గారు లలిత కళాసమితి వ్యవస్థాపక వర్గంలో ఒకరై, ప్రథమ కార్యదర్శిగా 8 సంవత్సరాలు, సహాయ కార్యదర్శిగా, ఉపాధ్యక్షులుగా సమితి పురోభివృద్ధికై విభిన్న పదవులను నిర్వహించారు. సాంస్కృతిక కళా రంగాలలో గొప్పనటులుగా, ఉత్తమ దర్శకులుగా, నాటక రచయితగా గుర్తింపు పొందారు. వీరి కళాసేవను గుర్తించి లలిత కళాసమితి – కర్నూలు యాజమాన్యం వారు శ్రీ జంపాల శివయ్యగారి ఆధ్వర్యంలో వీరి ఛాయా చిత్రాన్ని (ఫోటో) ఆవిష్కరించి, ఘనంగా సన్మానించారు.

ప్రస్తుతం వీరు కర్నూలుజిల్లా బాలభవనంలో పార్టు టైం సూపరింటెండెంటుగా 1981 నుండి ఇప్పటివరకూ పనిచేస్తూ, బాలబాలికలను కళాకారులుగా తీర్చిదిద్దడానికై రచయితగా, దర్శకుడుగా పిల్లలకు సందేశాత్మక నాటికలు వ్రాసి, వారికి శిక్షణ యిస్తూ, ప్రదర్శింపజేస్తూ, నాటక కళామతల్లికి సేవ చేస్తున్నారు. అఖిలభారత ఆకాశవాణికేంద్రం, కడపవారు ప్రసారంచేసిన వరకట్న శాపంపై వ్రాయబడిన నాటికతోబాటు, అనేక పిల్లల కదంబ కార్యక్రమాలు ప్రసారమయ్యాయి.

1968లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వంవారు శ్రీ అహమద్‌గారిని నాట్యవిద్యాలయం హైదరాబాదువారు ఎంపికచేసి, రవీంద్ర భారతిలో నటనలో శిక్షణను ఇచ్చారు.

కళాకారుడుగా గుర్తింపబడిన శ్రీ అహమద్‌గారిని 1981లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం వారు "పప్పెట్రీ" శిక్షణ నిమిత్తం యెంపికచేసి నేషనల్ ఇంటిగ్రేషన్ క్యాంపు జరుపబడిన సిక్కిం రాజధాని గాంగ్‌టాక్‌కు పంపించి, పప్పెట్ తయారీ, నాటిక రచన, ప్రదర్శనలలో శిక్షణ నొసగారు. ఈ శిక్షణ బాలభవనం పిల్లలకు వరప్రసాదంగా ఉపయోగపడుతున్నది.

శ్రీ సయ్యద్ అహమద్‌గారు గొప్ప నటులు, ఉత్తమ దర్శకులు, మంచి క్రమశిక్షణగల కార్యదక్షులు. మీదుమిక్కిలి ఆదర్శ ఉపాధ్యాయులు. జీవితాంతం నాటక కళామతల్లి సేవలో గడపాలన్నది వారి జీవితాశయంగా వున్నట్లు తెలుస్తుంది.

**మండ్ల రామలింగ మూర్తి :**



శ్రీ మండ్ల రామలింగ మూర్తిగారు 1942 వ సంవత్సరం కర్నూలు జిల్లా, ఆత్మకూరు తాలూకా, ఇందిరేశ్వరం అను గ్రామంలో జన్మించారు. తల్లి శ్రీమతి వెంకటమ్మ, తండ్రి శ్రీ చిన్నయ్య. చిన్ననాటినుండి కళాజిజ్ఞాసగల ఔత్సాహిక నటులు. వీరు "అశోక్ సామ్రాట్" అను చారిత్రక నాటకంలో 'అశోకుడుగా',"పెళ్లి చూపులు" నాటికలో ప్రసాద్ (పెద్ద మనిషిగా) గా, "ఈ తీర్పుకు బదులేది" నాటికలో 'మాష్టరు'గా, "చీకటి తెరలు" నాటికలో 'శంకర్'గా, "ఆశా! ఏది నీ గమ్యం"నాటికలో 'పెండ్లి కొడుకు' గా నటించి అనేక బహుమతులను, షీల్డులను పొందగలిగారు. వీరు నటులుగానే కాక దర్శకులుగా కూడ పేరు ప్రతిష్టలున్న కళాకారులు. వీరి దర్శకత్వంలో అశోక్ సామ్రాట్, పెళ్లి చూపులు, ఈ తీర్పుకు బదులేది, తులసి తీర్థం, అసురగణం, కుందేటి కొమ్ము, చీకటితెరలు, ఆశా! ఏది నీ గమ్యం, పుటుక్కు జరజర డుబుక్కు మే, సీతారామ కళ్యాణం, హుష్‌కాకి, మనుషులొస్తున్నారు జాగ్రత్త, గాలికి కులమేది, బి.పి. (చిన్న పిల్లల నాటిక), డైవర్సు మొదలగు నాటక, నాటికలు దిగ్విజయంగా ప్రదర్శింపబడ్డాయి. వీరు నటులు, దర్శకులే గాక నాటక రచయితలు కూడ. 'బి.పి.' అను పిల్లల నాటికను "ఆశా! ఏది నీగమ్యం?" అను నాటికను రచించి ప్రదర్శింపజేశారు.

వీరు 1955లో "స్టూడెంట్సు కల్చరల్ అసోసియేషన్" కమలాపురం, 1972లో "నటరాజ కళాసమితి" రాయల్‌చెరువు, 1973లో " లలిత కళాసమితి" కర్నూలు, 1988లో "రసమాధురి కళానికేతన్" కర్నూలువారు నిర్వహించిన నాటక పరిషత్తులలో పాల్గొని బహుమతులను స్వీకరించారు.

ప్రస్తుతం వీరు ఎలక్ట్రికల్ అసిస్టెంట్ ఇంజనీరుగా పనిచేస్తున్నారు. నాటక కళద్వారా సభ్యసమాజానికి మంచి సందేశ మివ్వగలిగితే తన నటనా జీవితం ధన్యమవుతుందన్న సదాశయంగల ఆదర్శ నటులు. నాటకకళకు తనవంతు సేవ చేయాలన్న తపనగల మంచి కళాకారులు.

## బోళ్ళ వెంకట సత్యనారాయణ :



శ్రీ బోళ్ళ వెంకట సత్యనారాయణగారు 1947లో కృష్ణా జిల్లా, గుడివాడలో జన్మించారు. వీరు ఔత్సాహిక నటులు. వృత్తిరీత్యా ఏ.పి.యస్. ఆర్.టి.సి. ఉద్యోగి. కర్నూలు జిల్లా, ఆదోనిలో స్థిరపడ్డారు. వీరు 1968లో "బాలనాగమ్మ" నాటకం ప్రదర్శించినప్పుడు "తలారి రాముడుగా, చాకలి తిప్పడు"గా నటించి, ప్రథమంగా రంగస్థల ప్రవేశం చేశారు.

శ్రీ వెంకట సత్యనారాయణ గారు 1981లో "కళా ప్రియ సమాఖ్య"లో సభ్యులై "బాలనాగమ్మ, చింతామణి, తులసి తీర్థం, రక్త పిపాస" మొదలగు నాటకాలను అనేక పర్యాయాలు ప్రదర్శించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు. వీరు చింతామణి నాటకంలో "సుబ్బిశెట్టి పాత్రను, బాలనామ్మ నాటకంలో "తలారి రాముడు, చాకలి తిప్పడు" పాత్రలను, తులసితీర్థం నాటకంలో "నారాయణ" పాత్రను అత్యద్భుతంగా పోషించి, ప్రేక్షకలోకంలో నవ్వుల పువ్వులు పూయించారు.

శ్రీ సత్యనారాయణ గారు స్వతహాగా హాస్యప్రియులు. "సంతోషమే సగము బలము" అనే ఆర్యోక్తి వీరిపట్ల సార్థకమైందనిపిస్తుంది. "కళ కళకోసమేగాని కాసుల కోసం గాదు" అనేది వీరి దృక్పథం. ఈ యాశయంతోనే వీరు నాటక కళలో ప్రవేశించారు. పేద కళాకారుల సహాయార్థం ఉచిత ప్రదర్శనలిస్తూ, నవ్వుతూ నవ్విస్తూ జీవితాన్ని ఆనందమయం చేసికొన్న ఉత్తమ హాస్యనటులు. వీరు నటించిన సుబ్బిశెట్టి పాత్రకు ఉత్తమ హాస్యనటుడుగా గౌరవం లభించింది.

వీరి హాస్యపు విరిజల్లులకు ముగ్ధులైన ఆదోని పట్టణ కళాకారులు వీరికి ఘనంగా సన్మానంచేశారు. కళకు దేశ, కాల అవధులులేవు. ప్రాంతీయ విభేదాలు లేవు. అందుకే శ్రీసత్యనారాయణగారు ఆంధ్రదేశపు మరోభాగంలో పుట్టినా రాయలసీమలో రంగస్థలానికి అంకితమైనారు. వీరు ఔత్సాహిక యువనటులు. ముందుముందుకూడ వీరు అనేక నాటకాలలో పెక్కు హాస్యపాత్రలను పోషించి, రాయలసీమ ఉత్తమ హాస్యనటులలో ఒకరుగా కీర్తిప్రతిష్ఠ లార్జించగలరని, రాయలసీమ నటరత్నాలలో సముచిత స్థానాన్ని అందుకోగలరని ఆశించవచ్చు.

## ఇప్పల పుల్లయ్య :



శ్రీ ఇప్పల పుల్లయ్యగారు 1948లో ప్రకాశం జిల్లా, ఆకివీడు గ్రామంలో జన్మించారు. తండ్రి శ్రీ నాగయ్య, తల్లి శ్రీమతి బాలఅంకమ్మ. శ్రీ పుల్లయ్యగారు ప్రకాశం జిల్లాలో జన్మించినా ఉద్యోగంచేత తనకళాసేవ రాయలసీమకే అంకితమైందని చెప్పకతప్పదు. ప్రస్తుతం వీరు ఆర్.టి.సి.లో ఉద్యోగం చేస్తున్నారు. 25 సంవత్సరాల నాటకానుభవంగల ఔత్సాహిక నటులు. కర్నూలు లలిత కళా సమితిలో కార్యవర్గ సభ్యులు. వీరి నటజీవితం "భీమాంజనేయ యుద్ధం"తో ప్రారంభమైంది.

శ్రీ పుల్లయ్య గారు "గయోపాఖ్యానం, శ్రీ కృష్ణ రాయబారం, భీమాంజనేయ యుద్ధం, రామ రావణ యుద్ధం, బొబ్బిలి యుద్ధం, శ్రీ కృష్ణా భిమన్యు, పెండింగ్ ఫైల్" మొదలగు నాటకాలలో "శ్రీ కృష్ణుడు, అభిమన్యుడు, రాముడు, నారదుడు, అర్జునుడు, నరస రాయుడు" ఇత్యాది పాత్రలను పోషించి, రంగస్థల నటులుగా రాయలసీమలో లబ్ధప్రతిష్ఠులైనారు.

వీరికి "శ్రీ కృష్ణుడు, అభిమన్యుడు," పాత్రలంటే యెక్కువ అభిమానం. రెండు పాత్రలలోను వీరు తమ నటనావైదుష్యాన్ని ప్రదర్శించారు.

శ్రీ పుల్లయ్యగారి ప్రతిభను గుర్తించిన కర్నూలు శ్రీ లలిత కళా సమితివారు వీరిని ఘనంగా సన్మానించారు. కళాతృష్ణ వీరిలో బాగా గోచరిస్తుంది. నాటకకళను అభిమానించే ప్రేక్షకులున్నప్పటికి కళాకారులను సగౌరవంగా ఆదరించి, ప్రోత్సహించే సుగుణం సభ్యసమాజంలోను, కళలను ప్రోత్సహించి, పోషించవలసిన బాధ్యత కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఉండడం యెంతైనా అవసరమని వీరి అభిప్రాయం.

శ్రీమతి జి. రమా శ్యాంకుమార్ :

శ్రీమతి జి. రమా శ్యాంకుమార్ గారు 1948లో కర్నూలు జిల్లా, కోవెలకుంట్ల తాలూకా, గోవిందిన్నె గ్రామంలో జన్మించారు. మద్రాసు వాస్తవ్యులు శ్రీతాండవ మునిలింగం గారి వద్ద భరతనాట్యం అభ్యసించారు. ప్రాథమిక పాఠశాల స్థాయిలోనే పాఠశాల వార్షికోత్సవాలలో నాట్య ప్రదర్శనలిచ్చి, పెద్దల ప్రశంసలనందుకున్నారు. వీరికి చిన్నతనంనుండి నాటకకళపైన అభిరుచి అధికంగా వుండేది. 1959నుండి పౌరాణిక నాటకాలలో "ద్రౌపది, సుభద్ర, శాంతిమతి, చిత్రరేఖ, సుమాలిని, చింతామణి, రాధ, సంగు, బాలనాగమ్మ" మొదలగు స్త్రీపాత్రలతోబాటు "శ్రీరామ, నారద, శ్రీకృష్ణ" మొదలగు పురుష పాత్రలనుకూడ పోషించి, పలువురి ప్రేక్షకుల మన్నన లందుకున్నారు.



1964లో వీరికి సంగీత కళాకారులైన శ్రీ శ్యాంకుమార్ గారితో వివాహం జరిగింది. వీరి నాటక కళాభిరుచికి, వీరి శ్రీవారి సంగీతంతోడై, నాటక కళోత్సాహం ద్విగుణీకృతమైంది.

1964లో 'సదరన్ రైల్వే ఇన్‌స్టిట్యూట్' గుత్తివారి సాంఘిక నాటకం "పునర్జన్మ"లో నటించి, పామిడి లలిత కళాసమితి నిర్వహించిన పోటీలలో ఉత్తమ ద్వితీయనటి బహుమతినందుకున్నారు.

1975లో లలిత కళాసమితి-కర్నూలువారు నిర్వహించిన నాటికల పోటీలలో పాల్గొని, "యువతరం" అను నాటికలో నటించి, ఉత్తమనటి బహుమతిని సంపాదించారు.

1978లో "సౌత్ సెంట్రల్ రైల్వేస్" గుంతకల్లువారిచే నిర్వహింపబడిన అఖిలభారతస్థాయి నాటకపోటీలలో కర్నూలు లలితకళాసమితి తరపున "సంఘం చెక్కిన శిల్పాలు" అను నాటకంలో నాయిక పాత్రధరించి "ఉత్తమనటి' రోలింగ్ షీల్డును గెలుచుకున్నారు.

1980లో గుంతకల్ "సౌత్ సెంట్రల్ రైల్వే"వారు నిర్వహించిన నాటకపోటీలలో "తులసి తీర్థం" నాటకంలో నటించి రెండవసారి "ఉత్తమ నటి" బహుమతిని గెలుచుకున్నారు. అదే సంవత్సరం నంద్యాలలో గణేశ్ ఉత్సవ కమిటీ నాటకపోటీలలో "తులసి తీర్థం" నాటకంలో నటించి, ఉత్తమనటి బహుమతినికూడ సంపాదించారు.

1981లో కర్నూలు రేంజి, పోస్టల్ అండ్ టెలిగ్రాఫ్ డిపార్టుమెంట్ వారు నిర్వహించిన నాటకపోటీలలో "తులసి తీర్థం"లో నటించి శ్రీమతి జమునగారిచే ఉత్తమనటి అవార్డును అందుకున్నారు.

1983లో తిరుపతి శ్రీ వేంకటేశ్వర నాట్యకళాపరిషత్తు వారు నిర్వహించిన పౌరాణిక నాటకపోటీలలో "సతీ అహల్య"లో నటించి ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు.

1984వ సంవత్సరం హైదరాబాదు దూరదర్శన్ కేంద్రంవారు ప్రసారం చేసిన "పోలీస్-పోలీస్" అను నాటికలో "సావిత్రి" పాత్రను నటించి, పలువురి ప్రశంసలనందుకున్నారు.

1985లో కర్నూలు జిల్లా పోలీస్ సంక్షేమనిధికి సహాయార్థం ప్రదర్శించిన "పోలీస్-పోలీస్" నాటికలో నటించి, ప్రముఖ సినీనటి "శ్రీమతి జయసుధ" గారిచే సన్మానింపబడినారు.

1987వ సంవత్సరం తెలుగు విశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో నిర్వహింపబడిన రాయలసీమ ప్రాంతీయ పౌరాణిక నాటకపోటీలలో కర్నూలు లలితకళాసమితివారిచే ప్రదర్శింపబడిన "యమాంజనేయ యుద్ధం"లో 'సుమాలిని' పాత్రను పోషించి ఉత్తమ ద్వితీయ బహుమతిని అందుకున్నారు.

శ్రీమతి రమా శ్యాంకుమార్ గారిది సహజసౌందర్యంగల నిండైన విగ్రహం. చక్కగా నాట్యం చేయగలరు. మధురమైన కంఠంతో ప్రేక్షకులను అలరించేవిధంగా పాడగలరు. ఉత్తమనటీమణులలో చేర్చతగిన కళాకారిణి. రాయలసీమ నటరత్నం.

**సింహం లక్ష్మీ నారాయణ :**

శ్రీ సింహం లక్ష్మీనారాయణగారు1949లో కర్నూలు జిల్లా, బెళగళ మండలం, పోలకల్లు గ్రామంలో శ్రీ పెద్ద మునెప్ప, శ్రీమతి సాయమ్మ అను పుణ్యదంపతులకు జన్మించారు. వీరు చిన్నతనం నుండి నాటక కళాపైన అభిరుచిగల ఔత్సాహిక నటులు. వీరి నటజీవితం "యమాంజనేయ యుద్ధం" అను నాటకంతో ప్రారంభమైంది. వీరు "శ్రీలలిత కళాసమితి"లో సభ్యులుగా "శ్రీ కృష్ణ రాయబారం,



యమాంజనేయ యుద్ధం, గయోపాఖ్యానం, శ్రీ కృష్ణాభిమన్యు, బొబ్బిలి యుద్ధం, ఈ తీర్పుకు బదులేది?" మొదలగు నాటకాలలో "అర్జునుడు, శ్రీకృష్ణుడు, ధర్మారాయుడు" మొదలగు పాత్రలను పోషించి, ప్రజల మన్ననలకు పాత్రులైనారు.

శ్రీ లక్ష్మీనారాయణగారు రాజంపేటలో(ను), తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహించిన నాటక పోటీలలో ఉత్తమ నటుడుగా యెన్నుకోబడినారు.

శ్రీ లక్ష్మీనారాయణగారికి పేరు ప్రతిష్టలను తెచ్చిపెట్టినది "అర్జున" పాత్ర. వీరు పాటలు, పద్యాలు చక్కగా పాడగలరు. వీరికి సంగీతము, దర్శకత్వము మీద అభిరుచి కలదు. వీరికి 1989లో శ్రీ లలిత కళాసమితి కర్నూలువారు ఘనంగా సన్మానం చేశారు. కర్ణాటక సంగీతంలో అభినివేశం గలదు. మంచి హార్మోనిస్టు. నటులుగా, హార్మోనిస్టుగా, దర్శకులుగా కీర్తి ప్రతిష్టలుగల కళాకారులు. వర్ధమాన ఔత్సాహిక నటులకు శిక్షణనిస్తూ నాటక కళామతల్లికి తనవంతుసేవ చేస్తున్నారు.

శ్రీ లక్ష్మీనారాయణ గారు ప్రస్తుతం పంచాయితీరాజ్, కర్నూలులో వర్క్ ఇన్స్పెక్టరుగా పనిచేస్తున్నారు. నాటక కళకు సరియైన ప్రోత్సాహం, ఆదరణ అవసరమనేవారిలో ఒకరు. సరళ స్వభావులు. రాయలసీమ నటరత్నాలలో చేర్చతగినవారు.

## శ్రీమతి ఎన్. పద్మాంజలి, నందికొట్కూరు :



శ్రీమతి ఎన్. పద్మాంజలి కర్నూలు జిల్లా, నందికొట్కూరు గ్రామంలో 1949వ సంవత్సరం శ్రీరంగా వీర్రాజుగారి దంపతులకు జన్మించారు. వీరికి లలితకళలు తండ్రినుండి వారసత్వంగా సంక్రమించాయని చెప్పవచ్చును. వీరు వృత్తికళాకారిణి. 1962లో ప్రప్రథమంగా "ఇన్స్పెక్టర్ జనరల్" అను నాటకంలోని పాత్రతో రంగస్థల ప్రవేశం చేశారు. ఆ తరువాత "పల్లె పడుచు, సక్కుబాయి, కులం లేని పిల్ల, చింతామణి, శ్రీ కృష్ణ తులాభారం, విప్రనారాయణ" మొదలగు పౌరాణిక, సాంఘిక నాటకాలలో వివిధ పాత్రలను పోషించారు.

శ్రీమతి పద్మాంజలిగారు అనేక పరిషత్తు నాటకపోటీలలో పాల్గొన్నారు. బళ్ళారిలో "రాఘవ కళా పరిషత్తు" నిర్వహించిన నాటకపోటీలలో "పల్లె పడుచు, కులం లేని పిల్ల" నాటకాలలో ఉత్తమ నటిగా యెన్నుకోబడి, ప్రథమ బహుమతులను అందుకున్నారు. వీరికి సక్కుబాయి పాత్ర యెంతగానో నచ్చింది. వీరికి ప్రజాబాహుళ్యంలో పేరు ప్రతిష్టలార్జించి పెట్టినవి "సక్కుబాయి, సత్యభామ, చింతామణి" మొదలగు పాత్రలు.

వీరికి "నందికొట్కూరు, ఏలూరు, రాజమండ్రి, మద్రాసు" మొదలగు పట్టణాలలో ఘనమైన సన్మానాలు జరిగాయి.

వీరు కూచిపూడి నాట్యంలో గొప్ప పేరు సంపాదించారు. గొప్ప నర్తకి. వీరు సినిమాలలోను, దూరదర్శన్‌లోను నటిగా, నర్తకిగా యెన్నో ప్రదర్శనలిచ్చారు. కూచిపూడి నాట్యంలో డొక్కశుద్ధిగలిగిన కళాకారిణి. ప్రస్తుతం వీరు ఆదోనిలో "కూచిపూడి నృత్యనికేతన్"అను నృత్య పాఠశాలను నడుపుతూ, అప్పుడప్పుడు సినిమాలలో నటిస్తూ దూరదర్శన్ నాట్యప్రదర్శనలిస్తూ స్వతంత్ర జీవితం గడుపుతున్నారు. వీరికి అందమైన విగ్రహం, శ్రావ్యమైన గాత్రం, సహజమైన నటన, కూచిపూడి నృత్యంలో పరిపూర్ణత భగవంతుని వరప్రసాదం.

శ్రీమతి పద్మాంజలి గొప్ప నర్తకి, మంచి నటి. నృత్య పాఠశాలకు అధికారిణి. ఒక మహా నటుని కుమార్తె. రాయలసీమ నటరత్నం.

## పి. నక్షత్ర రెడ్డి :

శ్రీ పి. నక్షత్ర రెడ్డిగారు 1951వ సంవత్సరం, కర్నూలు జిల్లా, ఆలూరు తాలూకా, అర్థగేరి గ్రామంలో శ్రీ తమ్మారెడ్డి, శ్రీమతి కమలమ్మ గార్లకు జన్మించారు. వీరు ఔత్సాహిక నటులు. చిన్నతనం నుండి నాటక కళపైన యెంతో అభిమానం గలవారు.వీరు వృత్తిరీత్యా ఏ.పి.యస్.ఆర్.టి.సి.లో పని చేస్తున్నారు. వీరు 1978లో "గయోపాఖ్యానం" నాటకంలో అర్జునుని పాత్రతో రంగస్థలప్రవేశం చేశారు.ఆదోని లోని "కళాప్రియసమాఖ్య" అను నాటక సమాజంలో సభ్యులై "చింతామణి, బాలనాగమ్మ, రామాంజనేయ యుద్ధం, శ్రీ కృష్ణ రాయబారం" మొదలగు పౌరాణిక నాటకాలను పెక్కుసార్లు పలుచోట్ల ప్రదర్శించారు. వీరు "భవాని శంకర్, శ్రీ కృష్ణుడు, అర్జునుడు"



మొదలగు పాత్రలను యెంతో వైవిధ్యంతో పోషించారు. ఆ తరువాత "లలిత కళాపరిషత్తు, సరస్వతీ నాట్యకళామండలి" అను నాటక సమాజాలలో సభ్యులుగా పెక్కు నాటకాలలో వివిధ పాత్రలను పోషించారు. ఆదోనిలో చింతామణి నాటకాన్ని ప్రదర్శించినప్పుడు ఆదోని పురప్రజలు భవాని శంకర్ పాత్రకు ఐదు తులాల బంగారు కడియాన్ని బహూకరించి సత్కరించారు. నంద్యాలలో చింతామణి నాటకాన్ని ప్రదర్శించినప్పుడు భవానీ పాత్రకు ముగ్ధులై పురప్రజలు మాడాతో సన్మానం చేయించి, సత్కరించారు.

వీరు ఔత్సాహిక కళాకారులే అయినా ఒక సదుద్దేశంతో కిరాయి నాటకాలాడి, వచ్చిన ధనంతో పేద, వృద్ధ కళాకారులకు ఆర్థిక సహాయం అందిస్తున్నారు. కళాతృష్ణ, సాటి కళాకారులపైన ఆదరం, అభిమానం లేని ఈ రోజులలో మంచి మనసుతో కళాసేవచేస్తూ, కళాకారుల నాదుకుంటున్న శ్రీ పి.నక్షత్రరెడ్డిగారు తమ జన్మను సార్థకపరుచుకుంటున్నారు.

వీరు ఉత్తమనటులు. రాయలసీమలోని ఆధునిక నటులలో గుర్తింపు పొందినవారు. సాటి కళాకారులకు చేయూతనివ్వాలన్న సహృదయతను గుండెనిండా నింపుకున్న మనసున్న మనిషి. మానవతావాది. రాయలసీమ నటరత్నం.

### పులిపాటి రామకృష్ణయ్య : నందికొట్కూరు :



శ్రీ పులిపాటి రామకృష్ణయ్యగారు 1953లో కర్నూలు జిల్లా, నందికొట్కూరు గ్రామంలో శ్రీమతి వీరమ్మ, శ్రీ పులిపాటి లక్ష్మయ్య అను పుణ్యదంపతులకు జన్మించారు. వీరు ఔత్సాహిక నటులు. వృత్తిరీత్యా జవులి వ్యాపారము. వీరికి చిన్నతనంనుండి నాటకకళపైన వల్లమాలిన అభిమానం వుండేది. తన పదవయేట 1963వ సంవత్సరం "లవకుశ" నాటకంలో 'లవుని'పాత్రతో వీరి నాటక చరిత్ర ప్రారంభమైంది. వీరు చిన్నతనంనుండి పద్యాలు, పాటలు మధురమైన గాత్రంతో, శ్రావ్యంగా పాడేవారు. వీరి ఉత్సాహాన్ని గుర్తించి, వీరు చదువుచుండిన పాఠశాల ప్రధానోపాధ్యాయులు వీరిని నాటకరంగంవైపు ప్రోత్సహించారు. వారి ఆశీర్వాదంతో శ్రీ రామకృష్ణయ్యగారు నటులుగా నిలదొక్కుకున్నారు. ఒకసారి నందికొట్కూరు గ్రంథాలయంలో "భక్తమాధవదాసు" అను పౌరాణిక నాటకం లభించింది. అందులోని పాత్రలకు నటీనటులను ప్రోగుచేసి, అప్పటికప్పుడే ఒక నాటకసమాజాన్ని స్థాపించి, ఆ నాటకాన్ని చక్కగా నేర్చుకున్నారు. ఆ నాటక రచయిత శ్రీ మండే వెంకటరత్నం. ఆ నాటకానికి రాజపోషకులు శ్రీ కాటరెడ్డి ఆదినారాయణరెడ్డి (వీరు నెల్లూరు జిల్లా వాస్తవ్యులు)గార్లను ఆహ్వానించారు. శ్రీ ఆదినారాయణరెడ్డి గారికి అదివరకే ఈ నాటకాన్ని సినిమా తీయాలనే తలంపు వుండేది. పిలిచిందే తడవుగా నాటకకర్త, శ్రీ ఆదినారాయణరెడ్డి గారు నందికొట్కూరుకు వచ్చి, శ్రీ రామకృష్ణయ్య జట్టువారు ప్రదర్శించిన "భక్తమాధవదాసు" నాటకాన్ని తిలకించి ముగ్ధులైనారు. వారికి కావలసిన నటుడు శ్రీ రామకృష్ణయ్య అని నిర్ణయించుకొని, వీరిని తమతో వెంటబెట్టుకొని వెళ్లినారు. నెల్లూరు జిల్లా, అల్లూరులో 'శ్రీ లలితాపరంజ్యోతి నటసమాఖ్య' అను నాటక సమాజం వుండేది. ఈ సమాజంలో ఒక్క మాధవదాసు పాత్రధారి తప్ప తక్కినవారందరూ వుండేవారు. శ్రీ రెడ్డిగారు శ్రీ రామకృష్ణయ్యగారిని మాధవదాసు పాత్రను వేయమన్నారు. ఈ నాటకాన్ని "నర్తకి" అను పేరుతో సినిమా తీయదలచి, ఆ సమాజంలోని వారినందరిని మద్రాసుకు తీసుకొని వెళ్ళి "స్క్రీన్‌టెస్ట్, వాయిస్‌టెస్ట్" లు చేయించారు. ఈ నటులందరికి అనుభవంకొరకు "శ్రీ లలితాపరంజ్యోతి నటసమాఖ్య" తరపున "నెష్ఞా" కళామందిరంతో ప్రారంభించి, ఒంగోలు, కావలి, వెంకటేశ్వరపురం, సిద్దిపేట, బుచ్చి" మొదలగు ప్రాంతాలలో అనేకసార్లు ప్రదర్శించారు.

తరువాత నెష్ఞా కళామందిరంలో శ్రీ కమలాకర కామేశ్వరరావుగారి సమక్షంలో "భక్తమాధవదాసు" నాటకాన్ని ప్రదర్శించి, వారి ప్రశంసలందుకున్నారు. ఎన్నో సన్మానాలు, సత్కారాలు లభించాయి. ఆ తరువాతనే వీరు సినిమా ప్రయత్నం చేశారు. కాని శ్రీ ఆదినారాయణరెడ్డిగారు అకాల మృత్యువువాతబడడంతో ఆ ప్రయత్నం ఆగిపోయింది. ఈ నాటక సమాజంవుండోలేదోగాని, ఆ సమాజంద్వారానే శ్రీ పులిపాటి రామకృష్ణయ్యగారు నటులయ్యారు. ఆ సమాజమే వారిపేరు, ప్రతిష్ఠలకు కారణమయ్యింది. అప్పటినుండి ఇప్పటికరకు శ్రీ రామకృష్ణయ్యగారు వివిధనాటకాలలో విభిన్నపాత్రలను పోషించారు.

ప్రదర్శించారు. "లంకెలబిందెలు" అను నాటిక "నవ్యకళాసాహితీ సమితి"లో ప్రదర్శింపబడింది.

శ్రీ రామకృష్ణయ్యగారు పౌరాణిక నాటకాలలో "దుర్యోధనుడు, అర్జునుడు, యయాతి, గయుడు" మొదలగు పాత్రలను పోషించి, పలువురి ప్రముఖులచేత ప్రశంసలందుకున్నారు. కర్నూలులో నిర్వహింపబడిన దుర్యోధన ఏకపాత్రాభినయ పోటీలలో 36మంది నటులలో శ్రీ రామకృష్ణయ్యగారికి మొదటి బహుమతి లభించగా, కర్నూలు జిల్లా కలెక్టర్ శ్రీ నాగేశ్వరరావుగారిచే నటరాజ విగ్రహాన్ని బహూకరింపజేశారు. భక్తమాధవదాసుకు ప్రముఖ సినీదర్శకులు శ్రీ కమలాకర కామేశ్వరరావుగారిచే ప్రశంసలు, దుశ్శాలువతో సన్మానం జరిగింది. "చింతామణి" నాటకంలో "భవానీ శంకర్" పాత్రకు యెందరో ప్రముఖులచేత ప్రశంసలందుకున్నారు.

"దుర్యోధన" పాత్రలో శ్రీ రామకృష్ణయ్యగారు మహానటులపంథాను అనుసరించి స్థితప్రజ్ఞులైనారు. దుర్యోధన ఏకపాత్రాభినయమునకు అప్పటి వైద్యశాఖామాత్యులు శ్రీ దగ్గుపాటి వెంకటేశ్వరరావుగారిచే సన్మానం జరుపబడింది. ఎమ్మిగనూరు పద్మశాలీయ జిల్లామగ్గాలసభలో కొండాలక్ష్మణ్ బాపూజీగారిచే ప్రశంసలు, సన్మానం అందుకున్నారు.

శ్రీ పులిపాటి రామకృష్ణయ్యగారు నటనలోనేగాక దర్శకత్వం, మేకప్ రంగాలలోకూడ అభినివేశం సంపాదించారు.

శ్రీ రామకృష్ణయ్యగారు దయార్ద్ర హృదయులు. మానవతావాది. పేదవృద్ధ కళాకారులకు పెన్షన్ తెప్పించడంలో అవిరళకృషిచేసి, సఫలీకృతులైనారు. తోటికళాకారులకు సహకరించడంలోను, సమాజంద్వారా పేదలకు అన్నదానం చేయడంలోను, పేద, ఔత్సాహిక యువకళాకారులను ప్రోత్సహించడంలోను తన శక్తివంచన లేకుండా పాటుపడుతున్నారు. కళను వ్యాపారదృష్టితోగాక కళాదృష్టితో స్వీకరించి, సమాజానికి సందేశమివ్వాలన్నది వీరి దృక్పథం.

శ్రీ పులిపాటి రామకృష్ణయ్యగారు గొప్పనటులు, మంచిగాయకులు, ఉత్తమదర్శకులు. ఆదర్శభావాలుగల కళాకారులు. భగవంతుడు వీరికి అందమైన విగ్రహాన్ని, శ్రావ్యమైన కంఠాన్ని ప్రసాదించాడు. స్వార్థచింతన లేని, కీర్తికండూతి కానరాని సహృదయులు. మీదుమిక్కిలి మానవత్వాన్ని మరువని మంచిమనిషి. ఆధునిక నటులలో మహోజ్వలంగా ప్రకాశిస్తున్న రాయలసీమ నటరత్నం.

## ఆకుతోట ఎల్లయ్య :

శ్రీ ఆకుతోట ఎల్లయ్యగారు 1954లో శ్రీమతి అంకమ్మ, శ్రీ చిన్నబాలయ్యగార్లకు ద్రోణాచలం పట్టణంలో జన్మించారు. వీరు ఔత్సాహిక నటులు. వృత్తిరీత్యా వ్యాపారస్తులు. ద్రోణాచలంలోని "శ్రీ వేంకటేశ్వరనాట్య కళామండలి" అను నాటక సమాజంలో సభ్యులై, పౌరాణిక నాటకాలలో నటించి, అంచెలంచెలుగా యెదిగి, ఈనాడు రాయలసీమలో ఒక ప్రముఖనటుడుగా గుర్తించబడ్డారు. వీరి నటజీవితం పదిసంవత్సరాలక్రితం "చింతామణి" నాటకంతో ప్రారంభమైంది. వీరు ప్రదర్శించిన నాటకాలు తక్కువే అయినా వేసిన నాటకాలేపలుసార్లుపలుప్రాంతాలలో ప్రదర్శించి, ప్రేక్షకుల ప్రశంసలకు పాత్రులైనారు. శ్రీ ఎల్లయ్యగారు "రామాంజనేయయుద్ధం, శ్రీకృష్ణతులాభారం, చింతామణి, బాలనాగమ్మ" మొదలగు నాటకాలలో "శ్రీ రాముడు, శ్రీకృష్ణుడు, భవానీశంకర్, కార్యవర్థిరాజు" మొదలగు విభిన్నపాత్రలను, యెంతో వైవిధ్యంతో పోషించి, పాత్రలకు తగిన న్యాయంచేకూర్చారు.



శ్రీ ఎల్లయ్యగారికి సంగీతంలో కొంత అభినివేశమున్నందున శ్రావ్యమైన కంఠంతో పాటలు, పద్యాలు చక్కగా పాడగలరు.

వీరు నెహ్రూ, రాఘవ కళాపరిషత్తులలో నాటకాలు ప్రదర్శించి, బహుమతులందుకున్నారు. వీరికి నచ్చిన, ప్రజలు మెచ్చినపాత్ర "చింతామణి" నాటకంలోని "భవానీశంకర్".

శ్రీ ఎల్లయ్యగారి నటనావైదుష్యాన్ని గుర్తించి వెల్దుర్తిలో మండలాధ్యక్షులు, గుత్తి యం.ఎల్.ఏలు వీరిని ఘనంగా సన్మానించారు. వీరికి రచన, సంగీతము లంటే యెంతోఇష్టం. రాయలసీమ నటరత్నాలలో చేర్చతగినవారు.

## శ్రీమతి ఎ.రజనీబాయి :

లలిత కళల సమాహారకళయైన నాటకాన్ని కులవృత్తిగా స్వీకరించిన వారు ఒక్క ఆంధ్రప్రదేశంలో తప్ప యావద్భారతదేశంలో మరెక్కడా కనిపించరు. తెలుగు నాటకరంగానికి సురభి నాటకవ్యవస్థ నిజంగానే సురభి. అధునాతన పద్ధతులతో, ట్రిక్కులతో నాటకాలను



అటువంటి సురభివంశానికి చెందినవారే శ్రీమతి ఎ.రజనీబాయిగారు. శ్రీమతి రజనీబాయిగారు 1955లో కర్నూలు జిల్లా సంద్యాల పట్టణంలో శ్రీమతి ఆర్. శాంతాబాయి, శ్రీ ఆర్. భద్రినారాయణ రావుగారు అనుపుణ్యాదంపతులకు జన్మించారు. వీరి తండ్రిగారు స్థాపించిన "ఆంధ్రకళాభారతి" అను నాటక సమాజం ఆధ్వర్యంలోఆంధ్రప్రదేశ్ రాష్ట్రమంతటా పెక్కుపల్లెలు, పట్టణాలలో పలునాటక ప్రదర్శన లిచ్చారు. వీరికి చిన్నతనంనుండి నాటకానుభవం వుంది. తండ్రిగారి శిక్షణలో బాల్యంలోనే ఆటపాటలు నేర్చుకొని, చిన్నచిన్నవేషాలు ధరించేవారు.

శ్రీమతి రజనీబాయిగారికి 1970లో శ్రీ ఎ.నాగరాజుగారితో వివాహం జరిగింది. వీరు గత 20 సంవత్సరాలుగా కర్నూలు పట్టణంలో స్థిరపడి, నాటకకళకు సేవచేస్తున్నారు. ప్రఖ్యాత సంగీత విద్వాంసులు, హార్మోనిస్టులైన శ్రీ జె.పురుషోత్తం, శ్రీ కె.సి.శివారెడ్డి, శ్రీ లంకా పిచ్చయ్య శాస్త్రి శ్రీ సి. వేమారెడ్డిగార్ల వద్ద సంగీతం, అభినయం అభ్యసించి, పౌరాణిక నాటకాలలో ముఖ్యపాత్రలను పోషించారు.

శ్రీమతి రజనీబాయిగారు నటించిన పెక్కు పౌరాణిక పాత్రలలో ఆమెకు నచ్చినవి, ప్రజలు మెచ్చినవి "చింతామణి, సత్యభామ, చంద్రమతి, ద్రౌపది, సంగు" మొదలగు స్త్రీ పాత్రలు, "శ్రీకృష్ణ, శ్రీరామ, అర్జున" మొదలగు పురుషపాత్రలు. వీరు ఆంధ్రప్రదేశ్‌లో అన్నిముఖ్యపట్టణాలలోను, పల్లెపల్లెలు, వాడవాడలలోను వివిధపాత్రలను సమర్థవంతంగా పోషించి, యెన్నో నాటక ప్రదర్శనలిచ్చి, పండిత, పామరభేదం లేకుండా అశేష ఆంధ్ర ప్రజానీకంచేత మన్ననలందుకున్న మహానటి.

ఆంధ్రప్రదేశ్ ప్రఖ్యాత రంగస్థలనటులు "శ్రీ పీసపాటి నరసింహమూర్తి, శ్రీ ఏ.వి. సుబ్బారావు, శ్రీ వై. గోపాలరావు, శ్రీ షణ్ముఖి ఆంజనేయులు, శ్రీ ఏ. వెంకటేశ్వర రావు, శ్రీ అమరపురి, శ్రీ పి.లక్ష్మణరావు, శ్రీ జి. జైరాజ్, శ్రీ డి.వెంకటసర్పునాయుడు, శ్రీ యం. అల్లాబక్ష్" మొదలగువారి సరసన స్త్రీ, పురుషపాత్రలను పోషించి, శ్రీమతి రజనీబాయిగారు అజరామరకీర్తిని ఆర్జించుకున్నారు. సహనటులు చిన్నవారైనా, పెద్దవారైనా యెంతోనమ్రతతో, సుహృద్భావంతో, సహకారంతో నడుచుకుంటూ, కళాసేవచేస్తున్న నిగర్వచూడామణి. వీరు సాంఘిక నాటకాలలోకూడ నటిస్తున్నారు.

శ్రీమతి రజనీబాయిగారు అనేక సన్మానాలు, బహుమతులు, ప్రశంసాపత్రాలు అందుకున్నారు.

1981లో హైదరాబాదు హెచ్.యం.టి. కంపెనీ సాంస్కృతిక శాఖవారిచే ఘనమైన సన్మానం అందుకున్నారు. అదేసంవత్సరం తూర్పుగోదావరి జిల్లా, ఏలేశ్వరం గ్రామం కళాసమితి వారిచే సన్మానింపబడ్డారు.

1982లో ప్రఖ్యాత సినీనటి, అకాడమీ అధ్యక్షురాలు శ్రీమతి జమునారమణరావుగారిచే 100 తులాల వెండి గాండీవమును అర్జున పాత్రకు బహుమతిగా పొంది, ఘనమైన సత్కార, సన్మానాలకు నోచుకున్నారు.

1983లో హైదరాబాదు రవీంద్రభారతిలో చింతామణిపాత్రకు శంకరాభరణం సినీనటులు శ్రీ జె.వి.సోమయాజులు రజనీబాయిగారిని సన్మానించారు.

1985లో "రిక్రియేషన్‌క్లబ్" ఆదోనివారు సినీనటి శ్రీమతి జయచిత్రగారిచేత వీరికి సన్మానం చేయించారు.

1987వ సంవత్సరం అనంతపురంలో రాయలసీమ కళాకారుల సన్మానసదస్సు నిర్వహించిన సందర్భంగా శ్రీమతి రజనీబాయిగారికి శ్రీ బి.యం.యన్. సింహగారు సన్మానంచేశారు.

1988 లో విభవ ఉగాది సందర్భంగా అప్పటి ముఖ్యమంత్రి గౌరవనీయులు శ్రీ నందమూరి తారక రామారావుగారిచే హైదరాబాదు రవీంద్రభారతిలో శ్రీమతి రజనీబాయిగారు ఘనంగా సన్మానింపబడినారు.అదే సంవత్సరం కర్నూలు జిల్లా, నందికొట్కూరు పట్టణంలో అర్జునపాత్ర ధరించిన సందర్భంగా వీరిని అప్పటి ఆరోగ్య శాఖామాత్యులు శ్రీ దగ్గుపాటి వేంకటేశ్వరరావుగారు ఉచితరీతిని సన్మానించారు.

వీరి భర్త శ్రీ ఏ.నాగరాజుకూడ రంగస్థలనటులు కావడంతో, భర్త సహకారంతో కర్నూలు పట్టణంలో "ఆంధ్రకళాభారతి" అను నాటక సమాజం తరపున "హరిశ్చంద్ర, శ్రీకృష్ణతులాభారం, చింతామణి, బాలనాగమ్మ" మొదలగు పౌరాణిక, జానపద నాటకాలను పలుమార్లు ప్రదర్శించారు. ప్రస్తుతంకూడ ప్రదర్శిస్తూనే వున్నారు.

శ్రీమతి రజనీబాయిగారు వృత్తికళాకారులైనప్పటికి ఔత్సాహిక నాటక సమాజాలలోకూడ నటిస్తూ, పరిషత్తులు నిర్వహించే నాటకపోటీలలో పాల్గొంటున్నారు. 1990లో తిరుపతి శ్రీ బాలాజిభవనంలో చింతామణి నాటకాన్ని ప్రదర్శించారు. వీరు రాష్ట్రస్థాయిలో

పేరుప్రఖ్యాతు లార్జించుకున్న ప్రముఖ రంగస్థల నటీమణి. ప్రస్తుతం ఆంధ్రదేశంలోగల నలుగురు మేటి నటీమణులలో శ్రీమతి రజనీబాయిగారొకరు. "శ్రీమతి రజనీబాయి - కర్నూలు, శ్రీమతి విమలాదేవి - రాజంపేట, శ్రీమతి గూడూరు సావిత్రి - నెల్లూరు, శ్రీమతి లతాలక్ష్మి - గుంటూరు" వీరు ఈనాటి రంగస్థల నటీమణులుగా లబ్ధప్రతిష్టులు.

శ్రీమతి రజనీబాయిగారు సంగీత పరిజ్ఞానంగల మధురగాయని. శ్రావ్యమైన కంఠం, సహజసుందరమైన నిండైన విగ్రహం. అన్నిటికీ మించి పెద్దలయెడ నమ్రత, గౌరవభావం, సహనటులతో సహకారం, నిరాడంబరత వీరిని రాష్ట్రస్థాయి నటీమణిగా కీర్తిశిఖరాలకు చేర్చాయి. రాయలసీమకు వన్నెతెచ్చిన గానమంజరి. నటరత్నం.

### రేఫ్ధర్ మంజుల :



శ్రీమతి రేఫ్ధర్ మంజుల గారు 1962లో శ్రీ ఆర్. చలపతిరావు, శ్రీమతి లేపాక్షిబాయిలకు అనంతపురంలో జన్మించారు. ఈమె వృత్తికళాకారిణి. 1988లో ప్రదర్శించిన శ్రీ వీరబ్రహ్మంగారి చరిత్రతో వీరి నాటక జీవితం ప్రారంభమైంది. వీరు శ్రీ బ్రహ్మంగారి నాట్యమండలి డోన్, శ్రీ రాఘవ కళాసమితి - డోన్, శ్రీ బాలసరస్వతీ నాట్యమండలి - కొచ్చెరువు" మొదలగు సమాజాలలో సభ్యురాలిగావుండి, "శ్రీ వీరబ్రహ్మంగారి చరిత్ర, శ్రీకృష్ణరాయబారము, రామాంజనేయ యుద్ధము" మొదలగు నాటకాలను పెక్కుసార్లు, పలుప్రాంతాలలో ప్రదర్శించారు. వీరు "సిద్ధయ్య, గోవిందమ్మ, ద్రౌపది, శాంతిమతి" మొదలగు పాత్రలను యెంతో నైపుణ్యంతో పోషించి, ప్రజలమన్ననలకు పాత్రులైనారు. వీరు లలిత కళాసమితి - రాయదుర్గం, శ్రీ రాఘవ కళాసమితి - డోన్ లలో నిర్వహించిన పరిషత్తు నాటకపోటీలలో పాల్గొని, బహుమతులందుకున్నారు. రాయదుర్గంలో పోషించిన సిద్ధయ్య పాత్రకు రూ 116/-లు బహూకరించారు. నంద్యాలలో శాంతిమతి పాత్రకు బహుమతి లభించింది.

శ్రీమతి మంజులగారు హరికథా భాగవతారిణి. భక్తిగీతాలను తన్మయత్వంతో ఆలపించగలరు. వీరికి చిత్రలేఖనంలోకూడ అభినివేశం కలదు. రంగాలంకరణలోకూడ వీరికి అభిరుచి కలదు. ప్రస్తుతం వృత్తిరీత్యా హరికథలు చెబుతున్నారు.

శ్రీమతి మంజులగారు నటీమణిగా, భాగవతారిణిగా లబ్ధప్రతిష్టురాలు. సంగీతం, చిత్రలేఖనం, రంగాలంకరణలలో అభినివేశము, అభిరుచికలదు.

వీరు దయార్ద్ర హృదయులు. దేవాలయ నిర్మాణనిధికి, పేదకళాకారుల సహాయార్థం ఉచితంగా నాటక ప్రదర్శనలిస్తున్న మనసున్న మంచిమనిషి. కళలద్వారా, ప్రత్యేకించి నాటక కళద్వారా జాతిని జాగృతంచేసి, మంచిని ప్రబోధించడానికి నాటకం పరమసాధనమని నమ్మిన సమాజ శ్రేయోభిలాషి, అభ్యుదయభావాలుగల కళాకారిణి.

### గిరిస్వామి :

శ్రీ గిరిస్వామిగారు కర్నూలుజిల్లా, ఎమ్మిగనూరు తాలూకా, కందనాతి గ్రామంలో తల్లి శ్రీమతి వెంకమ్మ, తండ్రి శ్రీ వెంకయ్య గార్లకు జన్మించారు. శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబంలో జన్మించి, వంశాచారమైన అర్చకవృత్తిని కొన్నాళ్ళు నిర్వహించిన శ్రీ గిరిస్వామిగారు నాటకకళచేత ఆకర్షింపబడి గొప్పనటులుగా, గాయకులుగా, హార్మోనిస్టుగా స్థితప్రజ్ఞులుకావడం గొప్పవిశేషం. అది వీరి జన్మసుకృతమని చెప్పవచ్చును. గుడిలోగంటలు మ్రోగిస్తూ వేదపారాయణం చేయవలసిన పూజారి ప్రేక్షకుల గుండెల్లో సప్తస్వరాలను పూరించడం, గొప్పనటులుగా ముద్రవేయడం గొప్పవిషయం. శాస్త్రీయ సంగీతాన్ని, నటనను సమపాళ్ళలో మేళవింపజేసిన శ్రీ గిరిస్వామిగారు ఉత్తమ నటులుగా, సంగీత దర్శకులుగా రాయలసీమకు ఘనకీర్తినార్జించిపెట్టారు. వీరు మొదట కొన్నాళ్ళు పురాణపురుషులైన "శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, బిల్వమంగళుడు" వంటి పాత్రలను ధరించి, ఉత్తమ నటనతో ప్రేక్షకుల హృదయాలను దోచుకున్నారు. తరువాత శ్రీ దేవనబండ కేశవాచారిని సంగీతగురువుగా యెన్నుకొని, వారివద్ద పండిత పామరులను ఆనందసాగరంలో వోలలాడించే రసమయసంగీతాన్ని అభ్యసించి, ఉన్నత విలువలుగల గొప్పహార్మోనిస్టు గా పేరుపొందారు. అర్చకవృత్తిని విడిచిపెట్టి, కర్నూలు పట్టణంలో హార్మోనిస్టుగా స్థిరపడ్డారు. ఆ తరువాత "శ్రీకృష్ణరాయబారం, రామాంజనేయ యుద్ధం, చింతామణి, శ్రీకృష్ణాభిమన్యు, యమాంజనేయ యుద్ధం" వంటి నాటకాలను వర్ధమాన ఔత్సాహిక నటులకు నేర్పించి, ప్రదర్శింపజేశారు. వీరిశిష్యకోటిలో రేడియో ఆర్టిస్టు శ్రీ పి.దస్తగిరి, కలియుగ



ఆంజనేయ బిరుదాంకితులు శ్రీ అక్బర్‌బాషా వంటి ప్రముఖులు వీరిని గొప్పగా సన్మానించారు. ఎన్నో కళాసంస్థలు వీరిని ఘనంగా సన్మానించి, తమ కళాభిమానాన్ని ప్రదర్శించాయి. "కల్లూరు, కర్నూలు, జొహరాపురం, పార్లపల్లి, చిన్నమత్తివీడు, గంజహళ్ళి, కందనాతి" వంటి ప్రాంతాలలో శ్రీ గిరిస్వామిగారికి యెన్నో సన్మానాలు జరిగాయి. 1989లో కర్నూలు శ్రీ లలిత కళాసమితి వీరిని సన్మానించడం ఒక మరపురాని ఘట్టం, మధురక్షణం.

శ్రీ గిరిస్వామిగారు లలిత కళాసమితికి శాశ్వత సంగీత దర్శకులు. వీరు ఉత్తమనటులుగా, మంచి దర్శకులుగా, మధురమైన గాయకులుగా, ఉన్నతవిలువలుగల సంగీత దర్శకులుగా, చేయితిరిగిన హార్మోనిస్టుగా, రాయలసీమకే గర్వకారణమైన కళాతపస్వి. రాయలసీమలో మహోజ్వలంగా ప్రకాశించే అపూర్వరత్నం.

## యం.ఏ. అజీమ్‌ఖాన్ :

శ్రీ యం.ఏ.అజీమ్‌ఖాన్ గారు కృష్ణాజిల్లాలో జన్మించినా ఉద్యోగరీత్యా రాయలసీమవాసిగా కర్నూలులో స్థిరపడినారు.

శ్రీ అజీమ్‌ఖాన్ గారికి చిన్ననాటినుండి నాటక కళమీద వల్లమాలిన అభిమానం. జన్మతహా హాస్యప్రియులు. సంగీతమంటే చాలయిష్టం. విద్యార్థిదశనుండి చిన్నచిన్న హాస్యపాత్రలు ధరించి, ప్రేక్షకుల మన్ననలందుకున్నారు. వీరు సమయస్ఫూర్తితో, ఆశువుగా అప్పటికప్పుడే హాస్యపు సంభాషణలను అల్లుకొని, ప్రజల మనస్తత్వాన్ని గ్రహించి, రంగస్థలంపైన ప్రదర్శించేవారు. వీరి హాస్యంలో సున్నితత్వం గోచరిస్తుంది. హాస్యపు సంభాషణలో సిద్ధహస్తులు. శ్రీ అజీమ్‌ఖాన్ గారు హాస్యం నేర్చుకున్నట్లు కనిపించదు. హాస్యం వీరి సొంతం. అది వీరి ప్రత్యేకత. జోక్స్, మిమిక్రీ (అనుకరణ), సర్కస్ కామిక్, పాట, నాట్యం, నడక, ఒకటేమిటి?, వీరి ప్రతికదలికలోను హాస్యం తొణికిసలాడుతుంది. కో ఆపరేటివ్ సబ్‌రిజిస్ట్రారుగా ఉన్నతమైన ఉద్యోగంచేస్తూ, ఉత్తమమైన హాస్యాన్ని ప్రదర్శించారేగాని, చౌకబారు హాస్యానికి తావివ్వలేదు. హాస్యం భగవంతుడిచ్చిన వరం. గుండెనిండా ఆనందం కలవారే ప్రేక్షకులగుండెలను ఆనందంతో నింపగలరు. శ్రీ అజీమ్‌ఖాన్ గారు రంగస్థలంమీదకు రాగానే ప్రేక్షాగారం నవ్వులతో పులకిస్తుంది. సుతిమెత్తని సున్నితమైన హాస్యాన్ని ప్రదర్శించడంలో వీరికి వీరేసాటి.



శ్రీ అజీంఖాన్ గారు కర్నూలు లలిత కళాసమితి వ్యవస్థాపక సభ్యులలో ఒకరు. వీరు కర్నూలులో సబ్‌రిజిస్ట్రారుగా వుండి, సమితి నాటకాలలో అనేక హాస్యపాత్రలు ధరించేవారు. వీరు "అప్పాస్వామి చికెన్‌స్టాల్" అను హాస్యనాటికలో హాస్యపాత్రను ధరించారు. వీరు నటులేకాదు, రచయితకూడ. "ఒకరిదికత్తి – ఒకరిదినెత్తి" అను హాస్యనాటికను రచించి, మహాశివరాత్రి సందర్భంగా కొండారెడ్డి బురుజు మైదానంలో ప్రదర్శించారు. "హోటల్ కల్పవృక్షం" అను హాస్యనాటికను వ్రాసి, అందులో హోటల్ ప్రొప్రయిటర్‌గా హాస్యపాత్రను పోషించారు. శ్రీ అజీంఖాన్ గారు సాంఘిక హాస్యపాత్రలనేగాక, దర్శకరత్న శ్రీ మాదినేని పాపారావుగారి దర్శకత్వంలో ప్రదర్శింపబడిన అనేక పౌరాణిక నాటకాలలో కూడ హాస్యపాత్రలను పోషించారు.

శ్రీ అజీంఖాన్ గారు "డాక్టర్ జోగేశ్వరరావు" నాటకంలో డాక్టరు పాత్రను, "హోటల్ కల్పవృక్షం" లో హోటల్ ప్రొప్రయిటర్ పాత్రను, 'బొబ్బిలియుద్ధం'నాటకంలో బొబ్బర్ఫిఖాన్, హసనల్లీఖాన్, బుస్సీదొర పాత్రలను, "చికెన్‌స్టాల్" నాటకంలో అప్పలస్వామి పాత్రను, "ఒకరిదికత్తి – ఒకరిదినెత్తి" నాటకంలో సెలూన్ బార్బర్‌పాత్రను, "ది ఘోస్ట్ ఆఫ్ పాంపే" నాటకంలో ఘోస్ట్ పాత్రను మహాద్భుతంగా పోషించి, ప్రేక్షకలోకంలో హాస్యనటచక్రవర్తిగా శాశ్వత స్థానాన్ని సంపాదించుకొన్నారు. శ్రీ అజీంఖాన్ గారు ఇవేగాక, కర్నూలు లలిత కళాసమితి వ్యవస్థాపక సభ్యులుగా సమితి అభివృద్ధికి యెంతగానో కృషిచేశారు. దర్శకరత్న శ్రీ మాదినేని పాపారావుగారితో వీరికున్న స్నేహం, లలిత కళాసమితితో గల అనుబంధం ప్రత్యేకమైనవి.

కర్నూలు పట్టణంలో హాస్యనటులుగా పరిచయమైనా, శ్రీ అజీమ్‌ఖాన్ గారు రాయలసీమలో "హాస్యనటరత్నం"గా పేర్కొనదగినవారు. సహజంగానే హాస్యప్రియులు, హాస్యనటులు. వీరు చమత్కార సరసోక్తులతో హాస్యభాషణము భాషించేవారు. వీరి మాటలలో హాస్యం పుడుతుంది. వీరి నడకలో హాస్యం నృత్యం చేస్తుంది. వీరి నాట్యంలో హాస్యం అడుగువేస్తుంది. వీరి పాటలో హాస్యం శృతికలుపుతుంది. వీరి కదలికలో హాస్యం మెదలుతుంది. ముఖంలో హాస్యం లాస్యం చేస్తుంది. హాస్యమే వీరు, వీరే హాస్యము. అందుకే వీరు హాస్యనటచక్రవర్తి.

**హెచ్. చంద్రం, ఎం.ఏ., (నెరవాడ గ్రామం)**



శ్రీ హెచ్. చంద్రంగారు కర్నూలుకు సమీపంలోని నెరవాడ గ్రామంలో ఒక నిరుపేద కుటుంబంలో జన్మించారు. వీరి తల్లి శ్రీమతి అనుమక్క, తండ్రి శ్రీ మారెన్న. చిన్నతనంనుండి నాటక కళపైన వల్లమాలిన అభిమానం. వీరికి వీధి నాటకాలు, రంగస్థల నాటకాలంటే యెంతోయిష్టం. వీరు తన పండ్రెండవయేటనుండి నాటకాలు చూడడం, వాటిని అనుకరించడం అలవాటు చేసుకున్నారు.

1961లో పెద్దపాడు గ్రామం, జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాలలో చదువుతూ, అక్కడున్న ప్రముఖ రంగస్థల నటులు శ్రీ ఏ. పాండురంగయ్యగారితో పరిచయం సంపాదించి, వారి శిష్యరికంలో నాటకాలు ప్రదర్శిస్తూ, విద్యాభంగం కలుగకుండా కళామతల్లికి సేవచేసేవారు. కర్నూలు ప్రాంతంలో యెక్కడ రంగస్థల నాటకాలు ప్రదర్శించినా, అక్కడికి వెళ్ళి నాటకాలను చూసేవారు. శ్రీ అబ్బూరి వరప్రసాదరావు, శ్రీ మల్లాది సూర్యనారాయణ, శ్రీ కొచ్చెర్లకోట సత్యనారాయణ, శ్రీ షణ్ముఖి ఆంజనేయరాజు, శ్రీ ఏ.వి. సుబ్బారావు, శ్రీమతి అబ్బూరి కమల, శ్రీమతి టి.కనకం, శ్రీ మాధవపెద్ది సత్యం, శ్రీ పీఠాపురం నాగేశ్వరరావు, శ్రీ డి. వెంకటనర్సునాయుడు, శ్రీ యం. అల్లాబక్ష్‌గార్లతో "సహదేవుడు, వికర్ణుడు, అభిమన్యుడు" మొదలగు చిన్నచిన్న పాత్రలు ధరించి,వారి అభిమానానికి పాత్రులైనారు.

కర్నూలు నాటక కళాసారధి శ్రీ బి.రంగనాయకులు, శ్రీ లంకా పిచ్చయ్య శాస్త్రిగారల నేతృత్వంలో నాటకాలు ప్రదర్శిస్తూ, తద్వారా వచ్చిన పారితోషికంతో కళాశాలవిద్య నభ్యసిస్తూ, యం.ఏ. వరకు చదివారు. వయసుతోపాటు నటనలోను, నటించే పాత్రలలోను యెదుగుతూ వచ్చారు. "శ్రీ కృష్ణుడు, శ్రీ రాముడు, భవాని, బిల్వమంగళుడు" మొదలగు పాత్రలను యెంతో వైవిధ్యంతో ప్రదర్శించారు. కీ.శే. కల్లూరి శేషయ్యగారి ప్రోత్సాహంతో 1981లో పెదపాడు నందు "శ్రీ రాయలనాటక కళాపరిషత్తు" అను నాటకసమాజాన్ని స్థాపించి, "హరిశ్చంద్ర" నాటకంలో హరిశ్చంద్ర పాత్రను పోషించి ప్రజలమన్ననలకు పాత్రులైనారు. వీరు ఆంధ్రదేశంలో ప్రఖ్యాత రంగస్థలనటులుగా పేరుగాంచిన శ్రీ బుఱ్ఱా సుబ్రమణ్యశాస్త్రి, శ్రీ రేబాల రమణగార్లతోను, శ్రీమతి గూడూరు సావిత్రి, శ్రీమతి గుమ్మడి విమలకుమారి, శ్రీమతి జయనిర్మల, శ్రీమతి రజనీబాయిగార్లతో హరిశ్చంద్రుడుగా నటించారు. వీరు ప్రవృత్తిరీత్యా నటులుగా కళామతల్లికి సేవచేస్తున్నారు.ఎన్నో సన్మానాలు అందుకున్నారు. 1986లో అప్పటి రాష్ట్ర మంత్రి గౌరవనీయులు శ్రీ యస్.యం.డి. ఫరూఖ్ గారిచే ఘనంగా సన్మానింపబడినారు. వృత్తిరీత్యా ప్రస్తుతం వీరు కర్నూలు మార్కెట్ యార్డులో గ్రేడ్ II కార్యదర్శిగా పనిచేస్తున్నారు. శ్రీ హెచ్. చంద్రంగారు సహృదయులు. గొప్పనటులు. రాయలసీమకు వన్నెతెచ్చిన నటరత్నం.

**వేముల కృష్ణమూర్తి గౌడు :**



శ్రీ వేముల కృష్ణమూర్తిగౌడు గారు కర్నూలుజిల్లా, బొల్లవరం గ్రామంలో శ్రీ వేముల దాసప్పగౌడు, శ్రీమతి గిడ్డమ్మ అను పుణ్యదంపతులకు జన్మించారు. వీరికి బాల్యంనుండి నాటకకళపై అభిరుచిమెండు. దానికితోడు వీరి తాతగారు శ్రీ వేముల కేశన్నగౌడుగారి ప్రోత్సాహం లభించింది. పాఠశాల స్థాయిలోనే రంగ ప్రవేశంచేసి, నాటకాలాడడం, బహుమతులు పొందడం అలవాటయ్యింది. కళాశాలలో సాంస్కృతిక ఉత్సవాలకు నాటకపోటీలు నిర్వహించేవారు. శ్రీ కృష్ణమూర్తిగౌడుగారు కర్నూలు నందలి ఉస్మానియా కళాశాలలో ఇంటరువరకు చదివారు. కళాశాలలో నిర్వహించిన నాటకపోటీలలో ఉత్తమ బహుమతులు సంపాదించారు.

1960 నుండి జిల్లాలో అనేక పరిషత్తు నాటకపోటీలలో పాల్గొని బహుమతులు పొందారు. 1968లో "రవీంద్రా ఆర్ట్స్" ఔత్సాహిక నాటకసమాజాన్ని స్థాపించి, 1983 వరకు ఆ సంస్థ వ్యవస్థాపక అధ్యక్షులుగాను, కార్యదర్శిగాను, దర్శకులుగాను వున్నారు. వీరు పై సమాజం తరపున "హిందూపురం, అనంతపురం, తిరుపతి, ప్రొద్దుటూరు, విజయవాడ, హైదరాబాదు, గుంతకల్లు, కడప" మొదలగు పట్టణాలలో నిర్వహించిన పరిషత్తు నాటక పోటీలలో పాల్గొని అనేక బహుమతులను పొందినారు.

వీరు పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలలో "దుర్యోధనుడు, యముడు, రావణుడు, బొబ్బిలిబుస్సీ" మొదలగు పాత్రలను ధరించి, ఆ పాత్రలకు న్యాయం చేకూర్చారు. 1981లో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షురాలు శ్రీమతి జమునా రమణరావుగారిచే సన్మానింపబడినారు. వీరు మంచినటులుగా ప్రేక్షకులచేత ప్రశంసల నందుకున్నారు. వీరు ప్రస్తుతం కర్నూలు

గవర్నమెంటు ప్రెసలో ఉద్యోగంచేస్తూ, స్థానికంగా నాటక ప్రదర్శనలిస్తున్నారు.

శ్రీ కృష్ణమూర్తిగౌడుగారు ఔత్సాహిక నటులు, దర్శకులు, కార్యదక్షులు. రాయలసీమ నటరత్నాలలో చేర్చదగినవారు.

## తిరువళ్ళూరు సామవేదం వీరరాఘవాచార్యులు



శ్రీ తిరువళ్ళూరు సామవేదం వీరరాఘవాచార్యులుగారు 1952 వ సంవత్సరం, కర్నూలు జిల్లా, ఆదోని తాలూకా, లంజబండ అను గ్రామంలో శ్రీ వెంకటరంగచార్య, శ్రీమతి పుణ్యవతి అను పుణ్యదంపతులకు జన్మించారు. వీరు ఔత్సాహిక నటులు. వృత్తిరీత్యా ఉపాధ్యాయులు. శ్రావ్యమైన కంఠం. తగిన శారీరక సౌష్టవము ఉన్నందున వీరెక్కువగా దుర్యోధన పాత్రను పోషించారు.

రాయలసీమ-కర్నూలు జిల్లాలో జన్మించి, ఆంధ్రదేశమంతటా కీర్తిపుంజాలను ప్రసరింపజేసిన మహానటులు. కీర్తిశేషులు వెంకటనర్సు నాయుడుగారి శిష్యులై, వారి ఆధ్వర్యంలో శ్రీ రాఘవాచారిగారు 'దుర్యోధనమయసభ' వందసార్లకు పైగా ప్రదర్శించి, రాయలసీమ నటరత్నాలలో సముచిత స్థానాన్ని సంపాదించుకున్నారు. వీరి నటనలో పరిణతి గోచరిస్తుంది. శ్రీ వెంకటనర్సు నాయుడుగారి గురుత్వం కనిపిస్తుంది. నటనలో మెలకువలు, సంభాషణలో స్పష్టత, హుందాతనం, హావభావ ప్రకటనలో రాజసం, కంఠంలో శ్రావ్యత ఉండడంవలన పద్యాలాపనలో ప్రావీణ్యం సర్వజనాకర్షణీయంగా గోచరిస్తుంది. వీరికి కర్ణాటక సంగీతము, లలిత సంగీతములలో అభినివేశమున్నందున పౌరాణిక పద్యనాటకాలు వీరికి ఘనమైనకీర్తిని గడించిపెట్టాయి.

శ్రీ వీరరాఘవాచారిగారు ఏకపాత్రాభినయములుకూడ చేశారు. 'రావణ, మహారధికర్ణ, దుర్యోధన' మున్నగు ఏకపాత్రలను అద్భుతంగా పోషించారు. వీరు ఎక్కువగా కిరాయి నాటకాలలోనే నటించారు. వీరికి రచనావ్యాసంగంలో అభినివేశం కలదు.

శ్రీ రంగాచారిగారు ఉత్తమ నటులు, ఉన్నత భావాలుగల ఆదర్శ ఉపాధ్యాయులు, గాయకులు, రచయిత. వీరు రాయలసీమ నటరత్నాలలో చేర్చదగినవారు.



# డా. పోతుగుంట వెంకట సీతారామయ్య, యం.ఎ., బి.ఇ.డి., పి.హెచ్.డి.

| | | |
|---|---|---|
| జననం | : | 11-12-1942 |
| తండ్రి | : | వెంకట్రాయులు |
| తల్లి | : | నరసమ్మ |
| జన్మస్థలం | : | ప్రసన్న వేంకటేశ్వరపురం (మచ్చారెడ్డిపల్లె) |
| ప్రాథమిక విద్య | : | పి.వి. పురం, గంగిరెడ్డిపల్లె |
| సెకండరీ పాఠశాలవిద్య | : | వెంకటాపురం, తిరుపతి (ఎస్.వి. హైస్కూలు) |
| ఉన్నత విద్య | : | బి.ఎ., యం.ఎ., బి.ఇడి., పి.హెచ్.డి.,<br>శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి. |
| రచనలు<br>(అముద్రితములు) | : | 1. ``బాగుపడాలంటే........'' సాంఘిక నాటిక<br>2. సిద్ధాంతవ్యాసం ``తెలుగు కవిత్వంపై బౌద్ధమత ప్రభావం''<br>3. కేరళలో అయ్యప్పస్వామి దేవాలయాలు -- ఒక పరిశీలన<br>4. వాతావరణ కాలుష్యభూతం -- Skit |
| ఉద్యోగం | : | తెలుగు పండితులు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ పాఠశా<br>తిరుపతి |
| ముఖ చిత్రం | : | సింగంపల్లి సత్యనారాయణ.<br>ఆర్టిస్, ఎస్.వి. వ్యవసాయ కళాశాల, తిరుపతి. |